# సందేశాలు

## చైనా ఉపాధ్యాయ సంఘం నుండి

Andhra Pradesh United Teachers Federation Palapartivari St. Vijayawada-520 002 India. Chinese Educational Workers Union Extends Fraternal greetings to fourth Educational and Cultural conference of your federation wishing your Federation new success in inheriting and Carrying forward Indian Traditional Spelendid Cultural Developing your Education undertaking and safeguarding your Teachers just Rights and interests. May friendship between Teachers and Educational Trade Unions of China and India continew Developing wishing your Conference a success.

**National Committee Chinese Educational Workers Union**

• • •

Dear Sri Venkata Swamy

Thank you for informing me about the Fourth Educational and Cultural Conference which the Andhra Pradesh United Teachers' Federation is organising from 8 to 10 January 1986.

I am sure the different items which are on your agenda for the Conference will prove stimulating, educative and useful. I wish the Conference every success.

*Yours Sincerely*

**K. Prabhakara Rao,**
Governor of Maharastra

• • •

I am receipt of your letter dated 1-12-1985 regarding the Fourth Educational and Cultural conference of A. P. United Teachers Federation to be held on 8th, 9th and 10th January, 1986 at Vijayawada.

I wish the function a success.

*Yours Sincerely*

**N. Yethiraja Rao,**
Minister for Endowments
and Housing

• • •

Kindly refer to your letter, dated 23-10-85 to Shri Joyti Basu, Chief Minister, West Bengal, inviting him to attend 4th Educational and Cultural Conference of A. P. United Teachers' Federation to be held at Vijayawada during 8th to 10th January, 1986. While thanking you for the invitation, Chief Minister regrets his inability to attend the conferene owing to his busy schedule of programmes during that period. He however, conveys his best wishes for success of the Conference and thanks the organisers and participants.

*Yours Faithfully*

× × × ×
Addl. Private Secretary.
To The Chief Minister W. B.

I am in receipt of your letter dated 1-12-1985 asking me to attend Andhra Pradesh United Teacher's Federation Conference, with a paper, scheduled for 10th Junuray 1986 at Vijayawada.

I regret, as I am pre-occupied with other passing engagements I may not find time to personally attend the Conference.

"Guru Brahma, Guru Vishnu, Gurudevo Maheswara" is the motto of our ancient Indian Society.

To-day, the society and the teacher himself, seems to have forgotten this. I, therefore, request the Conference, through you - particulary to evolve methods of discipline through which our society may once again rise to the dreams of our forefathers giving a respectful position to the teachers in our society.

I wish the Conference a success.

*Yours Sincerely*

**G. Narayana Rao,**
Speeker
A. P. Legislative Assembly

• • •

I am glad to know through your letter dated 1st December, 1985 that you are going to hold Fourth Educational and Cultural Conference of your Organisation from 8th to 10th of January, 1986 and that distinguished and eminent persons in educational field have been invited to participate in the said Conference.

I wish the conference every success.

*Yours Sincerely,*

**Justice Avula Sambasiva Rao**
Lok Ayukta, A. P.

• • •

I am glad to know that the A. P. United Teachers' Federation is holding its Fourth Educational and Cultural Conference in January, 1986.

Andhra Pradesh under the dynamic leadership of Dr. N. T. Rama Rao brought many important measures in the field of Educational like introduction of Vocational Courses in 105 select Secondary Schools, revision of Syllabi in Polytechnic and holding of common Entrance Test for them and also establishing Telugu Vignana Peetham. Teachers while protecting their legitimate rights should also feel their responsibilities in shaping the students as disciplined Citizens of the Nation.

I wish your deliberations all success.

**P. Mahendranath**
Minister for Finance and Power.

• • •

I am happy to learn that the Fourth Educational and Cultural Conference of your organisation is going to be held from 8th of January, 1986 at Vijayawada.

While hoping success of your conference, it is regretted that due to pre-occupation it may not be possible for me to attend the conference.

With greetings,

**Nripen Chakraborti**
Chief Minister, Tripura.

# ఆహ్వాన సంఘం ప్రముఖులు






శ్రీ కాటగడ్డ శ్రీనివాసరావు    శ్రీ చుక్కపల్లి పిచ్చయ్య    శ్రీ చుక్కపల్లి కుశలవ    శ్రీ ఎ. రామచంద్రరావు






శ్రీ యస్. యం. కొండయ్య    శ్రీ అట్లూరు శ్రీమన్నారాయణ    శ్రీ ఆయితా రాములు    శ్రీ యస్. సుందరాచారి








సందేశమిస్తున్న సర్వశ్రీ వై. వి. సుబ్బారావు (మద్రాసు), సోమనాథన్, సుకుమారన్ (కేరళ), తారాపాద బెనర్జీ (త్రిపుర), తుషారపంచానన్, అమితవసేన్ (బెంగాల్)



## యు.టి.యఫ్. కార్యవర్గం

IUV01A229

Grams : "UTIYEF"  Phone : V Z A. 63606  Phone : H Y D. 66840

IKYA UPADHYAYA

Life Subscription 200-00
Yearly „ 20-00
Single copy 1-75

Ikya Upadhyaya
Palapartivari Street
Vijayawada
520 002

# ఐక్యోపాధ్యాయ

సంపాదకవర్గం:

మైనేని వెంకటరత్నం
(ప్రధాన సంపాదకుడు)
అప్పారి వెంకటస్వామి
కె. కేశవరెడ్డి
వి. బాలసుబ్రహ్మణ్యం
వాగటి నారాయణ

సంపుటి 12  1986 జనవరి, ఫిబ్రవరి  సంచిక - 1, 2

# అందుకోండి.... ఉద్యమాంజలి!

ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్, నాల్గవ విద్యా వైజ్ఞానిక మహాసభలు, విజయవాడలో 1986 జనవరి 8, 9, 10 తేదీలలో అద్వితీయంగా జరిగాయి. ఇది ఉద్యమంలోనే అపూర్వం! చరిత్రలోనే అపురూపం!

రాజమండ్రిలో రాటుదేలి, ఖమ్మంలో సంఘటితమై, భీమవరంలో బలపడిన యు. టి. యఫ్., విజయవాడలో విశ్వరూపాన్ని చూపింది.

దశాబ్దానికి పైగా యు. టి. యఫ్. అనుసరించిన సూత్రబద్ధ వైఖరి, చేపట్టిన కార్యక్రమాలు, చేసిన పోరాటాలు, సాధించిన విజయాలు ఉపాధ్యాయుల హృదయాలలో శాశ్వత స్థానాన్ని పొందిన పరిస్థితిని ఈ మహాసభలు ప్రతిబింబించినయ్.

అన్ని ప్రాంతాలు, అన్ని మేనేజిమెంట్లు, అన్ని క్యాడర్లను ఐక్యం చేయడంలోను, అత్యవసర పరిస్థితిలోకూడా అజేయంగా నిలబడటంలోను, డైరెక్ట్ పేమెంట్ పోరాటానికి నాంది పలకటంలోను ప్రజాస్వామ్య రక్షణకు నడుంకట్టటంలోను, విద్య రాష్ట్రజాబితాలోనే ఉండాలనటంలోను, భాషావిధానాన్ని నిర్మొగమాటంగా ప్రకటించటంలోను అన్నిటా యు. టి. యఫ్. దే ముందడుగు! అగ్రస్థానం! అందుకే అందరికీ అది మార్గదర్శకం!

ఉద్యమ నిర్వహణలోనే యు టి.యఫ్.దొక ప్రత్యేకత. కార్యకర్తలదొక విశిష్టత. త్యాగాలతోకూడిన చరిత్ర దానిది. సామాజిక చైతన్యంతో, సమ సమాజ దృక్పథంతో వేసే ప్రతిఅడుగు ఓ వెలుగు. అందుకే మహాసభలలో ఆ కళ కళ... ఆ తళ తళ... విద్యాభిమానుల చేయూత... ప్రజానంఘాల సహకారం!

మహాసభల్లో ఎక్కడా పూలదండల్లేవు, సన్మానాలు కానరావు ఉన్నత క్రమశిక్షణ ... ఉత్తమాదర్శాలు ... అపారదీక్ష ... ఆశయాలకు అంకితమైన ప్రతినిధులే వెలలేని మణిహారాలు! ఉత్తమ అలంకారాలు!

జరిగిన గోష్ఠులు ... నిర్వహించిన చర్చలు ఆ విషయాన్నే ప్రస్ఫుటించినయ్, కేంద్ర ప్రభుత్వ నూతన విద్యావిధాన నగ్న రూపాన్ని తేటతెల్లంజేసిన తీరు, ప్రపంచ శాంతికై...పౌరహక్కులకై ప్రతిస్పందించిన హోరు మరిచిపోలేము.

సాహిత్యం సామాజిక ప్రయోజనానికేనని చాటిన విధం, సమ సమాజ నిర్మాణానికే అది ఉపయోగించాలన్న పథం, మహిళలు మరింత చైతన్యవంతంగావాలన్న ప్రబోధం ఉద్యమ రథానికి మరింత ఊపునిచ్చినయ్. ఉరవడి కల్పించినయ్.

శ్రీకాకుళం నుండి చిత్తూరు వరకు, ఖమ్మం నుండి నిజామాబాద్ దాకా 23 జిల్లాలనుండి వచ్చిన పదినేల మంది ఉపాధ్యాయులు విజయవాడ వీధుల్లో, వే వేల పతాకలెత్తి, నింగినంటే నినాదాల హత్తి కదంతొక్కుతూ ... పదంపాడుతూ క్రమశిక్షణతో సాగిన ఆ మహా ప్రదర్శననభూతో నభవిష్యతి.

మహాసభల్లో అమర్చిన వస్తు ప్రదర్శన విజ్ఞానదీప్తి ప్రసరించగా, రసవత్తరంగా పాడిన పాటలు ఉత్తేజపరచగా, సాంస్కృతిక ప్రదర్శనలు సమస్యా సాగరాన్ని మంథర మథనంచేసి అమృతాన్ని అందించినయ్. భోజనాల ఏర్పాట్లు సరేసరి... అందరినీ ఆశ్చర్యచకితుల్ని చేసినయ్.

వేయేల...ఏ వైపునుండి చూసినా ఈ మహాసభలు మరపుకు రాని మధురస్మృతుల్ని మనసులో నిలిపి, చిరకాలం చెరిగిపోని గాఢ ముద్ర వేసినయ్.

మహాసభల జయప్రదానికి అహరహం కృషిచేసిన కార్యకర్తలకు, ఆదరణతో విరాళాలిచ్చిన దాతలకు, అహోరాత్రులు శ్రమించిన ప్రజా సంఘాలకు, సహకరించిన వలంటీర్లకు, చేయూతనిచ్చిన పెద్దలకు, చేయెత్తి జై కొట్టిన ఉపాధ్యాయులకు ఈ సందర్భాన ఇవే మా హార్దికాభివందనలు!

అధ్యాపకలోకం, అశేష ప్రజానీకం, మహాసభల జయప్రదం చేయటంద్వారా మాపై వుంచిన నమ్మకాన్ని వమ్ముచేయమని; అమరజీవి చెన్నుపాటి ఆశయాల్ని అడుగడుగునా మననంజేసుకొంటూ ముందుకు సాగుతామని, విద్యారంగ అభివృద్ధికి, ఉపాధ్యాయ ఉజ్వల భవిష్యత్తుకు, ప్రజా సంక్షేమానికి పాటుబడతామని, శపథం చేస్తూ అవనత వదనంతో అంజలి ఘటిస్తున్నాం!

సమీక్ష :

## అపూర్వ చైతన్య శక్తినీ, సామాజిక స్పృహనూ చాటిన

# యు.టి.యఫ్. 4వ విద్యా వైజ్ఞానిక మహాసభలు

అది 1986 జనవరి, 8

సంధ్య చీకట్లు తొలగి తెల తెలవారుతున్న వేళ.

కృష్ణవేణీ తరంగాలను తలపిస్తూ నినాదాలిస్తూ గుంపులు గుంపులుగా రైళ్ళల్లో, బస్సుల్లో, అందిన వాహనాలన్నిటి మీద ప్రతినిధులు పట్టణానికి చేరుకొంటున్న సమయం. ఒకరా ... ఇద్దరా... పదివేలమంది పట్టణాన్ని మేల్కొలుపుతూ దీర్ఘశ్రుతి సింపినవే వేల కంఠనాదాల ఘోష.

మహబూబ్‌నగర్ జిల్లానుండి 50 మంది మహిళలతోసహా 400 మంది 6 బస్సుల్లోనూ, తూర్పుగోదావరి జిల్లానుండి 3 బస్సుల్లోనూ, నల్గొండ అనంతపురం జిల్లాలనుండి ఒక్కొక్క బస్సులోనూ బ్యానర్లు కట్టుకొని వచ్చారు. రైళ్ళపైన, ఆర్. టి. సి. బస్సులలోను వచ్చిన జనం మహాప్రవాహంలా సభాస్థలికి తరలివచ్చారు.

పశ్చిమబెంగాల్, త్రిపుర, కేరళ, తమిళనాడు రాష్ట్రాలనుండి సౌహార్ద ప్రతినిధులు ఆ రాత్రికే చేరుకొన్నారు.

ఉదయ సూర్యకాంతిలో... చలి వదిలిస్తున్న లేఎండ మెరుపులో కూడలుల్లో కట్టిన యు. టి. యఫ్. తోరణాలు తళతళలాడుతూ కనులవిందు చేశాయి. 'వెల్‌కం' బ్యానర్లు స్వాగతమిచ్చాయి. చెన్నుపాటి, కందుకూరి, గురజాడ, ముట్నూరి, గంగిశెట్టి, ఏసురత్నం ద్వారాలు సభా స్థలికి దారి చూపాయి. 7 గంటలకల్లా వేలాది ప్రతినిధులతో సభా స్థలి నిండిపోయింది.

మాంటిసోరీ కళాశాల. బందరురోడ్డులో గల వెంకటేశ్వర కళ్యాణ మంటపం, మొగల్రాజపురంలో గల మధు కళామండపం. గాంధీనగర్‌లో గల యస్. కె. పి. వి. వి. హిందూ హైస్కూళ్ళు, సి. వి. ఆర్. మునిసిపల్ హైస్కూళ్ళలో ప్రతినిధులకు జిల్లాలవారీగా వసతులు కల్పింపబడ్డాయి.

బిషప్ అజరయ్యా బాలికల హైస్కూలులోగల విశాలావరణలో షామియానాల క్రింద ఒక్కసారే 4 వేలమంది భోజనం చేసే వీలు కల్పిస్తూ బ్రహ్మాండంగా, పకడ్బందీగా సౌకర్యాలు కల్పింపబడ్డాయి. వివిధ సోదర ప్రజాసంఘాలకు చెందిన వందలాదిమంది వలంటీర్లు రాత్రింబవళ్ళు శ్రమించి, ప్రతినిధులకు ఏ లోటు లేకుండా వసతుల్లో, వంటశాలల్లో, సభాంగణంలో, నిర్ణీత స్థానంలో ఉండి స్థిర దీక్షతో... ఆప్యాయతతో... అలవోకగా కర్తవ్య నిర్వహణ చేశారు.

బ్యాడ్జీలు ధరించి, ఎర్రెర్రని ఫైళ్ళతో, పలకరింతలూ ... పులకరింతలూ ఆనందోత్సాహాల మధ్య ... ప్రయాణ శ్రమనంతటినీ మరిచిన వేలాదిమంది ప్రతినిధుల కోలాహలంతో సభాంగణం చైతన్యాకృతి ధరించింది.

ఆ విధంగా యు టి.యఫ్. 4 వ విద్యా వైజ్ఞానిక మహాసభలు విజయవాడ మాంటిసోరి మహిళా కళాశాల ఆవరణలో, ప్రత్యేకంగా నెలకొల్పిన పి. వి. సుబ్బరాజు నగర్‌లో 86 జనవరి 8, 9, 10 తేదీలలో అతి కోలాహలంగా, అత్యుత్సాహ సంభరిత వాతావరణంలో ప్రారంభమయ్యాయి.



పతాకావిష్కరణ

'వందే మాతరం' గేయంతో పతాకావిష్కరణ కార్యక్రమం ప్రారంభమయింది. జాతీయ పతాకను నగర మేయర్ శ్రీ ఆయితా రాములు, ఉద్యమ పతాకను సీనియర్ కార్యకర్త శ్రీ యస్. సీతా రామాచారి ఆవిష్కరించారు.

పిదప 'ప్రజా సేవలో ప్రాణాలర్పించిన అమరవీరులకు జోహార్లు చెప్తూ, నార్నెపాడు (గుంటూరు జిల్లా) దళం 'అందుకోండి అందుకోండి జోహారులూ' అంటూ మంద్ర స్వరంతో గేయం ఆలపిస్తుం

జిందాబాద్ ... జిందాబాద్
యు టి. యఫ్. జిందాబాద్

సమస్యల పరిష్కారానికి
పోరాటం ... పోరాటం

రెడ్ టేపిజం-నశించాలి!

అవినీతి - అంతరించాలి!





స్మారక స్థూపం

దగా. యు.టి.యఫ్. రాష్ట్ర కౌన్సిల్ సభ్యులు, ఇతర రాష్ట్రాల ప్రతినిధులు 'స్మారక స్థూపానికి' పూమాలలు సమర్పించి శ్రద్ధాంజలి ఘటించారు. త్యాగధనులయెడ భక్తి, ... విశ్వాసం ... ఆదర్శం ముప్పిరిగొనగా ఈ కార్యక్రమం ఉద్విగ్నభరితంగా జరిగింది. 'అమర వీరులకు జోహార్!' అంటూ వేలాది గొంతులు దిక్కులు పిక్కటిల్లేట్టు నినదించటంతో ఆ కార్యక్రమం ముగిసింది.

శ్రీ అయితా రాములు సందేశమిస్తూ 'జాతీయ జెండా సమైక్యతా చిహ్నమనీ, దాని గౌరవమే భారతజాతి గౌరవమనీ, జాతి నిర్మాతలైన ఉపాధ్యాయులు ప్రాంతీయ విభేదాలకు అతీతంగా, సంకుచిత కులమత తత్వాలకు వ్యతిరేకంగా బిడ్డల్ని తీర్చిదిద్దాలని, రాష్ట్రాల అభివృద్ధి జరగటం ద్వారానే కేంద్రం మరింత పటిష్ఠమవుతుందని, కాని రాష్ట్రాల అధికారాలు క్రమక్రమంగా కుంచింపబడుతున్నాయనీ, మునిసిపాలిటీ స్థాయికి కుదింపబడుతున్నాయనీ, అందువలననే ప్రాంతీయ తత్వాలు చెలరేగుతున్నాయని, దేశం గుండెలమీద కుంపట్లు తయారవుతున్నాయనీ, దానికి వ్యతిరేకంగా ఉపాధ్యాయ ఉద్యమం పోరాడాలనీ, సరయిన జాతినిర్మాతలుగా కర్తవ్య నిర్వహణ చేయాలనీ ఉద్బోధించారు.

శ్రీ యస్. సీతారామాచారి సందేశమిస్తూ, 'యు. టి. యఫ్. పురోగమనాన్ని ఎవరూ అడ్డలేరని, ఈ పతాక క్రింద అనేకానేక పోరాటాలు జరిగాయనీ, వేలాది కార్యకర్తలకు ఈ జెండా ప్రాణప్రదమైనదనీ, ఐక్యఉద్యమాన్ని మరింత ముందుకు తీసుకుపోవటం ద్వారా దీని ప్రతిష్ఠను మరింత పెంచాలని ప్రబోధించారు.

## ప్రారంభ సభ

'విజయవాడ పిలుస్తోంది ... విజయశంఖ మూదుతోంది
యు. టి. యఫ్. మహాసభల స్వాగతమదె పలుకుతోంది
మన ఉద్యమ చైతన్యం ... కృష్ణవేణి ఉరకలనీ
మన ఆశయ ఔన్నత్యం ... ఇంద్రకీల శిఖరమనీ

విజయవాడ పిలుస్తోంది! — అంటూ స్వాగత గీతం ఆలపిస్తుండగా యు. టి. యఫ్ ప్రధాన కార్యదర్శి వక్తల్ని వేదికపైకి ఆహ్వానించారు.

ప్రారంభ సభకు శ్రీ డి. రామిరెడ్డి అధ్యక్షత వహించారు. విద్యామంత్రి శ్రీ గాలి ముద్దుకృష్ణమనాయుడుతోపాటు జిల్లా పరిషత్ చైర్మన్ శ్రీ సుంకర సత్యనారాయణ, శ్రీ మూల్పూరి బాలకృష్ణారావు (గన్నవరం యం.యల్.ఎ.), ఇతర రాష్ట్రాల ప్రతినిధులు, శ్రీయుతులు అట్లూరి శ్రీమన్నారాయణ, పుట్టగుంట సుబ్బారావు, పి. దివాకర్ మొదలైన ప్రజా సంఘాల నాయకులు వేదికనలంకరించారు.



సందేశమిస్తున్న శ్రీ సి. రామయ్య

శ్రీ కాట్రగడ్డ శ్రీనివాసరావు (ఆహ్వాన సంఘాధ్యక్షులు) ప్రతినిధులనాహ్వానిస్తూ, రాజకీయ, సాంస్కృతిక, సాహిత్య, కళా రంగాల అభివృద్ధిలో అనధికార రాష్ట్ర రాజధానిగా వర్ధిల్లుతున్న విజయవాడ నగర పక్షాన, కృష్ణాజిల్లా అభ్యుదయ ప్రజానీకం పక్షానా అందరికీ స్వాగతం పలికారు. కృష్ణామండల ప్రాచీన ఔన్నత్యాన్ని ఉగ్గడించి, మహాసభల్ని దిగ్విజయం చేయటానికి తోడ్పడిన కార్యకర్తలకు, విద్యాభిమానులకూ, విరాళాలిచ్చిన దాతలకు కృతజ్ఞతలు తెల్పారు. యు. టి. యఫ్ ప్రత్యేకతను వివరిస్తూ, కేవలం ఆర్థిక



హక్కులకేగాక బాధ్యతలను కూడా గుర్తెరిగిన సంఘంగా పేర్కొంటూ అభినందించారు.

## ఉపాధ్యాయ శిక్షణకై అకాడమీ

శ్రీ ముద్దుకృష్ణమనాయుడు సభల్ని ప్రారంభిస్తూ 'ఉపాధ్యాయులకు శిక్షణ ఇచ్చేందుకు' టీచర్స్ అకాడమీ ఏర్పాటు చేయాలని రాష్ట్ర ప్రభుత్వం తలపెట్టిందని వెల్లడించారు. ఎస్.సి.ఇ.ఆర్.టి. తో కలిసి దీనికి చెందిన అవసరమైన చర్యల్ని గైకొంటున్నామని, బహుశా ఇది 1987-88 కి ఆచరణ రూపం ధరింపవచ్చని అన్నారు. రాష్ట్రప్రభుత్వం విద్యాభివృద్ధికి సాగిస్తున్న వివిధ కార్యక్రమాల్ని వివరించి, ప్రస్తుతం బానిస విద్యావిధానమే కొనసాగుతున్నదని, చదువుకు ఉపాధికి పొంతన లేకుండా పోయిందని, ఈ దృష్ట్యా రాష్ట్రంలో వృత్తి విద్యా కోర్సుల్ని ప్రవేశపెట్టామని ఆయన వివరించారు. హిందీని బోధనా భాషగా వద్దంటే, కేంద్రం బలవంతంగా రుద్దుతున్నదని విమర్శించారు. వేలాది ఉపాధ్యాయుల్ని సమీకరించి నూతన విద్యావిధానంపైనా, విద్యారంగ సమస్యలపైనా చర్చించుతున్నందుకు యు. టి. యఫ్. ను అభినందించారు.

త్రిపుర, పశ్చిమబెంగాల్, కేరళ, తమిళనాడు ప్రతినిధులు సందేశాలివ్వటంతో ప్రారంభసభ ముగిసింది.

## ప్రతినిధుల సభ

ఆ తర్వాత శ్రీ డి. రామిరెడ్డి అధ్యక్షతన ప్రతినిధుల సభ ప్రారంభమయింది. మహాసభల నిర్వహణకు 5 గురితో అధ్యక్ష వర్గాన్ని, 11 మందితో సారథ్య సంఘాన్ని మరో 11 మందితో అర్హతల సంఘాన్ని ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. వెంకటస్వామి ప్రతిపాదించగా ప్రతినిధులు కరతాళ ధ్వనులతో ఏకగ్రీవంగా ఆమోదించారు.



అధ్యక్ష వర్గం



విజయవాడ ఆఫీసు సిబ్బంది

శ్రీ మైనేని వెంకటరత్నం వేదికపై ప్రత్యేకంగా నెలకొల్పిన ఉద్యమ పితామహుడు అమరజీవి చెన్నుపాటి చిత్రపటానికి పూలమాలవేసి జోహార్లు చెప్పేరు. సభాంగణమంతా ఒక్కసారి 'అమరజీవి చెన్నుపాటికి జోహార్ ! చెన్నుపాటి ఆశయాలను సాధిస్తాం... సాధిస్తాం' అంటూ నినాదాలతో మార్మ్రోగింది.

పిదప శ్రీ కె. నారాయణరావు గత మహాసభల నుండి యీ మహాసభల వరకు మరణించిన ప్రముఖుల్ని, ప్రజా సంఘాల నాయకుల్ని పేర్కొంటూ సంతాప తీర్మానం ప్రవేశపెట్టగా మహాసభ మౌనంపాటించి శ్రద్ధాంజలి ఘటించింది.

### అధ్యక్ష వర్గం

శ్రీయుతులు డి. రామిరెడ్డి, పి. సత్యనారాయణ, పి. సోమయ్య, టి. వెంకటరావు, ఎ. చెన్నకేశవరెడ్డి.

### సారథ్య సంఘం

సర్వశ్రీ ఎ. వెంకటస్వామి, యం. వెంకటరత్నం, కె. తిరుపాలు, జి. లక్ష్మయ్య, టి. అంజిరెడ్డి, జి. సి. లక్ష్మిరెడ్డి, యస్. ఆర్. పోలిశెట్టి, యం. నరహరి, వి. సూర్యనారాయణ రాజు, ఎస్. విజయకుమార్, యం.ఎ.కె. దత్తు.

### అర్హతల కమిటీ

సర్వశ్రీ యం. రాయన్న, కె. కృష్ణయ్య, సిహెచ్. లక్ష్మినారాయణ, పి. కృష్ణమూర్తి, ఆర్. నాగమల్లేశ్వరరావు, ఎ. చంద్రమౌళి, వై.జి. శౌరయ్య, కె. గురుస్వామి నాయుడు, బి. నరసప్ప, యం. పానకాలరావు, జి. చిట్టిబాబు.









అర్హతల సంఘం

శ్రీ రామిరెడ్డి అధ్యక్షోపన్యాసం చేస్తూ మహాసభల ప్రాము ఖ్యతను వివరించారు. విద్యారంగం ఎలా సంక్షోభంలో చిక్కుకున్నదో తెల్పి, కేంద్రప్రభుత్వం ప్రకటించిన 'విద్యారంగానికి సవాల్' మౌలిక సమస్యల్ని తీర్చేదికాదని, మరింత ఊబిలో దింపే విధాన మని విశదీకరించారు. నిరక్షరాస్యత, నిరుద్యోగాల్ని తీర్చేదిగా గాక మరింత పెంచే విధానమని విమర్శించారు. దానిలో ప్రగతి నిరోధక అంశాలు అనేకం వున్నాయని, దానికి వ్యతిరేకంగా దేశవ్యాప్త ఉద్యమం నడపాలని, యు. టి. యఫ్. దానికి సర్వసన్నద్ధమవుతుందని ఉద్బోధించారు.

పిదప ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. వెంకటస్వామి సంఘ కార్య కలాపాల నివేదిక సమర్పిస్తూ సమస్యా పరిష్కారానికి యు.టి.యఫ్. నిర్వహించిన వివిధ పోరాట కార్యక్రమాల్ని వివరించారు. అకడమిక్ సెల్ స్థాపన ద్వారా విద్యారంగాభివృద్ధిలో ఉపాధ్యాయుల భాగ స్వామ్యాన్ని, కర్తవ్య దీక్షను పురికొల్పుతున్నదనీ, బాధ్యతల్ని సక్రమంగా నిర్వహించినపుడే హక్కులకోసం పోరాడగలమని, ప్రజా సహకారం, గౌరవాదరాలు అప్పుడే లభించగలవని నొక్కి చెప్పారు. ఎయిడెడ్ టీచర్ల జీతాలు, స్పెషల్ టీచర్ల సమస్యలపై పోరాటం సాగించాలన్నారు. పి. ఆర్. సి. రిపోర్టు మనం కోరిన పద్ధతిలో రప్పించుకోవాలని, రీగ్రూపింగ్ స్కేళ్ళలో వచ్చిన అసంబద్ధాలు పరిష్కరించుకోవాలని, ప్రమోషన్ స్కేలుపొందటానికి గ్రూప్ III టీచర్లకు కల్పించిన సౌకర్యాలే, గ్రూప్ II వారికి కూడా అన్వయిం చాలని భవిష్యత్ కార్యక్రమాన్ని సూచించారు.

ఉద్యమం పటిష్టంగా ఉన్నపుడే ఏ పోరాటమైనా విజయం సాధింపగలదనీ, అన్నిశాఖలూ, కార్యకర్తలూ దానికి కృషిచేసి ఈ మహాసభ అవిచ్ఛిన్న చైతన్యం ద్వారా సభ్యత్వం మరింత పెంచా లని ఉద్బోధించారు.

## ప్రతి కార్యకర్తకూ ఒక పత్రిక
## ప్రతి పాఠశాలకూ ఒక పత్రిక

శ్రీ మైనేని వెంకటరత్నం ప్రధాన సంపాదకుడు ఐక్య ఉపా ధ్యాయ పత్రికా నివేదిక సమర్పిస్తూ, గత మహాసభల నాటికి 11 వేలుగా ఉన్న పత్రికాసర్క్యులేషన్ ప్రస్తుతం 13 వేలు ఉన్నదని, అలాగే 2,400 గా ఉన్న జీవిత చందాలు ఇబ్బడి ముబ్బడై 5,800 కు చేరుకొన్నదని వివరించారు. ప్రస్తుతం నడుస్తున్న క్యాంపెయిన్లతో తీవ్ర కృషి చేసి సర్క్యులేషన్‌ను 15 వేలకు పెంచాలన్నారు.

పత్రిక ఉద్యమానికి ప్రాణమనీ, ప్రధాన చోదక శక్తి, చైతన్య ప్రదాత అనీ దాన్ని ఉపేక్షిస్తే ఆ మేరకు నష్టంకూడా జరుగు తుందనీ, అందువల్ల, 'ప్రతి కార్యకర్తకూ ఒక పత్రిక... ప్రతి పాఠశా లకూ ఒక పత్రిక' అనే నినాదంతో ముందుకు పోవాలని, సంఘసభ్యులు కాని వందలాది మంది పత్రిక చందాదారులుగా ఉన్నారని, ఆదరణకు తగినట్టు విస్తృత వ్యాప్తి జరగాలని ప్రబోధించారు.

## యు. టి. యఫ్. కు ప్రభుత్వం గుర్తింపు ఇవ్వాలి

నివేదికలపై చర్చల్లో 25 మంది దాకా పాల్గొని ఉద్యమాభి వృద్ధికి వివిధ సూచనల్ని చేశారు. మహాసభలు జరిగిన మూడురోజులూ ప్రతినిధుల సభ కొనసాగింది. విద్యారంగాన్ని, ఉపాధ్యాయ వర్గాన్ని వేధిస్తున్న వివిధ సమస్యలపై 20 తీర్మానాలు ఆమోదించింది.

ముఖ్యంగా 'ఉపాధ్యాయ సంఘాల గుర్తింపు' పై రాష్ట్ర ప్రభుత్వ వివక్షత ఖండిస్తూ 10 వేలకు పైగా సభ్యులు గల్గి, రాష్ట్ర వ్యాప్త ప్రాతిపదికలపై విశాల వేదిక నిర్మించి పనిచేస్తున్న ఉపా



అధ్యాపకదర్శిని కూర్పుకు సహకరించిన కార్యకర్తలు





ఎగ్జిబిషన్‌ను ఆవిష్కరిస్తున్న
శ్రీ వై. రవి (డైరెక్టర్, యస్. సి. ఆర్. టి)

ధ్యాయ సంఘాలన్నింటినీ గుర్తించాలని మహాసభ డిమాండ్ చేసింది. బోర్డు మాత్రమే మిగిలివున్న నామమాత్ర సంఘానికి, ఒకే యాజమాన్యానికి, ఒక ప్రాంతానికే ప్రాతినిధ్యం వహిస్తున్న సంఘాలకు గుర్తింపుయిస్తూ, విస్తృత ప్రాతిపదికగల యు.టి యఫ్. ను నిర్లక్ష్యం చేయటాన్ని ఆ తీర్మానంలో ఖండించారు. పదివేల మందితో జరిగిన ఊరేగింపులోకూడా 'యు.టి.యఫ్ ను గుర్తించాల'ని ఎలుగెత్తి చాటడం జరిగింది.

ఆ మధ్యాహ్నం శ్రీ వై. రవి (డైరెక్టర్, ఎస్.సి.ఇ.ఆర్.టి.) ఎగ్జిబిషన్ ప్రారంభించారు.

## విద్యా గోష్ఠులు – ఉన్నత స్థాయి ప్రసంగాలు

మహాసభలు జరిగిన మూడు రోజులూ మొదటిరోజు 'నూతన విద్యావిధానం'పై విద్యాగోష్ఠి, రెండవరోజు 'సామాజిక సమస్యల'పై సదస్సు, మూడవరోజు 'సాహిత్య సదస్సు' సమున్నతంగా నిర్వహింపబడ్డాయి. సమస్యల శాశ్వత పరిష్కారానికి శాస్త్రీయ సోషలిజం తప్ప మరోమార్గం లేదని, సమసమాజ నిర్మాణం ధ్యేయంగా మేధావి వర్గం పురోగమించాలని ఈ సదస్సులలో ప్రసంగించిన విద్యావేత్తలందరూ అడుగడుగునా ప్రబోధించారు. ప్రతినిధులు చేసిన హర్షధ్వానాలూ, కరతాళధ్వనులూ వారి నెలా ఉత్తేజపరిచాయో, కర్తవ్య నిష్ఠ ఎలా నింపాయో స్పష్టం చేసినయ్.

### విశిష్టమైన విద్యాగోష్ఠి

8 వ తేదీ మధ్యాహ్నం 3 గంటలకు 'విద్యా గోష్ఠి' జరిగింది. కేంద్రప్రభుత్వం ప్రతిపాదించిన 'నూతన విద్యావిధానం'పై కేంద్రీకరించిన ఈ గోష్ఠికి ఫెక్టా అధ్యక్షులు శ్రీ యం.జె. మాణిక్యారావు అధ్యక్షత వహిస్తూ ఇలా అన్నారు. కేంద్రం తనకుతానే ఒక విధానాన్ని రూపొందించి ప్రజాభిప్రాయ సేకరణ పేరిట చర్చలకు విడుదల చేసింది. కాని వాస్తవంగా చూస్తే ఇదొక నాటకం తప్ప మరేమీకాదు. మనం ఆమోదించినా, వ్యతిరేకించినా కేంద్రప్రభుత్వం తన నిర్ణయాన్ని అమలుజరిపి తీరుతుందన్నారు. పెట్టుబడిదారీ దేశాలలోని విద్యారంగ సంక్షోభాన్ని, సోషలిస్టు దేశాలలోని విద్యారంగ ఔన్నత్యాన్ని విడమర్చి చెప్పారు. ఆంధ్రప్రదేశ్‌లో కొన్ని ఉపాధ్యాయ సంఘాలు ఉద్యమాన్ని చీల్చడానికి, జారిపోతున్న తమ ఉనికిని దక్కించుకొనటానికి తలమునకలవుతున్న ఈ దశలో యు.టి.యఫ్. విద్యారంగ అభివృద్ధికి, సమరశీల ఉపాధ్యాయ ఉద్యమ నిర్మాణానికి ఐక్య వేదికగా ఆదర్శవంతమయిన కృషి చేస్తున్నదని ఆయన యు.టి.యఫ్. ని ప్రశంసించారు.

గోష్ఠిలో ప్రధానవక్తగా పాల్గొన్న త్రిపుర ఉపముఖ్యమంత్రి, ఆ రాష్ట్ర విద్యాశాఖ మంత్రి అయిన శ్రీ దశరథదేవ్ తమ సుదీర్ఘ ప్రసంగంలో విద్యారంగానికి సంబంధించిన అనేక కీలకాంశాల్ని చర్చించారు. విద్య రాష్ట్రాల జాబితాలో వుండాలని రాజ్యాంగ వేత్తలు అంబేద్కర్, నెహ్రూలు పేర్కొనగా 1976 లో శ్రీమతి ఇందిరాగాంధీ వారి అభిప్రాయాలను త్రోసిపుచ్చి ఉమ్మడి జాబితాలో చేర్చారనీ, నేటి ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధి మరొక అడుగు ముందుకు వేసి విద్యారంగాన్ని టాటా, బిర్లాల చేతుల్లో పెట్టే ప్రయత్నాలు చేస్తున్నారని అన్నారు. విద్యారంగ సంక్షోభం మొత్తం ఈ దేశ ఆర్థిక సంక్షోభంలో భాగమేనని నొక్కిచెప్పారు.

గోష్ఠిలో సందేశమిచ్చిన మార్క్సిస్టుపార్టీ రాష్ట్ర కార్యదర్శి



విద్యాగోష్ఠికి అధ్యక్షత వహించిన
శ్రీ యం. జె. మాణిక్యారావు,






ప్రసంగిస్తున్న శ్రీ యల్. బాలగంగాధరరావు,

శ్రీ లావు బాలగంగాధరరావు మాట్లాడుతూ దేశంలో క్రమంగా నియంతృత్వ ఛాయలు పొడచూపుతున్నాయని, ప్రజాఉద్యమాలపైనా, ప్రజా సంఘాలపైనా నిర్బంధకాండ పెరుగుతోందనీ, ఈ స్థితిలో ఉపాధ్యాయులు కేవలం తమ ఆర్థిక హక్కుల కొరకే పరిమితమయితే, లేక తక్షణం లాభం పొందే అంశాలను మాత్రమే దృష్టిలో పెట్టుకుంటే ఇన్ని సంవత్సరాలుగా కష్టపడి నిర్మించుకున్న ప్రజా ఉద్యమాలు నాశనమయ్యే ప్రమాదమున్నదని, ఈ ప్రమాదం పట్ల అన్ని వర్గాలతోపాటు ఉపాధ్యాయ వర్గంకూడ అతి జాగరూకతతో వుండాలని హెచ్చరించారు.

అనంతరం భారత విద్యార్థి ఫెడరేషన్ అధ్యక్షులు శ్రీ శీతారాం ఏచూరి విలువైన ప్రసంగం చేశారు. విద్యా వ్యవస్థ ఎప్పుడూ పాలక వర్గాల ప్రయోజనాలకు అనుగుణంగానే వుంటుంది తప్ప ప్రజలందరి ప్రయోజనాలకోసం కాదని అన్నారు. ఉడ్స్ డిస్పాచ్ దగ్గరనుండి నేటి రాజీవ్ విద్యావిధానం వరకు భారతదేశంలో జరిగిన విద్యావిధాన మార్పులు, ఆ మార్పులకు వెనకనున్న ఆయా పాలక వర్గాల ప్రయోజనాలను బయట పెడుతూ ఒక తాత్విక దృష్టితోగల సమాచారాన్ని సవివరంగా తెలియజేశారు.

శ్రీ సి.యస్. చారి (ప్రిన్సిపాల్, న్యూసైన్స్ కాలేజి, హైదరాబాద్) ప్రసంగిస్తూ, యు.టి.యఫ్. ఆధ్వర్యాన సాగుతున్న 'అకడమిక్ సెల్'ను మహాసభల సందర్భంలో వెలువరించిన డాక్యుమెంట్ సారాంశాన్ని వివరించారు. చివరిగా 'ఆల్ బెంగాల్ టీచర్స్ అసోసియేషన్' నాయకులు శ్రీ అమితవసేన్ మాట్లాడుతూ, కేంద్రం ప్రతిపాదించిన డాక్యుమెంటును 'నల్ల డాక్యుమెంటు'గా అభివర్ణించారు. ఇది ప్రజాస్వామ్య, శాస్త్రీయ, లౌకిక పద్ధతులకు వ్యతిరేకమని అన్నారు.

గోష్ఠిలో పాల్గొన్న వక్తలందరూ కేంద్రప్రభుత్వం ప్రతిపాదించిన నూతన విద్యావిధానం పట్ల ఆందోళన చెందారు. ఈ విధానం విద్యారంగ భవిష్యత్తును అంధకార బంధురం చేస్తుందని, సకల అరిష్టాల్ని విద్యారంగంలోకి చొప్పిస్తుందనీ వారు నిశితంగా విమర్శించారు.

పిదప శ్రీ మైనేని ప్రవేశపెట్టిన నూతన విద్యావిధానంపై తీర్మానాన్ని సభ కరతాళ ధ్వనులతో ఆమోదించింది.

## సామాజిక సమస్యలు - సదస్సు

మహాసభల రెండవరోజు ఉదయం శ్రీ కె. నారాయణరావు అధ్యక్షతన 'సామాజిక సమస్యలు - సదస్సు' జరిగింది. ఈ సదస్సులో ప్రధాన ఉపన్యాసకులుగా ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం ప్రధాన కార్యదర్శి డా॥ వై. రాధాకృష్ణమూర్తి గారు పాల్గొన్నారు. 'పౌరహక్కుల పరిరక్షణ' అన్న అంశంపైన మాట్లాడుతూ, దేశంలో పౌరహక్కులపై దాడి నానాట పెరుగుతోంది. అసలు రాజ్యాంగంలోనే హక్కులు కుడిచేత్తో ఇచ్చి. ఎడం చేత్తో లాక్కున్నట్టుందన్నారు. మేధావి వర్గానికి చెందిన ఉపాధ్యాయులు పౌరహక్కుల పరిరక్షణ అంశానికి కూడ ప్రాధాన్యత నివ్వవలసిన అవసరం ఎంతైనా వుందన్నారు. వ్యక్తి స్వేచ్ఛ, సమాజ స్వేచ్ఛ, ప్రజాస్వామ్య హక్కుల రక్షణను నిత్యజాగరూకతతో కాపాడుకోవాలని డా॥ రాధాకృష్ణమూర్తిగారు నొక్కిచెప్పారు.

అనంతరం 'ప్రపంచ శాంతి' అనే అంశంపైన డా॥ వి. బ్రహ్మారెడ్డిగారు మాట్లాడుతూ ప్రపంచంలో నేడు అణుయుద్ధోన్మా



సామాజిక సమస్యల సదస్సుకి అధ్యక్షత వహించిన శ్రీ కె. నారాయణరావు







సబ్ కమిటీ

## స బ్ క మి టీ

అధ్యక్షుడు శ్రీ డి. రామిరెడ్డి. ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. వెంకటస్వామి. ఉపాధ్యక్షులు శ్రీయుతులు కె. తిరుపాలు, పి. లక్ష్మయ్య, టి. అంజిరెడ్డి, పి. సత్యనారాయణ, జి.సి. లక్ష్మిరెడ్డి. కార్యదర్శులు సర్వశ్రీ ఎస్. ఆర్. పోలిశెట్టి, ఎం. నరహరి, వి. సూర్యనారాయణ రాజు, ఎస్. విజయకుమార్, కె. నారాయణరావు. ప్రధాన సంపాదకుడు శ్రీ యం. వెంకటరత్నం.

## కా ర్య వ ర్గ ం

సర్వశ్రీ బి. మోహనరావు (శ్రీకాకుళం), ఎం. కృష్ణమూర్తి (విజయనగరం), కె.ఎస్.ఎన్. శాస్త్రి (విశాఖపట్నం), జి. చిట్టిబాబు (తూర్పు గోదావరిజిల్లా), జి. రాఘవరాజు (పశ్చిమగోదావరి జిల్లా) పి. సోమయ్య (కృష్ణా), వి. విశ్వనాథం (గుంటూరు), ఎం. పానకాల రావు (ప్రకాశం), వి. బాలసుబ్రహ్మణ్యం (నెల్లూరు), ఎస్. ఆనంద నాయుడు (చిత్తూరు), డి. రామిరెడ్డి (కడప), ఎ. చెన్నకేశవరెడ్డి (కర్నూలు), బి. నరసప్ప (అనంతపురం), కె. కృష్ణయ్య (ఖమ్మం), కె. భద్రయ్య (వరంగల్), కె. కృష్ణమూర్తి (నల్లగొండ), ఎ. చంద్ర మౌళి (మహబూబ్‌నగర్), ఎస్. నరసయ్య (ఆదిలాబాద్), పి. వెంకటి (కరీంనగర్), బి. బాలయ్య (నిజాంబాద్), ఎన్. రమణయ్యశాస్త్రి (హైద్రాబాద్), యం. మార్క్ (రంగారెడ్డిజిల్లా), ఎం. ఆర్. రెడ్డి, (మెదక్), ఎ. లెనోరా (మహిళా).

దానికి వ్యతిరేకంగా సాగుతున్న శాంతి ఉద్యమానికి అత్యంత ప్రాధాన్యతనీయాల్సిన ఆవశ్యకత వుందన్నారు. ఆయుధాలను ఎవరు ఎందుకు తయారుచేస్తారో వివరించారు. సోవియట్ రష్యా లేకపోతే అమెరికా ఏనాడో ఈ ప్రపంచాన్ని తన పాదాక్రాంతం చేసుకొనే దన్నారు. శాంతి శక్తుల్ని మనం బలపర్చుకోవాలన్నారు.

వీరిద్దరి ప్రసంగాలు సభికుల్ని ఆలోచింపజేశాయి. పలువురు ప్రశంసించారు. విజ్ఞానాత్మక, ప్రయోజనాత్మక ప్రసంగాలు అవి.

# నూతన కార్యవర్గం ఎన్నిక

౮వ తేదీ మధ్యాహ్నం నూతన కౌన్సిల్ సమావేశం జరిగింది. శ్రీ పి. సోమయ్య పర్యవేక్షణలో క్రిందివారితో నూతన కార్యవర్గ ఎన్నిక ఏకగ్రీవంగా జరిగింది.



ఆడిట్ కమిటీ

## సం పా ద క వ ర్గ ం

శ్రీ మైనేని వెంకటరత్నం (ప్రధాన సంపాదకుడు), శ్రీ అప్పారి వెంకటస్వామి, శ్రీ కె. కేశవరెడ్డి. శ్రీ వి. బాలసుబ్రహ్మణ్యం శ్రీ నాగటి నారాయణ.

## ఆ డి ట్ క మి టీ

శ్రీ జి. లక్ష్మయ్య, శ్రీ టి. కొండాచారి, శ్రీ ఎం.ఎ.కె. దత్.

### ప్ర క ట న

మహాసభలో పాడిన పాటలు, హరికథ క్యాసెట్‌గా రూపొందిస్తున్నాం. ఎవరికి కావాలో ముందుగా రు. 40/-లు అడ్వాన్స్ పంపితే సప్లయి చేయగలం ॥సం॥





# స్పందించిన గురువాహిని ప్రతిధ్వనించిన ఉద్యమవాణి

ఆ సాయంత్రం 4 గంటలకు బ్రహ్మాండమయిన ప్రదర్శన జరిగింది. రాష్ట్రంలో ఉపాధ్యాయ ఉద్యమానికి అద్దంపడుతూ మహోత్తేజపూరితంగా జరిగిన ఉపాధ్యాయుల ఊరేగింపు అది. మూడు రోజులపాటు జరిగిన మహాసభలు ఒక ఎత్తు కాగా ఈ ఊరేగింపు మరో ఎత్తుగా కొనసాగింది.

మహాసభలు జరుగుతున్న సుబ్బరాజు నగర్ (మాంటిసోరి మహిళా కళాశాల) నుండి ప్రదర్శన ప్రారంభమయింది. ప్రదర్శనకు ముందు పీటీన నాల్గవ మహాసభలకు సూచనగా నాలుగు పెద్ద అరుణ పతాకాలను పట్టుకొని శ్రీయుతులు వై. యల్. నారాయణ, గోపాలం, ధర్మారావు మరియు శ్రీమతి కమల కుమారిగార్లు ముందడుగు వేయగా మహాసభల బ్యానర్‌ను ఇద్దరు ఉపాధ్యాయినులు పట్టుకొని ముందుకు సాగారు. ఆ వెనుక సబ్ కమిటీ సభ్యులు ఇతర రాష్ట్రాల ప్రతినిధులు వారి వెనుక ఉపాధ్యాయినులు, ఆ తరువాత ఆతిథ్యమిచ్చిన కృష్ణాజిల్లా వారు, వారి వెనుక ఒక్కొక్క జిల్లావారు వారి వారి జిల్లా బ్యానర్లతో అత్యంత క్రమశిక్షణాయుతంగా సుశిక్షితులయిన సైనికులుగా దాదాపు పదికిలోమీటర్లు 'లాంగ్ మార్చ్' చేశారు. ప్రదర్శన అగ్రభాగం బస్‌స్టాండు వద్దకు చేరుకోగా చివరిభాగం మాంటిసోరి వద్దనే వున్నది. రెండు వరుసలలో సాగిన ఈ ప్రదర్శన ఒక క్రొత్త కొండవాగులా కన్పించింది. ప్రతి ఒక్కరి చేతిలోనూ ఒక యు. టి. యఫ్ జెండా వున్నది. పైకెగిరిన అన్నివేల అరుణ పతాకాలు సాగిపోతూ వుంటే ఒక ఎర్రని సెలయేరు గలా గలా సాగిపోతున్నట్టు, మందారాలు కదులుతున్నట్లు ... ఎర్రగులాబీలు పరచినట్టు నయనానందకరంగా వున్నది.



డెకరేషన్ కమిటీ



సమీక్షకర్తలు - సంపాదకవర్గ సభ్యులు

సర్వశ్రీ కె. కేశవరెడ్డి, వి. బాలసుబ్రహ్మణ్యం, యన్. నారాయణ

## స్థంభించిన వాహనాలు

విజయవాడ పట్టణంలో సాయంత్రం ట్రాఫిక్ రద్దీగా వుంటుంది. వాహనాల జోరు చెప్పనలవిగాదు. అదే సమయంలో ఉపాధ్యాయుల ఊరేగింపు రోడ్లు కలిసిన కూడలి ప్రాంతాలు దాటి పోయే సందర్భంలో ట్రాఫిక్‌కు పూర్తి అంతరాయం కలిగింది. ఎటు చూసినా నిలిచిపోయిన వాహనాలే. ప్రదర్శన ఒక పాయింటుని దాటి పోవుటకు దాదాపు గంట సమయం పట్టింది. ఇంత సమయం నిలవ లేక ప్రదర్శన మధ్యలో పోవాలని కొన్నిచోట్ల వాహనాలు ప్రయత్నించినా వాటి ప్రయత్నం విఫలమైంది. ఇందుకు ట్రాఫిక్ పోలీసుల కృషి ఏమీలేదు. వారికంటె సుశిక్షితులయిన వలంటీర్లు ప్రతి కూడలి లోనూ ఒకరి చేతులు ఒకరు పట్టుకుని ఊరేగింపు నిరంతరాయంగా సాగేందుకు తోడ్పడ్డారు.

## మూడు గంటల్లో పదికిలోమీటర్లు

ప్రదర్శన సాగిన దూరం పదికిలోమీటర్లు. ఇందులో అనేక మలుపులు... పలుకూడలులు వున్నాయి. మాంటిసోరినుండి బయల్దేరి మహాత్మగాంధీ రోడ్డుపైసాగి, బస్‌స్టాండు దాటి, ఫైర్ స్టేషన్ వద్ద మలుపుతిరిగి, కార్ల్ మార్క్స్ రోడ్డుపై చకచకా నడిచి, లక్ష్మిటాకీస్ సెంటర్‌నుండి అలంకార్ వైపు అలలై ప్రవహించింది. శైలజ రామా... కళ్యాణచక్రవర్తి... రాజ్ యువరాజ్... ఊర్వశి...





మేనక థియేటర్ల నధిగమించి శాతవాతన కాలేజీనొక కంట జూస్తూ... కొత్తవంతెన మీదుగా ముందుకుసాగి, నాల్గింటికి బయల్వెడలి ఏడుగంటలకు మళ్ళీ సభా స్థలికి చేరింది.

## అందరి కళ్ళూ ప్రదర్శన పైనే....

విజయవాడ పురవీధుల్లోని ప్రజల కళ్ళన్నీ ఆ మహాప్రదర్శన పైనే నిలిచాయి. స్కూల్ పిల్లల్లా ఉరకల పరుగులతో మార్చ్‌చేస్తూ కెరటాల్లా కదిలిపోతూన్న ఆ మహావాహినిని చూసి ముగ్ధులైపోయారు. ఇది 'ఉపాధ్యాయ ఊరేగింపు' అంటే కొందరు నమ్మలేకపోయారు... మరికొందరు ఆశ్చర్యచకితులయ్యారు. చాలామంది ఉత్తేజితులయ్యారు. రిక్షా కార్మికులు పట్టరాని సంతోషంతో కొందరు యు. టి. యఫ్. జండాలు తీసుకుని తమ రిక్షాలకు కట్టుకున్నారు. నిలిచిపోయిన బస్సుల్లోని ప్రయాణీకులు కూడ అరుణపతాకాలను అడిగితీసుకుంటూ నినాదాల హోరులో వారి గొంతులూ కలిపారు. డాబాలపై నున్న వారు చేతులూపుతూ స్వాగతం పలికారు.

రాష్ట్రంలోని ఉపాధ్యాయ వాణిని ప్రతిధ్వనిస్తూ సాగిన గురుశ్రేణి 'ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్' మహాప్రస్థానంలో ఒక మైలురాయిగా, ఒక కలికితురాయిగా చెప్పుకోవచ్చు. ఫెడరేషన్ పోరాట చరిత్రలో ఇదొక కీలక ఘట్టంగా ప్రస్తుతించవచ్చు. ఉపాధ్యాయ సంక్షేమంతోపాటు రాష్ట్ర శ్రేయస్సును, దేశాభ్యుదయాన్ని, ప్రపంచ శాంతిని కోరుకుంటూ యు. టి. యఫ్. నిరంతరం ఉపక్రమిస్తుందనటానికి ఈ అశేష అధ్యాపక సమీకరణ ఒక ప్రత్యక్ష నిరూపణ. రాష్ట్రంలో ఉపాధ్యాయ ఉద్యమానికి సమరశీల కార్యక్రమంతో ప్రాతినిధ్యం వహిస్తున్న ఏకైక సంఘం యు. టి యఫ్. అన్న సత్యాన్ని ఆ ప్రదర్శన నిరూపించింది.



హైదరాబాద్ కార్యాలయం : శ్రీ యం. ఎ. కె. దత్తు (యు.టి.యఫ్. కార్యదర్శి), శ్రీ పి. సత్యనారాయణ (హౌస్ బిల్డింగ్ సొసైటీ బాధ్యులు), యల్. రమణారెడ్డి (టైపిస్ట్)

## బహిరంగసభ

విజయవాడ పురవీధులలో ఉత్సాహోత్తేజాలతో ఉప్పొంగిన ఉపాధ్యాయుల ప్రదర్శన అనంతరం మహాసభల ప్రాంగణంలో ఒక బ్రహ్మాండమయిన బహిరంగసభ జరిగింది. సభకు శ్రీ డి. రామిరెడ్డి అధ్యక్షత వహించారు.



ప్రసంగిస్తున్న శ్రీ మోటూరు హనుమంతరావు

బహిరంగసభలో ప్రధాన ఉపన్యాసం చేసిన 'ప్రజాశక్తి' సంపాదకులు శ్రీ మోటూరు హనుమంతరావు మాట్లాడుతూ సమాజంలో మౌలిక మార్పుల్ని తీసుకరాలేని రాజీవ్ ప్రభుత్వ నూతన ఆర్థిక, విద్యావిధానాల్ని త్రోసిపుచ్చటం మినహా మరో మార్గం లేదన్నారు. 'రాజీవ్ విధానాలు ఒకవైపు కంప్యూటరైజేషన్ మరోవైపు నిరక్షరాస్యత, నిరుద్యోగం' అని వక్కాణించారు. సోషలిజం పేరు జపిస్తూ, ఆచరణలో భిన్నమైన, నష్టదాయకమైన వైఖరిగాన్నదని విశదీకరించారు. ఈ విద్యావిధానం అజ్ఞానం, నిరక్షరాస్యత, నిష్ట దరిద్రాలను పెంచేదిగా వున్న దృష్ట్యా దాన్ని వ్యతిరేకించాల్సిన ఆవశ్యకత వుందన్నారు. కొన్ని సూత్రాలకు కట్టుబడి పనిచేస్తున్న యు. టి. ఎఫ్. కు రాష్ట్ర ఉపాధ్యాయ రంగంలో ఒక విశిష్ఠ స్థానం ఏర్పడింది. ఆ విషయం నేటి ప్రదర్శన, మహాసభ స్పష్టంగా ఋజువు చేస్తున్నాయి. ప్రజా సమస్యలపై కూడ సానుకూలంగా ప్రతిస్పందిస్తున్నందుకు అభినందనలు" అని శ్రీ మోటూరు హనుమంతరావు యు. టి. ఎఫ్. ని అభినందించారు.

నేడు రెండు రకాల ప్రపంచాలు వున్నాయని, అందు ఏది నిజమైన ప్రజాశ్రేయస్సును నిలబెట్టే ప్రపంచమో ఉపాధ్యాయులు అధ్యయనం చేయాలనీ, వాస్తవాలను గ్రహించి శాస్త్రీయ పంథాను చేపట్టాలని కుల, మత, ప్రాంతీయ తత్వాలను రెచ్చగొట్టే శక్తుల పట్ల







ఎగ్జిబిషన్ నిర్వాహక బృందం

అప్రమత్తంగా వుండాలని ఆయన ఉపాధ్యాయ లోకానికి విజ్ఞప్తి చేశారు.

గన్నవరం సమితి అధ్యక్షులు శ్రీ అట్లూరి శ్రీమన్నారాయణ గారు ప్రసంగిస్తూ అనతి కాలంలోనే గణనీయమైన అభివృద్ధిసాధించి ఐక్యఉపాధ్యాయ ఉద్యమానికి అవిరళ కృషిచేస్తూ, అదే సందర్భంలో సమసమాజాన్ని కాంక్షిస్తూ అందుకు తనవంతు కర్తవ్యం నిర్వహిస్తున్న యు.టి.యఫ్. ని ప్రశంసించుతూ, ఇంతటి విశిష్ట ప్రగతిని చూసి ఓర్వలేని కొన్ని శక్తులు యు.టి.యఫ్. ప్రతిష్టతను దెబ్బతీయుటకు పొంచివున్నాయని, ఈ పరిస్థితిలో యు.టి.యఫ్. వారు అప్రమత్తంగా వుండాలన్నారు.

శ్రీ అయితా రాములు (విజయవాడ నగర మేయర్) ప్రసంగిస్తూ ప్రజాసంఘంగా యు.టి.యఫ్. పురోగమనాన్ని నగర ప్రజలు కళ్ళారా చూశారని, ఇంకా అనేకుల్ని ఆకర్షించి మరింత పటిష్టంగా రూపొందాలని తన అపార ఆనందాన్ని వ్యక్తీకరించారు.

సభకు అధ్యక్షత వహించిన శ్రీ డి. రామిరెడ్డి తొలుత మాట్లాడుతూ, తమ సంఘం ఏ రాజకీయ పార్టీకి అనుబంధం కాదని తమ సంఘంలో వివిధ రాజకీయ పార్టీలకు చెందినవారు, ఏ రాజకీయ పార్టీకి చెందనివారుకూడా వున్నారని వివరించారు. సమస్యల పరిష్కారానికి ఐక్య ఆందోళనలు చేపట్టడం తమ సంఘ ప్రధాన ధ్యేయమని, విద్యారంగంలో సమూలమైన మౌలిక మార్పులకు తమ సంఘం కృషి చేస్తుందని స్పష్టంగా చెప్పారు.

## సాహిత్య గోష్ఠి

మహాసభల సందర్భంగా జనవరి 10 వ తేదీ ఉదయం జరిగిన 'సాహిత్య గోష్ఠి' ఒక హైలైట్. సభికుల్ని ఆకట్టుకున్న ఈ గోష్ఠి ఉపాధ్యాయులలో సాహిత్యాభిలాషను కలిగించింది. గోష్ఠికి యు.టి.యఫ్. రాష్ట్ర కార్యదర్శి శ్రీ యం. నరహరి అధ్యక్షత వహిస్తూ సమాజానికీ-సాహిత్యానికీ, సమాజానికీ-మహిళలకూవున్న సంబంధాన్ని విశ్లేషిస్తూ సాహిత్యం సామాజిక ప్రయోజనాన్ని నెరవేర్చాలని ఉద్ఘాటించారు.



సాహిత్య సదస్సుకు అధ్యక్షత వహించిన శ్రీ యం. నరహరి

గోష్ఠిలో ప్రధాన ఉపన్యాసం చేసిన ప్రముఖ కవి, సాహిత్య సాగరాన్ని మధించిన నిర్విరామ పరిశోధకుడు డాక్టర్ ఆరుద్ర 'అధ్యయనం...అధ్యాపనం...పోరాటం' అనే ధ్యేయాన్ని సూత్రీకరిస్తూ తన ఉపన్యాసాన్ని ఆద్యంతం అత్యంత ఉత్కంఠ ప్రాయంగా కొనసాగించారు.

యుగధర్మాన్ని ఆరుద్ర ప్రస్తావిస్తూ పాలకులను బట్టి యుగధర్మం చలామణి అవుతోందనీ ప్రస్తుతం పెట్టుబడిదారీ యుగధర్మం మన దేశంలో నడుస్తుందనీ, అయితే రేపటి యుగధర్మం 'సామ్యవాదమనీ' సుస్పష్టంగా చెప్పటంతో సభాప్రాంగణం కరతాళ ధ్వనులతో మార్మోగింది. భూమి ఉమ్మడి ఆస్తికావాలని, అది ఒక్క కమ్యూనిస్టు సమాజంలోనే వీలవుతుందని శ్రీ ఆరుద్ర ఉద్ఘాటించారు.

విద్యావిధానం మారాలని వేదికమీద చెప్పేపాలకులు విద్యావిధానాన్ని మార్చి పుణ్యంకట్టుకోరు ఎందుకు? అని ప్రశ్నిస్తూ...ఆ పుణ్యం కట్టుకుంటే వారు స్థానభ్రష్టులవుతారని అసలు రహస్యాన్ని బయట పెట్టారు. మనకు మేధావులున్నారు. గొప్ప సాంకేతిక శాస్త్రజ్ఞులున్నారు...లేనిదల్లా చిత్తశుద్ధేనని నిర్మొహమాటంగా చెప్పారు.





ప్రసంగిస్తున్న డా॥ వి. కోటేశ్వరమ్మ

'దేశంలోని స్త్రీలు మారనిదే, దేశం మారదన్న' వీరేశలింగం గారి ప్రవచనాన్ని గుర్తుచేస్తూ, స్త్రీలు సంపూర్ణ విజ్ఞానాన్ని సముపార్జించాలనీ, వారి చదువుకు అందరి తోడ్పాటు వుండాలంటూ, సమాజ పరిణామ క్రమంలో స్త్రీల నిర్మాణాత్మక పాత్రను గురించి సోదాహరణంగా వివరించారు.

దేశ ఫెడరల్ వ్యవస్థనూ, భాషా సమస్యను, పోరాట సమయా సమయాలకు సంబంధించిన అనేక విషయాలను తన గంటకు పైగా ఉపన్యాసంలో వివరించుతూ, ప్రేక్షలకు విజ్ఞానాత్మక చైతన్యం అందించటమేగాక ఆలోచనామృతంలో ముంచారు.

ఇంకా సదస్సులో శ్రీమతి కె. అరుణావ్యాస్ 'సాహిత్యంలో మహిళలు' అన్న అంశంపై ప్రసంగిస్తూ, ప్రస్తుతం సమాజంలో పెచ్చుపెరుగుతున్న అశ్లీల సాహిత్యాన్ని గూర్చి తీవ్ర విచారాన్ని



ప్రసంగిస్తున్న శ్రీమతి అరుణా వ్యాస్

వ్యక్తం చేశారు. ఇటువంటి అశ్లీల, అరాచక కల్మషాన్ని తుడిచిపెట్టి డానికి మహిళలు నడుంకట్టి పోరాడాలని ఆమె ఉద్బోధించారు.

శ్రీమతి వి. కోటేశ్వరమ్మ 'విద్యారంగం - మహిళలు' అన్న అంశంపై ప్రసంగిస్తూ, దేశంలోని సగభాగమైన స్త్రీల అభివృద్ధి కూడ జరిగినప్పుడే దేశం పురోగమిస్తుందని, స్వాతంత్ర్యం పొందిన నాటినుండి విద్యారంగంలో స్త్రీల పరిస్థితుల్ని గణాంకాలతో సహా వివరిస్తూ మహిళా విద్యాభివృద్ధికి అందరూ కృషి చేయాలని అన్నారు.

ఈ సదస్సులో పాల్గొన్న మరొక ప్రధాన వక్త శ్రీమతి గోదావరి పరులేకర్ ప్రసంగించుతూ, 'మహిళలు పోరాడవలసింది పురుషులకు వ్యతిరేకంగా కాదనీ, అసమానతలను పెంచి పోషిస్తున్న, పురుషాధిక్యతను కాపాడుతున్న ఈ వ్యవస్థపై తిరుగుబాటు చేయాలనీ, ఈ అస్తవ్యస్త సమాజాన్ని అంతరింపజేయాలనీ, నూతన సమాజానికి బాటలు వేసే వారితో చేయి కలిపి కలిసికట్టుగా పోరాడాలనీ మహారాష్ట్రలో వర్లీ ఆదివాసుల తిరుగుబాటుకు నాయకత్వం వహించిన వీరనారి, అనేక అవార్డులు పొందిన రచయిత్రి శ్రీమతి పరులేకర్ ఉద్బోధించారు. 79 సంవత్సరాల శ్రీమతి పరులేకర్ అత్యంత ఆవేదనతో, ఆవేశంతో చేసిన ప్రసంగం అందరినీ ఉత్తేజితుల్ని చేసింది.




ప్రసంగిస్తున్న డా॥ ఎ. పి. విఠల్

అనంతరం ఆంధ్రప్రజానాట్యమండలి అధ్యక్షులు డా॥ ఎ.పి. విఠల్ 'సాహిత్యం-సామాజిక ప్రయోజనం' అన్న అంశంపై ప్రసంగిస్తూ, సాహిత్యం సమిష్టి మానవశ్రమ ఫలితమేననీ, అటువంటప్పుడు ఆ సాహిత్యం ఆమానవుల ప్రయోజనానికి ఉద్దేశించబడాలని అన్నారు. సాహిత్య పరమప్రయోజనం సామ్యవాద ప్రపంచ స్థాపనని ఆయన నొక్కివక్కాణించారు. భావాల పుట్టుకకూ, సాహిత్య ఆవిష్కరణకు పునాది భౌతిక పరిస్థితులేనని "నిరుపహతి స్థలంలో రమణీప్రియ





ప్రసంగిస్తున్న శ్రీమతి యస్. పుణ్యవతి



శ్రీ జగన్ మరియు నారినపాడు పాటల దళం

దూతిక చెంతనున్నప్పుడు 'మను చరిత్ర' పుడితే, ఆకలేసి కేకలేస్తే 'మహా ప్రస్థానం' వచ్చిందని" ఈ విషయాన్ని గమనంలో వుంచుకోవాలని ఆయన ఉద్బోధించారు. ఒక మేధావి మెదడును మాత్రమే స్పందింపజేయగలడు, అయితే కవి మెదడును, హృదయాన్ని స్పందింపజేయగలడని, అటువంటి కవులు, రచయితలు సమసమాజ నిర్మాణ కృషిలో తమవంతు కర్తవ్యం నెరవేర్చాలని, అప్పుడే సాహిత్యానికున్న సామాజిక ప్రయోజనం నెరవేరుతుందని శ్రీ విఠల్ ఉద్బోధించారు.

ఆ తరువాత శ్రామిక మహిళా సంఘం కన్వీనర్ శ్రీమతి పుణ్యవతి 'మహిళలు-రాజకీయాలు' అన్న అంశంపై ప్రసంగిస్తూ, మహిళలకు రాజకీయాలకు సంబంధం లేదన్నది మోసపూరితమైన వాదన అనీ, స్త్రీల సమస్యలు రాజకీయాలతో ముడిపడివున్నాయని అన్నారు. ఈ సందర్భంగా ఆమె షాభాను కేసులో జరుగుతున్న రాజకీయ తంతును దుయ్యబట్టారు.

శ్రీ వి. వి. కృష్ణారావు (గౌరవాధ్యక్షుడు, ఎ.ఐ.సి.యు.ఎఫ్.) సందేశమిస్తూ, 'విద్యావిధానాన్ని శాస్త్రీయ ప్రాతిపదికపై విశ్లేషించాలని, సోషలిస్టు వ్యవస్థ పరమార్థంగా ఉండాలని అన్నారు.

## ముగింపు సభ

10వ తేదీ సాయంత్రం జరిగిన ముగింపు సభకు శ్రీ డి. రామిరెడ్డి అధ్యక్షత వహించారు. కృష్ణా జిల్లాపరిషత్ అభివృద్ధి అధికారి శ్రీ పి. వెంకటేశ్వరరావు, రెసిడెన్షియల్ కాలేజి లెక్చరర్ శ్రీ సి. రామయ్యగార్లు ప్రసంగిస్తూ, ఉపాధ్యాయ ఉద్యమంలో యు. టి. ఎఫ్. స్థానాన్ని ప్రశంసించారు. అది సాధించిన విజయాలపట్ల సంతృప్తి వ్యక్తంజేశారు. తమిళనాడు గ్రాడ్యుయేట్స్ అసోసియేషన్ కార్యదర్శి శ్రీ ఆరోగ్యదాస్, ఆంధ్రప్రదేశ్ మహిళాసంఘం ప్రధాన కార్యదర్శి శ్రీమతి మోటూరి ఉదయం ప్రభృతులు సందేశాలిచ్చారు.

పిదప పత్రికా క్యాంపెయిన్లలో విజేతలకు, మహాసభల సందర్భంగా ఏర్పాటుచేసిన ఎగ్జిబిషన్‌లో ఉత్తమ ప్రదర్శనలకు, సాంస్కృతిక ప్రదర్శనల్లో గెలుపొందినవారికి శ్రీ రామిరెడ్డి బహుమతి ప్రధానం చేశారు.

ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. వెంకటస్వామి మహాసభలు ఇంతగా దిగ్విజయం కావటానికి పలువిధాల సహకరించి, సహాయపడిన అందరికి పేరుపేరునా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనలు తెలిపారు. 'జయమనదే' పాటతో మూడురోజుల మహాసభల కార్యక్రమం విజయవంతంగా ముగిసింది.

## జోహారు!

— శ్రీ వల్లి ధర్మారావు

జోహారు జోహారు మా సుందరయ్యా
నీ వంటి త్యాగధనులు విశ్వంలో ఎందరయ్యా ॥జోహారు॥
పూవు పుట్టగానే - పరిమళించు అన్నటుల
పసివయసులో - స్వాతంత్ర్య పిపాసతో కదిలావు
సమతకొరకు, శాంతికొరకు కమ్యూనిస్టువైనావు
లక్షలాది ప్రజా హృదిలో తీయగా మెదిలావు ॥జోహారు॥
నిర్భాగ్యుల కోసమే - నీ బాధ, నీ మేధ
నిరుపేదలకోసమే - నిత్యం నీ ఆలోచన
శ్రమజీవుల హృదయాలకు - సౌఖ్యం కావాలని
సౌఖ్యం నువు మానుకొని - కష్టించిన తండ్రివయ్యా ॥జోహారు॥
స్వార్థము నీవెరుగవు - ప్రకృతిలా, పసిపాపలా
కల్మషమే ఎరుగవు - కాంతిలా, కనుపాపలా
స్వచ్ఛం నీ జీవితం - హిమములా, సుమములా
మహోన్నతం నీ త్యాగం - అరుణారుణ పతాకంలా ॥జోహారు॥
ఆపుకుందామన్నా - ఆగదయ్యా ఈ శోకం
మరిచిపోదు నిన్నెపుడు - దగాపడిన శ్రమలోకం
అమరుడవైనావంటే - నమ్మకుంది నా గుండె
తండ్రీ! తండ్రీ! అని - తల్లడిల్లు చుండె ॥జోహారు॥

(వేలాదిమంది ఊపివేస్తూ, కంటతడి పెట్టిస్తూ మహాసభలో శ్రీ జగన్ పాడిన ఈ గేయాన్ని ప్రతినిధుల కోరిక మేరకు ప్రచురిస్తున్నాం).



సందేశమిస్తున్న శ్రీ పి. వెంకటేశ్వరరావు

# ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ 4వ విద్యా, వైజ్ఞానిక మహాసభలు

# ఆహ్వాన సంఘాధ్యక్షుని స్వాగతోపన్యాసం




శ్రీ కాట్రగడ్డ శ్రీనివాసరావు

అధ్యక్ష మహాశయా !
ఐక్య ఉద్యమ ప్రతినిధులారా !!
విద్యాభిమానులారా !!!

ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్, 4 వ విద్యా వైజ్ఞానిక మహాసభలకు రాష్ట్రం నలుమూలలనుండి విచ్చేసిన ప్రతినిధులకు, ప్రత్యేకాహ్వానితులకు, ఉపన్యాసకులకు, ప్రజానాయకులకు, ప్రభుత్వాధినేతలకు, తదితర పెద్దలందరికీ కృష్ణాజిల్లా ప్రజానీకం తరఫునా, విజయవాడ పట్టణం తరఫునా, మా ఆహ్వానసంఘం పక్షానా ఇదే నా హృదయపూర్వక స్వాగతం !

సంకుచితమైన కుల, మత, ప్రాంతీయ తత్వాలకు అతీతంగా, మేనేజిమెంటు క్యాటగిరి విభేధాల నధిగమించి, అఖిలాంధ్ర దేశంలోని అన్ని తరగతుల ఉపాధ్యాయుల్ని సమీకరించి, సంఘటితపరచిన ఐక్య ఉద్యమ ప్రతినిధులుగా మీకు స్వాగతం చెప్తున్నాను.

మీ పదేళ్ళ ఉద్యమ పురోగతినీ, మీ కార్యకలాపాలనూ ప్రత్యక్షంగా చూచి, తమ సందేశాలను, అభినందలను అందజేయటానికి పలువురు పెద్దలు, ఇతర రాష్ట్రాలనుండి ఎన్నో వ్యయ ప్రయాసలకోర్చి వచ్చారు. వారందరికీ ప్రత్యేకంగా స్వాగతం చెప్తున్నాను.

మీ అందరినీ ఆహ్వానించే అదృష్టం కల్గినందుకు ఆనందిస్తూ ఈ ప్రాంతపు విశిష్టతను తెల్పటంకూడా నా బాధ్యతగా భావిస్తున్నాను.

• • •

కృష్ణానదికి ఉత్తరతీరాన వ్యాపించి, ఆ నది పేరుతోనే సార్థక నామధేయం అయింది మా జిల్లా. కృష్ణవేణీ జలాలతో తడిసి, పదునెక్కి కొన్ని తాలూకాలు సారవంతంగావున్నా, మరికొన్ని ప్రాంతాలు వర్షాధారంగా కూడా వున్నాయి.

జిల్లాలో సిమెంటు, పంచదార, హెవీ ఇంజనీరింగ్, థర్మల్ పవర్, ఎలక్ట్రానిక్స్ మొదలగు ఆధునిక పరిశ్రమలు నెలకొని ఉన్నాయి. బందరు ఓడరేవుగా, సాంకేతిక పరికరాల ఉత్పత్తి కేంద్రంగా, కలంకారీ అద్దకానికి, రోల్డ్‌గోల్డ్ పరిశ్రమకు ప్రసిద్ధినందింది. స్వాతంత్రోద్యమ కాలంలో జాతీయ విద్యా ప్రచారానికి ప్రతీకగా కూడా ఈ పట్టణం నిల్చింది. పాడి పరిశ్రమ, కోళ్ళ పరిశ్రమల్లో గణనీయ స్థానంలో ఉన్నదిమా జిల్లా. ప్రత్యేకించి విజయవాడ సినిమా డిస్ట్రిబ్యూటింగ్ కేంద్రంగా, ఆటోమొబైల్ సెంటర్‌గా ప్రసిద్ధినందింది. కృష్ణాబ్యారేజి జాతీయ రహదారిని కలుపుతూ, లక్షలాది ఎకరాల సాగుకు ఉపయోగిస్తున్నది. భారతదేశంలోనే పెద్ద రైల్వేకూడలిగా విజయవాడ రాణిస్తున్నది. ఇక్కడికి సమీపాన గల కొండపల్లి కొయ్యబొమ్మలు గృహపరిశ్రమగా దేశ విదేశాల్లో కూడా ప్రఖ్యాతి వహించి ఉన్నాయి. ఒక్క మాటలో చెప్పాలంటే, రాజకీయ, సాంస్కృతిక, సాహిత్య, కళారంగాల అభివృద్ధిలో విజయవాడ అనధికార రాష్ట్ర రాజధానిగా వర్థిల్లుతున్నది.

## ప్రాచీన చరిత్ర

పూర్వం కృష్ణా, గుంటూరు, పశ్చిమగోదావరి జిల్లాలు 'కృష్ణా మండలం'గా పిలువబడుతుండేది. ప్రాచీన కాలంలో దీనికి 'కర్మనాడు' అని పేరు కూడా ఉండేది. పూర్వం ఆంధ్ర సామ్రాజ్యానికి ఆయువు పట్టుగాను, ప్రస్తుతం రాజకీయ సాహిత్య కళారంగాల కేంద్రంగాను ఈ జిల్లా విలసిల్లుతున్నది.

1950 దశకంలో ప్రపంచ మహామేధావి కమ్యూనిస్టు సిద్ధాంత తత్వవేత్త అయిన కారల్ మార్క్స్ దృష్టిని ఆకర్షించటం, ఆయన భారతదేశం గురించి వ్రాసిన లేఖలలో ఈ మండలం స్థానం కల్పించుకొనటం గర్వింపదగిన అంశం.

క్రీస్తుకు పూర్వం 400 సంవత్సరాల ప్రాంతంలో ఈ మండలం బౌద్ధ మతానికి సుక్షేత్రం అయింది. నేటికీ చారిత్రక అవశేషాలుగా మిగిలిన ఘంటసాల, జగ్గయ్యపేట మొదలైన బౌద్ధ క్షేత్రాలు అందుకు సాక్షీభూతాలు. అంతేకాదు ఘంటసాల పూర్వం 'కంటక శైలము'ని పిలువబడేది. ఇది క్రీస్తుకు పూర్వమే ప్రధానమైన రేవు పట్టణంగా రాణించింది. అక్కడి పాటిదిబ్బలు తవ్వుతుంటే ఇప్పటికి బంగారు రోమన్ నాణేలు లభిస్తున్నాయి. ఇటలీ తదితర యూరప్ దేశాలకు, తూర్పు ఆసియా దేశాలకు ఈ రేవు నుండి పెద్దఎత్తున వ్యాపారం సాగింది సుప్రసిద్ధ ఈజిప్ట్ ఖగోళ శాస్త్రజ్ఞుడు 'టాలమీ' రచనలోనూ ఫ్రెంచి చిత్రకారుడు 'డూబ్రియల్' రచనలోను ఈ చారిత్రక

వాస్తవాలు ఉదహరించబడినవి. ఆచార్య నాగార్జునుని ముఖ్య శిష్యుడు, మూలికా వైద్య నిపుణుడుగా గణుతికెక్కిన సిద్ధ నాగార్జునుడి జన్మ స్థలం జగ్గయ్యపేట. అక్కడ ఆయన నిర్మించిన బౌద్ధస్తూపం నేటికీ పర్యాటకుల దృష్టిని ఆకర్షిస్తున్నది. విజయవాడలోని మొగల్రాజపురం, ఇంద్రకీలాద్రి కొండగుహలు, ఇక్కడికి సమీపాన గల ఉండవల్లి గుహలు, అమరావతిస్తూపం, పల్లు గ్రామాలలో నేటికీ కన్పిస్తున్న బౌద్ధ చిహ్నాలను బట్టి ఈ మండలం బౌద్ధమత వ్యాప్తికి నిదర్శనంగా ఉన్నది.

మొవ్వ తాలూకాలోని కృష్ణానదీ తీరానగల శ్రీకాకుళం క్రీస్తుకు పూర్వం 400 సం॥ ప్రాంతంలో. ఆంధ్ర విష్ణువు స్థాపించిన ఆంధ్ర సామ్రాజ్యానికి రాజధాని అయింది. కృష్ణదేవరాయలు ఇక్కడే ఆంధ్రదేవుని ఆలయం నెలకొల్పి ఉత్తర దిశగా దండ యాత్ర సాగించాడు. సుప్రసిద్ధ పదకవి క్షేత్రయ్య జన్మస్థానం కృష్ణాజిల్లా మొవ్వ. అలాగే భరత నాట్యాచారుడు సిద్ధేంద్ర మహా యోగి కర్మభూమి కృష్ణాజిల్లా కూచిపూడి. కూచిపూడి భరతనాట్యం సాంప్రదాయిక నాట్యాలలో జగత్ ప్రసిద్ధమయింది.

ఇలాంటి సుసంపన్నమైన ప్రాచీన సంస్కృతీసంపద, నాగరికత, చరిత్రగల్గిన కృష్ణామండలం, ఆధునిక కాలంలో బ్రిటిష్ వలస పాలనకు వ్యతిరేకంగా సాగిన భారత స్వాతంత్ర్య సంగ్రామంలో కూడా అగ్రశ్రేణిలో నిలబడి అత్యంత ప్రముఖపాత్ర వహించింది. ఇక్కడి జమీందారీ వ్యతిరేక పోరాటాలు ప్రజా చైతన్యానికి నిదర్శనాలు.

తెలుగునాట స్వాతంత్ర్యోద్యమ ఆద్యులు, నిర్మాతలు, రథసారథులు కూడా ఎక్కువభాగం కృష్ణాజిల్లాలోనే జన్మించారు. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, ముట్నూరి కృష్ణారావు, భోగరాజు పట్టాభిరామయ్య, అయ్యదేవరకాళేశ్వరరావు మొదలగువారు ఇక్కడివారే.

తెలుగు సాహితీ పునర్వికాసానికి పునాదులువేసి గ్రంథ ప్రచురణ ప్రారంభించిన కొమర్రాజు లక్ష్మణరావు, తెలుగు నాటక రంగం పునరుజ్జీవనానికి ప్రముఖపాత్ర వహించిన మైలవరం నాటక సమాజం ఇక్కడిదే. ప్రసిద్ధ నటుడు డి. వి. సుబ్బారావు ఇక్కడే పుట్టి పెరిగాడు.

అంతేగాదు. ఆంధ్రదేశంలో సహకారోద్యమం, గ్రంథాలయోద్యమం, హిందీ ప్రచారోద్యమంలో ఉన్నత శిఖరాలందుకున్న ప్రముఖులు ఈ జిల్లాలో ఉన్నారు. జాతీయ ఉద్యమనాయకులను సృష్టించిన ఆంధ్రజాతీయ కళాశాల ఈ జిల్లాలో ఉన్నది. జాతీయ జెండాకు రూపకల్పన జేసిన పింగళి వెంకయ్య ఈ జిల్లావాసే. కళారంగంలో మాలపిల్ల, రైతుబిడ్డ వంటి సంచలనాత్మక చిత్రాలు నిర్మించిన గూడవల్లి రామబ్రహ్మం ఈ జిల్లాలోనే జన్మించారు. తెలుగు పత్రికా ప్రపంచంలో నూతనాధ్యాయం ప్రారంభించిన నార్ల ఇక్కడివారే. సుప్రసిద్ధ కమ్యూనిస్టు నాయకులు శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య రాజకీయ జీవితానికి కృష్ణాజిల్లాయే ప్రధాన కార్యరంగం. తెలుగు సాహిత్యానికి నూతనోత్తేజం కల్గించిన, తిరుపతి వెంకటేశ్వర కవులుగా ప్రసిద్ధినందిన జంటకవులలో తిరుపతిశాస్త్రి బందరు హిందూ హైస్కూలు అధ్యాపకులు. బహుళ గ్రంథకర్త విశ్వనాథ సత్యనారాయణ, బాలల సాహిత్యంలో అభ్యుదయగామి అయిన శ్రీ నార్ల చిరంజీవి సంగీత శాస్త్రజ్ఞుడు హరినాగభూషణం, బ్రహ్మ సమాజ స్థాపన ద్వారా సాంఘిక పునర్వికాసానికి ఉద్యమించిన రఘుపతి వెంకటరత్నం నాయుడు ఈ జిల్లా వాస్తవ్యులే. ప్రముఖ ఇంజనీరు శ్రీ కె.యల్.రావు, ఆంధ్రప్రదేశ్‌లో తొలి కాంగ్రెసేతర ప్రభుత్వాన్ని నెలకొల్పిన శ్రీ ఎన్. టి. రామారావు ఈ జిల్లాలో జన్మించినవారే.

## బెజవాడ ప్రశస్తి

ఇంద్రకీలాద్రి పర్వతంగా పిలువబడే తూర్పు కనుమల కొండపైన అర్జునుడు తపస్సు చేసి పాశుపతాస్త్రం సంపాదించాడని స్థల పురాణ గాథ ఉన్నది. యుద్ధమల్లుని శాసనంలో కూడా బెజవాడ ప్రశస్తి కలదు. విష్ణుకుండినుల కాలంలో నిర్మితమైన కనకదుర్గ ఆలయం, మల్లిఖార్జున ఆలయం ఈ పట్టణ ప్రాచీన వైభవానికి నిదర్శనాలు.

నేడు ఈ పట్టణం రాజకీయ, విద్యా, విజ్ఞాన వ్యాపార కేంద్రంగా వర్ధిల్లుతున్నది. అతివాద ఉద్యమం పెల్లుబికి విజయవాడ పట్టణ కార్పొరేషన్ మిత్రపక్షాల అధీనంలోకి వచ్చి, రాజకీయ చైతన్యంతో ఆంధ్ర ప్రదేశానికి మకుటాయమానంగా ఉన్నది. సామాన్య ప్రజల కనీసావసరాలైన మంచినీరు, రహదార్లు, కరెంటు, పారిశుద్ధ్యం, మురికిపేటల ప్రజలకు ప్రత్యామ్నాయ స్థలాలు, యువజనోత్సవాలు మొదలగువాటిని ఆదర్శప్రాయంగా నిర్వహిస్తున్నది.

ఈ విధంగా పాడి పంటల్లో, సంస్కృతిలో, సంస్కారంలో, లలిత కళల్లో, విద్యాభివృద్ధిలో ఈ ప్రాంతం ప్రత్యేకత సంతరించుకున్నది. దానికి తగినట్టు ఈ మహాసభలు మా విజయవాడ పట్టణానికి మరింత వన్నె తెచ్చిపెడుతున్నవి.

ఇక ప్రస్తుతానికి వస్తాను. నేటి విద్యార్థుల్ని 21వ శతాబ్దపు పౌరులుగా రూపొందిస్తామని ఒక ఛాలెంజ్‌గా కేంద్ర ప్రభుత్వం నూతన విద్యా విధాన ముసాయిదా విడుదల చేసింది. దానిపై పలు చోట్ల గోష్ఠులు, సెమినార్లు, విస్తృతంగా జరుగుతున్నట్లు పత్రికా వార్తలు తెల్పుతున్నాయి. ఈ మహాసభ కూడా దానికి తగిన ఆలోచనలు చేసి, చర్చలు నడిపి, భావితరాల్ని తీర్చిదిద్దే సూచనలు చేస్తారని, ఉద్యమ పరంగా దాన్ని సాధిస్తారని, తద్వారా జాతి నిర్మాతలుగా కీలకపాత్ర వహిస్తారని, నేడు విద్యారంగాన్ని ఎదుర్కొంటున్న సమస్యల్ని ఆమూలాగ్రంగా చర్చించి శాస్త్రీయమైన నిర్ణయాలు చేస్తారని, వాటి అమలుకు చిత్తశుద్ధితో పాటుబడతారని ఆశిస్తూ మరొకసారి మీ అందరికీ హార్దిక స్వాగతాన్ని అందజేస్తున్నాను.

ఈ మహాసభలు దిగ్విజయం కావటానికి తోడ్పడిన దాతలకు, కార్యకర్తలకు, విద్యాభిమానులందరికీ నా కృతజ్ఞతాభివందనలనందిస్తున్నాను.

★

# మహాసభలో ప్రారంభోపన్యాసము




శ్రీ గాలి ముద్దుకృష్ణమనాయుడు
విద్యాశాఖామాత్యులు, ఆంధ్రప్రదేశ్.

ఉపాధ్యాయ మిత్రులకు, సభకు విచ్చేసిన అతిథులకు, ఆహ్వానితులకు, తదితర పెద్దలకు శుభాభివందనలు.

ఈ రోజు జరుగుతున్న ఈ మహాసభలకు నన్ను ఆహ్వానించిన కార్యక్రమ నిర్వాహకులకు నా ధన్యవాదాలు.

విద్యావృద్ధికి, సమాజాభివృద్ధికి, రాష్ట్ర, దేశ పురోగమనానికి ఉపాధ్యాయుడు కీలకపాత్ర వహిస్తాడనేది నిర్వివాదాంశము. ఉపాధ్యాయుడు మార్పుకు ప్రతీక. సాంఘిక, సామాజిక మార్పులకు అనుగుణంగా, ఆ మార్పులను విద్యార్థుల ప్రవర్తనా సరళిలో ప్రతిబింబించేటట్లు విద్యాబోధన చేయడంలో ఉపాధ్యాయుడు ప్రముఖపాత్ర వహిస్తాడనేదికూడా జగమెరిగిన సత్యమే. మనం అనుసరించేది ఎట్లాంటి విద్యావిధానమయినా, ఉపాధ్యాయుని బాధ్యత గురుతరం. ప్రస్తుత పరిస్థితులలో ఆర్థిక, సాంఘిక, సామాజిక ఒత్తిడులు వుండి నప్పటికి, విద్యార్థిలో సరయిన జీవన విధానాన్ని అభివృద్ధి చేయడం ఉపాధ్యాయుని బాధ్యత. ఈ బాధ్యతను నిర్వహించడంలో ఉపాధ్యాయునికి ప్రోత్సాహాన్ని, శిక్షణను ఇవ్వడానికి, పరస్పర అభిప్రాయాలను తెలుపుకోవడానికి ఇట్లాంటి సభలు చాలా ఉపయోగకారిగా వుంటాయనేది అందరికి తెలిసిన విషయమే.

విద్యార్థులు జీవితంలో, వారు అపరిపక్వదశలో మీ దగ్గరికి వస్తారు. ప్రాథమిక, సెకండరీ పాఠశాలల్లో ఈ విద్యార్థులకు మీరు బోధించాలి. వారి మూర్తిమత్వాన్ని మలచాలి. వీరిపట్ల మీలో తగినంత ప్రేమాభిమానాలు వుండడం చాలా ముఖ్యం. ప్రతిభావంతుడయిన, సమర్థవంతుడయిన ఉపాధ్యాయుని ముఖ్య లక్షణం—విద్యార్థుల పట్ల ప్రేమాభిమానాలు కలిగి ఉండడం. ఉపాధ్యాయునిలో ప్రజ్ఞాపాటవాలు ముఖ్యమైనప్పటికీ, అంతకంటే ముఖ్యం విద్యార్థులపట్ల ప్రేమ. ఈ ప్రేమాభిమానాలున్న ఉపాధ్యాయుడు విద్యార్థులకు ఆదర్శమూర్తి అవుతాడు. ఈ విషయాన్ని ప్రతి ఉపాధ్యాయుడు దృష్టిలో వుంచుకుంటాడని ఆశిస్తున్నాను.

ప్రాథమిక విద్య సార్వజనీనం చేయాలనేది మన రాజ్యాంగంలో ముఖ్య గమ్యం. అయితే ఈ గమ్యాన్ని మనం చేరుకోలేకపోతున్నాం. ఇందుకు కారణాలు విభిన్నం, వివిధం అని మీకు తెలుసు. ఈ గమ్య సాధనకు మనం చాలా ప్రత్యామ్నాయ పద్ధతులు అనుసరించాం, అనుసరిస్తున్నాం. అయితే వీటి నిర్వహణ, ఈ నిర్వహణవల్ల కలిగే ప్రతిఫలం సమాజ సభ్యులపైన మాత్రమే ఆధారపడి వుంటాయి. అయితే, సమాజ సభ్యులలో ఈ ప్రత్యామ్నాయ ఏర్పాట్లపట్ల సరైన వైఖరులు ఏర్పరిచే బాధ్యత ఉపాధ్యాయులు తమ భుజస్కంధాల పైకి తీసుకోవలసిన అవసరంవుంది. ఈ బాధ్యతను ఏ విధంగా నిర్వహించడానికి వీలుంటో మీరు చర్చిస్తారని ఆశిస్తున్నాను.

ఉపాధ్యాయ సంఘాలు ఏర్పరుచుకోవడానికి ఒక కారణం— తమ సమస్యలను ప్రభుత్వ దృష్టికి తీసుకొని వచ్చి, సంఘటితంగా సమస్యా నివారణలో కృషిచేయడం. సమస్యలను చర్చించి వాటిని ఏ విధంగా నివారణచేసే మంచిటో ఆలోచించవలసిన అవసరంగూడా వుంది. విద్యారంగంలో కృషి అనేది ఒక గురుతర బాధ్యత. విద్యా కృషిలో ప్రతి సమస్యను నివారించడంకూడా కష్టమయిన విషయమే. విద్యాకృషిలో, ఉపాధ్యాయవర్గం సమస్యలను గూర్చి ఆలోచించడం మాత్రమేగాక, కొన్ని త్యాగాలు చేయవలసిన అవసరంగూడా వుంది. అంతేగాక, ప్రతినిత్యం తమ ఆర్థిక సమస్యలను గూర్చి చర్చించడం మాత్రమేగాక, విద్యా సమస్యలను కూడా ప్రభుత్వ దృష్టికి తీసుకు రావలసిన బాధ్యత గూడా ఉపాధ్యాయులకు వుంది. ఉపాధ్యాయులంటే విద్యాధికులు. వారు సంఘానికి మూలస్తంభాలు. ఈ విషయాన్ని దృష్టిలో వుంచుకొని, ఉపాధ్యాయులు ప్రవర్తింపవలసి వుంటుంది. వేతనాలు మొదలగు విషయాలలో వున్న వైవిధ్యాలను, సమస్యలను నివారించడానికి ప్రభుత్వం కృషిచేస్తూనే వుంది— భవిష్యత్‌లో గూడా కృషిచేస్తుంది. ఈ విషయాన్ని గూడా ఉపాధ్యాయులు దృష్టిలో వుంచుకుంటారని ఆశిస్తున్నాను.

ఇకపోతే, మనరాష్ట్రంలో తెలుగుదేశం ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తరువాత, మన గౌరవనీయులైన ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావుగారి ఆధ్వర్యంలో, విద్యారంగంలో విప్లవాత్మకమైన మార్పులు తీసుకురావడానికి ప్రయత్నించాము-ప్రయత్నిస్తున్నాము. ఈ మార్పులు ఏమిటో, ఎందుకు చేశామో ఉపాధ్యాయ మిత్రులందరికి తెలుసు.

పాఠశాలల్లో 1, 2 తరగతులు చదువుకొనే పేద పిల్లలకు ఉచిత పాఠ్యపుస్తకాల సరఫరా, యూనిఫారం బట్టల సరఫరా; 1984-85 విద్యా సంవత్సరంలో 7 జిల్లాల్లోని 105 పాఠశాలలలో 8వ తరగతిలో ప్రవేశపెట్టిన వృత్తి విద్యను మిగతా జిల్లాలలోని మరో 250 పాఠశాలలకు విస్తరించే కార్యక్రమం, విద్యార్థుల ఆరోగ్య సేవా పథకం, తెలుగు విజ్ఞాన పారితోషికాలు, గ్రామీణ ప్రాంతాలలోనున్న విద్యార్థుల కోసం 110 గురుకుల పాఠశాలల ఏర్పాటు, 3,672 ప్రాథమిక

పాఠశాలల ఏర్పాటు, క్రీడాభివృద్ధి, యువజన కార్యక్రమాలు మొదలైనవి ముఖ్యమైనవి.

ఉపాధ్యాయ నియామకాలకు వస్తే, 1984-85 లో 1250 వ్యాయామవిద్య ఉపాధ్యాయ పోస్టులను మంజూరు చేయడం జరిగింది. పాఠశాలల్లో బాలికల నమోదును పెరుగుపర్చాలనే ఉద్దేశ్యంతో 750 ఉపాధ్యాయినుల పోస్టులకుగూడా మంజూరు చేయడం జరిగింది. అంతేగాక, కన్సాలిడేటెడ్ వేతనం మీద 3,000, మరో 3,213 పోస్టులు రెగ్యులర్ టైం స్కేల్ వేతనంపై మంజూరు చేయటం జరిగింది. ఇవిగాక, షెడ్యూల్ కులాల ప్రజలు నివసించే ప్రదేశాలలో 857 నూతన పాఠశాలల ప్రారంభం, 100 మంది సెకండరీ ఉపాధ్యాయుల నియామకం, 50 మంది ఉపాధ్యాయినుల నియామకం కూడా ప్రభుత్వ పరిశీలనలో వుంది. పై అంశాలలో మాత్రమేగాక, ప్రాథమిక తరగతులలో దృశ్యశ్రవ్య పరికరాల ద్వారా బోధనవంటి నూతన ప్రక్రియలు గూడా పాఠశాలల్లో ప్రవేశపెట్టడానికి చర్యలు తీసుకొనబడుతున్నవి. అనియత విద్య, వయోజన విద్య, పాఠశాలా భవనాల నిర్మాణ విషయాలలో గూడా ప్రభుత్వం తగు కృషి చేస్తున్నది.

అయితే ఇదిమాత్రం సరిపోదు. ప్రభుత్వం ఏర్పాటు చేసిన ఈ సౌకర్యాలను ప్రజలు సంపూర్ణంగా ఉపయోగించుకోవాలి. వారు ఆ విధంగా చేయాలంటే సాంఘికంగా, సామాజికంగా ప్రజల్లోని అభిప్రాయాలలో, వైఖరులలో మార్పులు రావాలి. ఈ మార్పులు తీసుకొనివచ్చే విషయంలో ఉపాధ్యాయులు బాధ్యత వహించాలి. ప్రపంచ దేశాలన్నీ కూడా సాంకేతికంగా ఎంతో అభివృద్ధిచెంది, వీటిని విద్యారంగంలో ప్రవేశపెట్టి పురోభివృద్ధి చెందుతున్నాయి. మన దేశంలో కూడా ఈ విధమైన కృషిచేసి, విద్యారంగంలో విప్లవాత్మకమైన మార్పులు తీసుకురావాలని నేను ఉపాధ్యాయ మిత్రులందరిని కోరుతున్నాను.

సాధారణంగా ఉపాధ్యాయుడు సాంప్రదాయబద్ధుడు, మార్పులను ఆహ్వానించడనే అభిప్రాయం కనిపిస్తుంది. అయితే, ఉపాధ్యాయుడు మార్పుకు ప్రతీక కావాలి. మన సాంప్రదాయాలను, ఆచారాలను ఒకవైపు దృష్టిలో వుంచుకొని, మరొకవైపు నూతన సాంకేతిక మార్పులను ఆహ్వానించి ఈ రెండింటి సమన్వయ భావనను విద్యార్థులలో కలిగించడానికి ప్రతి ఉపాధ్యాయుడు కృషి చేస్తాడని ఆశిస్తున్నాను.

మనం 20 వ శతాబ్దంఅంతంలో వున్నాము. 21వ శతాబ్దాన్ని ఆహ్వానించడానికి సన్నద్ధులమవుతున్నాం. మన విద్యార్థులు 21 వ శతాబ్దపు సవాళ్ళను ఎదుర్కొని, తమ జీవిత పంథాను మలచుకోవడానికి ఉపాధ్యాయవర్గం కృషి జేయాలి. సాంఘిక, సామాజిక, సాంకేతిక మార్పులను ఎదుర్కోవడానికి విద్యార్థులను మనం సన్నద్ధం చేయాలి. విద్యార్థిని ఈ విధంగా సన్నద్ధం చేయాలంటే, ఉపాధ్యాయుడు ముందుగా తను సన్నద్ధుడు కావాలి.

మన మందరం సంఘంలో సభ్యులం-సాంఘిక కట్టుబాట్లకు బద్ధులయి వుండాలి. సాంఘిక నియమాలకు, కట్టుబాట్లకు బద్ధుడుకాని ఉపాధ్యాయుడు విద్యార్థులకు మేలు చేయలేడు. నిజాయితీ, సార్వజనీక సౌభ్రాతృత్వం అనేది మంచి ఉపాధ్యాయుని రెండు ముఖ్యలక్షణాలు. ఈ రెండు లక్షణాలను మీలో అభివృద్ధిపరచుకొని, విద్యార్థులకు యితోధికంగా సహాయంచేస్తూ, రాష్ట్ర, కేంద్రాల అభివృద్ధికి కృషి చేస్తారని ఆశిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను. ★





## శ్రీ డి. రామిరెడ్డి

ఎన్నో వ్యయ ప్రయాసలకోర్చి, సుదూర ప్రాంతాల నుండి ఈ సభకు విచ్చేసిన మీకందరకు సుస్వాగతం.

1975 ఆగష్టు 10 వ తేదీన ఆవిర్భవించిన మన సంఘం దిన దిన ప్రవర్ధమానమౌతూ 1975 అక్టోబరులో రాజమండ్రిలో మొదటి మహాసభ, 1977 ఆగష్టులో ఖమ్మంలో ద్వితీయ మహాసభ, 1981 ఆగష్టులో భీమవరంలో తృతీయ మహాసభ జరుపుకుంది.

ఈ నాల్గవ మహాసభ గత మహాసభల కన్నా అన్నివిధాలా భిన్నమైన వాతావరణంలో జరుపుకుంటున్నాం.

స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనని లేదా తర్వాత జన్మించిన తరం ఈనాడు కేంద్రంలోను, అనేక రాష్ట్రాలలోను పరిపాలన సాగిస్తున్నది జాతీయస్థాయి పార్టీయైన కాంగ్రెసుపార్టీ 16 రాష్ట్రాలలో అన్ని కేంద్రపాలిత ప్రాంతాలలో పాలిస్తుండగా వామపక్ష పార్టీలు 2 రాష్ట్రాలలో, జనతాపార్టీ 1 రాష్ట్రంలో పరిపాలిస్తుండగా ప్రాంతీయ పార్టీలు 4 రాష్ట్రాలలో పరిపాలన సాగిస్తున్నాయి. వివిధ పార్టీల పరిపాలన ఎలా సాగుతున్నదో, ప్రజాస్వామ్యం సక్రమంగా, అర్థవంతంగా పనిచేయడంలో ఈ రాజ్యాంగం ఎన్ని అవరోధాలు, నిర్బంధాలు కల్పిస్తున్నదో పలు అనుభవాలు మనం చూస్తున్నాం.

దేశ ఆర్థిక పరిస్థితి భయంకరముగా ఉన్నది. రోజురోజుకు ద్రవ్యోల్బణం పెరుగుతున్నది. పన్నులు, ధరలు మిన్నుముట్టుతున్నాయి. జనాభాతోపాటు నిరక్షరాస్యులు, నిరుద్యోగం పెరుగుతున్నది. దేశ విదేశీ ఋణభారం పెరుగుతున్నది.

1-4-85 నాటికి విదేశాలకు 24,762 కోట్లు; స్వదేశీ ఋణం 58,494 కోట్లు మొత్తం 83 256 కోట్లు ఋణభారముంది. అంటే తల ఒక్కంటికి రూ. 114/- లు అప్పుంది.

1984 డిశంబరు నాటికి చదువుకున్న వారిలో 2 కోట్ల 90 లక్షలమంది నిరుద్యోగులుంటే, ఆంధ్రప్రదేశ్‌లో 21.7లక్షలున్నారు. ఈ సంఖ్య ప్రతి సంవత్సరం పెరుగుతున్నదేగాని, తరగడం లేదు.

## విద్యారంగ పరిస్థితి

మన దేశంలో 81 జనాభా లెక్కల ప్రకారం మన జనాభా 68.38కోట్లుండగా అందులో అక్షరాస్యులు 36.17శాతం మాత్రమే. వారిలో కూడ స్త్రీలలో 24.88 % మాత్రమే అక్షరాస్యులు. మన రాష్ట్రంలో 29.72 శాతం అక్షరాస్యులున్నారు.

మన రాష్ట్రం దేశంలో వైశాల్యంలో 5 వ స్థానంలోను, జనాభాలో 4 వ స్థానంలోను ఉండగా అక్షరాస్యతలో 18వ స్థానంలో ఉంది.

1968లో ఆమోదించిన జాతీయ విద్యా విధాన తీర్మానంలో మొత్తం బడ్జెట్‌లో కేంద్రం 7 %, రాష్ట్రాలు 35 % విద్యకు కేటాయించాలని తీర్మానించినా గత 14 సం॥ లలో కేంద్రం మొత్తం బడ్జెటులో 2 % మాత్రమే విద్యకు కేటాయిస్తున్నది మన రాష్ట్ర బడ్జెటులో 17 శాతం మాత్రమే కేటాయిస్తున్నారు. దానిలో 95 % ఉపాధ్యాయుల, ఉద్యోగుల జీత భత్యాలకే ఖర్చవుతున్నది. అందుచే మన పాఠశాలల భౌతిక పరిస్థితులు భయంకరంగా ఉన్నవి.

30-9-78 ప్రాతిపదికగా జరిపిన నాల్గవ అఖిల భారత సర్వే ప్రకారం పరిస్థితి ఇలా వుంది.

దేశంలోని 0.62 % ప్రాథమిక పాఠశాలలలో ఉపాధ్యాయులు లేరు. 34.75 % పాఠశాలలలో ఏకోపాధ్యాయులు, 27.27 % పాఠశాలలలో ఇద్దరు ఉపాధ్యాయులు, 15.10 % పాఠశాలలలో ముగ్గురు 8.16 % నలుగురు, 5.25 % ఐదుగురు, 8.85 % 5గురు కంటే ఎక్కువమంది ఉపాధ్యాయులున్నారు. దేశం మొత్తంమీద ప్రాథమిక పాఠశాలల్లో ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తి 1:41 గా వున్నది.

మన రాష్ట్రంలో 1978 నాటికి 39,696 ప్రాథమిక పాఠశాలలు, 4,382 ప్రాథమిక ఉన్నత పాఠశాలలు, 3,567 ఉన్నత పాఠశాలలున్నవి. (అవి 1983-85 నాటికి వరుసగా 41,702; 5,445; 4,679 కి పెరిగాయి) వాటిలో కనీసం చాపగాని, పర్చిచరుగాని లేని ప్రాథమిక పాఠశాలలు 15,298; ప్రాథమికోన్నత పాఠశాలలు 857, ఉన్నత పాఠశాలలు 5,311 ఉన్నాయి.

ఉపాధ్యాయులకు కుర్చీలుగూడ లేని ప్రాథమిక పాఠశాలలు 1,698 ఉన్నాయి.

ప్రాథమిక పాఠశాలలలో 19,122; ప్రాథమికోన్నత పాఠశాలలో 2,758; ఉన్నత పాఠశాలలో 2,964 లకు మాత్రమే నల్లబల్లలున్నవి.

ప్రాథమిక పాఠశాలలో 3308, ప్రాథమికోన్నత పాఠశాలలో 266, సెకండరీ పాఠశాలలో 3325కి మాత్రమే ఆటస్థలాలున్నవి.

ప్రాథమిక పాఠశాలలో 14287, ప్రాథమికోన్నత పాఠ

శాలలో 1089 ఉన్నత పాఠశాలలో 2168 కి మాత్రమే మూత్ర విసర్జనశాలలున్నవి.

భవనాల పరిస్థితి మరీ ఘోరంగా ఉంది. మొత్తం ప్రాథమిక పాఠశాలలో 39,696 లో 7,827 కు పక్కా భవనాలు, 2,974 సగం పక్కా భవనాలు, 15,895 తాటాకు షెడ్లు, 3000 ఆరుబయట నడుస్తున్నాయి.

మాధ్యమిక పాఠశాలలు 4982 లో 3001 పక్కా భవనాలు 716 సగం భవనాలు, 649 తాటాకు షెడ్లు, 16 ఆరుబయట నడుస్తున్నాయి. ఉన్నత పాఠశాలలు 3567 కాగా వానిలో 2640 పక్కా భవనాలు 757 లో 750 సె. మీ. పక్కా 161 ఆరుబయట నడుస్తున్నాయి. గత 6 సం॥లలో వీటిలో 10.15% పక్కా భవనాలు అదనంగా నిర్మించబడ్డాయి.

ప్రాథమిక పాఠశాల స్వంత భవనాలు 14578, బాడుగకు 8436, ప్రజలు ఉచితంగా యిచ్చినవి 13893 ఉండగా ప్రాథమికోన్నత పాఠశాలలలో 3142 స్వంతం, 917 బాడుగ, 292 ఉచితం. సెకండరీ పాఠశాలలో 2958 స్వంతం, 303 బాడుగ, 290 ఉచితంగా యిచ్చిన వానిలో నడుస్తున్నాయి. మంచినీళ్ళ వసతి కేవలం 34% పాఠశాలలలోనే వున్నది. ఇదీ పాఠశాలల దుస్థితి.

ప్రణాళికల వారీగా చూస్తే విద్యకు కేటాయించిన మొత్తం డబ్బులో ప్రాథమిక విద్యకు మొదటి ప్రణాళికలో 56 శాతం కేటాయించగా అది క్రమంగా 6 వ ప్రణాళిక నాటికి 35% పడిపోయింది. దాని ఫలితంగా ఒక్కొక్క విద్యార్థి మీద ప్రాథమిక విద్యాస్థాయి వరకు పెట్టే ఖర్చు 1950-51 లో రు.19.9 లు ఉండగా 1975-76 నాటికి రు 25.5 రు॥లకు మాత్రమే పెరిగింది.

దానివల్ల పాఠశాలలలో విద్యార్థుల్ని చేర్చడం, చేరిన వారిని కనీసం 7 వ తరగతి వరకు పాఠశాలల్లో నిలపడం పెద్ద సమస్యగా మారింది. మధ్యలో పాఠశాలలు వదిలేవారి సంఖ్య ఎక్కువయింది. 1 వ తరగతిలో 100 చేరారనుకొంటే 7 వ తరగతిలో 22 మంది మాత్రమే కొనసాగుతున్నారు. ఈ పరిస్థితి బాలికలలో, షెడ్యూల్డు కులాలలో మరీ దారుణంగా వున్నది. దీనికి ప్రధాన కారణం దరిద్రం· సాంఘికంగా వెనుకబడి వుండడం.

నిరక్షరాస్యత వల్ల అన్ని రంగాలలో ఉత్పత్తి కుంటుబడిన పరిస్థితి గమనిస్తే అన్ని ప్రభుత్వాలు విద్యమీద ఎక్కువ డబ్బు ఖర్చు పెట్టాలి.

పాఠశాలల పరిసితి అలావుంటే ఉపాధ్యాయుల పని పరిస్థితులు దానికి తోడుగానే వున్నాయి. ఉపాధ్యాయ విద్యార్హి నిష్పత్తి ప్రకారం ఉపాధ్యాయులు లేకపోగా వున్న వారిలో అనేకమందికి సర్వీసు రెగ్యులరైజేషన్ కాలేదు. ఎయిడెడ్, అన్ ఎయిడెడ్ ప్రైవేటు పాఠశాలలలో ఈ పరిస్థితి మరింత దారుణంగా వుంది.

మన రాష్ట్రంలో సమిష్టి ఉద్యమ ఫలితంగా వేతనాల విషయంలో కొన్ని గణనీయ విజయాలు సాధించుకున్నాం. రీగ్రూపింగు స్కేళ్ళు, రీగ్రూపింగు ఆధారంగా 10,15 సం॥ స్కేళ్ళు, ఆయా క్యాటగిరీలలో మొత్తం సర్వీసు పరిగణన చాలా ముఖ్యమైన విజయాలు. అయితే దీనివలన అనేక కొత్త సమస్యలుగూడా ఉత్పన్నమైనాయి· అనేక క్యాడర్ల ఉపాధ్యాయుల వేతన వ్యవస్థలో తులనాత్మక మార్పు వచ్చింది. దీనివలన సీనియరు, జూనియర్ల వేతనాలలో తేడాలు వచ్చాయి. ప్రమోషన్ స్కేళ్ళు యిచ్చేదానికి పెట్టిన షరతుల లోని వ్యత్యాసాలవల్ల క్యాటగిరి-III క్యాటగిరి-II ఉపాధ్యాయులమధ్య తేడాలు వచ్చాయి. క్యాటగిరి II లో గూడా వివిధ క్యాడర్లలో అసమానతలు ఏర్పడ్డాయి.

ట్రిబ్యునల్ తీర్పులను అమలు జరపడానికి గూడ ప్రభుత్వం అంగీకరించడంలేదు. ఇచ్చే జీతాలు ఇస్తూగూడ ఎయిడెడ్ ఉపాధ్యాయులకు రెగ్యులర్‌గా జీతాలు అరియర్స్ చెల్లించే ఏర్పాట్లు లేవు. ప్రభుత్వ ఉపాధ్యాయులకు ఇస్తున్న కొన్ని ముఖ్యమైన సౌకర్యాలు ఇతర స్థానిక సంస్థల ఉపాధ్యాయులకు వర్తింపచేయలేదు. ఎయిడెడ్ ఉపాధ్యాయులను అన్నింటా సవతిబిడ్డలలాగే చూడటం జరుగుతున్నది.

ఉపాధ్యాయుల రక్షణకు ప్రవేశపెట్టిన విద్యాబిల్లు దానిలోని లోపాలవల్ల అది ఎయిడెడ్ ఉపాధ్యాయుల పాలిట ఉరిత్రాడుగ పరిణమించింది.

పంచాయితీరాజ్ వ్యవస్థలో తీవ్రమైన మార్పులు రానున్నట్లు ప్రభుత్వం ప్రకటిస్తున్నది. ఈ తరుణంలో పాఠశాల యాజమాన్య సమస్య జటిల సమస్యగా తయారుకానున్నది. ఈ సమయంలోనే ప్రభుత్వ ఉద్యోగుల సర్వీసు నిబంధనల విషయంలో జరిగిన ఆందోళన గమనించాలి. మన విషయంలో కూడ సరియైన డిమాండ్లతో సరియైన సమయంలో ఆందోళన చేయకపోతే చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకునే పరిస్థితి వస్తుంది.

దేశంలో 66% పైగా ప్రజలు దరిద్రనారాయణులు. మన పాఠశాలలకువచ్చేది చాలామంది వారి పిల్లలే. వారి విషయంలో మనం మరింత బాధ్యతగా వ్యవహరించి మన సామాజిక కర్తవ్యాలను నిర్వర్తించాలి.

శాస్త్రవిజ్ఞానం శరవేగంతో అభివృద్ధి చెందుతున్నది. దానికి సరిపడే విధంగా మన సిలబసు మారాలి. దానికి తగినట్లుగా ఉపాధ్యాయులు తమ విజ్ఞానాన్ని నిరంతరం పెంచుకునే ఏర్పాట్లు జరగాలి. మనం దీన్నొక ఉద్యమంగా చేపట్టాలి.

నూతన విద్యా విధానాన్ని 1986 విద్యా సంవత్సరము నుండి ప్రవేశపెడుతున్నట్లు కేంద్ర ప్రభుత్వం ప్రకటించింది. దానిని గూర్చి దేశవ్యాపితంగా చర్చలు జరుగుతున్నాయి. మన పక్షాన ఈ సాయంత్రం విద్యాగోష్టి జరుగుతున్నది. మన అభిప్రాయాలను సమగ్రంగా ఆ సదస్సులో ప్రకటించాలి. కొత్త విద్యా విధానంలో దేశప్రగతిని నిరోధించే అంశాలుంటే దానికి వ్యతిరేకంగా ఉద్యమం నడపాలి. ఇటీవల రాజ్యాంగాలో 310, 311 అంశాలపై వచ్చిన సుప్రీంకోర్టు తీర్పు ప్రభావాన్ని ఉపాధ్యాయులు గుర్తించి స్పందించాలి. అలాగే విద్యాబిల్లులో సమగ్ర మార్పుల కొరకు పోరాటం సాగించాలి.

మహాశయులారా,

పై విషయాలన్నీ దృష్టిలో ఉంచుకొని ఈ 3 రోజులు అన్ని కార్యక్రమాలలో శ్రద్ధగా పాల్గొని, మనకున్న కీర్తి ప్రతిష్టల కనుగుణంగా క్రమశిక్షణతో వ్యవహరించి ఈ మహాసభను జయప్రదం చేయగోరుతున్నాను.

ఫోన్ : 8041

అద్వితీయంగా మహాసభల్ని నిర్వహించిన యు.టి.యఫ్. కు శుభాకాంక్షలతో

# ప్రకాశంజిల్లా ఉపాధ్యాయ
# సహకార గృహనిర్మాణ సంస్థ లిమిటెడ్

రిజిష్టర్ నెం. జె. 661 – ఒంగోలు – తేది 21-8-79

## ఒంగోలు - 523 002



| | |
|---|---|
| అధ్యక్షులు | : శ్రీ డి. రామిరెడ్డి, సింగరాయకొండ |
| కార్యదర్శి | : శ్రీ వల్లమల్లి రామారావు, ఒంగోలు |
| ఉపాధ్యక్షులు | : శ్రీ యల్. రాధాకృష్ణమూర్తి, లింగంగుంట |
| సహాయ కార్యదర్శి | : శ్రీ పి. నాగేశ్వరరావు, ఒంగోలు |
| కోశాధికారి | : శ్రీ పి. మునిభూషణరావు, ఒంగోలు |
| డైరెక్టర్లు | : శ్రీ పి. అర్లారెడ్డి, త్రోవగుంట |
| | శ్రీ సి. హెచ్. వి. సుబ్బయ్య, యన్. అగ్రహారం |
| | శ్రీ జె. మల్లిఖార్జునరావు, జాగర్లమూడివారి పాలెం |
| | శ్రీ కె. ఆదినారాయణ, మర్లపాడు |

కార్యాలయ చిరునామా

C/o యు. టి. యఫ్. ఆఫీసు

భూపతివారి స్ట్రీట్, 25-8-40

ఒంగోలు – 523 002

24

# సంఘపు కార్యకలాపాలను వివరిస్తూ కర్తవ్య దీక్షను పురికొల్పుతున్న
# కార్యదర్శి నివేదిక



శ్రీ ఎ. వెంకటస్వామి

అధ్యక్షా, కామ్రేడ్స్!

నాల్గవ విద్యా వైజ్ఞానిక మహాసభలకు తరలివచ్చిన తమందరికి స్వాగతం! సుస్వాగతం!!

ఆంధ్ర ప్రదేశ్‌కే కాకుండా అఖిలభారత ప్రఖ్యాతిగాంచిన, అనధికార రాజధానిగా అలరారుతున్న విజయవాడ పట్టణంలో జరపుకుంటున్న మహాసభలివి.

1984 ఆగస్టు 10న ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ ఆంధ్ర, తెలంగాణా విభేదాలు అధిగమించి, ప్రాథమిక సెకండరీ పరిధులు దాటి, మేనేజిమెంటు అంతరాల దొంతరలు త్రోసి, విశాల ధ్యేయంతో, సామాజిక దృక్పథంతో చారిత్రక అవసరంగా ఏర్పడింది.

1974 అక్టోబరు 20. 21 తేదీలలో గోదావరీ తీరాన రాజమండ్రిలో వేయి మంది డెలిగేట్లతో ప్రథమ మహాసభ జరుపుకొని, ఉద్యమానికనువయిన నిబంధనావళి, ప్రగతిపథగామియైన పాలసీ స్టేటుమెంటు రూపొందించుకున్నాము.

1977 ఆగస్టు 17, 18 తేదీలలో ఖమ్మంలో ద్వితీయ మహాసభలు 7 వేల మంది ప్రతినిధులతో జరుపుకొని, ఉద్యమాన్ని అన్ని ప్రాంతాలకు వ్యాపింపజేసుకొని, చెన్నుపాటి భవనానికి పునాదులు వేసుకున్నాం.

1981 ఆగస్టు 16, 17, 18 తేదీలలో భీమవరంలో 10 వేల మంది డెలిగేట్లతో మహాసభలు జరుపుకొని, 23 జిల్లాలలో ఎదురు లేని సంఘంగా ఆంధ్ర ప్రాంతానికే అగ్రగామి సంస్థగా రూపొంది హైదరాబాదు భవనానికి పిలుపు యిచ్చాం.

1981-85 కు మధ్య జాతీయ - అంతర్జాతీయ పరిస్థితులలో అనేక మార్పులు జరిగాయి. మన జీవితాలపై, మన వృత్తిపై వాటి ప్రభావం గణనీయంగాపడింది. వాటిని పట్టించుకొనకపోతే నేల విడిచి సాము చేసినట్లే అవుతుంది.

మేధావి వర్గానికి చెందిన ఉపాధ్యాయులు రాజకీయాలు అధ్యయనం చేయాలి. సరైన రాజకీయాలు అనుసరించాలి. భావిభారత పౌరులను తయారుచేసే ఉపాధ్యాయుడే అంధకారంలో ఉంటే దేశానికి దాపురించేది అధోగతే!

ఆర్థిక సంక్షోభంలో పడి కొట్టుకుంటున్న పెట్టుబడిదారి దేశాలు వలస దేశాలను, వర్ధమాన దేశాలను దోచుకుతింటూ ఇంతకాలం పబ్బం గడుపుకొన్నాయి. అమెరికాతో సహా అన్నిట నిరుద్యోగం పెరిగిపోయి, అభివృద్ధి రేటు పడిపోయి, ఉత్పత్తి స్థాయి తగ్గి ఉక్కిరి బిక్కిరి అవుతున్నాయి.

అమెరికాలో 28 లక్షలు, బ్రిటన్‌లో 3½ లక్షలు, ఫ్రాన్స్‌లో 25 లక్షలు, ఇటలీలో 2½ లక్షలు, పశ్చిమ జర్మనీలో 25 లక్షలు, జపాన్‌లో 16 లక్షలమంది నిరుద్యోగులుగా వున్నారనేది పరిశీలిస్తే పెట్టుబడిదారీ వ్యవస్థ బండారం గమనించవచ్చు.

సోషలిస్టు దేశాలు ఏ సంక్షోభాలూ లేకుండా, ఉత్పత్తి పెంచుకుంటూ, ప్రజల అవసరాలు తీరుస్తూ ప్రగతిపథంతో పయనించుతున్నాయి. ప్రపంచంలో జరిగే ఉత్పత్తిలో 50 శాతం సోషలిస్టు దేశాలే చేస్తున్నాయి.

అంగోలా, ఇథియోపియా, మొజాంబిక్‌లలో సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా జరిగే పోరాటాలకు, ఆర్థికంగా నిలద్రొక్కుకునేందుకు వర్ధమాన దేశాలకు సోషలిస్టు దేశాలు చేసే సహాయం ఎనలేనిది ఇజ్రాయిల్‌కు వ్యతిరేకంగా పోరాడుతున్న అరబ్బు దేశాలకు, యూదు జాత్యహంకార వ్యతిరేక పోరాటాలకు, వర్ణ వివక్షతకు వ్యతిరేకంగా పోరాడుతున్న అలీన దేశాలకు సోషలిస్టు దేశాల సహకారం సాటిలేనిది.

ఫాసిజంపై విజయం సాధించిన 40 సంవత్సరాల తర్వాత, సామ్రాజ్యవాదులు చరిత్ర పాఠాలు మరిచి మరో యుద్ధానికి కాలు దువ్వుతున్నారు. నక్షత్ర యుద్ధానికి పథకాలు వేస్తున్నారు. యుద్ధమంటూ జరిగితే అది సర్వ నాశనం తప్ప పరిమిత యుద్ధాలనేవి, ఏ దేశమైనా దీనికి అతీతంగా ఉండి రక్షణ చేసుకోవడమనేది అసాధ్యం. మానవాళి ఇంతవరకు సాధించుకున్న నాగరిత, ప్రగతి సమస్తం తుడిచిపెట్టుకుపోవడం ఖాయం.

ఇంత వినాశకరమైన యుద్ధానికి వ్యతిరేకంగా ప్రపంచ ప్రజానీకం శక్తివంతంగా గళంవిప్పి శాంతి ప్రదర్శనలు చేస్తున్నారు. ఐరోపా దేశాలలో కార్మిక సంఘాలు, అమెరికా మిసిలీలు పెట్టటానికి వ్యతిరేకంగా శాంతి ప్రదర్శనలు జరిపాయి. నాగసాకి, హిరోషిమాలలో

అమెరికా అణుబాంబులు వేసిన నలభయ్యవ స్మారక దినంనాడు ప్రపంచమంతటా జరిగిన శాంతిప్రదర్శనలలో లక్షలాది ప్రజలు పాల్గొనడం సామ్రాజ్యవాదులకు గంగ వెర్రులెత్తించాయి.

ఈ పరిస్థితులలో జనీవాలో సోవియట్, అమెరికా అధినేతల మధ్య జరిగిన శిఖరాగ్ర సమావేశం, పరస్పరం అభిప్రాయాలు తెలుపుకొనే దానికయినా అవకాశం కల్పించింది. ఇది కారుచీకటిలో కాంతిరేఖ.

దక్షిణాఫ్రికాలో మండేలాను జైలులో పెట్టి, శ్రీమతి మండేలాను ఇంటినుండి నెట్టి నల్లజాతి ప్రజలను వేలాదిమందిని చంపి, సాగుతున్న రాక్షస రాజ్యానికి సామ్రాజ్యవాదుల వత్తాసువుంది. అయినా అది కూలిపోవడం ఖాయం పాకిస్థాన్‌లో జనరల్ జియా ప్రజాస్వామ్యం నోరునొక్కి ఎన్నికలు తొత్తడం చేశాడు. దేశంలో ఆయుధాలు విపరీతంగా దిగుమతి చేసుకుంటూ, తనగడ్డపై యుద్ధ స్థావరాలకు అవకాశం కల్పిస్తూ అణుబాంబులకు కూడా అర్రులు చాస్తున్నాడు.

బంగ్లాదేశంలో పరిస్థితి పాకిస్థాన్‌కు భిన్నంగాలేదు. అక్కడ కూడా రాజకీయ పార్టీలకు, ప్రజలకు, పౌరహక్కులు మృగ్యం. అది సైనిక నియంతృత్వ పాలనలో వుంది.

శ్రీలంకలో జయవర్దనే, తమిళ తీవ్రవాదులకు మధ్య చర్చలు జరిగినా, ఒక అంగీకారానికి రాలేకపోతున్నారు. ఈలోగా తమిళ ప్రజలుమాత్రం ఊచకోత కోయబడుతున్నారు. దీనిని అరికట్టి సామరస్య వాతావరణం నెలకొల్పి, సమస్య పరిష్కరించాలి.

భారతదేశంలో ఈ కాలంలో బాధాకరమైన పరిణామాలు జరిగాయి. వేర్పాటు ఉద్యమాలు, ప్రాంతీయ తత్వాలు, మత దురహంకారాలు వెర్రితలలు వేశాయి. ఈ ప్రతి సందర్భంలోను సామ్రాజ్యవాదుల హస్తం వాటికి ఆజ్యం పోసింది. అట్టి ప్రేరేపించబడ్డ మతతత్వ శక్తులచేతిలో దేశ ప్రధాని, అలీనోద్యమ నాయకురాలు శ్రీమతి ఇందిరాగాంధీ అసువులు బాసారు.

రాజీవ్‌గాంధీ తాత్కాలిక ప్రధానిగా 8 వ లోక్‌సభ ఎన్నికలు జరిగాయి. ఇందిరాగాంధీ మరణంపట్ల సానుభూతి, దేశసమగ్రతపట్ల ఆవేదన కాంగ్రెస్‌కు అఖండ విజయం చేకూర్చిపెట్టాయి. అయితే యిటీవల జరిగిన బై ఎలక్షన్లలో ఆ గాలి తగ్గింది. ఇంత గాలిలో కూడా ఆంధ్ర, కర్ణాటక, బెంగాలు, త్రిపుర ప్రజలు, ప్రజాతంత్ర వామపక్ష శక్తులకు విజయం చేకూర్చి పెట్టారు.

కేంద్రప్రభుత్వం తెచ్చిన పార్టీ మార్పిడులబిల్లు, కొన్ని ఇబ్బందులున్నా అభినందించ తగ్గది. అయితే దామాషా ఎన్నికల విధానాన్ని ప్రవేశపెట్టనిదే ప్రజల నాడి పార్లమెంటు, అసెంబ్లీలలో ప్రతిబింబించే అవకాశంలేదు. రోజురోజుకు ఎన్నికల ఖర్చులు చుక్కలంటుతూ సామాన్యుడు ఎన్నికలలో నిలబడే దానికి అవకాశం లేకుండా పోతున్నది.

రాజీవ్‌గాంధీ వాగ్దానాలెన్ని చేసినా, ప్రజలకు ఆశలు కల్పించి అధికారానికి వచ్చినా, కలవారికి కట్టబెట్టే విధానాలు, గుత్త పెట్టుబడులకు రాయితీలుయిచ్చే పద్ధతులు సామాన్యుని మనుగడకు సంకెళ్ళు మాత్రమే. నిత్యం పెరిగే ధరలలో, తరిగే జీవితాలతో వారి బ్రతుకులు దుర్భరంగా తయారయ్యాయి.

పంజాబ్ విషయంలో ఏనాడో ప్రతిపక్షాలు చెప్పిన దానిని అమలు జరిపినా, అస్సాంలో విదేశీయులంటూ 1966 ప్రాతిపదికగా చేయడం దారుణమైన విషయం. దీని ప్రకారం 10 లక్షలమంది ఓటింగు హక్కు కోల్పోయారు.

ఈ సంవత్సర కాలంలో, కేంద్ర బడ్జెట్, రైల్వే బడ్జెట్‌లలో ప్రజలపై 1900 కోట్ల అదనపు పన్నులు వడ్డించారు. ఉద్యోగుల, కార్మికుల జీవితాలు నిరంతరం ద్రవ్యోల్బణం తాకిడికి గురౌతూ, నిజ వేతనాలు పడిపోతున్నాయి. రూపాయి విలువ 13.2 శాతానికి పడిపోయింది. నూతన పన్నుల విధానం మరింత పతనానికి దారి తీస్తున్నది.

కేంద్ర ప్రభుత్వం ప్రతిపాదించిన నూతన విద్యా విధానం, దాని ఆర్థిక విధానాలలాగే ఉన్నత వర్గాలకు వుపయోగించే పద్ధతిలోనే వున్నది. విద్యను కంప్యూటర్ యుగానికి తీసుకవెడుతున్నామనడం, పాఠశాలలు సామాజికపరం చేయాలనడం, స్వయం పోషకత్వం కావాలనడం, గంటలవారీ జీతాలు-ఇవన్నీ ఏవైపు వెళుతున్నాయో గమనించవచ్చు. సామాన్యునికి అందుబాటులోలేని పచ్చి అభివృద్ధి నిరోధకమైన నూతన విద్యా ముసాయిదాను మనమంతా వ్యతిరేకించి వెనక్కి నెట్టాలి.

శ్రీ రాజీవ్‌గాంధీ, కొందరు రాజకీయ నాయకులు రాష్ట్రాలు కేంద్ర సహాయాన్ని అర్థించమంటేనే, ఎవరి సొమ్మో ఎత్తుక పోతున్నట్లు గగ్గోలు పెడుతున్నారు. అన్ని వనరులు తమ చేతులలో పెట్టుకుని రాష్ట్రాలను బిచ్చగాళ్ళుగా చూడటం అవమానకరమైన విషయం. కేంద్ర రాష్ట్ర సంబంధాలు, వనరుల పంపిణి తిరిగి సరైన పద్ధతిలో నిర్ణయించబడాలి.

పశ్చిమ బెంగాలు, త్రిపుర రాష్ట్రాలు రాజ్యాంగ పరిమితులలో అనేక అవాంతరాలు అధిగమించి 8½ సంవత్సరాలుగా వామపక్షాలు అధికారంలో వుండి ప్రజా సంక్షేమానికి, చైతన్యానికి పాటుపడుతున్నాయి. ప్రాంతీయ, కుల, మత తత్వాలు వెర్రితలలు వేయని రాష్ట్రాలు దేశంలో ఈ రెండు మాత్రమే. ఇది మామూలు విషయం కాదనేది మనమంతా గమనించవచ్చు.

ఆంధ్రప్రదేశ్‌లో 30 ఏండ్ల కాంగ్రెస్ పాలనకు స్వస్తిచెప్పి శ్రీ యన్. టి. రామారావు తెలుగుదేశం పేరుతో అధికారానికి వచ్చారు. శ్రీ భాస్కరరావును పావుగా వుపయోగించి కేంద్రం దానిని రద్దు చేసింది. ప్రజాస్వామ్య హక్కుల కొరకు ఆంధ్ర ప్రజలు అపూర్వంగా పోరాడి తిరిగి తెలుగుదేశాన్ని అధికారంలోకి తెచ్చారు. అఖండ విజయం చేకూర్చారు.

ఈ సందర్భంలో యు. టి. యఫ్.. మాత్రమే ప్రజాస్వామ్య హక్కుల పునరుద్ధరణలో ముందుండి ప్రకటనలు, తీర్మానాలు, చేసి

# యు. టి. యఫ్. సమరశీల పోరాట కార్యక్రమాలు *

ధర్నాలలో పాల్గొన్నది. అవకాశవాద విధానాలకు తల వంచలేదు. అడ్డుదారులు త్రొక్కలేదు.

తిరిగి అధికారానికి వచ్చిన తెలుగుదేశం ఎంత చెప్పినా వినక రిటైరుమెంటు వయసుపై సుప్రీంకోర్టు చేత చీవాట్లు తిన్నది. తిరిగి 25 సంవత్సరాల సర్వీసు 50 ఏండ్ల వయస్సుకు రిటైరు చేసే ఆలోచనలు చేయడం, తన ఉద్యోగ వ్యతిరేక వైఖరిని విడనాడలేదనే దానికి ఉదాహరణ.

ప్రజలపై విపరీతంగా పన్నులు, బస్సురేట్లు, పాలధర పెంచటం, అలాగే ప్రెస్సు బిల్లు తేవాలని చేసిన ప్రయత్నం, ఇప్పుడు పోలీసు బిల్లు తెచ్చేదానికి చూపుతున్న ఆతురత, తెలుగుదేశం నిరంకుశ పద్ధతులవైపు మొగ్గుతున్న పరిస్థితిని గమనించవచ్చు.

2 రూపాయలకు కిలో బియ్యం, తెలుగుగంగ లాంటి పథకాలు చేపట్టినందులకు అభినందించినా, నిరంకుశ పద్ధతులు చేపట్టే వైఖరిని తీవ్రంగా గర్హించుతున్నాం.

యు. టి. యఫ్ స్థాపించినపుడు అనేక పేర్లు పెట్టినవారు, పెద్దమనుషుల ఒప్పందం ప్రకారం తెలంగాణాకు విస్తరించరాదన్న వారు, ప్రాథమిక, సెకండరీ విడిపడవన్నవారు, ఆచరణలో యు. టి. యఫ్ చేపట్టిన విశిష్ట మార్గాన్ని చివరికి అనుసరించవలసి వచ్చింది.

వేర్పాటు ఉద్యమాలను వీరోచితంగా ఎదుర్కొని, ఎమర్జెన్సీలో, 20 పాయింట్లకు తల వంచకుండా, ఎయిడెడ్ ఉపాధ్యాయుల డైరెక్ట్ పేమెంట్ సందర్భంగా అగ్రిమెంట్‌ను వ్యతిరేకించి, విద్యను ఉమ్మడి జాబితానుండి తొలగించి స్టేటు జాబితాలో చేర్చాలని, చివరికి నాదెళ్ళ ప్రభుత్వాన్ని కూడా వ్యతిరేకించి, నిలకడగా నిలిచినది యు.టి యఫ్. మాత్రమే. ప్రతి పరీక్షా సమయంలోను ఉపాధ్యాయుల పక్షాన నిలిచి సూత్రబద్ధవైఖరితో తనదంటూ ఓ ప్రత్యేకతను నిలుపుకొని ప్రఖ్యాతి చెందింది యు. టి. యఫ్.

1974 నవంబరు 8 సి. డి. ఆర్డినెన్సుకు వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో పాల్గొని దానిని నిలుపుదల చేయించాం.

1975 ఫిబ్రవరి 10 న వేలాది సంతకాలతో విజ్ఞాపన పత్రం అసెంబ్లీకి ఇచ్చి, సెప్టెంబరులో 10 కోర్కెల కార్డులు ముఖ్యమంత్రికి పోస్టు చేయించి సమస్యల పరిష్కారానికి కృషి చేశాం.

1976 ఏప్రిల్ 15న నేటివిటి ఉత్తర్వు నిర్బంధం రిటైర్‌మెంట్‌పై ముఖ్యమంత్రికి విజ్ఞప్తి పత్రాలు అందజేసి సెప్టెంబరు 29 30 లలో గుంటూరులో విద్యా గోష్ఠి జరిపి పని గంటల బడి దినాల తగ్గింపులో కీలకపాత్ర వహించాం.

1977లో శిక్షణ సమస్యల పరిష్కారానికి అసెంబ్లీకి విజ్ఞాపన పత్రం సమర్పించాము.

1978 సెప్టెంబరు 8 న 8 వేల మందితో చారిత్రాత్మకమైన చలో హైదరాబాదు ప్రదర్శన నిర్వహించి పోరాట చరిత్రలో కొత్త పుటల్ని చేర్చాం.

1979 అక్టోబరులో రిటైర్‌మెంట్ వయస్సు పి. ఆర్. సి. రికమండ్ చేసిన 58 సం॥ అమలు గురించి లక్ష కార్డులు పోస్టు చేయించి విజయం సాధించాం.

1980 లో ధర్నాలు నిర్వహించి అగ్రిమెంటు లేకుండా డైరెక్టు పేమెంటు సాధించుకున్నాం.

1981 మార్చి 1 న హైదరాబాదులో వేయి మందితో ధర్నా సాగించి పలు సమస్యల పరిష్కారానికి కృషి చేశాము.

1982 ఆగష్టు 30 న వేయి మందితో సెక్రటేరియట్ ముందు పికెటింగ్ చేసి అరెస్టులకు, లాఠీచార్జిలకు గురై రీగ్రూపింగ్ స్కేల్సు సాధనకు కృషి చేశాం.

1983 నవంబరు 15 న సెక్రటేరియట్ ముందు అపూర్వమైన రీతిలో ధర్నా చేసి, 50 వేల సంతకాల విజ్ఞప్తులు యిచ్చి 10-15 స్కేళ్ళ సాధనకు కృషి చేశాం.

1984 మే జూన్ నెలలలో 50 వేల మంది ఉపాధ్యాయులకు శిక్షణా తరగతులు నిర్వహించాం.

1985 ఆగష్టు 5 న సమితి పట్టణాలలో, 12 న జిల్లా ఆఫీసు ముందు, 19 న సెక్రటేరియట్ ముందు ధర్నాలు చేశాం. సెప్టెంబరు 5 న 50 వేల సంతకాలతో అసెంబ్లీకి మహా విజ్ఞాపన పత్రాలు సమర్పించాం.

## మన భవనాలు

ఈ పదకొండు సంవత్సరాల కాలంలో ఇలాంటి పోరాట కార్యక్రమాల ద్వారాను, సమితి, పట్టణ, జిల్లాశాఖలు సమస్యలపై నిర్విరామ పోరాట కార్యక్రమాలు చేపట్టి అవినీతికి వ్యతిరేకంగా కృషి చేయుటద్వారా యు. టి. యఫ్. ఉపాధ్యాయుల హృదయాలలో శాశ్వత స్థానాన్ని పొందింది.

ఖమ్మం విద్యా మహాసభలలో పిలుపు ఇచ్చి 9-12-78 న విజయవాడలో చెన్నుపాటి భవనం నిర్మించుకున్నాం. అందులోనే 7-5-81 న మీటింగు హాలు ఏర్పాటు చేసుకున్నాం. భీమవరం మహాసభ పిలుపు ప్రకారం 10-9-83 న హైదరాబాదులో యు టి. యఫ్. భవనం ఏర్పాటు చేసుకున్నాం.

విజయవాడ భవనాన్ని ఉద్యమానికి అనువైన రీతిలో తిరిగి పునర్ నిర్మాణం చేసుకున్నాం. అలాగే హైదరాబాదులో యు టి.ఎఫ్ భవనం పైన మీటింగుహాలు వేసుకొని ఉద్యమ అవసరాలకు అనుగుణంగా రూపొందించుకున్నాం. వీటి నిర్మాణంలో సహకరించిన శ్రీ కె. తిరుపాలు, శ్రీ టి. అంజిరెడ్డి, శ్రీ పి. సత్యనారాయణ (ఖమ్మం) గార్లకు అభినందనలు.

వరియు ఖమ్మం, ప్రకాశం, నెల్లూరు జిల్లాలలో స్వంత

# ఉద్యమాన్ని ప్రగతి పథంలో నడిపిన కార్యవర్గాలు

భవనాలు ఏర్పాటు చేసుకున్నాం. అమలాపురం, మధిరలలో కూడా భవనాలు వున్నాయి. తూ గో, ప. గో, గుంటూరు, యం. నగర్, కరీంనగర్ జిల్లాలలో స్వంత భవనాలు ఏర్పాటు చేసుకొనే దానికి కార్యక్రమం చేపట్టారు.

కార్యాలయాలు ఏర్పడగానే సరిపోదు వాటిని సక్రమంగా నిర్వహించాలి. ఆస్తులు ప్రోగుపడగానే అయిపోదు. వాటిని సద్వినియోగం చేయాలి.

ఉపాధ్యాయులు, కార్యకర్తలు, ఉద్యమాభిమానులు త్యాగాలలో ముందుండి, చొరవతో పయనించిన ఫలితమే యు.టి.యఫ్. ప్రగతి పథంలో పయనించి, రాష్ట్రంలోనే పెద్ద సంఘంగా, పోరాట సంస్థగా అభివృద్ధి చెందింది. సదా దానిని మనస్సులో వుంచుకొని మనం మెలగాలి.

ఈ పదునొకండు సంవత్సరాలలో పని చేసిన కార్యవర్గాలు ఒకసారి పరిశీలిద్దాం.

## (1) 1974 అగస్టు 10 కార్యవర్గం

సర్వశ్రీ అధ్యక్షులు యస్. సీతారామాచారి, ప్రధాన కార్యదర్శి ఎ. వెంకటస్వామి, ఉపాధ్యక్షులు డి. రామిరెడ్డి, కార్యదర్శి ఎస్. ఆర్. పోలిశెట్టి, సభ్యులు పి.బి. ముత్తారావు, వి. సూర్యనారాయణ రాజు (తూ.గో.), సి హెచ్. వెంకటరెడ్డి, పి. సత్యనారాయణరాజు (ప.గో.), ఎం ఏసురత్నం (కృష్ణ), జి కె. రామారావు (గుంటూరు), కె. తిరుపాలు (నెల్లూరు), కె. కర్రెన్న (కర్నూలు), యం. వెంకటరత్నం పత్రికా సంపాదకులు.

## (2) 1974 అక్టోబరు కార్యవర్గం

1974 అక్టోబరు రాజమండ్రి మహాసభలో ఎన్నుకోబడి 1975 జనవరిలో తెలంగాణా ప్రాంతానికి విస్తరించిన తర్వాత కో-అప్ట్ చేసుకున్న వారితో కార్యవర్గం :

సర్వశ్రీ అధ్యక్షులు కె. నారాయణరావు, ప్రధాన కార్యదర్శి ఎ. వెంకటస్వామి, ఉపాధ్యక్షులు యస్. సీతారామాచారి, పి. వి. సుబ్బరాజు, పి బి. ముత్తారావు, జి. లక్ష్మయ్య, కార్యదర్శులు డి. రామిరెడ్డి, కె. తిరుపాలు, యస్. ఆర్. పోలిశెట్టి, కె. భద్రయ్య. ఎడిటరు యం. వెంకటరత్నం, సభ్యులు ఎ. బాబూరావు (విశాఖ), వి. సూర్యనారాయణరాజు (తూ. గో.), పి. సత్యనారాయణరాజు (ప. గో.), యం. ఏసురత్నం (కృష్ణ), టి. అంజిరెడ్డి (గుంటూరు), కె. కర్రెన్న (కర్నూలు), యం. కోటయ్య (ప్రకాశం), టి. కొండాచారి (నెల్లూరు), ఆర్. రాఘవయ్య (ఖమ్మం), ఎస్ సోమయ్య (వరంగల్), పి. సత్యనారాయణ (నల్గొండ), బి. హరనాథ్ (హైదరాబాద్), సి హెచ్. పట్టాభిరామయ్య (నిజామాబాద్), ఎ. సరోజినీనాయుడు (మహిళ), సి హెచ్. మునేశ్వరరావు (ఏజన్సీ).

## (3) 1975 అగస్టులో ఎన్నికయిన కార్యవర్గం

సర్వశ్రీ అధ్యక్షులు కె. నారాయణరావు, ప్రధాన కార్యదర్శి ఎ. వెంకటస్వామి, ఉపాధ్యక్షులు ఎస్ సీతారామాచారి, పి. వి. సుబ్బరాజు, పి. బి. ముత్తారావు, జి. లక్ష్మయ్య, కె.భద్రయ్య, కార్యదర్శులు డి. రామిరెడ్డి, కె. తిరుపాలు. ఎస్ ఆర్. పోలిశెట్టి. ఆర్. రాఘవయ్య, యం. నరహరి, సభ్యులు పి. సాంబమూర్తి (విశాఖ), వి. సూర్యనారాయణరాజు (తూ. గో.), పి. సత్యనారాయణరాజు (ప. గో.), ఎం. ఏసురత్నం (కృష్ణ), టి. అంజిరెడ్డి (గుంటూరు), ఎం.కోటయ్య (ప్రకాశం), టి కొండాచారి (నెల్లూరు), జి. గోవిందప్ప (కర్నూలు), వి. మల్లిఖార్జునరావు (ఖమ్మం), జి. కొమరయ్య(వరంగల్), పి. సత్యనారాయణ (నల్గొండ), సి హెచ్. పట్టాభిరామయ్య (నిజామాబాద్), కె రామిరెడ్డి (ఎం.నగర్), ఎం మార్క్స్ (హైదరాబాదు), ఎ సరోజిని నాయుడు (మహిళ).

## (4) 1976 సెప్టెంబరు 30 న ఎన్నికయిన కార్యవర్గం

సర్వశ్రీ అధ్యక్షులు కె. నారాయణరావు, ప్రధాన కార్యదర్శి ఎ. వెంకటస్వామి, ఉపాధ్యక్షులు ఎస్. సీతారామాచారి, పి వి సుబ్బరాజు, పి. బి. ముత్తారావు, కె. భద్రయ్య, కార్యదర్శులు డి రామిరెడ్డి, కె. తిరుపాలు, ఎస్ ఆర్. పోలిశెట్టి, ఆర్. రాఘవయ్య, ఎం. నరహరి, ఎడిటరు ఎం. వెంకటరత్నం. కార్యవర్గం పి. సాంబమూర్తి, (విశాఖ) వి. సూర్యనారాయణరాజు (తూ. గో.), పి. సత్యనారాయణరాజు (ప. గో.), ఎం ఏసురత్నం (కృష్ణ), టి. అంజిరెడ్డి (గుంటూరు), ఎం. కోటయ్య (ప్రకాశం), సి హెచ్. లక్ష్మీనారాయణ (నెల్లూరు), జి గోవిందప్ప (కర్నూలు), సి. మహదేవరెడ్డి (చిత్తూరు), వి. మల్లిఖార్జునరావు (ఖమ్మం), జి రఘుపతి, (వరంగల్), పి.సత్యనారాయణ (నల్గొండ), పి. అమరేశ్వరరావు (నిజామాబాద్), కె.రామిరెడ్డి (మహబూబ్‌నగర్), ఎం. మార్క్స్ (హైదరాబాద్), ఎ. అనసూయ (మహిళ).

## (5) 1977 అగస్టు 18న ఎన్నికయిన కార్యవర్గం

సర్వశ్రీ అధ్యక్షులు కె. నారాయణరావు, ప్రధాన కార్యదర్శి ఎ. వెంకటస్వామి, ఉపాధ్యక్షులు ఎస్. సీతారామాచారి, పి. వి. సుబ్బరాజు, జి. లక్ష్మయ్య, కె. భద్రయ్య, టి. అంజిరెడ్డి, కార్యదర్శులు డి. రామిరెడ్డి, కె. తిరుపాలు, ఆర్. రాఘవయ్య, ఎస్ ఆర్. పోలిశెట్టి, యం. నరహరి, పి. సత్యనారాయణ, ఎడిటరు యం. వెంకటరత్నం, కార్యవర్గం వై. పద్మనాభం (విశాఖ), వి. సూర్యనారాయణరాజు (తూ. గో.), పి. సత్యనారాయణరాజు (ప. గో.), యం. ఏసురత్నం (కృష్ణ), సి హెచ్. గోపాలరాజు (గుంటూరు), యం. కోటయ్య (ప్రకాశం) టి. కొండాచారి (నెల్లూరు), సి. మహదేవరెడ్డి (చిత్తూరు), బి వెంకటసుబ్బయ్య (అనంతపూర్), జి. గోవిందప్ప (కర్నూలు), వి. మల్లిఖార్జునరావు (ఖమ్మం), పి. చక్రపాణి (వరంగల్), సి హెచ్.

పట్టాభిరామయ్య (నిజాంబాద్), టి. జి. గోపాలన్ (మెదక్), వి. భాస్కరశర్మ (హైదరాబాద్), ఎస్. విజయకుమార్ (ఎం. నగర్), వి బంగారయ్య (నల్గొండ), ఎ. అనసూయ (మహిళ).

## (6) 1978 సెప్టెంబరు 9 వ ఎన్నికయిన కార్యవర్గం

సర్వశ్రీ అధ్యక్షులు కె. నారాయణరావు, ప్రధాన కార్యదర్శి ఎ. వెంకటస్వామి, ఉపాధ్యక్షులు యస్. సీతారామాచారి, జి. లక్ష్మయ్య, టి అంజిరెడ్డి, వి. సూర్యనారాయణరాజు, కార్యదర్శులు డి. రామిరెడ్డి, కె. తిరుపాలు, యస్. ఆర్. పోలిశెట్టి, యం. నరహరి, ఎడిటరు యం. వెంకటరత్నం, సభ్యులు కె. వి. సుబ్బారావు (విశాఖ), పి. బి. ముత్తారావు (తూ.గో.), వి. శ్రీరామమూర్తి (ప గో.), యం. ఏసురత్నం (కృష్ణ), యం. రాయన్న (గుంటూరు), యం. కోటయ్య (ప్రకాశం), టి. కొండాచారి (నెల్లూరు), సి. మహదేవరెడ్డి (చిత్తూరు), యం. డి. అబ్దుల్ అజీజ్ (కర్నూలు). బి. వెంకట సుబ్బయ్య (అనంతపురం), ఆర్. పురుషోత్తమరావు (ఖమ్మం), కె. భద్రయ్య (వరంగల్), పి. సత్యనారాయణ (నల్గొండ) పి. భాస్కరశర్మ (హైదరాబాదు), ఎస్. విజయకుమార్ (యం. నగర్), టి. డి. గోపాల్ (మెదక్), పి. అమరేశ్వరరావు (నిజాంబాదు), యం. వీరారెడ్డి (ఆదిలాబాదు), కె. కృష్ణమూర్తి (కరీంనగర్), ఎ. లెనోరా (మహిళ).

## (7) 1979 ఆగస్టు 12 వ ఎన్నికయిన కార్యవర్గం

సర్వశ్రీ అధ్యక్షులు కె. నారాయణరావు, ప్రధాన కార్యదర్శి ఎ. వెంకటస్వామి, ఉపాధ్యక్షులు యస్. సీతారామాచారి, పి.వి. సుబ్బరాజు, జి. లక్ష్మయ్య, టి. అంజిరెడ్డి, వి. సూర్యనారాయణరాజు, కార్యదర్శులు డి. రామిరెడ్డి, కె తిరుపాలు, యస్. ఆర్. పోలిశెట్టి, యం. నరహరి, పి. సత్యనారాయణ, ఎడిటరు యం. వెంకటరత్నం. సభ్యులు జె. సూర్యనారాయణ (విజయనగరం), వై. ఆనందరావు (విశాఖ), పి.బి. ముత్తారావు (తూ.గో.), వి. శ్రీరామమూర్తి (ప.గో.), యం. యేసురత్నం (కృష్ణా), వై.యల్. నారాయణ (గుంటూరు), యం. కోటయ్య (ప్రకాశం), టి. కొండాచారి (నెల్లూరు), బి. వెంకట సుబ్బయ్య (అనంతపురం), ఆర్. రాఘవయ్య (ఖమ్మం), ఎ. నరసింహారెడ్డి (వరంగల్), వి. బంగారయ్య (నల్గొండ), పి. భాస్కరశాస్త్రి (హైదాబాదు), యం. మార్క్ (రంగారెడ్డి), డి. వెంకటరెడ్డి (యం.నగర్), యల్. చెన్నకేశవరావు (ఆదిలాబాదు), వై. లక్ష్మినారాయణ (నిజాంబాదు), ఎ. కృష్ణమూర్తి (కరీంనగర్).

## (8) 1980 సెప్టెంబరు 14 వ ఎన్నికయిన కార్యవర్గం

సర్వశ్రీ అధ్యక్షులు డి. రామిరెడ్డి, ప్రధాన కార్యదర్శి ఎ. వెంకటస్వామి, ఉపాధ్యక్షులు కె. నారాయణరావు, యస్. సీతారామాచారి, పి. వి. సుబ్బరాజు, జి. లక్ష్మయ్య, టి. అంజిరెడ్డి. కార్యదర్శులు కె. తిరుపాలు, యస్.ఆర్. పోలిశెట్టి, యం. నరహరి, వి. సూర్యనారాయణరాజు, పి. సత్యనారాయణ, ఎడిటరు యం. వెంకటరత్నం. సభ్యులు జె. కన్నమనాయుడు (వి నగర్), ఎ. బాబూరావు (విశాఖ). పి. బి. ముత్తారావు (తూ.గో), వి. శ్రీరామమూర్తి (ప. గో.), యం. ఏసురత్నం (కృష్ణ), వై. యల్. నారాయణ (గుంటూరు), యం. కోటయ్య (ప్రకాశం). వి. బాలసుబ్రహ్మణ్యం (నెల్లూరు), యం.రామమూర్తి (కడప), యం. వెంకటరామయ్య (కర్నూలు), పి. సుబ్రహ్మణ్యం (చిత్తూరు), బి. నరసప్ప (అనంతపురం), ఆర్.రాఘవయ్య (ఖమ్మం), సి హెచ్. పిచ్చిరెడ్డి (నల్గొండ), డి. వెంకటరెడ్డి (యం. నగర్), ఆర్. నాగమల్లేశ్వరరావు (ఆదిలాబాద్), వై. లక్ష్మినారాయణ (నిజామాబాద్), యస్. అంజయ్య (కరీంనగర్), ఎస్.రాములు (హైదాబాదు), వై జి. శౌరయ్య (వరంగల్), ఎం. మార్క్ (రంగారెడ్డి), యం. ఆర్. రెడ్డి (మెదక్), యస్. వి. రమణమ్మ (మహిళ).

## (9) 1981 ఆగస్టు 18 వ ఎన్నికయిన కార్యవర్గం

సర్వశ్రీ అధ్యక్షులు డి. రామిరెడ్డి, ప్రధాన కార్యదర్శి ఎ. వెంకటస్వామి, ఉపాధ్యక్షులు, కె. నారాయణరావు, ఎస్. సీతారామాచారి, కె. తిరుపాలు, జి. లక్ష్మయ్య, టి. అంజిరెడ్డి, యస్. ఆర్. పోలిశెట్టి, యం. నరహరి, వి. సూర్యనారాయణరాజు, పి. సత్యనారాయణ, ఎస్. విజయకుమార్, ఎడిటర్ యం వెంకటరత్నం, సభ్యులు యస్. బాలసుందరరావు (శ్రీకాకుళం), ఐ. వి. వి. గోపాలాచార్యులు (వి. నగర్), ఎ. బాబూరావు (విశాఖ), పి. బి. ముత్తారావు (తూ.గో), కె. రాఘవరాజు (ప.గో), యం. ఏసురత్నం (కృష్ణ), యం. రాయన్న (గుంటూరు), పి బాలకృష్ణమూర్తి (ప్రకాశం), సి హెచ్. లక్ష్మినారాయణ (నెల్లూరు), సి. అంజనేయరెడ్డి (చిత్తూరు), టి. నాగన్న (కర్నూలు), వై. వెంకటాచలం (అనంతపురం), వి. మల్లిఖార్జునరావు (ఖమ్మం), కె. భద్రయ్య (వరంగల్), సి హెచ్. పిచ్చిరెడ్డి (నల్గొండ), యస్. రాములు (హైదరబాదు), యం. మార్క్ (రంగారెడ్డి), కె. యాదగిరాచార్య (యం. నగర్), సి. మాణిక్ప్రభు (ఆదిలాబాదు), యం.ఆర్. రెడ్డి (మెదక్), పి. అమరేశ్వరరావు (నిజాంబాదు), కె. నారాయణ (కరీంనగర్).

## (10) 1982 అక్టోబరు 3 వ ఎన్నికయిన కార్యవర్గం

సర్వశ్రీ అధ్యక్షులు డి. రామిరెడ్డి, ప్రధాన కార్యదర్శి ఎ. వెంకటస్వామి. ఉపాధ్యక్షులు కె. నారాయణరావు, కె. తిరుపాలు, జి. లక్ష్మయ్య, టి. అంజిరెడ్డి, యం. వెంకటరత్నం, కార్యదర్శులు యస్. ఆర్. పోలిశెట్టి, యం. నరహరి, వి. సూర్యనారాయణరాజు, పి. సత్యనారాయణ, యస్. విజయ్కుమార్, సభ్యులు యస్. బాలసుందరరావు (శ్రీకాకుళం), జె. అప్పలనాయుడు (వి. నగరం),

యు. టి. యఫ్. విద్యా మహాసభల ద్వారా

మనసులో చెరిగిపోని మధురస్మృతులు కలిగించిన కార్యకర్తలందరికీ

శుభాకాంక్షలతో....

# యునైటెడ్ టీచర్స్ కో-ఆపరేటివ్ హౌసింగ్ సొసైటీ లిమిటెడ్

రిజిష్టర్ నెం. టి. బి. 349 / తేదీ 6-6-84

పెదఅంబర్ పేట : : హయత్‌నగర్

## రంగారెడ్డి జిల్లా

అధ్యక్షులు : శ్రీ డి. రామిరెడ్డి

ఉపాధ్యక్షులు : శ్రీ వై. యల్. నారాయణ

కార్యదర్శి : శ్రీ పి. సత్యనారాయణ

సహాయకార్యదర్శి : శ్రీ పి. సత్యనారాయణరాజు

కోశాధికారి : శ్రీ సి. హెచ్. పిచ్చిరెడ్డి

డైరెక్టర్లు :

సర్వశ్రీ జి. లక్ష్మయ్య, కె. జోజయ్య, కె. కృష్ణయ్య, వి. రంగారావు

కార్యాలయం

యు. టి. యఫ్. భవన్

దోమల్‌గూడ, హైదరాబాద్-29

ఫోన్ : 66840

వి. భాస్కరరావు (విశాఖ), పి.బి. ముత్తారావు (తూ.గో.), కె.రాఘవ రాజు (ప. గో.), యస్. రామకోటేశ్వరరావు (కృష్ణ), ఎం. రాయన్న (గుంటూరు) టి. బాలకృష్ణమూర్తి (ప్రకాశం), సిహెచ్. లక్ష్మినారాయణ (నెల్లూరు), కె. గురుస్వామినాయుడు (చిత్తూరు), డి. రామిరెడ్డి (కడప), పి. నరసప్ప (కర్నూలు), బి. వెంకటసుబ్బయ్య (అనంతపురం), పి. కృష్ణమూర్తి (నల్గొండ), టి. పుల్లారావు (హైదరాబాదు), ఎం. మార్క్ (రంగారెడ్డి), ఎ. చంద్రమౌళి (యం.నగర్), వై. లక్ష్మినారాయణ (నిజాంబాదు), యం. ఆర్. రెడ్డి (మెదక్), టి శ్రీనివాసరావు (కరీంనగర్), కె. భద్రయ్య (వరంగల్), వి. మల్లిఖార్జునరావు (ఖమ్మం), ఆర్. నాగమల్లేశ్వరరావు (ఆదిలాబాదు), ఎ. అనసూయ (మహిళ).

## [11] 1983 సెప్టెంబరు 11 న ఎన్నికయిన కార్యవర్గం

సర్వశ్రీ అధ్యక్షులు శ్రీ డి. రామిరెడ్డి, ప్రధాన కార్యదర్శి ఎ. వెంకటస్వామి, ఉపాధ్యక్షులు కె తిరుపాలు, జి. లక్ష్మయ్య, టి. అంజిరెడ్డి, పి సత్యనారాయణ. కార్యదర్శులు ఎస్.ఆర్. పోలిశెట్టి, యం. నరహరి, వి. సూర్యనారాయణరాజు, యస్. విజయకుమార్, ఎడిటర్ ఎం. వెంకటరత్నం, సభ్యులు ఎస్. బాలసుందరరావు, (శ్రీకాకుళం) యం. కృష్ణమూర్తి, (వి.నగర్) డి. చక్రరావు, (విశాఖ) టి. వెంకటరావు (తూ. గో.), కె. రాఘవరాజు (ప. గో.), ఎస్. రామకోటేశ్వరరావు (కృష్ణ), యం. రాయన్న (గుంటూరు), డి. లక్ష్మిరెడ్డి (ప్రకాశం), సిహెచ్. లక్ష్మినారాయణ (నెల్లూరు), కె. గురుస్వామినాయుడు (చిత్తూరు), డి. రామిరెడ్డి(కడప), బి. కృష్ణారెడ్డి(కర్నూలు), బి. నరసప్ప (అనంతపురం), వి. యల్. నరసింహారావు (ఖమ్మం), పి. మల్లేశం (వరంగల్), పి. కృష్ణమూర్తి (నల్గొండ), ఎ చంద్రమౌళి (యం. నగర్), కె కృష్ణారెడ్డి (ఆదిలాబాద్), టి. శ్రీనివాసరావు (కరీంనగర్), ఎస్. రమణయ్యశాస్త్రి (హైదాబాద్), కె. యస్ మూర్తి (రంగారెడ్డి), ఎం. ఆర్. రెడ్డి (మెదక్), బి. బాలయ్య, (నిజాంబాద్), ఎస్. అనసూయ (మహిళ).

## (12) 1984 అక్టోబరు 14న ఎన్నికయిన కార్యవర్గం

సర్వశ్రీ అధ్యక్షుడు డి. రామిరెడ్డి, ప్రధాన కార్యదర్శి ఎ. వెంకటస్వామి, ఉపాధ్యక్షులు కె. తిరుపాలు, జి లక్ష్మయ్య, టి. అంజిరెడ్డి, పి. సత్యనారాయణ జి. సి. లక్ష్మిరెడ్డి కార్యదర్శులు యస్. ఆర్. పోలిశెట్టి, యం. నరహరి, వి. సూర్యనారాయణరాజు, యస్. విజయకుమార్, యం. ఎం. కె. దత్తు, ఎడిటరు ఎం. వెంకటరత్నం. సభ్యులు పి.మహేశ్వరరావు(శ్రీకాకుళం), ఎం.కృష్ణమూర్తి(వి.నగరం), డి. చక్రరావు (విశాఖ), టి.వెంకటరావు (తూ. గో), కె. రాఘవరాజు (ప. గో.), కె. నారాయణరావు (కృష్ణ), వై. యల్. నారాయణ (గుంటూరు), డి. లక్ష్మిరెడ్డి (ప్రకాశం), వి. బాలసుబ్రహ్మణ్యం (నెల్లూరు), ఎ. చెన్నకేశవరెడ్డి (కర్నూలు), బి. నరసప్ప (అనంతపురం), వి. యల్. నరసింహారావు (ఖమ్మం), వై. జి. శౌరయ్య (వరంగల్), పి. కృష్ణమూర్తి (నల్గొండ), డి.వెంకటరెడ్డి(యం.నగర్), యస్. నరసయ్య (ఆదిలాబాద్), ఎస్. రాములు (హైదరాబాదు), ఎం. మార్క్ (రంగారెడ్డి), ఎం. ఆర్. రెడ్డి (మెదక్), పి. బాలాజీ (చిత్తూరు), యస్. అనసూయ, ఎ. లెనోరా (మహిళలు).

ఈ అన్ని కమిటీలు సమిష్టి అవగాహనతో పనిచేసి, ఉద్యమాన్ని అభివృద్ధి చేశాయి. 7 జిల్లాలతో ప్రారంభమైన ఉద్యమం 23 జిల్లాలకు విస్తరించింది. అయితే ఇదంతా కత్తిమీద సాములా విచ్ఛిన్నకారులను ఎదుర్కొంటూ పురోగమించవలసివచ్చింది. మన ఉద్యమంలోనే వరంగల్లు, కడప జిల్లాలలో పెడధోరణులు ఎదుర్కొన్నాం. ఉద్యమాన్ని కాపాడుకున్నాం.

పది సం॥రాలకు పైగా జరిగిన కాలంలో అద్దెకొంపలో చిన్న ఆఫీసుతో ప్రారంభమైన మన సంఘం రాశిలో, వాసిలో చెందిన అభివృద్ధి సామాన్యమైనదికాదు. అందుకు అమరజీవులు శ్రీ పి. వి. సుబ్బరాజు, ఎం. ఏసురత్నం, కె. గంగిశెట్టి, పకీరయ్య, నాగిశెట్టి, వెంకటరెడ్డిలాంటి వారి త్యాగాలు, కార్యకర్తల కృషి అమూల్యమైనది.

## మనం పయనించవలసిన పథం

పెరిగే ఉద్యమంలో అనేక పెడధోరణులు కనిపిస్తున్నాయి. మనం ప్రాణప్రదంగా కాపాడుకొంటున్న కొన్ని విలువలు సన్నగిల్లుతున్నాయి. వాటిపై సకాలంలో సరైన చర్యలు గైకొనుట ద్వారా ఉద్యమ వాడిని నిలబెట్టుకోవాలి.

అవినీతికి వ్యతిరేకంగా పోరాడవలసిన మన శాఖలు కొన్ని చోట్ల దళారీల ఆటలు అరికట్టకపోగా, నిర్లిప్తంగా వుండటం ప్రమాదకరమైన లక్షణం. పోరాటం ద్వారా సాధించే వైపు నడుపవలసిన కర్తవ్యం విస్మరించరాదు.

రాను రాను ప్రజలకు దూరమయి, మన పోరాటాలు, మన జీతాలు వరకే పరిమితమయ్యే పరిస్థితి ప్రమాదకరమైనది. మన పాలసీలో చెప్పుకున్నట్లు "సమాజాన్ని ఉన్నది ఉన్నట్లు వుంచి ఉపాధ్యాయులొక్కరినే ఉట్టికెక్కిస్తారనేది కల్ల" అనేది అక్షరాల నిజం. జనంతో, కార్మిక కర్షక ఉద్యమాలతో మనం కలిసి పని చేయాలి

మన వృత్తి మనం చేసుకుంటూనే, విద్యార్థి ఉద్యమానికెంతో సహకరించవచ్చు. యువజన ఉద్యమానికి చేయూతనివ్వవచ్చు. ప్రజానాట్యమండలి పనిచేసేందుకు కృషి చేయవచ్చు. శాంతి ఉద్యమం గురించి ప్రచారం చేస్తూ అందులో పాల్గొనవచ్చు. వయోజనవిద్యావ్యాప్తికి కృషి చేయవచ్చు.

నూటికి 70 మందిగా వున్న పేదవారికి మనం చెప్పేదే చదువు. మన పాఠశాలలే విశ్వవిద్యాలయాలు. ఎన్ని అవాంతరాలు

వున్నా అనుకూల పరిస్థితులు ఎదురైనా, వారికి చదువు చెప్పేదానికి నిరంతరం కృషి చేయాలి. అపప్రథ తొలగించు కోవాలి. అధ్యాపక వృత్తికి గౌరవం ఇనుమడింపచేయాలి.

## రీగ్రూపింగ్ స్కేళ్ళ గురించి పోరాటం

గత భీమవరం మహాసభలనుండి నేటివరకు ప్రధానంగా జరిగిన పోరాటాలు రీగ్రూపింగ్, 10-15 సం॥రాల స్కేల్సు గురించి జరిగాయి. ఫేప్టో బేనరుతో ఇది సాగించాం. యు.టి యఫ్. ప్రధాన పాత్ర వహించింది.

1981 లో రీగ్రూపింగ్ స్కేల్సు గురించి మొదటగా యు.టి యఫ్ వార్తలలో ప్రచురించి 1982 మార్చి 7 న పోరాటానికి పిలుపు యిచ్చాం. దానితో ఒక ఒప్పందానికి రావడం జరిగింది. తరువాత ఏప్రిల్ 8 న మరొక ఒప్పందం జరిగింది.

1982 అక్టోబరు 2 నుండి రిలే నిరాహారదీక్షలు జరిగాయి. 7 వ తేదీనుండి మన చొరవతో నిరవధిక నిరాహారదీక్షలు జరిగాయి. అర్ధరాత్రి చర్చలు జరిగి పోరాటం విరమించబడింది. రీగ్రూపింగ్ స్కేల్స్ గురించి కమిటీని వేశారు.

1982 డిశంబరు 17 సమ్మెకు పిలుపుయిచ్చి 1 రోజు సమ్మె చేయడం జరిగింది. అర్ధరాత్రి చర్చలు జరిగి ఒప్పందం కుదిరి రీగ్రూపింగ్ స్కేల్సు జి. ఓ. గ్రామప్రాంతాలకు ఇంటిఅద్దె జి.ఓ. అప్పటికప్పుడుఇవ్వగా సమ్మె విరమించడం జరిగింది

తర్వాత మన పోరాటం ప్రధానంగా 10-15 స్కేళ్ళపై కేంద్రీకరించబడింది. 1983 ఫిబ్రవరి 25 సెక్రటేరియట్ ముందు పికెటింగు, మార్చి 28న హైద్రాబాద్‌లో ప్రదర్శన జరిగింది. అప్పటికి ప్రభుత్వం కదలని కారణంగా జూలై 15 నుండి సమ్మె చేయాలని పిలుపు ఇచ్చాం. అదే సందర్భంలో ఎన్. జి. ఓ. లు కూడా పిలుపు ఇచ్చారు. వీరితో సమన్వయం చేసుకోవాలని చాలా ప్రయత్నించాం. చర్చలు జరిపాం. అయినా ఫలితం కనిపించలేదు. ఫలితంగా విడివిడిగానే చర్చలు జరిగాయి. మనం ప్రభుత్వంతో ఒప్పందానికి వచ్చి సమ్మె విరమించాం.

జూలై 14 ఒప్పంద చారిత్రాత్మకమైనది. ఉపాధ్యాయులకు 15 సం॥రాల ప్రమోషను స్కేలు పైకేడరు స్కేలు ఇచ్చుటకు, క్వాలిఫికేషన్‌తో నిమిత్తం లేకుండా పెస్టు పెట్టుటకు, అభ్యుదయ పాఠశాలల రద్దు, గ్రేడు II పండితులకు గ్రేడు I స్కేలు ఎయిడెడ్ పాఠశాలల సమస్యలు, ప్రొవిన్సలైజేషన్ సౌకర్యాలవంటి అతి ముఖ్యమైన విజయాలు గలవు.

తర్వాత హామీలు అమలుపై 1984 ఫిబ్రవరి 17 న సెక్రటేరియట్ ముందు పికెటింగు జరిగింది. ప్రభుత్వం అప్పటికి కదలకపోతే మార్చి 14 నుండి సమ్మెకు పిలుపు ఇచ్చాం. కొన్ని సంఘాలు సమ్మెకు అడ్డుపడినా ఉపాధ్యాయులు అపూర్వంగా అందుకున్నారు. ఉపాధ్యాయ యం. యల్. సి. లు ఒకరు తప్ప అందరూ 16 నుండి నిరాహార దీక్షలో పాల్గొన్నారు. రాష్ట్ర వ్యాప్తంగా పరీక్షలు నిలిచిపోయే స్థితి ఏర్పడింది. ఫలితంగా ప్రభుత్వం దిగివచ్చి మార్చి 19 న చర్చలు జరిపి జి. ఓ. లు విడుదల చేసింది. 10-15 సంవత్సరాల స్కేల్సు సాధించుకున్నాం.

తిరిగి 1985 మార్చి 25 న పోరాటానికి పిలుపు ఇచ్చి గ్రూపు III వారికి పరీక్ష మినహాయింపు సాధించి, మిగిలిన వారికి హామీ పొంది. ప్రొవిన్సలైజేషన్ సౌకర్యాలపై కేటాయింపులు చేయించి పోరాటం విరమించటం జరిగింది.

1983 జూలై 14 అగ్రిమెంటు ప్రాముఖ్యత గుర్తించని కొందరు ఎన్.జి.ఓ. లతో పాటు సమ్మె చేయలేదని, తప్పుడు ప్రకటనలు చేశారు. 1984 మార్చి సమ్మెలో పాల్గొనని వారు అవకాశవాదంతో అర్థగోలు వాదనలు చేశారు. గ్రూపు III టెస్టుకు కొన్ని సంఘాలు కారణమంటూ ఆరోపించారు. జూలై 14 అగ్రిమెంటు ప్రమోషను స్కేలు ప్రాధాన్యత గుర్తించిన ఉపాధ్యాయులు అట్టి వాదనలు త్రోసిపుచ్చారు.

## ఫేప్టో కార్యక్రమాలు

అనేక హామీలు అమలు జరగని కారణంగా 40 సమస్యలతో ప్రభుత్వానికి నోటీసు ఇచ్చి దశలవారి కార్యక్రమానికి పిలుపు ఇవ్వడము జరిగింది.

11-12-84న అన్ని జిల్లా కేంద్రాలలో ప్రదర్శనలు జరిగాయి. 19-12-84 సెక్రటేరియట్ ముందు వేయిమందితో పికెటింగు జరిగింది లాఠీ చార్జిలో యం.యల్.సి.లు, ఉపాధ్యాయ నాయకులు తీవ్రంగా గాయపడ్డారు. 4-1-84న నిరసన టెలిగ్రాములు ఇచ్చారు 29-1-85న సమితి కార్యాలయాలముందు పికెటింగు జరిగింది. 19-2-85న కలెక్టర్ కార్యాలయములముందు పికెటింగ్ జరిగింది 2-2-85న సమ్మె బేలట్ గురించి పిలుపు యివ్వగా ఆచరణలో అది నామమాత్రమే అయింది.

తిరిగి మార్చి 26 నుండి సమ్మెకు పిలుపు ఇవ్వడం జరిగింది. 1985 జనవరి 8, 16, 22, ఫిబ్రవరి 5, 11, మార్చి 2తేదీలలో జరిగిన చర్చలు ఇంక్రిమెంటు తేదీకి ఇంక్రిమెంటు జి. ఓ. తప్ప మరే ఫలితాలు సాధించలేదు. చివరికి సమ్మె కార్యక్రమాన్ని మరింత తీవ్రతరం చేయగా ప్రభుత్వం దిగివచ్చి చర్చలకు ఆహ్వానించింది.

85 మార్చి 19 న విద్యాశాఖ కార్యదర్శితోను, 20 న చీఫ్ సెక్రటరీతోను, 22న విద్యాశాఖ మంత్రితోను, 25 న ఉదయం ముఖ్యమంత్రి, సాయంత్రం విద్యామంత్రితోను చర్చలు జరిగి ఒప్పందానికి వచ్చి సమ్మె విరమించడం జరిగింది. ఒప్పందంలో గ్రూపు III వారికి 5 సం॥రాల వరకు పరీక్ష మినహాయింపు, స్పెషల్ టీచర్లకు సెలవులు, తాత్కాలిక సహాయానికి పి.ఆర్.సి. లో ప్రొటక్షన్, పంచాయితిరాజ్ ఉపాధ్యాయులకు యల్.టి.సి. పండగ అడ్వాన్సులు, ప్రమోషన్ సౌకర్యాలు మొదలగునవి కల్పించుటకు, ఎయిడెడ్ ఉపాధ్యాయులకు డైరెక్టు పేమెంటుగురించి, అన్ ఎయిడెడ్ పోస్టులు ఎయిడ్‌కు అడ్మిట్

చేయుట గురించి ఒప్పందం కుదిరింది. ఇందులోని చాల విషయాలపై ఉత్తర్వులు వచ్చాయి.

తర్వాత ఆగస్టు 20న ఫేప్టోతో ప్రభుత్వం చర్చలు జరిపింది. అటు తర్వాత మరేమీ జరగలేదు. 85 మే నెలలో ఫేప్టో ఎన్నికలు జరిగినతర్వాత ఈనాటివరకు సమావేశాలు జరుపుటగాని, రశ్యాకలాపాలు నిర్వహించుటగాని జరగలేదు. ఫేప్టో ఏ విధమైన కదలిక లేక, కొందరు ప్రకటనలు ఇచ్చుకొనేదానికి, తమ పేరుప్రక్క హోదాలు వేసుకొనే దానికి, తమసంఘ కార్యక్రమాలకు వాడుకొనేదానికి మాత్రమే పనికివచ్చే సంస్థగా తయారుచేశారు.

పి. ఆర్. సి. రిపోర్టు మనకు అనుకూలంగా రప్పించుకోవలసివున్న ప్రత్యేక పరిస్థితులలో ఫేప్టోను కదిలించి పనిచేయించవలసివున్నది.

## యు. టి. యఫ్. పోరాట కార్యక్రమాలు

ఫేప్టోలో అగ్రభాగానవుండి కృషిచేయటమేగాక, యు టి.ఎఫ్. ప్రత్యేక కార్యక్రమాలు అనేకం చేపట్టింది.

ఎయిడెడ్ సదస్సులు : ప్రభుత్వంతో ఎన్ని ఒప్పందాలు జరిగినా, మరెన్ని ఉత్తర్వులు వచ్చినా ఎయిడెడ్ ఉపాధ్యాయుల మౌలిక సమస్యలు పరిష్కరించబడలేదు. అందుచేత యు. టి. ఎఫ్. ఎయిడెడ్ సదస్సులకు పిలుపు ఇచ్చింది.

23-6-1985న రాష్ట్రవ్యాప్తంగా ఎయిడెడ్ సదస్సులు అత్యంత జయప్రదంగా జరిగాయి. ఎయిడెడ్ ఉపాధ్యాయుల సమస్యలపై ప్రత్యేక కార్యక్రమం జరగడం అందరిని ఉత్సాహపరిచింది.

హైదాబాదులో 14-7-85న ఎయిడెడ్ సదస్సు జరిగింది. విద్యామంత్రికి సదరు సమస్యలపై ప్రత్యేకమైన మెమొరాండం అందజేశాం. అందు ఎయిడెడ్ పాఠశాలల స్వాధీనం గురించి, ఉద్యోగ రక్షణ గురించి, విద్యాబిల్లుకు రూల్సు గురించి, ఇతర ఉపాధ్యాయులు పొందుతున్న అన్ని సౌకర్యాలు, నెలాఖరున జీతాలు చెల్లించుటతో సహా ఎయిడెడ్ ఉపాధ్యాయులకు ఇవ్వాలని, అన్ ఎయిడెడ్ పోస్టులు ఎయిడ్‌కు అడ్మిట్ చేయాలని, ప్రతి సం॥రం డిశంబరు జీతాలు ఆగే పరిస్థితులకు స్వస్తి చెప్పాలని మొదలగు సమస్యలు గలవు.

## దశలవారి పోరాట కార్యక్రమం

ప్రభుత్వ హామీలు అమలుజరగలేదు. ప్రభుత్వకార్యాలయాలు, ఆఫీసులు అవినీతికి నిలయాలుగా తయారైనాయి. రీగ్రూపింగ్ 10-15 సం॥ స్కేళ్ళ ఫిక్సేషనుల సందర్భంగా దళారీలు వీధిలో పడ్డారు. యు. టి. యఫ్ తిరిగి పోరాట కార్యక్రమానికి పిలుపు ఇచ్చింది.

రాష్ట్ర సంఘం పక్షాన జిల్లా పరిషత్, డి.ఇ.ఓ. యల్. యఫ్, సమితి, మున్సిపాలిటీ ఆఫీసుల సమస్యలపై నోటీసులు ఇచ్చాం. ఆయా శాఖలు కూడా నోటీసులు ఇచ్చాయి.

ఇదే సందర్భంలో 25 సమస్యలతో అసెంబ్లీకి సమర్పించుటకు మహావిజ్ఞాపన పత్రాలపై సంతకాలు చేయించవలసినదిగా పిలుపు ఇవ్వబడింది.

(1) 1985 ఆగస్టు 5 :- సమితి, మునిసిపల్ ఆఫీసుల ముందు జయప్రదంగా ధర్నాలు జరిగాయి. అనేక స్థానిక సమస్యలు పరిష్కరింపబడ్డాయి.

(2) 1985 ఆగస్టు 12 :- జిల్లా పరిషత్, యల్. యఫ్, డి.ఇ.ఓ ఆఫీసులలోని సమస్యలపై అత్యంత జయప్రదంగా ధర్నాలు జరిగాయి. అనేక జిల్లాలలో మన ప్రతినిధులను పిలిచి చర్చలు జరిపారు.

(3) 1985 ఆగస్టు 19 :- సెక్రటేరియట్, డైరెక్టరేట్‌ల ముందు వేయిమందితో ధర్నా జరిగింది. 80 సమస్యలతో ప్రభుత్వానికి నోటీసు ఇచ్చాం.

(4) 1985 సెప్టెంబరు 5 :- టీచర్స్ డే సందర్భంగా మనం సేకరించిన 50 వేల సంతకాల విజ్ఞాపన పత్రాలు అసెంబ్లీకి సమర్పించాం.

20-8-85 న ధర్నా సమస్యలపై ప్రభుత్వంతో చర్చ జరిగింది. తరువాత జరిగే సమావేశంలో నిర్ణయాలు తీసుకోవచ్చని చెప్పారు. ఎయిడెడ్ ఉపాధ్యాయుల సమస్యలపై వివరంగా చర్చించాం. మినిట్సు కూడా వచ్చాయి. తర్వాత చర్యలు గైకొనాలి.

## పే రివిజన్ కమీషన్

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పే రివిజన్ కమీషన్‌ను వేసింది. దానికి యు. టి యఫ్. పక్షాన 1985 జూన్‌లో రిపోర్టులిచ్చాం. అక్టోబరు 30 న ఆయన చర్చలకు పిలిచారు. అక్కడ ఫేప్టో నాయకులను కలియుట జరిగింది. అప్పుడు ఫేప్టోలో వున్న సంఘాలు కలిసి చర్చించి, ఫేప్టో లోగడ యిచ్చిన స్కేల్సు గత స్కేల్సు ప్రాతిపదికకు చాలా తక్కువగా వున్నాయి. యు. టి. యఫ్. స్కేల్సు సూత్రబద్ధ వైఖరితో వున్నాయని, వాటినే ఫేప్టో స్కేల్సుగా యివ్వాలని నిర్ణయించారు. అందుకై ప్రత్యేక మెమోరాండం యిచ్చుట జరిగింది.

## ఫేప్టో పి. ఆర్. సి. కి లోగడ యిచ్చిన స్కేళ్ళు

| | | |
|---|---|---|
| కేటగిరి III | ఉపాధ్యాయులకు ప | 1,000-30-1,150-40-1,350 |
| ,, | 10 సం॥లకు | 1,150-40-1,350-50-1,600 |
| ,, | 15 సం॥లకు | |
| కేటగిరి II | ఉపాధ్యాయులకు | 1,300-50-1,550-60-1,850 |
| ,, | 10 సం॥లకు | 1,450-60-1,750-70-2,110 |
| ,, | 15 సం॥లకు | |
| కేటగిరి I | ఉపాధ్యాయులకు | 1,600-70-1,950-80-2,350 |
| ,, | 10 సం॥లకు | 1,750-80-2,150-90-2,600 |
| ,, | 15 సం॥లకు | 1,900-90-2,850-100-2850 |

గ్రామ్స్ : ONION

ఫోన్స్ { ఆఫీస్ : 76462
ఫైనాన్స్ : 62470
రెసిడెన్స్ : 74720 }

మహాసభలలో పదివేల మందికి భోజనాలు ఏర్పాటుచేసిన
కార్యకర్తలకు అభినందనలతో



# చింతా వెంకటరత్నం అండ్ సన్స్

బంగాళదుంపలు, పచ్చిమిర్చి, కూరగాయలు కమీషన్ మర్చంట్స్

కాళేశ్వరరావు మార్కెట్, విజయవాడ-520 001



## ఫిఫ్టో పక్షాన తిరిగి రివైజ్ చేసి యిచ్చిన స్కేళ్లు

| | | |
|---|---|---|
| కేటగిరి III | ఉపాధ్యాయులకు రు. | 1,050-40-1250-60-1,610 |
| ,, | 10 సం॥లకు | 1,150-50-1,400-75-1,850 |
| ,, | 15 సం॥లకు | 1,300-60-1,600-90-2,140 |
| కేటగిరి II | ఉపాధ్యాయులకు | |
| ,, | 10 సం॥లకు | 1,450-70-1,800-100-2,300 |
| ,, | 15 సం॥లకు | 1,600-80-2 000-120-2,600 |
| కేటగిరి I | ఉపాధ్యాయులకు | |
| ,, | 10 సం॥లకు | 1,750-90-2 200-130-2,850 |
| ,, | 15 సం॥లకు | 1900-100-2400-150-3,150 |

సవరించి మెమోరాండ మిచ్చిన పిదప, జీతాలు నిర్ణయించటంలోను, అలవెన్సులు ఇచ్చుటలోను పాటించవలసిన సూత్రాలు వివరించటం జరిగింది.

1984 డిశంబరు 31 వరకుగల 568 పాయింట్ల కరువుభత్యం పే తో కలిపివేయాలని, ప్రతి 2 సం॥లకు ఒక వెయిటేజీగాని, సంవత్సర సర్వీసుకు 2 శాతం చొప్పున వెయిటేజీగాని, ఇవ్వాలని కనిష్ఠ గరిష్ఠ వేతనాలకు 60 శాతం ఉండాలని, ప్రతి స్కేలులో 2 ఇంక్రిమెంట్లు ఉండాలని, మొదటి ఇంక్రిమెంటుకు రెండవ ఇంక్రిమెంటు 1½ రెట్లు ఉండాలని తెల్పడం జరిగింది.

మినిమం పే రు. 600 ఇవ్వాలని, స్పెషల్ టీచర్లకు మినిమం స్కేలు ఇవ్వాలని, పార్ట్ టైం టీచర్లకు మినిమం స్కేలులో సగం జీతం ఇవ్వాలని, వేతనాలలో తేడా 8 రెట్లు మించరాదని, అన్ని కేడర్లకు సబ్జక్టుతో నిమిత్తం లేకుండా అదనపు అర్హతలకు అదనపు ఇంక్రిమెంట్లు ఇవ్వాలని వివరించి అన్ని పాయింట్లు నోట్ చేయించడం జరిగింది.

అలాగే హైద్రాబాదులో మన కార్యాలయం నిత్యం ఉపాధ్యాయుల వ్యక్తిగత, జనరల్ సమస్యలపై రాయబారాలు జరుపుతూ వుంది. విజయవాడ, హైద్రాబాదు కార్యాలయాలనుండి అనేక సమస్యలపై ప్రభుత్వానికి, వివిధ మేనేజిమెంట్లకు కరస్పాండెన్సు జరుపుతున్నాం. తరచు హైద్రాబాదులో అధికారులతో రాయబారాలు జరుపుతూ సమస్యల పరిష్కారంతో కృషిచేయుట జరుగుచున్నది. అయితే యిది చాలదు, సమస్యలపై మరింత కృషిచేయాలి.

### కోర్టు చర్యలు

రాయబారాలు, పోరాటాలతోపాటు అవసరమైన సందర్భాలలో కోర్టులద్వారా కూడా ఉపాధ్యాయులకు న్యాయంకల్గించే దానికి కృషి చేయవలసిన పరిస్థితులు ఏర్పడుతున్నాయి. అయితే అదే సమస్తం కాకుండా ఉద్యమ అవగాహనతో అందుకు కృషిచేస్తున్నాం.

1. రిటైరుమెంటు రిట్సు : తెలుగుదేశ ప్రభుత్వం రిటయిరుమెంటు వయసు 58 నుండి 55 కు తగ్గించిన సందర్భంలో రాయబారాలు, ప్రత్యక్ష చర్యలు ప్రభుత్వం పట్టించుకొనకపోతే హైకోర్టులో రిట్సువేసి స్టేలు రప్పించి 3వేల మందికి పైగా కంటిన్యూ చేయించాం. తరువాత 1983 ఫిబ్రవరి 28 తర్వాత 1984 మార్చి 1 లోగా రిటైరైనవారి గురించి సుప్రీంకోర్టు తీర్పు తర్వాత తిరిగి హైకోర్టులో వేశాం. ఈలోగా సుప్రీంకోర్టు జడ్జిమెంటు రావడంతో సర్వీసులో కంటిన్యూ కావడమో, మొత్తం జీతాలు తీసుకొనే పరిస్థితులు కల్పించటమో జరిగింది.

2. విద్యా సం॥రం చివరివరకు రిట్సు : అక్టోబరు తర్వాత రిటైరయ్యే వారు విద్యా సం॥రం చివరివరకు కంటిన్యూ అయ్యే సౌకర్యం తెలుగుదేశ ప్రభుత్వం రద్దుచేసిన కారణంగా, కోర్టులకువెళ్ళి కొందరిని కంటిన్యూ చేసుకోవడం జరిగింది. అయితే తిరిగి ప్రభుత్వం ఇటీవల ఉత్తర్వులు యిచ్చినా అది నిరుపయోగంగా వుంది.

3. బి.ఇ.డి, పండిట్స్ రిట్సు : 1974 పూర్వం గ్రాడ్యుయేట్స్ అయి సర్వీసులో వున్న వారికి, బి.యి.డి, గ్రేడుI స్కేలు గురించి రిట్సు వేశాం. సదరు తీర్పులు చాలాభాగం ప్రభుత్వం అమలు జరపని కారణంగా తిరిగి హైకోర్టుకు వెళ్ళి విషయం పరిశీలించాలి.

4. ఇతరములు : తెలంగాణా నుండి వచ్చిన వారి సర్వీసు గురించి, 12-12-66 కు పూర్వం వారిని కూడా అప్‌గ్రేడు గురించి రిట్సు వేయుట జరిగింది. అలాగే నిల్వవున్న శెలవు అమ్ముకొను సౌకర్యం 31-3-85 పూర్వం వారికి కూడా వర్తింపజేసే విషయం కోర్టుకు వెళ్ళేందుకు సన్నద్ధం అవుతున్నాం.

### శాసనమండలి రంగం

ఉద్యమానికి శాసన మండలి కూడా ఒక వేదిక. దానిని సద్వినియోగం చేసుకొనేదానికి మనవంతు కర్తవ్యం నిర్వహించాం. తూర్పు రాయలసీమనుండి లోగడ శ్రీ మాధవరావుగారిని, తర్వాత మన అధ్యక్షులు శ్రీ రామిరెడ్డిగారిని, గుంటూరులో శ్రీ మాణిక్యారావు గారిని ఉభయ గోదావరి జిల్లాల్లో శ్రీ శివరామరాజుగారిని బలపరచి నెగ్గించాం.

తూర్పు తెలంగాణాలో ఒకసారి శ్రీ లక్ష్మయ్యగారిని మరొకసారి శ్రీ రామయ్యగారిని; కృష్ణాలో శ్రీ వెంకటేశ్వరరావుగారిని బలపరచి ఓటమి చెందాం. ఇప్పుడు శాసనమండలియే రద్దు అయిన కారణంగా ఆ రంగం మూత పడింది.

అయితే అదివున్న కాలంలో దానిని పోరాట వేదికగా ఉపయోగించుకొనేదానికి సమస్యల పరిష్కారంలో ఒక సాధనంగా చేసేదానికి ఎంతో కృషి చేశాం.

### అమరజీవుల వర్ధంతి సభలు

అమరజీవి చెన్నుపాటి వర్ధంతి సభలు ప్రతి సంవత్సరం జరిపి కార్యకర్తలు ఉత్తేజం పొందుతున్నారు. అలాగే మన ఉద్యమ నిర్మాతలలో ఒకరు శ్రీ పి.వి. సుబ్బారాజుగారు 15-12-84 న మరణించారు. వారి అంత్యక్రియలు మన ఆఫీసునుండి నిర్వహించుట జరిగింది. వారి వర్ధంతి సభలు కూడా జరిపాం.

మన ఉద్యమ కార్యకర్త, పతాక గేయ రచయిత శ్రీ కడలి గంగిశెట్టిగారు 18-2-85న మరణించారు. శ్రీ పకీరయ్య, శ్రీ నాగిశెట్టి, శ్రీ రోశయ్యలాంటి అనేకమంది మరణించారు. వారందరికి జోహార్లు అర్పించి సంతాప సభలు నిర్వహించుట జరిగింది.

## హైదరాబాద్‌లో ఇండ్ల ప్లాట్లు

ఉపాధ్యాయులకు ఇండ్లప్లాట్ల గురించి హైదరాబాదులో యునైటెడ్ హౌసింగ్ కాలనీకి సొసైటీ రిజిష్టరు చేయించి 490 ప్లాట్ల వరకు విక్రయించటం జరిగింది. రాజధానిలో తక్కువ ధరకే మన కార్యకర్తలకు అవి లభ్యమైనాయి. ఇటీవల ఎన్నికలు కూడా జరిపి క్రొత్త కమిటీ వచ్చింది.

ఈ ప్లాట్ల ఏర్పాట్లలో, విభజన, రిజిస్ట్రేషన్, తదితర పనులలో ఎంతో సేవచేసినవారు శ్రీ పి. సత్యనారాయణ (ఖమ్మం), శ్రీ వై. యల్. నారాయణ (గుంటూరు) గార్ల కృషి ప్రశంసనీయం.

## ఐక్య ఉపాధ్యాయ ప్రచురణలు

ఐక్య ఉపాధ్యాయ ప్రచురణల పరంగా అధ్యాపక దర్శిని 7 భాగాలు వేశాం. 8వ భాగం కూడా తీసుకవస్తున్నాం. అలాగే 9 వ భాగం కూడా తీసుకరావాలని ప్రయత్నం చేస్తున్నాం.

గత 5 సంవత్సరాలుగా యు టి యఫ్ డైరీలు తీసుకువస్తున్నాము. ఉపాధ్యాయులకు ఉద్యమపరంగా డైరీలు వేయించి అలవాటు చేశాం. అవి ఎంతో విలువైన సమాచారంతో ఉపయోగకరంగా వున్నాయి.

అలాగే బేడ్జీలు, బేగ్సు, పర్సులు, ఫైల్సు కూడా వేయించి అతి తక్కువ ధరలకే ఉపాధ్యాయులకు అందించాం.

అధ్యాపక దర్శిని 1, 2, 4 భాగాలు అయిపోయినయ్ తిరిగి వాటిని పునర్ముద్రించాలి.

## అకడమిక్ సెల్

హైదరాబాదులో యు. టి. యఫ్. భవనంపై హాలు వేయడం పూర్తి అయింది. దానిలో ఒక గది "విద్యా విషయిక విభాగము"నకు కేటాయించుట జరిగింది. దానిని 14-7-85 న విద్యామంత్రి శ్రీ గాలి ముద్దుకృష్ణమనాయుడు ప్రారంభించారు. దానిని తెలుగు అకాడమి డైరెక్టర్ శ్రీ వెంకారెడ్డిగారు, ఎస్. సి. ఆర్. ఇ. టి. డైరెక్టరు శ్రీ రవిగారు, పాఠశాల విద్యా డిప్యూటీ డైరెక్టర్ శ్రీ నరసింహరాజుగారు హాజరయ్యారు. శ్రీ యం. జె. మాణిక్యారావు, కాలేజీ సంఘనాయకులు, తదితరులు హాజరయ్యారు. దాని ఉద్దేశ్యాలు కార్యక్రమం విడిగా ప్రకటించిన బులెటిన్‌లో వివరించాము.

## ఉద్యమ నిర్మాణం

నిర్మాణం ఉద్యమాలకు ఊపిరి, పోరాటాలకు పదును. అది లేని ఉద్యమం ఇసుక గూడు కట్టినట్టె అవుతుంది అందుకే మనం దానికి అత్యంత ప్రాధాన్యత ఇస్తున్నది.

మన ఉద్యమం పెరిగినంతగా నిర్మాణం కూడా పెంచుకోవాలి. సకాలంలో సభ్యత్వాలు, నిర్మాణాలు పూర్తికావాలి. సూత్రబద్ధంగా వ్యవహరించవలసినచోట, ఊగిసలాటలు వుండరాదు. ఆర్థిక సమస్యలకిచ్చినంత ప్రాధాన్యత, విద్యావిషయాలకు ఇవ్వాలి. ప్రజలతో మమేకం కావాలి. ఇవన్నీ జరిగితేనే నిర్మాణం సరిగా వున్నట్లు.

అందుకు నిత్యం కృషిచేస్తూ పురోగమిస్తున్నాం. తప్పటడుగులు సరిజేసుకుంటూ గట్టిగా నిలబడుతున్నాం. అహరహం పని చేస్తూ ఉద్యమాన్ని అందల మెక్కిస్తున్నాం.

జిల్లాల వారిగా మన నిర్మాణ స్వరూపాన్ని ఈ క్రింద వివరిస్తున్నాము.

1. శ్రీకాకుళం : రాజాం సమితినుండి ప్రారంభించి, ఇతర ప్రాంతాలకు విస్తరించింది. స్పెషల్ టీచర్ల సమస్యలపైనను, అక్రమ బదిలీలపైనను పోరాట కార్యక్రమాలు చేపట్టారు. అధ్యక్ష ప్రధాన కార్యదర్శులుగా శ్రీ జె. అప్పారావు నాయుడు శ్రీ పి మహేశ్వరరావు గారలు పనిచేస్తున్నారు.

2. విజయనగరం : ఉద్యమం మరికొన్ని ప్రాంతాలకు విస్తరించింది. అక్రమ బదిలీలపై కోర్టుకు కూడా వెళ్ళి విజయం సాధించారు. సమస్యలపై కృషి చేస్తున్నారు. అధ్యక్ష ప్రధాన కార్యదర్శులుగా శ్రీ జె. అప్పలనాయుడు శ్రీ యం కృష్ణమూర్తి పని చేస్తున్నారు.

3. విశాఖ : ఉద్యమం ఏజన్సీతో సహా మరికొన్ని ప్రాంతాలకు విస్తరించింది సమస్యలపై కృషి చేస్తున్నారు. గత సంవత్సరం ఉద్యమం కొన్ని ఇబ్బందులు ఎదుర్కొన్నా దానిని అధిగమించింది. అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులుగా శ్రీ కే. చిన్నయ్య, శ్రీ కె ఎస్.ఎన్. శాస్త్రిగారలు పనిచేస్తున్నారు.

4. తూర్పుగోదావరి : ఇప్పటికీ సభ్యత్వంలో అగ్రభాగాన నిలుస్తున్న శాఖ, సమస్యలపైనను, బదిలీలపైనను, పోరాట కార్యక్రమం చేపట్టి చాలవరకు సరిచేయించుకున్నారు. కార్యకర్తలకు సర్క్యులరుగా "వాయిస్ ఆఫ్ టీచర్స్" నిర్వహిస్తున్నారు. కాకినాడలో భవనంకై కృషి చేస్తున్నారు. అధ్యక్ష ప్రధాన కార్యదర్శులుగా శ్రీ వి. సూర్యనారాయణరాజు, శ్రీ జి. చిట్టిబాబుగారలు పని చేస్తున్నారు.

5. పశ్చిమగోదావరి : ఇప్పటికి జీవిత చందాలలో మొదటి స్థానం నిలుపుకుంటున్నారు. సమస్యలపై కరస్పాండెన్సు చేస్తున్నారు. తరచు ఏదో ఒక పత్రికద్వారా కార్యకర్తలకు వార్తలు అందజేస్తున్నారు ఏలూరులో బిల్డింగ్‌కై కృషి చేస్తున్నారు. అధ్యక్ష ప్రధాన కార్యదర్శులుగా శ్రీ కె. రాఘవరాజు, శ్రీ యస్. ఆర్. పోలిశెట్టిగారలు పని చేస్తున్నారు.

6. కృష్ణ : మహాసభల నిర్వహణకు ధైర్యంతో ముందుకు వచ్చిన జిల్లా. సమస్యలపై కృషి చేస్తున్నారు. ఉద్యమం మరికొన్ని ప్రాంతాలకు విస్తరించింది. అధ్యక్ష ప్రధాన కార్యదర్శులుగా శ్రీ పి. సోమయ్య, శ్రీ కె. నారాయణరావు గారలు పనిచేస్తున్నారు.

7. గుంటూరు : సభ్యత్వంలో 2 వ స్థానంలో వున్న జిల్లా. ప్రాథమిక సెకండరీ రంగాలలో బలమైన కార్యకర్తలు వున్నారు.

దేనికైనా రిజర్వు ఫోర్సు పరీక్ష పత్రాలు సంఘపరంగా నిర్వహించు చున్నారు. అక్రమ బదిలీలపై పోరాట కార్యక్రమం చేపట్టారు. అధ్యక్ష ప్రధాన కార్యదర్శులుగా శ్రీ టి. అంజిరెడ్డి, శ్రీ వి. విశ్వనాథం గారలు పనిచేస్తున్నారు.

8. ప్రకాశం : సమస్యల పరిష్కారంలో, పోరాట కార్యక్రమాలలో గట్టి విజయాలు సాధించారు. కార్యకర్తల కొరతవున్నా జిల్లా ఆఫీసుకు స్వంత భవనం కొనుక్కొని, చక్కగా నిర్వహిస్తున్నారు. అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులుగా శ్రీ డి. లక్ష్మిరెడ్డి, శ్రీ యం. పానకాలరావుగారలు పనిచేస్తున్నారు.

9. నెల్లూరు : ఉద్యమానికి రెండుసార్లు యం. యల్. సి. ని ఇచ్చి, పోరాటాల ద్వారా సమస్యలు పరిష్కరించుకొంటూ జిల్లా కార్యాలయానికి స్వంత భవనాన్ని కొనుక్కుని కృషి చేస్తున్న జిల్లా. నెల్లూరు కేంద్రంగా 'ఉద్యమం' పత్రిక సర్క్యులరుగా చిత్తూరు, ప్రకాశం జిల్లాలకు కలిపి నడుపుతున్నారు. అధ్యక్ష ప్రధాన కార్యదర్శులుగా శ్రీ సి హెచ్. లక్ష్మినారాయణ, శ్రీ వి. బాలసుబ్రహ్మణ్యం గారలు పనిచేస్తున్నారు.

10. చిత్తూరు : రెండుసార్లు ఉద్యమ అభ్యర్థి, యం. యల్. సి. గా రావడంలో ప్రశంసనీయమైన పాత్ర వహించినజిల్లా. కార్యకర్తల కొరత వుంది. పోరాటాల ద్వారా పురోగమిస్తున్నారు. అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులుగా శ్రీ కె. ఆర్ముగం పిళ్ళె, శ్రీ కె. గురుస్వామి నాయుడు పనిచేస్తున్నారు.

11. కడప : ఉద్యమంలో కొన్ని ఆటుపోట్లు ఎదుర్కొన్నా నిలద్రొక్కుకున్నది. అయితే కార్యకర్తల కొరతమూలంగా ప్రధాన బాధ్యులు కదిలి పనిచేయలేని పరిస్థితులలో వున్నారు. అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులుగా శ్రీ విద్వాన్ శివశ్రీ, శ్రీ డి. రామిరెడ్డిగారలు పనిచేస్తున్నారు.

12. కర్నూలు : నిర్మాణం మెరుగు పడింది. ఉద్యమం విస్తరించింది కార్యకర్తలు కదిలి పని చేస్తున్నారు. అధ్యక్ష ప్రధాన కార్యదర్శులుగా శ్రీ జి. సి. లక్ష్మిరెడ్డి శ్రీ ఎ. చెన్న కేశవరెడ్డిగారలు పని చేస్తున్నారు.

13. అనంతపురం : ఉద్యమం కొన్ని ప్రాంతాలకు పరిమితంగా ఉంది. కార్యకర్తల కొరత వుంది. అక్రమ బదిలీలపై పోరాట కార్యక్రమాలు చేపట్టారు. అధ్యక్ష ప్రధాన కార్యదర్శులుగా శ్రీ కె. వెంకటరాయుడు, శ్రీ కె. కళ్యాయప్ప పని చేస్తున్నారు.

14. ఖమ్మం : అన్ని శాఖలకు నిర్మాణం వుంది. సభ్యత్వం, జనరల్ ఫండు కోటాలు సక్రమంగా చెల్లించే జిల్లా. కార్యకర్తల కొరతలేదు. ఇతర కార్యక్రమాలకు సహకరిస్తారు. పోరాటాల ద్వారా సమస్యల పరిష్కారానికి కృషి చేస్తున్నారు. స్వంత భవనంలో కార్యాలయం చక్కగా నిర్వహించుచున్నారు. అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులుగా శ్రీ జి. లక్ష్మయ్య, కె. కృష్ణయ్యగారలు పని చేస్తున్నారు.

15. వరంగల్ : ఒకటికి రెండుసార్లు ఉద్యమం విచ్ఛిన్నతకు గురైంది. అయినా తట్టుకొని నిలబడింది. పోరాటాలద్వారా సమస్యల పరిష్కారానికి కృషి చేస్తున్నారు. అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులుగా శ్రీ వై. జి. శౌరయ్య, శ్రీ కె భద్రయ్యగారలు పనిచేస్తున్నారు.

16. నల్గొండ : ఉద్యమం ఇతర ప్రాంతాలకు విస్తరించింది. సూర్యాపేటలో శ్రీ పాపిరెడ్డి మరణాన్ని అవకాశంగా తీసుకొని అవకాశవాదులు కొందరు మనపై దాడి చేశారు. ప్రత్యక్ష చర్యలద్వారా సమస్యల పరిష్కారానికి కృషి చేస్తున్నారు. అధ్యక్ష ప్రధాన కార్యదర్శులుగా శ్రీ పి. సత్యనారాయణ, శ్రీ పి. కృష్ణమూర్తిగారలు పని చేస్తున్నారు.

17. మహబూబ్‌నగర్ : ఉద్యమం ఊపునందుకున్నది. కార్యకర్తలకు కొదువలేదు. కేంద్రీకరించి పని చేస్తే జిల్లాలోని అన్ని ప్రాంతాలకు విస్తరించే అవకాశాలు వున్నాయి. ప్రాంతీయ విద్యాగోష్ఠులు ప్రారంభించి ప్రజలలోకి వెళ్ళి ఇతర ప్రజాసంస్థల అభివృద్ధికి కృషి చేసిన జిల్లా. అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులుగా శ్రీ డి. వెంకటరెడ్డి, శ్రీ ఎ. చంద్రమౌళి కృషి చేస్తున్నారు.

18. ఆదిలాబాద్ జిల్లా: ఈజిల్లా ఆ మూలనుండి ఈ మూలకు చాలా విశాలమైనది. ఉద్యమం కొత్తప్రాంతాలకు విస్తరించింది. సమస్యల పరిష్కారానికి కృషిచేస్తున్నారు. అధ్యక్ష ప్రధాన కార్యదర్శులుగా శ్రీ ఆర్. నాగమల్లేశ్వరరావు, శ్రీ యస్. నరసయ్యగారలు పనిచేస్తున్నారు.

19. కరీంనగర్ : ఉద్యమం మరింతగా విస్తరించేదానికి అవకాశాలు అపూర్వం. కార్యకర్తలమధ్య సమన్వయం మెరుగుపడాలి. పత్రికా క్యాంపెయిన్‌లో వ్యక్తిగత బహుమతి వరుసగా మూడుసార్లు వచ్చిన శ్రీ రాజమౌళిగారిది ఈ జిల్లాయే. అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులుగా శ్రీ పి. వెంకటి, శ్రీ టి. శ్రీనివాసరావు గారలు పనిచేస్తున్నారు.

20. నిజామాబాద్ : జిల్లా నిర్మాణం విస్తరించలేదు. మందకొడిగా వుంది. మరింత కృషి అవసరం. కార్యకర్తల కొరత ఎక్కువగా వున్నది. వున్నంతలో ఉద్యమాన్ని నడుపుతున్నారు. అధ్యక్షులుగా శ్రీ కె. సాంబశివరావు, ప్రధాన కార్యదర్శిగా శ్రీ బి. బాలయ్య పని చేస్తున్నారు.

21. హైద్రాబాదు : రాజధానిలో యు. టి. యఫ్. భవనం కార్యాలయం వున్న జిల్లా. ఎయిడెడ్ ఉపాధ్యాయుల సమస్యలు హెచ్చు. నిత్యం పోరాట కార్యక్రమాలే. సమస్యల పరిష్కారానికి కృషి జరుగుతున్నది. అధ్యక్ష ప్రధాన కార్యదర్శులుగా శ్రీ పి దయాకర్, శ్రీ రమణయ్యశాస్త్రి గారలు పనిచేస్తున్నారు.

22. రంగారెడ్డి : హైద్రాబాదు చుట్టూ అవరించివున్న జిల్లా. మన సొసైటీ ఇండ్ల స్థలాలువున్న ప్రాంతం. నిర్మాణంవిస్తరించలేదు. కార్యకర్తల కొరత వుంది. అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులుగా శ్రీ కె. యస్. మూర్తి, శ్రీ యం. మార్క్ గారలు పనిచేస్తున్నారు.

23. మెదక్: జిల్లాలో ఉద్యమం ఒక ప్రాంతంలోనే వుంది. ఒకరిద్దరు తప్ప కార్యకర్తలులేరు. రాష్ట్రసంఘం మరింత కేంద్రీకరించి

కృషిచేయాలి. అధ్యక్ష కార్యదర్శులుగా శ్రీ యం. ఆర్. రెడ్డి, శ్రీ బి. బ్రహ్మయ్యగార్లు పనిచేస్తున్నారు.

ఇది మన నిర్మాణం. యింకా పటిష్టం కావాలి. కేంద్రీకరించి పనిచేయాలి. రాష్ట్రబాధ్యులు తరచు జిల్లాలో పర్యటించాలి. పోరాటాల ద్వారా సమస్యా పరిష్కారానికి పూనుకోవాలి.

## సంఘ ఫంక్షనింగ్

ప్రతినెల సమావేశాలు జరుపుతూ, నిర్ణయాలు తీసుకొని పని చేస్తున్నాం. రాష్ట్రసంఘం, జిల్లాశాఖలు, సమితి, పట్టణశాఖల పని పరిస్థితుల మెరుగుదలకు కృషిచేయడం జరుగుతున్నది.

| | | | | |
|---|---|---|---|---|
| 1984 | అక్టోబరు | 13, 14 | నూతన కౌన్సిల్ | విజయవాడ |
| 1984 | నవంబరు | 12 | సబ్ కమిటీ | హైద్రాబాదు |
| 1984 | డిశంబరు | 15 | కార్యవర్గం | విజయవాడ |
| 1985 | జనవరి | 7 | సబ్ కమిటీ | విజయవాడ |
| 1985 | ఫిబ్రవరి | 9,10 | కార్యవర్గం | హైద్రాబాదు |
| 1985 | మార్చి | 23 | జనరల్ కౌన్సిల్ | విజయవాడ |
| 1985 | ఏప్రిలు | 14 | సబ్ కమిటీ | విజయవాడ |
| 1985 | మే | 16 | కార్యవర్గం | విజయవాడ |
| 1985 | జూన్ | 16 | సబ్ కమిటీ | హైద్రాబాదు |
| 1985 | జూలై | 7 | కార్యవర్గం | హైద్రాబాదు |
| 1985 | ఆగస్టు | 18 | జనరల్ కౌన్సిల్ | హైద్రాబాదు |
| 1985 | సెప్టెంబరు | 8 | సబ్ కమిటీ | విజయవాడ |
| 1985 | అక్టోబరు | 18 | కార్యవర్గం | విజయవాడ |
| 1985 | నవంబరు | 11 | సబ్ కమిటీ | విజయవాడ |
| 1985 | డిశంబరు | | కార్యవర్గం | విజయవాడ |

## యు. టి. యఫ్. వార్తలు

ఎప్పటికప్పుడు ఉద్యమ వార్తలు, సమావేశ నిర్ణయాలు, కోటాలు, ఫలితాలు, పోరాటాలు, విజయాలు, ప్రభుత్వ ఉత్తర్వులు కార్యకర్తలకుఅందించే దానికి యు.టి.యఫ్. వార్తలు ప్రతినెల అంద జేస్తున్నాం. అది సమితి, పట్టణ శాఖల, సబ్ కమిటీల సభ్యుల వరకు ఈ సంవత్సరం నుండి అందించుతున్నాం. అయితే దాని సాధ్యా సాధ్యాలు పరిశీలించాలి.

## కార్యాలయాల నిర్వహణ

విజయవాడ ఆఫీసులో సిబ్బంది కొరత వున్నది. దానిని సరి చేయాలి. అలాగే హైద్రాబాదులో కూడా తగు ఏర్పాట్లు చేయాలి. ఆఫీసులకు కావలసినవన్నీ సమకూర్చుకొన్నాం. శ్రీ డి. రామిరెడ్డి, శ్రీ ఎ. వెంకటస్వామి వాలంటరి రిటైర్‌మెంటు తీసుకొని పూర్తికాలం పని చేస్తున్నారు. శ్రీ యం. వెంకటరత్నం, శ్రీ యం. ఎ. కె. దత్తు శలవులు పెట్టి బాధ్యతలు చూస్తున్నారు. శ్రీ వి. సూర్యనారాయణరాజు (తూర్పుగోదావరి), శ్రీ ఎస్. ఆర్. పోలిశెట్టి (పశ్చిమ గోదావరి), శ్రీ వి. విశ్వనాధం. (గుంటూరు) శ్రీ యం. పానకాలరావు (ప్రకాశం) శలవులు పెట్టి ఆయా జిల్లాల బాధ్యతలు చూస్తున్నారు.

సంఘ కార్యకలాపాలు, కార్యాలయాల నిర్వహణ, సభ్యత్వం తోనే చాలదు. తప్పనిసరిగా జనరల్ ఫండు కూడా వసూలు చేయాలి.

## మనకున్న ఆస్తులు

విజయవాడ, హైద్రాబాదు, అమలాపురం, ఒంగోలు, నెల్లూరు, ఖమ్మం, మధిరలలో స్వంత భవనాలు వున్నాయి. కరీంనగర్, మహబూబ్‌నగర్ జిల్లాలలో స్థలాలు వున్నాయి. గుంటూరు, ఏలూరు కాకినాడలలో భవనాల ఏర్పాటుకు కృషి జరుగుతున్నది.

విజయవాడ ఆఫీసు : ఇనుపబీరువాలు 2, కర్రబీరువాలు 6, ఇనుపర్యాకులు 3, కర్రడ్రాయర్లు 6, ఇనుపడ్రాయరు 1, కర్రకుర్చీలు (చేతులవి) 4, ఇనుపకుర్చీలు (చేతులవి) 2, ఇనుపకుర్చీలు 32, గ్లాసు డ్రాయరు 1, మీటింగు టేబులు 1, స్టూల్సు 5, ఇనుప మంచాలు 8, ఇనుప బకెట్సు 5, జంపఖానాలు 4, టైపుమిషన్లు 2, డూప్లికేటింగు 1, రేడియో 1, టేపురికార్డు 1, గోడగడియారంలు 2, సీలింగు ఫ్యాన్లు 9, ట్యూబులైట్లు 9, తాళంకప్పలు 5, ఫ్లాస్కు 1, స్టీలు నీళ్ళడమ్ము 1, స్టీలు నీళ్ళగ్లాసులు 18, వంటసామాన్లు 20, నీళ్ళడమ్ము 1, మోటారు (1. H. P.) 1, టేపు 1, సైకిల్ (అట్లాసు) 1, గలవు

హైద్రాబాదు ఆఫీసు : ఇనుప టేబుల్స్ 2, ఇనుప కుర్చీలు (చేతులవి) 2, స్టీలుకుర్చీలు 15, ఇనుప మంచాలు 8, రేక్స్ 2, ఫ్యాన్లు 11, రేడియో 1, జంపఖానాలు 5, ఇనుప బీరువాలు 2, డైనింగుటేబిలు 1, టైపుమిషన్లు 2, డూప్లికేటింగు 1, కర్రటేబులు 1, స్టూల్సు 6, టేపు 1, నీళ్ళ మోటారు (1HP) 1, స్టీలునీళ్ళ డమ్ము 1, బజాజ్ స్కూటరు 1, సైకిలు 1, గ్యాస్‌స్టవ్ 1, వంట పాత్రలు గలవు.

## భవిష్యత్ కార్యక్రమం

రీగ్రూపింగ్ 10,15 సం॥రాల స్కేల్సు ఆధారంగా చాలా మెరుగుదల సాధించాం. ఎయిడెడ్ ఉపాధ్యాయుల జీతాలు చెల్లింపు ఒక కార్యక్రమ పద్ధతిలో జరుగుటలేదు. వారికి ఇతర సౌకర్యాలు వర్తించుటలేదు. స్పెషల్ టీచర్ల సమస్యలు పరిష్కరించాల్సి ఉంది. పి ఆర్.సి. రిపోర్టు మనం కోరిన పద్ధతిలో రప్పించుకోవాలి. విద్యా విషయంగా మరెంతో కృషిచేయాలి ప్రజలకు సన్నిహితం కావాలి. యుద్ధ ప్రమాదనివారణకు తక్షణం కృషి చేయాలి.

## ముగింపు

ఉద్యమ కార్యకర్తలారా!

గత 11 సంవత్సరాల సంక్షిప్త నివేదికతోపాటు ఈ 15 మాసాల ఉద్యమ కార్యకలాపాల నివేదిక మీ ముందుంచాం. దీనికి జిల్లా కార్యదర్శులు యిచ్చే నివేదికలు జత చేసుకోవాలి. ఇందులో రాని విషయాలన్నీ జోడించాలి. నిర్మాణాత్మకమైన సూచనలతో దీనికి మెరుగులు దిద్దండి, ఉద్యమ డాక్యుమెంటుగా తీర్చిదిద్దండి. భవిష్యత్ ఉద్యమానికి బాటలు వేయండి.

★

# ఉద్యమవాణిగా, ఉత్సాహోత్తేజాల చైతన్య దీపికగా

# పత్రికా నివేదిక [1-8-81 నుండి 31-12-85 వరకు]




## మైనేని వెంకటరత్నం

ప్రధాన సంపాదకుడు, ఐక్య ఉపాధ్యాయ

అధ్యక్షా ! నూతన కౌన్సిల్ సభ్యులారా !! మహాశయులారా !!!

ఆంధ్రప్రదేశ్ నడిబొడ్డూ, ఉద్యమాల గనిగడ్డా, విద్యా విజ్ఞాన కేంద్రమూ అయిన విజయవాడ పట్టణంలో మన 4వ విద్యా వైజ్ఞానిక మహాసభలు అతి వైభవంగా జరుపుకొంటున్నాం. ఈ సందర్భాన ఐక్య ఉద్యమ రథ సారధులుగా, అనేకానేక పోరాటాలలో రాటుదేలి, అగ్ని పరీక్షల్లో గడితేరి, రాష్ట్రం నలుమూలలనుండివచ్చిన మీ అందరికీ సంపాదక వర్గం పక్షాన ఇవే మా జేజేలు !

అమరజీవి చెన్నుపాటి ఆశయాలబాటలో మనం ఐక్య ఉద్యమ మహాప్రస్థానం సాగిస్తున్నాం. ఆ ప్రయాణంలో గతంలో జరిగిన మూడు మహాసభలు మన ఉద్యమానికి చిర ప్రతిష్ఠనార్జించాయి.

సమైక్య ఉద్యమ రూపకల్పనలో 1974 లో జరిగిన 'రాజమండ్రి మహాసభ' ఓ మైలురాయి ! ప్రత్యామ్నాయ విద్యావిధానాన్ని రూపొందించి దానిని అటు ప్రజలకూ, ఇటు ప్రభుత్వానికీ అందించడంలో 1977 లో జరిగిన 'ఖమ్మం మహాసభ' మరో కలికితురాయి ! ఈశ్వర్‌బాయ్ పటేల్ కమిటీ నివేదికను చర్చించి, వృత్తివిద్యా ప్రాధాన్యతను నొక్కి చెప్పటంలో 1981లో జరిగిన 'భీమవరం మహాసభ' ఇంకో మలుపురాయి !! ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోవటంలోనూ, శాస్త్రీయ దృక్పథంలో విద్యా సమస్యల్ని ఉపాధ్యాయ వర్గం ముందూ, ప్రజల ముందూ ఉంచటంలోనూ ఆ మూడు మహాసభలూ జయప్రదమయ్యాయి.

ఇపుడు జరుగుతున్న ఈ నాల్గవ మహాసభకు కూడా ప్రత్యేక ప్రాధాన్యత ఉన్నది. ఇటీవల కేంద్ర ప్రభుత్వం 'విద్యా రంగానికి ఓ సవాల్' నినాదంతో 'నూతన విద్యా విధానాన్ని' బహిరంగ చర్చలకు విడుదల చేసింది. మనం కూడా దాన్ని ఒక ఛాలెంజీగా తీసుకొని, ప్రజల ప్రయోజనాలకు, దేశాభివృద్ధికి తోడ్పడే సరియైన అవగాహనతో విద్యా రంగంలో ఏ మౌలిక మార్పులు కావాలో స్పష్టమైన సూచనలు చేయాల్సి ఉంది. దానిపై ఆందోళనోద్యమాన్ని నిర్మించాల్సి ఉంది.

అంతేగాక మన రాష్ట్రంలో మండలాల వ్యవస్థ, నూతన పే కమిషన్ సిఫార్సులు, ప్రొవిన్షలైజేషన్ రూల్సు, ఎయిడెడ్ టీచర్ల జీతాలు, సెషనల్ టీచర్ల దీనస్థితి మొదలగు తక్షణ సమస్యలు పరిష్కారం కోసం ఎదురు చూస్తున్నాయి. దానికి తోడు ప్రభుత్వ వాగ్దానాలెన్నో కాగితాల మీదే మిగిలిపోతున్నవి. వాటన్నిటి సాధనకు మనం మరింత సమైక్యత, పోరాటశక్తి ప్రదర్శించాల్సిన ప్రత్యేక తరుణంలో ఈ మహాసభల్ని జరుపుకొంటున్నాం.

రాజ్యాంగంలో 310, 311 క్లాజులపై సుప్రీంకోర్టు తీర్పు, 50 సం॥ల వయసు... 25 సం॥ సర్వీసుకు రిటైర్ చేయాలనే రాష్ట్ర ప్రభుత్వ తలంపు ఉద్యోగ వర్గాల పాలిటి అశనిపాతాలుగా తయారయ్యాయి.

— ఈ విధంగా రాబోయే కాలం పోరాట కాలం !

అవకాశ వాదులెవరో, ఆశయాలకు నిలబడేదెవరో తేల్చేసే కాలం !

శాసనమండలి రద్దయిన సందర్భంలో, ఉద్యమాలు మరింత పటిష్ఠంగా, వేగంగా కదలాల్సిన కాలం !

దీన్నంతటిని సమీక్షించుకొని, తగు నిర్ణయాలు చేసుకొని మనం పురోగమించాల్సి ఉంది. ఆ ఉద్యమోత్సాహానికి, ఆ పోరాట పటిమకు తోడ్పడే విధంగా మన పత్రికనింకా సానబట్టి, ఉద్యమాయుధంగా... ప్రబల ప్రచార సాధనంగా... చైతన్య స్ఫూర్తినిచ్చేదిగా నిగ్గు దేల్చాల్సిన అవసరాన్ని తెల్పుతూ గత నాల్గున్నర సంవత్సరాల నివేదిక సంగ్రహంగా మీ ముందుంచుతున్నాను.

## పత్రిక శీర్షికలు

అటు ఉద్యమ పరంగా, ఇటు విద్యారంగ పరంగా చైతన్య స్ఫూర్తినీ, సామాజిక స్పృహనూ రేకెత్తించి ఉపాధ్యాయులు నిజమైన జాతి నిర్మాతలుగా రూపొందేందుకు మనం దాదాపు 28శీర్షికలు నిర్వహిస్తున్నాం. సందర్భాన్నిబట్టి, అవకాశాన్నిబట్టి 15 శీర్షికలు ప్రతి సంచికలోనూ వచ్చేట్టు చూస్తున్నాం. ప్రతి శీర్షికా ప్రతి సంచికలోనూ రావాలని మన పాఠకుల ఆకాంక్ష. ప్రపంచ ఉపాధ్యాయ వార్తలు, వివిధ రాష్ట్రాల ఉద్యమ వార్తలు, యూనివర్శిటీల ప్రకటనలు, వివిధ కోర్సుల, ఉద్యోగాల ప్రకటనలు, డిపార్టుమెంట్ టెస్టుల ప్రకటనలు, విద్యావిధానంపై పరిశోధనాపరమైన ప్రత్యేక వ్యాసాలు వుంటే బాగుం



టుందని సూచనలు చేస్తున్నారు. మన పత్రిక పరిమితులు, సేకరించే అవకాశాన్నిబట్టి వాటిని మనం పూర్తి చేసుకోవాల్సి వుంది.

మన కార్టూన్లు పత్రికకే హైలైట్ అని, సంపాదకీయాలు సందర్భానుసారంగా రూపొందింపబడుతున్నాయని, 'ప్రశ్నోత్తరాలు' అనుమానాల మంచు తెరల్ని విడగొట్టి చైతన్యపరుస్తున్నాయని, సాహిత్యపరంగా ప్రారంభించిన 'మీరు చదివారా ?', 'ఏ సాహిత్యం ఎందుకు ?' శీర్షికలు సద్గ్రంథ పఠనాభిలాషను పెంపొందిస్తున్నాయని, 'బదిలీలు కావాలా ?' శీర్షిక పలువురికి ఉపయోగించిందని, దాదాపు అన్ని శీర్షికలపైన పాఠకులు సదభిప్రాయాలు వెల్లడిస్తున్నారు.

మన పత్రిక పోషకులు, రచయితలుకూడా మన పాఠకులే మన కార్యకర్తలే! దాదాపు 150 మంది కొత్త రచయితలు మన పత్రికద్వారా పరిచితులై ఈ కాలంలో ప్రోత్సహింపబడ్డారు. ఈ మహాసభలకు వారిలో చాలామంది వచ్చారు. వారందరికి నా అభివందనలు.

## పత్రిక సర్క్యులేషన్

మనం ప్రతి సంవత్సరం పత్రికా వ్యాప్తికి స్పెషల్, జనరల్ క్యాంపెయిన్‌లు సాగిస్తున్నాం. కార్యకర్తలు అపారదీక్షతో నిర్విరామ కృషిచేసిన ఫలితంగా గత మహాసభల నాటికి 11 వేలుగావున్న సర్క్యులేషన్ ఈ మహాసభల నాటికి 13 వేలకు పెరిగింది. అలాగే 2400 వున్న జీవిత చందాలు ఇబ్బడి ముబ్బడై 5,286 కు పైగా చేరుకొన్నవి.

ఈ జీవితచందాల దివ్వె పశ్చిమగోదావరి జిల్లా, విస్సాకోడేరు సమితి వెలిగించింది. వారి నాదర్శంగా ఆ జిల్లాయేగాక, అన్ని జిల్లాలు పోటీలుపడి ప్లాను ప్రకారం వీటిని అతివేగంగా పెంపొందించాయి. ప్రస్తుతం ఉభయ గోదావరి జిల్లాలు ప్రథమ స్థానాన్ని అందుకోటానికి పోటీపడుతున్నాయి. వాటి వివరాలు ప్రత్యేకంగా ఇస్తున్నాం.

నెల్లూరుజిల్లా కోటసమితి, ఇందుకూరుపేట సమితులు, ప్రకాశంజిల్లా వెలిగండ్ల సమితి, కరీంనగర్ జిల్లా పట్టణ సమితి శాఖలు వీటిని పెంపొందించటంలో ప్రత్యేక కృషి చేశాయి. అపార దీక్షతో వీటిని ముందుకు తీసుకుపోతున్న కార్యకర్తలందరికి ఇవే మా జేజేలు!

అయితే ప్రధానమైన జిల్లాలు నూతన భవన నిర్మాణాల్లాంటి కార్యక్రమాల్లో మునిగి తేలుతుండటంవల్ల గత వత్సరం పత్రికా వ్యాప్తి కొంచెం మందగించింది. లేకపోతే ఈ మహాసభల నాటికి మన పత్రిక సర్క్యులేషన్ 15 వేలకు తేలికగా చేరుకొని ఉండేది.

పత్రిక ఉద్యమానికి ప్రాణం. ప్రధాన చోదకశక్తి. చైతన్య ప్రదాత. దాన్ని ఉపేక్షిస్తే ఆ మేరకు నష్టంకూడా జరిగి తీరుతుంది. అందువల్ల ఈ మహాసభలో 'ప్రతి కార్యకర్తకూ ఒక పత్రిక, ప్రతి పాఠశాలకు ఒక పత్రిక' అనే నినాదాన్ని ముందుకుతీసుకుపోవాల్సిన కర్తవ్యం మన ముందున్నది. మన పత్రికను మారుమూలలకు కూడా వ్యాప్తి చేస్తేనే కుటిల నీతిపరుల, అసూయాగ్రస్తుల, అవకాశవాదుల దుష్ప్రచారం ఎక్కడికక్కడ పటాపంచలవుతుంది. ఉద్యమం ముందుకు పోతుంది. అంత కీలకపాత్ర పత్రికకు ఉన్నదిగాన దానికి ఉద్యమించాల్సిందిగా కోరుతున్నాను.

మనం ఆ బలహీనతల్ని అధిగమించితీరాలి. ఈ మహాసభ లిచ్చే ఉత్సాహోత్తేజాలతో జనరల్ క్యాంపెయిన్‌లో ఆ లోటంతా తీరుతుందని ఆశిస్తున్నాను. కార్యకర్తలారా! స్థిరదీక్షతో ముందుకు సాగండి. ఈ నూతనసంవత్సరం మన లక్ష్యం 15 వేలు! ప్రతి కార్యకర్తా పత్రిక చందాదారు కావాలి; కనీసం పది పత్రికలు చేర్పించాలనేది మన నినాదం. ఉద్యమించండి ... పురోగమించండి. ఏ కార్యక్రమమైనా యు. టి. యఫ్. కు తిరుగులేదని నిరూపించండి.

## కార్యాలయ నిర్వహణ

గత మహాసభల పిలుపుతో, అన్ని హంగులూగల నూతన భవనాన్ని మనం నిర్మించుకొన్నాం. 'చెన్నుపాటి భవనం' పేరుతో ఉద్యమ పితామహుని స్మృతి చిహ్నాన్ని ఏర్పరచుకొన్నాం. దానిలోనే పత్రికా కార్యాలయం నడుస్తున్నది.

ఒక టైపిస్టూ, ఇద్దరు ఉద్యోగులూ, ఒక పార్ట్‌టైమర్, ఒక హోల్‌టైమరూ ప్రస్తుతం పనిచేస్తున్నారు. మరో పర్మినెంటు ఉద్యోగి, ఆఫీసు సెక్రటరీ ఉంటే తప్ప కార్యాలయానికి న్యాయం జరగదు. దీన్ని మనం తీవ్ర సమస్యగా భావించి వెంటనే పూరించుకోవాలి.

## సంపాదక వర్గం పని విభజన

ప్రధాన సంపాదకుడు, కార్యదర్శి ఎప్పటికప్పుడు సమన్వయించుకొని అన్ని శీర్షికలకూ న్యాయం జరిగేట్టు బాధ్యతల్ని నిర్వహిస్తున్నారు.

శ్రీ ఎన్. సీతారామచారి అస్వస్థతగా నుండటంతో ప్రశ్నోత్తరాల బాధ్యత అధ్యక్షుడు, ప్రధాన కార్యదర్శి చూస్తున్నారు. శ్రీ జి. లక్ష్మయ్య (ఉపాధ్యక్షుడు) ఇకనుండి ఆ బాధ్యత నిర్వహింపగలరు.

శ్రీ కె. కేశవరెడ్డి ముఖ్యంగా అనువాద వ్యాసాలు చూస్తున్నారు. ప్రత్యేక శీర్షికలు కూడా నిర్వహిస్తున్నారు.

భద్రాచలం సమితి ప్రధాన కార్యదర్శి శ్రీ నాగటి సంపాదక వర్గంలో లేకపోయినా 'మీరు చదివారా !' శీర్షికను గత సంవత్సరంగా నిర్వహిస్తున్నారు. ఇంకా ఎందరో కార్యకర్తలు సందర్భాన్నిబట్టి సహకరిస్తున్నారు. దీన్నిబట్టి సంపాదకవర్గంలో క్రొత్తరక్తాన్ని చేర్చాల్సిన అత్యవసర స్థితి కన్పిస్తున్నది.

గతంలో శ్రీ పి. నాగేశ్వరరావు (గుంటూరు), శ్రీ లోకనాథం (వరంగల్ జిల్లా) మనం ముందుగా ఐడియా పంపితే చక్కని 'కార్టూన్లు' పత్రికకు అందించేవారు. నిర్విరామ కార్యక్రమాల మూలంగా కార్టూన్ల భావాల్ని మన ఆర్టిస్టులకు ముందుగా తెల్పలేని



స్థితిలో వారి సేవల్ని అందుకోవటం వెనకబడింది. అప్పటికప్పుడు నిర్ణయం చేసుకోవటం, అందుబాటులో ఉన్న ఆర్టిస్టులతో కార్టూన్లు వేయించి ప్రచురించటం జరుగుతున్నది.

ఆధునిక కార్టూన్ చిత్రకళ చాలా వేగంగా అభివృద్ధి అవుతున్న దశలో పై కారణంవల్ల ఆ స్థాయినందుకోలేకపోతున్నాము. అందువల్ల కార్టూన్ చిత్రకళలో అభిరుచి ఉన్నవారినీ, అరితేరిన వారినీ ఎక్కడికక్కడ ప్రోత్సహించి ఆ లోటును సరిదిద్దాలని కోరుతున్నాను. వాటిని సందర్భాన్నిబట్టి కవర్‌పేజీ పైనా, వ్యాసాల మధ్యా మనం వినియోగించుకొని పత్రికనింకా ఆకర్షణీయంగా రూపొందించవచ్చు.

## పత్రిక మిస్సింగ్

పత్రికలు నిర్దిష్టంగా పోస్టవుతున్నా, ఇంకా మిస్సవుతూనే వున్నాయి. ప్రతినెలా కొన్ని కార్యాలయానికి తిరిగి వస్తున్నాయి.

అడ్రస్ మార్పుల్ని వెంటనే తెలియజేయకపోవటం దానికి ప్రధాన కారణం.

కొందరు పత్రిక దొంగలుకూడా బయల్దేరారు. ఒకే స్కూలుకు పది పత్రికలు పోతుంటే నెలకొకరిది చొప్పున మిస్సవుతున్నాయని రిపోర్టులు వస్తున్నాయి. ఆ దావు తెలివే దొంగల్ని పట్టిస్తున్నది. దానికి తగు జాగ్రత్తలు తీసుకొనండి.

పత్రిక అందలేదనే కంప్లెయింట్ ఆ నెలలో వస్తే వెంటనే మరొకటి పంపటానికి వీలవుతుంది. కొంతమంది నెలల తరబడి ఆగి పత్రిక అందలేదని వ్రాస్తూ వెనుకటివన్నీ పంపమంటున్నారు. ఆఫీసులో నిల్వలేకపోవటంతో అలా పంపలేక పోతున్నాము.

ఎప్పుడు పత్రిక అందకపోయినా, పోస్టల్‌కంప్లెయింట్ పెట్టి సహకరింపవలసిందిగా ఎన్నోమార్లు ప్రకటించాము. కాని చాలామంది దాన్ని సరిగా పాటించటంలేదు.

## సూచనలు

1. అడ్రస్ మార్పు వెంటనే తెల్పాలి.

2. పత్రిక అందలేదన్న విషయం ఆ నెలలోనే తెల్పితే, మళ్ళీ పత్రిక పంపటానికి వీలవుతుంది.

3. అడ్రసులను పంపేప్పుడు తప్పనిసరిగా పిన్‌కోడ్ వేయాలి.

—పై జాగ్రత్తలు తీసుకొంటే, మిస్సింగ్ చాలా వరకు తగ్గుతుంది.

4. కొందరు ఉద్యమవార్తలు, సందేహాలు, కంప్లెయింట్‌లు కలగాపులగంగా ఒకే కాగితంపైన పంపుతున్నారు. దేనికది విడివిడిగా వ్రాస్తే ఆయా ఫైళ్ళలో చేర్చి సత్వర చర్యలు తీసుకోటానికి వీలవుతుంది.

5. ఉద్యమ వార్తలు, వ్యాసాలు, గేయాలు ఏవి పంపినా కాగితానికి ఒక ప్రక్కనే వ్రాసి పంపాలి.

6. మన పత్రిక నెలనెలా 23 జిల్లాల్ని ప్రతిబింబించాల్సి ఉన్నది అవి 8 పేజీలలో రావాలి. అందువల్ల ఉద్యమ వార్తలు ఏవి వ్రాసినా ప్రధాన సమస్య శీర్షికగా ఉంచి సంగ్రహంగా వ్రాసి పంపాలి. పత్రికలో వచ్చే వార్తల్ని మోడల్‌గా తీసుకొని ఆ విధంగా వ్రాసి పంపాలి.

—ఈ జాగ్రత్తలు తీసుకుంటే ఎడిటింగ్ తేలికవుతుంది. రీరైట్ చేసుకొనే భారం తగ్గుతుంది.

కామ్రేడ్స్,

గత నాల్గున్నర సంవత్సరాల సంగ్రహ నివేదిక మీ ముందుంచాను. దానిని చర్చించి, తగు సూచనలు చేసి పత్రికాభివృద్ధికి తోడ్పడవలసిందిగా కోరుతున్నాను.

## జిల్లావారీ పత్రిక సర్క్యులేషన్ వివరాలు

[ 85 డిశంబరు 31 వరకు ]

| వరుస నెం. | జిల్లా పేరు | సం॥ చందాలు | జీవిత చందాలు | స్కీములు | ఏజెన్సీ | లైబ్రరీ | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|
| 1. | తూర్పుగోదావరి | 653 | 909 | 11 | 79 | 92 | 1,744 |
| 2. | పశ్చిమగోదావరి | 436 | 903 | — | — | — | 1,339 |
| 3. | ప్రకాశం | 653 | 449 | — | 60 | 35 | 1,197 |
| 4. | నెల్లూరు | 574 | 417 | 97 | 16 | — | 1,086 |
| 5. | గుంటూరు | 484 | 359 | 2 | 15 | 50 | 910 |
| 6. | ఖమ్మం | 434 | 447 | 1 | 21 | — | 903 |
| 7. | కృష్ణా | 488 | 185 | 1 | — | 168 | 832 |
| 8. | మహబూబ్‌నగర్ | 256 | 408 | 5 | — | — | 669 |
| 9 | నల్గొండ | 275 | 227 | 3 | 16 | — | 521 |
| 10. | వరంగల్ | 338 | 117 | — | — | 17 | 472 |
| 11. | కరీంనగర్ | 345 | 81 | — | 5 | — | 431 |
| 12. | చిత్తూరు | 279 | 67 | — | — | — | 346 |
| 13. | నిజామాబాద్ | 119 | 112 | — | 88 | 9 | 338 |
| 14. | కర్నూలు | 128 | 57 | — | 7 | — | 246 |
| 15. | హైదరాబాద్ | 127 | 117 | — | — | — | 244 |
| 16. | ఆదిలాబాద్ | 118 | 51 | — | — | — | 232 |
| 17. | అనంతపూర్ | 42 | 166 | — | — | — | 208 |
| 18. | విశాఖపట్నం | 63 | 90 | 1 | — | — | 154 |
| 19. | విజయనగరం | 79 | 31 | 1 | — | — | 111 |
| 20. | శ్రీకాకుళం | 89 | 14 | — | — | — | 103 |
| 21. | కడప | 86 | 7 | — | — | — | 93 |
| 22. | రంగారెడ్డి | 75 | 8 | — | — | — | 83 |
| 23. | మెదక్ | 43 | 4 | — | — | — | 47 |
| 24. | సి. సి. లు | 200 | — | — | — | — | 200 |
| 25. | ఇతరాలు | 500 | — | — | — | — | 500 |
| | మొత్తం | 6,996 | 5,236 | 104 | 307 | 366 | 13,009 |

# పండ్రెండు వసంతాల ప్రగతి - సభ్యత్వ వివరాలు

| క్రమ సంఖ్య | జిలా | 1974 | 75 | 76 | 77 | 78 | 79 | 80 | 81 | 82 | 83 | 84 | 85 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | శ్రీకాకుళం | ... | ... | ... | ... | ... | ... | ... | 11 | 150 | 150 | 225 | 364 |
| 2. | విజయనగరం | ... | ... | ... | ... | ... | 300 | 358 | 445 | 500 | 500 | 500 | 600 |
| 3. | విశాఖ | ... | 111 | 250 | 400 | 500 | 400 | 384 | 605 | 500 | 620 | 500 | 700 |
| 4. | తూర్పు గోదావరి | 3,000 | 3,300 | 3,500 | 4,500 | 4,500 | 5,500 | 6,000 | 6,000 | 6,300 | 6,250 | 7,200 | 7,000 |
| 5. | పశ్చిమ గోదావరి | 1,500 | 2,022 | 2,050 | 2,800 | 3,800 | 3,300 | 4,090 | 5,000 | 5,000 | 5,000 | 5,212 | 5,000 |
| 6. | కృష్ణా | 500 | 900 | 697 | 1,100 | 1,600 | 2,500 | 2,900 | 2,000 | 1,500 | 2,500 | 2,500 | 3,300 |
| 7. | గుంటూరు | 700 | 1,112 | 1,900 | 2,600 | 3,740 | 4,260 | 5,000 | 5,000 | 5,500 | 6,000 | 6,000 | 5,500 |
| 8. | ప్రకాశం | 300 | 800 | 1,330 | 1,700 | 2,650 | 3,000 | 3,504 | 4,508 | 4,000 | 4,500 | 4,000 | 4,500 |
| 9. | నెల్లూరు | 500 | 1,894 | 1.400 | 1,856 | 3,000 | 3,000 | 3,000 | 3 700 | 4,000 | 4,000 | 4 500 | 5,000 |
| 10. | చిత్తూరు | ... | ... | ... | 2,000 | 1,000 | 550 | 310 | 915 | 2,000 | 1,200 | 2,200 | 2,200 |
| 11. | కడప | ... | ... | ... | ... | ... | ... | 100 | 500 | 500 | 400 | 500 | 500 |
| 12. | కర్నూలు | 500 | 500 | 100 | 440 | 500 | 430 | 750 | 1,000 | 1,000 | 920 | 1,300 | 1,000 |
| 13. | అనంతపూర్ | ... | ... | ... | 100 | 200 | 280 | 500 | 650 | 500 | 600 | 500 | 500 |
| 14. | ఖమ్మం | ... | 550 | 900 | 1,100 | 1,500 | 2,000 | 1,932 | 2,004 | 2,200 | 2,025 | 2,087 | 2,350 |
| 15. | వరంగల్ | ... | 100 | 400 | 700 | 1,032 | 1,600 | 1,880 | 923 | 1,300 | 760 | 1,218 | 1,300 |
| 16. | నల్గొండ | ... | 100 | 234 | 400 | 550 | 1,000 | 1,000 | 1,200 | 1,300 | 1,200 | 1,200 | 1,200 |
| 17. | మహబూబ్‌నగర్ | ... | 60 | 25 | 200 | 500 | 700 | 670 | 800 | 1,300 | 1,200 | 1,200 | 1,000 |
| 18. | ఆదిలాబాద్ | ... | ... | ... | ... | 500 | 500 | 653 | 510 | 500 | 600 | 700 | 1,100 |
| 19. | కరీంనగర్ | ... | ... | ... | ... | ... | 500 | 400 | 500 | 1,000 | 700 | 1,200 | 1,000 |
| 20. | నిజాంబాద్ | ... | 54 | 144 | 100 | 63 | 450 | 300 | 305 | 350 | 400 | 500 | 300 |
| 21. | హైదరాబాద్ | ... | 65 | 82 | 84 | 150 | 300 | 300 | 400 | 500 | 600 | 600 | 700 |
| 22. | రంగారెడ్డి | ... | ... | ... | ... | ... | 24 | 35 | 27 | 50 | 56 | 100 | 160 |
| 23. | మెదక్ | ... | ... | .... | 23 | 100 | 55 | 20 | 50 | 50 | 50 | 100 | 100 |
| | మొత్తం | 7,000 | 11,068 | 13,012 | 20,103 | 25,885 | 30,379 | 34,186 | 37,053 | 38,200 | 40,231 | 44,042 | 45,374 |

## ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ సంఘ

### అర్థిక నివేదిక

1-10-84 నుండి 31--12-85 వరకు కౌన్సిల్ కాలం

| జమలు | | ఖర్చులు | |
|---|---|---|---|
| గత నిల్వ | 66-98 | ప్రయాణం | 18,379-47 |
| సభ్యత్వం | 64,137-50 | ప్రింటింగు | 14,334-35 |
| జనరల్ ఫండు | 17,279-40 | కార్యాలయ నిర్వాహణ | 16,964-63 |
| విరాళములు | 1,499-80 | స్టేషనరి | 6,603-85 |
| వడ్డీలు | 955-15 | పోస్టల్ | 4,288-65 |
| అద్దెలు | 685-00 | అలవెన్సులు | 21,744-60 |
| అమ్మకాలు | 405-00 | లైబ్రరిఖాతా | 1,283-76 |
| టెలిఫోను | 230-00 | ఫ్యాప్టో | 1,000-00 |
| డెలిగేటు ఫీజు | 1,378-00 | ఇతరములు | 360-00 |
| అప్పులు | 1,051-00 | బ్యాంక్ ఖాతా | 2,897-15 |
| | | చేతినిల్వ | 336-37 |
| మొత్తం | 87,687-83 | మొత్తం | 87,687-83 |

1-8-81 నుండి 31-12-85 వరకు మహాసభల నుండి మహాసభలు

| | | | |
|---|---|---|---|
| గత చేతినిల్వ | 2-66 | ప్రయాణం | 51,348-52 |
| గత బ్యాంకి నిల్వ | 941-23 | ప్రింటింగు | 34,407-72 |
| సభ్యత్వం | 1,66,928-00 | పోస్టులు | 8,011-00 |
| జనరల్ ఫండు | 28,688-40 | స్టేషనరి | 11,376-35 |
| విరాళములు | 65,532-47 | లైబ్రరి | 3,554-91 |
| వడ్డీలు | 2,109-95 | అలవెన్సులు | 51,244-60 |
| డెలిగేటు ఫీజు | 7,936-75 | ఆఫీసు నిర్వాహణ | 37,963-87 |
| అద్దెలు | 685-00 | ఫ్యాప్టో | 1,600-00 |
| ఇతరములు | 2 457-55 | విరాళములు (జిల్లాకు) | 48,642-00 |
| | | సహాయనిధి | 2,232-50 |
| | | ఇతరములు | 360-00 |
| | | బ్యాంకి నిల్వ | 11,539-93 |
| | | చేతినిల్వ | 336-37 |
| | | అప్పు అడ్వాన్సు | 12,719-24 |
| మొత్తం | 2,75 332-01 | మొత్తం | 2,75,332-01 |

## ఐక్య ఉపాధ్యాయ పత్రిక

### అర్థిక నివేదిక

1-10-84 నుండి 31-12-85 వరకు కౌన్సిల్ కాలం

| జ మ లు | | ఖ ర్చు లు | |
|---|---|---|---|
| గతనిల్వ | 296-40 | ప్రింటింగు | 1,21,429-46 |
| జీ॥చందాలు | 1,69,650-00 | న్యూస్ ప్రింటు | 72,409-40 |
| స॥చందాలు | 1,27,970-00 | స్టేషనరీ | 6,844-40 |
| వ్య.జీ.చందాలు | 1,000-00 | పోష్టల్ | 12,056-65 |
| ఏజన్సీలు | 2,165-00 | లైబ్రరి | 2,654-20 |
| ప్రకటనలు | 1,655-00 | అలవెన్సులు | 29,260-00 |
| వడ్డీలు | 73,667-42 | ప్రయాణములు | 4,552-35 |
| విరాళాలు | 1,878-50 | కా. నిర్వాహణ | 3,008-98 |
| అప్పులు | 10,528-05 | ఇతరములు | 80-00 |
| బ్యాంకు | 3,149-08 | ఫిక్సెడ్ డిపాజిట్లు | 1,36,500-00 |
| | | చేతి నిల్వ | 164-01 |
| మొత్తం | 3,91,959-45 | మొత్తం | 3,91,959-45 |

## ఐక్య ఉపాధ్యాయ అర్థిక నివేదిక

1-8-1981 నుండి 31-12-85 వరకు మహాసభనుండి మహాసభ

| | | | |
|---|---|---|---|
| గత నిల్వ | 149-83 | ప్రింటింగు | 4,95,718-03 |
| జీ॥చందాలు | 3,52,253-00 | స్టేషనరి | 13,270-21 |
| స॥చందాలు | 4,31,180-25 | పోస్టల్ | 37,135-65 |
| వ్య.జీ. చందాలు | 4,000-00 | లైబ్రరి | 6,142-10 |
| ఏజన్సీలు | 98,907-70 | అలవెన్సులు | 73,363-00 |
| విరాళములు | 1,878-50 | ప్రయాణములు | 12,877-20 |
| ప్రకటనలు | 15,082-50 | ఆఫీసు నిర్వహణ | 12,118-64 |
| వడ్డీలు | 1,46,959-17 | ఫిక్సెడ్ డిపాజిట్లు | 6,50,100-00 |
| అప్పులు | 65,042-65 | బహుమతులు | 1,359-00 |
| ఫి॥డిపాజిట్లు | 2,13 600-00 | బ్యాంక్ నిల్వ | 34,273-01 |
| బ్యాంక్ నిల్వ | 7,467-25 | చేతినిల్వ | 164-01 |
| మొత్తం | 13,36,520-85 | మొత్తం | 13,36.520-85 |

జి. లక్ష్మయ్య, టి. కొండాచారి, ఎం.ఎ కె. దత్తు
ఆడిట్ కమిటీ పక్షాన.

ఎ. వెంకటస్వామి
ప్రధాన కార్యదర్శి.

# నూతన విద్యా విధానంపై ప్రభుత్వ ముసాయిదా U. T. F అభిప్రాయాలు

## యు. టి. యఫ్. విద్యా విషయక అధ్యయన శిక్షణా విభాగం వివరాలు



శ్రీ సి. యన్. చారి

10 సం॥ల ప్రగతి సాధించి 11 వ సంవత్సరములో అడుగు పెడుతున్న తరుణంలో యు.టి.యఫ్. ప్రచురణ విభాగానికి తోడు విద్యా విషయక పరిశోధనా విభాగంకూడ ఏర్పాటు చేయాలని సంకల్పించింది. దాని ఉద్దేశాల్ని, కార్యక్రమాల్ని ఈ క్రింది విధంగా వెల్లడించింది.

### విద్యావిషయక విభాగ ప్రారంభ ఉద్దేశ్యాలు

1) ఉపాధ్యాయ సంక్షేమానికి, వృత్తి నైపుణ్యానికి అవినాభావ సంబంధమున్నదని మా సంఘము యోచిస్తున్నది.

2) ఉపాధ్యాయ సమస్యా పరిష్కారానికి నిత్యము పోరాడుతూనే వృత్తి నైపుణ్యాభివృద్ధికి ఈ సంఘము వివిధ కార్యక్రమాన్ని రూపొందిస్తున్నది. విద్యాభివృద్ధికి తన వంతు పాత్ర నిర్వహిస్తున్నది.

3) ఈ విద్యా విషయక విభాగ నిర్మాణం క్రమబద్ధమైన అభివృద్ధి సాధించేందుకు ఉపయోగపడుతున్నది.

4) విద్య సామాజిక మార్పులకు సాధనము. ఆ లక్ష్య సాధనకు అంకితమైన ఉపాధ్యాయుడు మాత్రమే ఈ కర్తవ్యాన్ని నిర్వహింపగలడు.

ఈ సంఘము ఆ చైతన్య స్ఫూర్తి గలిగించడానికి విద్యా విషయక విభాగాన్ని ప్రారంభిస్తున్నది.

### కార్యక్రమం

1) జాతీయ, అంతర్జాతీయ విద్యారంగాలకు సంబంధించిన సమాచారాన్ని సేకరించుట.

2) దేశకాల పరిస్థితులకు అనుకూలముగా విద్యా విధానాన్ని నిర్ణయించడములో దీనిని సంఘానికి సలహామండలిగా ఉపయోగించు కొనుట.

3) పాఠ్యాంశాలలోను, బోధనాంశాలలో వచ్చే మార్పులకు అనుగుణంగా ఉపాధ్యాయులు శిక్షణా తరగతులు నడుపుట.

4) బోధనా కార్యక్రమములో ప్రయోగాత్మకంగా పరిశోధనలకు ఉపయోగించు వివిధ వనరులను (హేండ్ బుక్స్, బులిటెన్లు, పత్రికలు) సమకూర్చుట.

5) విద్యా విధానములో వస్తున్న మార్పులను విశ్లేషించి మూల్యాంకనము గావించుట.

6) విద్యా మహాసభలు, సదస్సులు, గోష్ఠులలో చర్చనీయాంశములకు రూపకల్పనచేయుట, నిర్ణయాల అమలుకు రూపకల్పన చేయుట.

### ప్రారంభ సమావేశం

డి. 10-2-85 హైదరాబాదు ఎ.పి. కళాశాలలో ప్రారంభ సమావేశం జరిగింది. ఈ విషయమై ఆసక్తిగలిగిన విద్యావేత్తలందరిని ఆహ్వానించటం జరిగింది. ఆ సమావేశానికి శ్రీ డి. రామిరెడ్డి అధ్యక్షత వహించారు. శ్రీ ఎ. వెంకటస్వామి సమావేశ లక్ష్యాలను వివరించారు. ఆ సమావేశంలో విద్యాశాఖా మంత్రి శ్రీ బి. ముద్దు, కృష్ణమనాయుడు, తెలుగు అకాడమి డైరెక్టరు శ్రీ టి. వెంకారెడ్డి ఉస్మానియా యూనివర్సిటీ విద్యాశాఖ ప్రొఫెసరు ఈశ్వరరెడ్డి, కళాశాలల అధ్యాపక సంఘ నాయకులు శ్రీ సి. రామయ్య, ఎస్ సి.ఇ.ఆర్.టి ఉపాధ్యాయులు శ్రీ రమణారెడ్డి, ఉస్మానియా యూనివర్సిటీ డాక్యుమెంటేషన్ అధికారి శ్రీ సందీప్, ప్రభుత్వ కళాశాల అధ్యాపక సంఘ నాయకులు శ్రీ బి. సత్యనారాయణ, శ్రీ డి. విజయప్రసాద్, టాక్టా నాయకులు శ్రీ సి.యన్. చారి మరియు అనేక మంది విద్యాభిలాషులు హాజరై ఈ విభాగం పనిచేయుటకు తగు సూచనలు యిచ్చారు.

### కార్యాలయ ప్రారంభం

హైదరాబాదులో యు.టి.యఫ్. భవనముమీద నిర్మించిన రెండవ అంతస్థులో ఈ విభాగానికి ప్రత్యేకంగా ఒక గది కేటాయించడం జరిగింది. దానికి కావలసిన బీరువాలు, గ్రంథాలయం సమకూర్చబడింది. ఈ కార్యాలయాన్ని 14-7-85 న ఆంధ్రప్రదేశ్

శుభాకాంక్షలతో

★ డైరీ కవర్స్, ప్రైజ్‌లిస్ట్ కవర్స్, మనీ పర్సులు, ఐడెంటిటీ కార్డు కవర్స్, రేషన్‌కార్డు కవర్స్, ఎలక్ట్రిసిటీకార్డు కవర్స్, అన్నిరకముల బ్యాగులు.

★ అన్నిరకముల ప్లాస్టిక్ కవర్స్ మరియు బ్యాగ్స్ మీకు కావలసిన క్వాలిటి సైజులలో తయారుచేసి ఇవ్వబడును.

★ వివాహాది శుభకార్యములు మనీ పర్సులమీద, మిగతా వాటిమీద మీకు కావలసిన విధంగా ప్రింట్ చేసి ఇవ్వబడును.



విద్యాశాఖామాత్యులు శ్రీ జి. ముద్దు కృష్ణమనాయుడుగారు ప్రారంభించారు.

హైదరాబాదులోని న్యూసైన్సు కాలేజీ ప్రిన్సిపాల్ శ్రీ. సి. యస్. చారి ఈ విభాగ కన్వీనరుగ బాధ్యతలు స్వీకరించారు.

## తొలి విద్యా గోష్ఠి

14-7-85న హైదరాబాదులోని ఎ.వి. కళాశాలలో విద్యాగోష్ఠి జరిగింది. ఆ సదస్సుకు శ్రీ డి. రామిరెడ్డి అధ్యక్షత వహించారు. శ్రీ ఎ. వెంకటస్వామిగారు సదస్యులకు స్వాగతం తెలిపారు.

## అధ్యక్షోపన్యాస సారాంశం

యు. టి. యఫ్. గత 10 సం॥లుగా ఉపాధ్యాయుల పక్షాన అనేక పోరాటాలు గావించి గణనీయమైన విజయాలు సాధించింది దానితోపాటు ఉపాధ్యాయులు తమవిధులను మరింత సమర్థవంతంగా చేసేందుకు కృషి చేస్తున్నది, అందులో భాగమే అకడమిక్ సెల్ స్థాపన.

మేము ప్రారంభిస్తున్న ఈ విద్యా విషయక విభాగ (అకడిమిక్ సెల్) అభివృద్ధికి మీ అందరి అండదండలు, ప్రోత్సాహం వుండగలదని ఆశిస్తూ అభినందనలు తెలుపుచున్నాను. —అని 'అకడమిక్ సెల్' ఉద్దేశ్యాన్ని, కార్యక్రమాన్ని అధ్యక్షుడు వివరించాడు.

పిదప ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖామాత్యులు శ్రీ జి.ముద్దుకృష్ణమనాయుడు ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. వారి ఉపన్యాసంలో "ఉపాధ్యాయులకు సమస్యలు ఎల్లప్పుడూ ఉంటాయి. ఉపాధ్యాయ సంఘాల నాయకులతో చర్చించి వానిని పరిష్కరిస్తున్నాం. ఉపాధ్యాయులు తమ బాధ్యతలు సక్రమంగా నిర్వర్తించాలి. లేకపోతే దేశం నాశనమవుతుంది. పనిచేసే ఉపాధ్యాయులకు సంఘంలో మంచి గౌరవముంటుంది. వారు తమ విజ్ఞానాన్ని నిరంతరము అభివృద్ధి చేసుకోవాలి" అన్నారు.

తెలుగు అకాడమీ అధ్యక్షులు శ్రీ టి. వెంకారెడ్డిగారు "తరగతిగదిలో బోధనా భాష—మధ్యమము" అను అంశంపై ప్రసంగం చేశారు.

## శ్రీ టి. వెంకారెడ్డిగారి ప్రసంగ సారాంశం

ఉపాధ్యాయ సంఘాలు అకడమిక్ సెల్ స్థాపించడం ముదావహం. ఉపాధ్యాయ సంఘాలు తమ హక్కుల కొరకు ఉపాధ్యాయుల ఆర్థిక పరిస్థితులు మెరుగుకు కృషి చేస్తూనే బాధ్యతలను సక్రమంగా నెరవేర్చాలి. బాధ్యతలకు జీతాలకు ముడి పెట్టరాదు. 'జీతాలు చాలలేదు కాబట్టి దానికి తగినట్లే పనిచేస్తాను.' అనే వాదన సరియైనదికాదు. జపాన్‌లో ఉపాధ్యాయుడు ప్రభుత్వంతో పోట్లాడదలచుకుంటే ఎక్కువ పనిచేస్తాడు. యు.టి.యఫ్. అభ్యుదయ సంస్థ - దాని సభ్యులు సాంఘిక మార్పు కోరేవారు కాబట్టి మరింత బాధ్యతగా కృషి చేయాలి.

తరగతి గదిలో ఏ మాధ్యమంలో విద్యా బోధన జరగాలి. అనేది చాలా రోజులుగా చర్చనీయాంశంగా వున్నది. శిశువు బాహ్య ప్రపంచాన్ని అర్థం చేసుకోటానికి ఉపయోగించేది మాతృభాష. అన్ని స్థాయిలలో విద్యాబోధనకు మాతృభాష ఎక్కువ ఉపయోగకరమని స్థిరపడిన సత్యం. అయితే ప్రామాణిక, పారిభాషిక పదాలను రూపొందించడం పెద్ద సమస్యగా ఉంది. అనేక సంవత్సరాలు ఆంగ్లంలో బోధించిన ఉపాధ్యాయుణ్ణి తెలుగులో బోధించమంటే చాలా ఇబ్బంది పడుతున్నాడు. ఎందుకంటే దానికి తయారుకావాలి. తెలుగు పదాలు నేర్చుకోవాలి. అందుచే వీలైనంత వరకు పారిభాషిక పదాలు ఇంగ్లిషలోనే వాడడానికి ప్రయత్నిస్తారు.

సంస్కృత పదాలలో నుడికారం ఉంటేనేగాని సరియైన తెలుగు కాదనేవారుకూడ వున్నారు. 'వేవ్‌లెంక్త్' అనే ఆంగ్ల పదానికి 'తరంగ దైర్ఘ్యము' బాగుందని కొందరంటారు. 'అల పొడవు' అని వాడుక భాషలో చెబితే సులభంగా ఉంటుంది. అయినా అలా చెప్పడానికి ఉపాధ్యాయులు ఇష్టపడరు. యాంగిల్ అనే ఆంగ్ల పదానికి 'కోణము' అనే దానికి బదులు ప్రజలు మాట్లాడే 'మూల' అంటే వచ్చే యిబ్బంది ఏమిటి ?

ఏది ప్రామాణిక భాష ? పుస్తకాలలో వ్రాసేదా ? రేడియోలలో వచ్చేదా ? ప్రజలు మాట్లాడేదే ప్రామాణిక భాష అవుతుంది. బోధనకు ఆ భాషనే ఉపయోగించాలి. మాట్లాడే భాష సజీవంగా వుంటుంది. జీవభాషను మాధ్యమంగా ఉపయోగించాలి. ఏ భాషనూ పలానా విధంగానే వుండాలి అని శాసించడానికి వీలులేదు. అదొక ప్రవాహం. పరిశీలించి నియమాలను ఏర్పరచుకోవచ్చు. శాస్త్రీయంగా పరిశోధించి ఆధునిక యుగానికి మరింతగా ఉపయోగపడడానికి కృషి చేయాలి.

తెలుగు భాషను ఆధునీకీకరించి, సుసంపన్నం చేసి అన్ని రంగాలలోను మాధ్యమంగా తీర్చి దిద్దాల్సిన అవసరం ఎంతైనాఉంది. వాడుక భాషను పూర్తిగా అన్ని రంగాలలో ప్రవేశపెట్టినప్పుడే ప్రజలందరూ పాల్గొనడానికి అవకాశముంటుంది. అప్పుడే భాష దానితోబాటు వివిధ ప్రక్రియలు అభివృద్ధి చెందుతాయి.

ఆంగ్ల భాషలోనే బోధన జరగాలనేవారు కొందరున్నారు. తెలుగులో బోధిస్తే కొందరికి 20 మార్కులు, కొందరికి 80 మార్కులు రావచ్చు. అందరికీ సమానమైన భారం మోపి, అందర్ని 30 మార్కుల స్థాయికి తగ్గించడానికే ఈ మాధ్యమం ఉపయోగపడుతుంది.

## పారిభాషిక పదాల తయారీకి
## తెలుగు అకాడమీ కృషి

తెలుగు అకాడమీ 28 శాస్త్రాలలో గ్రంథ ప్రచురణ చేస్తున్నది. 1968లో ఇది స్థాపించబడింది. మొదట లిప్యంతరణ చేసిన పరిభాషనే విస్తృతంగా వాడడం జరిగింది. యస్. సి. ఇ. ఆర్. టి. వారు కూడా 25% మాటలకు మించి తెలుగు మాటలు వాడరాదని, సాధ్యమైనంతవరకు తమ పరిభాషనే వాడాలని సూచించారు. కాని దానిని మన రాష్ట్రంలో అమలు జరపలేదు. వారు భిన్నత్వంలో ఏకత్వం సాధించే పదాలు వాడడం వల్ల సంస్కృత పదాల సంఖ్య పెరిగింది.

సహజ పరిణామంలో శాస్త్ర పరిభాష రావాలి. అందుకు జాతి

మొత్తం అక్షరాస్యమై, పారిశ్రామికంగా అభివృద్ధి కావలసియున్నది. వివిధ శాస్త్రాలలో వాడిన పరిభాషలోని లోటు పాట్లను పరిశీలించి సమన్వయించి, మెరుగు పరిచే ప్రయత్నాలు జరుగుతున్నాయి. మీ అకడమిక్ సెల్ వారు కూడా ప్రామాణిక పారిభాషిక పదాలు రూపొందించుటకు కృషి చేస్తారని ఆశిస్తాను.

పిదప యస్. సి. ఇ. ఆర్. టి. డైరెక్టరు శ్రీ వై. రవిగారు 'పాఠ్యాంశాలు - పునఃపరిశీలన - ఉపాధ్యాయ శిక్షణ' అను అంశంపై ప్రసగించారు. "కొఠారి కమిషన్" నివేదిక ఆధారంగా 1979-80 లో ప్రణాళికను మార్చాము. 84-85 సంవత్సరం, నాటికి 10 వ తరగతిలో ఆ మార్పు ప్రవేశ పెట్టబడింది. దీనిలో ప్రధాన విషయం 1, 2 తరగతులలో విద్యార్థిపై బరువు తగ్గించాలనేదీని ఉద్దేశ్యం. అందుకే వాచకం, గణితం, పరిసర విజ్ఞానందాలని అనుకున్నాం. హోంవర్కు వ్రాతపని తగ్గాలి. కాని ఉపాధ్యాయుల దృక్పథంలో మార్పు రానందున నేటికి 1, 2 తరగతుల విద్యార్థులు బండెడు పుస్తకాలు మోస్తున్నారు. అందుచే సిలబసులో వచ్చే మార్పులను ఉపాధ్యాయులు అవగాహన చేసుకొని దాని కనుగుణంగా తయారు కావాలి. సిలబసును మార్చేటప్పుడు అనేక దశలలో ఉపాధ్యాయుల సహకారం తీసి కొంటున్నాము అని అన్నారు.

అటు పిమ్మట పాఠశాల విద్యా డిప్యూటీ డైరెక్టరు కె. నరసింహరాజుగారు "7వ పంచవర్ష ప్రణాళిక-పాఠశాల విద్య" అను అంశంపై ప్రసంగించారు. 7 వ ప్రణాళిక యింకా తుదిరూపం ఈయబడనందున దానిలోని అంకెలు చెప్పడం సాధ్యం కాదని, అయినా 7 వ ప్రణాళికలో పాఠశాలలులేని అన్ని గ్రామాలలో పాఠశాలలు ప్రారంభించేందుకు కృషి చేస్తున్నామని, రాబోయే సమాజాన్ని దృష్టిలో నుంచుకొని ఉపాధ్యాయులు బోధనా విధానంలో మార్పులు తేవాలని చెప్పారు.

మాజీ శాసన మండలి సభ్యుడు, ఫాక్టా ఛైర్మన్ శ్రీ యం.జె. మాణిక్యాలరావుగారు 'విద్యాబిల్లు - ఎయిడెడ్ ఉపాధ్యాయుల సమస్యలు' అను అంశంపై సుదీర్ఘంగా ప్రసంగించారు. ఏ బిల్లూ లేనిదానికంటే ఏదో ఒక బిల్లు ఉండడం మేలని భావిస్తున్నాను. 1975 ఆర్డినెన్స్ లోని కొన్ని సుగుణాలు, ప్రస్తుత విద్యాబిల్లులో కొరవడ్డాయి. అయినా బిల్లులో వున్న అధికారాలను గూడ అనేక మంది అధికార్లు గుర్తించకుండా, ఎయిడెడ్ మేనేజర్ల మీద తమకేమీ అధికారాలు లేవని దాట వేస్తుంటారు. అది సరికాదు. మేనేజరు ఉపాధ్యాయుణ్ణి అక్రమంగా తొలగించినా లేదా ఏదైనా నిబంధనలకు వ్యతిరేకంగా చర్య తీసికొని గ్రాంటు ఆపడానికి, కరస్పాండెంటును సస్పెండు చేయడానికి లేదా తొలగించడానికి, రికగ్నిషన్ రద్దు చేయడానికి అధికారాలున్నాయి. వాటిని అధికార్లు తెలిసికొని ఉపాధ్యాయులకు రక్షణ కల్పించాలి. అలాగే మైనారిటీలు అంటే ఎవరు? వారికున్న అధికారాలేమిటి? అను విషయంలో బిల్లులో వున్న అస్పష్టత తొలగించాలి అని చెప్పారు.

చివరగా శ్రీకాకుళం జిల్లా విద్యాశాఖాధికారి శ్రీ సంజీవరావు గారు ప్రసంగిస్తూ ఉపాధ్యాయుల దృక్పథంలో మార్పురావాలని నిరంతర అధ్యయనం కొనసాగించాలని, సోషలిస్టు మానవుణ్ణి తయారు చేసే లక్ష్యంవుండాలని, వీరేశలింగం వంటివారు మనకు ఆదర్శంగా వుండాలని, "లివ్ అండ్ లెట్ లివ్" అనే దానికంటే "జీవించు-ఇతరులు జీవించడానికి తోడ్పడు" అనే నినాదం ప్రచారం గావాలని, యు టి.యఫ్. నెలకొల్పిన ఎకడమిక్ సెల్ పురోగమించాలని ఉద్బోధించారు.

సదస్సుకు ఉపాధ్యాయులు, విద్యావేత్తలు, వివిధ ఉపాధ్యాయ సంఘనాయకులు, ఇతరులు పెద్ద సంఖ్యలో హాజరయినారు. ★



సారాంశం

1.1 విద్యావిధానాన్ని రూపొందించడానికి సంబంధించిన కొన్ని వాస్తవాలను, దృక్పథాలను, చర్చనీయాంశాలను గురించిన చర్చ జరగటానికి వీలుగా కేంద్ర విద్యా మంత్రిత్వశాఖ 'విద్యా విధాన సమస్యలు: విధాన నిరూపణ' అనే శీర్షికతో రూపొందించి పదిమంది అభిప్రాయ సేకరణకోసం పంపించిన పత్రానికిది సారాంశం.

1.2 విద్య అనేది విపులపరిధిలో విస్తృతాంశాలతో ముడిపడిన సంక్లిష్ట విషయం కాబట్టి దానికొక నూతన విధానాన్ని రూపొందించే టప్పుడు రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలలో విద్యావిషయాలను నిర్ణయించే వాళ్ళు, అభిజ్ఞులైన పార్లమెంటు సభ్యులు, విద్యావేత్తలు, మేధావులు, ఉపాధ్యాయులు, తల్లిదండ్రులు, విద్యార్థులు, విద్యా సంస్థల నిర్వాహకులు మొదలైనవాళ్ళను సంప్రదించకుండా నిశ్చితమైన అభిప్రాయాలతో దానికి ఒక తుదిరూపం ఇవ్వటం అసాధ్యం. ఆలోచనలను దృక్పథాలను సూటిగా ప్రతిపాదించి ఒక చర్చను ప్రేరణ చేయడం ఈ పత్రం ఉద్దేశం. ప్రజలు దీనిని చదివి విశ్లేషిస్తే, వ్యాఖ్యానిస్తే, విమర్శిస్తే ఈ పత్రం రూపొందడంలోని ఉద్దేశం నెరవేరుతుంది.

1.3 ఈ పత్రాన్ని సిద్ధం చేస్తున్న సమయానికి భారతదేశం ఇరవయ్యోశతాబ్ది నుంచి ఇరవై ఒకటిలో అడుగుపెడుతున్న సంగతి దృష్టిలో పెట్టుకోవాలి.

ఇప్పుడు పుట్టినవాళ్ళు ఈ శతాబ్ది పూర్తికావచ్చేసరికి తమ ప్రాథమిక విద్యను పూర్తి చేసుకుంటారు. అప్పటికి వాళ్ళు అంతకు పూర్వం వాళ్ళు ఎదుర్కొని సరికొత్త సవాళ్ళను ఎదుర్కొంటారు. అపూర్వమైన అవకాశాలను చవిచూస్తారు. వీటికి వాళ్ళను సంసిద్ధులను చేయటానికి శాంతియుతంగా, సామరస్యపూరితంగా అభివృద్ధి సాధించటానికి కావలసిన వాతావరణాన్ని కల్పించటానికి విద్యావ్యవస్థలో మార్పులు తేవడం అవసరం.

ప్రజలకు జ్ఞానం కలగజేసేది విద్య. వాళ్ళకు ప్రయోజన దృష్టి కలిగించేది విద్య. ఇంతే కాకుండా ఇంతకన్నా ఉన్నతమైన ఇంతకన్నా సంపూర్ణమైన, ప్రయోజనాత్మకమైన జీవితాన్ని వాళ్ళు అనుభవంలోకి తెచ్చుకునేందుకు అవసరమైన వనరులను ప్రజలకు సమకూర్చగల చైతన్యవంతమైన, స్పందనశీలమైన, సుసంఘటితమైన దేశీయ పునర్నిర్మాణానికి ఆవశ్యకమైన మనస్థైర్యాన్ని ఇవ్వగలిగేది విద్య ఒక్కటే.

1.4 వ్యక్తి విశిష్టతను, జాతి సమైక్యాన్ని, సమగ్రతను పరిరక్షించే న్యాయమైన సౌహార్దంతో కూడిన సమాజ నిర్మాణం భారత రాజ్యాంగ పరమాశయం. ఆర్థికశక్తి, ప్రజాశక్తి కోట్లాది ప్రజల స్వాతంత్ర్యపరిధినీ స్వభావాన్నీ నిర్ణయిస్తే, ప్రజలకు స్వాతంత్ర్యంవల్ల ఒనగూరిన ప్రయోజనం ఉత్పత్తి పెరుగుదలమీదా ఆమీదట వస్తు, సేవల న్యాయమైన పంపిణీమీదా ఆధారపడి ఉంటుందని భారతీయ ప్రణాళిక కర్తల ఏకాభిప్రాయం. ఇది ఉద్యోగావకాశాల విస్తరణ, విభజన, బహుముఖ వ్యాపనాలవల్ల మాత్రమే సాధ్యం కాగలుగుతుంది. జ్ఞాన సముపార్జనంలోను, నైపుణ్యాలు అలవరచుకోవడంలోను సమానావకాశాలుండాలనేది ఇందులోని పరమార్థం.

1.5 భారత రాజ్యాంగ వ్యవస్థ అభివృద్ధి కృషికిగాను వ్యక్తిని సాధన మాత్రంగా చేయకుండా అతని శ్రేయస్సునే తన లక్ష్యంగా ఎంచుకున్నది. ప్రజాస్వామ్య విలువలకు, సమగ్ర జాతీయతకు నిబద్ధులై ఉండే ఆత్మ విశ్వాసపూరితులైన వ్యక్తులను రూపొందించటంలో విద్యకుండే ప్రాముఖ్యాన్ని గట్టిగా ప్రతిపాదిస్తున్నది.

1.6 విద్య ప్రజలమధ్య ఉండే అంతరాలనూ సాంఘిక - ఆర్థిక వర్గాలమధ్య, వివిధ ప్రాంతాలమధ్య ఉండే వ్యత్యాసాలనూ తగ్గించి విచ్ఛిన్నకర తీవ్ర ధోరణులను అరికట్టటానికి తోడ్పడగలదు. మానవ శక్తి యుక్తులను వృద్ధి పొందించగలదు. తద్వారా ఇతర రంగాలలోని వనరులన్నిటివల్లా ఎన్నోరెట్లు ప్రయోజనాన్ని సాధించటానికి విద్య బాగా తోడ్పడుతుంది. ఈ విధంగా అభివృద్ధి సాధన కృషిలో విద్య ముఖ్యమైన మూలధనం.

1.7 విద్యార్జన దశలన్నింటిలో అతికీలకమైన దశ ప్రాథమిక విద్యాదశ. ఈ దశలోనే సరిఅయిన వ్యక్తిత్వం రూపుదిద్దుకోవాటానికి అనువైన దృక్పథాలు ఏర్పరచుకోవటానికి, ఆత్మస్థైర్యం సమకూరటానికి, మంచి ప్రవర్తన అలవడటానికి విషయగ్రహణ నైపుణ్యం, భావప్రసారణ కౌశలం పెంపొందటానికి సరైన పునాది ఏర్పడటం జరుగుతుంది. సార్వజనీక ప్రాథమిక విద్య ప్రజలు ప్రజాస్వామిక విలువలకు కట్టుబడి వుండటాన్ని మరింత దృఢతరం చేయగలదు. అందువల్లనే రాజ్యాంగం 45 వ పరిచ్ఛేదంలో దీన్ని పొందుపరచటం జరిగింది.

1.8 ఆర్థికాభివృద్ధికి కావలసిన అంగబలాన్ని చేకూర్చటంలో వృత్తివిద్యాబోధన తప్పనిసరిగా అవసరం. ఉత్పాదన కృషికి, ఉద్యోగావకాశాలకు, విద్యారంగ వినిమయ ప్రక్రియలకు ఇది పరస్పర సంబంధం నిర్దేశిస్తుంది.

1.9 భవిష్యత్తును రూపొందించుకోవటంలో సహకరించే భావాలను, వ్యక్తులను ఉన్నత విద్యారంగం సమకూర్చగలదు. ఇతర విద్యా దశలకు, వివిధ స్థాయిలకు వున్నత విద్యారంగం పరిపోషకం కాగలదు. నాగరికతావసరాలకు అనుగుణ్యమైన ఆదర్శమయ దృక్పథాన్ని ఉన్నత విద్యారంగం కలిగిస్తుంది. వీటికి తోడు అత్యంతాధునికమైన పద్ధతులలో ఇతోధికంగా సుశిక్షితమైన అంగబలాన్ని పరిశ్రమల రంగానికి, వ్యవసాయరంగానికి, సేవారంగానికి, పరిపాలనా రంగానికి అది అందించగలదు.

1.10 సమాజంలోని లోపాలన్నిటినీ విద్యా వ్యవస్థ తొలగించలేదు. సంఘంలోని ఒక ఉప-వ్యవస్థగా సంఘం మొత్తంలో పర్యాప్తంగా వున్న ప్రధాన లక్షణాలు దానికి సంక్రమిస్తాయి. తనంత తానుగా మహత్వపూర్ణంగాగాని, ప్రజాస్వామిక లక్షణ సహితంగాగాని అది మనజాలదు. అటువంటి మహత్ప్రయత్నాలతో దాన్ని తీర్చిదిద్దాలని గొప్ప సంకల్పంతో మాత్రమే అది సాధ్య పడగలదు.

1.11 జాతీయాభివృద్ధికి బాధ్యత వహించవలసిన వాళ్ళు విద్యారంగపు పరిమాణాత్మక గుణాత్మకధ్యేయాలను ప్రకటించినప్పుడు మాత్రమే విద్యాప్రణాళిక రచనకు సాంఘిక సంబంధిత సిద్ధించగలదు. అంతేకాక జాతి భావితరాలవారి పరిపూర్ణ సౌభాగ్యాన్ని ఆకాంక్షించినప్పుడు మాత్రమే, వర్తమాన కాలంలోని తాత్కాలికమైన చౌకబారు ప్రచార ధోరణులకు తలవొగ్గనప్పుడు మాత్రమే, ఆ విద్యా ప్రణాళిక రచనకు క్రియాసిద్ధి, చైతన్యం చేకూరుతుంది.

1. 12 విద్యా లక్ష్యాలను, ఆశయాలను తరచు వాయిదా వేయడానికి వాటిని ప్రవేశపెట్టే విషయంలో వెనుకంజ వేయడానికి ముఖ్యకారణం, అవి అమితమైన ఖర్చువల్ల గాని సాధ్యం కావనే నిస్పృహాయ దృక్పథమే. కాని ఏ మార్పు లేకుండా ఉండిపోవడం 'తప్పద'ను కునేవాళ్ళు అందువల్ల సంఘానికి కలిగే నష్టాన్ని గూర్చి ఆలోచించరేమి ?

మన పాఠశాలలు, కళాశాలలు, విశ్వవిద్యాలయాలనుంచి తయారయిన ఉత్తమశ్రేణి విద్యావంతులు ప్రపంచంలో ఇతరత్రా ఉన్న ఉత్తమ విద్వాంసులకు, సాంకేతిక విద్యానిపుణులకు, వైద్యులకు పరిపాలనా నిర్వాహకులకు సరిసమానులుగా ఉండవచ్చు అయితే వీళ్ళ సంఖ్య చాలతక్కువే అనిచెప్పాలి. ఇందుకుభిన్నంగా అత్యధికసంఖ్యాకులు స్వయంకృషి, ప్రజ్ఞ ఏ కొంచెంకూడా లేనివాళ్ళు, భావప్రసరణ నైపుణ్యం ఏ మాత్రం కనబరచ లేనివాళ్ళు. సాంఘిక బాధ్యతను కాని, జాతీయ కర్తవ్య నిర్వహణ బాధ్యతను కాని ఏ కొంచెం కూడా వహించలేనివాళ్ళు. ఇంతేకాదు, తెలివితేటలున్న వాళ్ళు కూడా సాంఘికబాధ్యతల విషయంలో లోకం తమనుంచి ఆశించే తమవంతు కర్తవ్యాన్ని నెరవేర్చడానికి కూడా ఏ మాత్రం సంసిద్ధులు కానివాళ్ళే.

1.13 ఈ పరిస్థితులీవిధంగా తయారుకావడానికి ప్రధాన కారణం డిగ్రీలకు అత్యంత ప్రాధాన్యత ఇవ్వడమే. దీనికి తోడు పరీక్షల నిర్వహణ పద్ధతులలో వాటి ద్వారా ప్రకటించే ఫలితాలలో చోటు చేసుకున్న పెద్ద లోపంకూడా ఉంది. ఏడాదికోసారి ఈ పరీక్షలు జరుగుతాయి. వల్లెవేసి గుర్తుపెట్టుకున్న చదువునే ప్రధానంగా విలువకట్టేవి ఈ పరీక్షలు. ఇవి విద్యార్థుల తరతమ ప్రతిభను నిర్ణయించడానికి తగినవికావు. ఇవి విలువనెప్పుడో పోగొట్టుకున్నాయి. వాటికిప్పుడు విశ్వసనీయత కొరవడింది. లోకమూ, ఉద్యోగాలిచ్చే యజమానులూ కూడా వీటిని నమ్మటంలేదు. విద్యార్థుల దృష్టిలో విద్యార్జన అంటే పరీక్షలలో నెగ్గటమే. తత్ఫలితంగా విద్యావిధానం నిరుపయోకరమైపోయింది. కేవలం ఉద్యోగార్హతలేని అసంఖ్యాకులను సృష్టిస్తున్నది. కాలక్రమాన పడిపోతున్న విలువలను ఆపలేకుండా ఉపాధ్యాయులూ, విద్యార్థులూ వూరుకోవడానికి ఈ పరీక్షా విధానమే ఒక కారణంగా కనబడుతున్నది. విద్యావ్యవస్థకు కొత్త రూపురేఖలిచ్చి ఇప్పటికీ అవాంఛనీయమయిన పరిణామాలను అరికట్టకపోతే దోపిడీ విధానాన్ని, భద్రతారాహిత్యాన్ని, దౌర్జన్యాన్ని అదుపుచేయడం అసాధ్యం కావచ్చు. ఇంతేకాక కుల, మత, ప్రాంతీయాభిమానాలను నిరోధించకపోతే జాతీయ సమైక్యానికే ఇవి భంగకారకులుగా పరిణమించే ప్రమాదం వుంది. జాతీయతాభావాన్నీ, జాతిగౌరవంతో తాదాత్మ్యాన్నీ పునర్నిర్మించుకోవాలి.

1.14 ఉత్పాదనలో ఆధునికపద్ధతులు నెలకొల్పడానికి, సేవలను ఆధునికం చేయడానికి, ప్రాతిపదిక సాధన సామాగ్రిని కూర్చుకోవడంలో ఆధునికమైన మెళుకువలు అవలంబించడానికి, విద్యా వ్యవస్థను ఆధునీకరించవలసిన అగత్యం ఎంతైనా వుంది. ఇంతే కాకుండా యువతలో కొత్త కొత్త బాధ్యతలు స్వీకరించడంలో ఉత్సాహ దీక్షా దక్షతలు ప్రోదిచేయగలిగేందుకు, విద్యార్థుల కొత్త కొత్త సవాళ్ళను, గడ్డు పరిస్థితులను, అనూహ్య అపరిచిత సన్నివేశాలను ఎదుర్కొగలిగేందుకు దోహదం చేయవలసి వుంటుంది. ఇటువంటి పరిస్థితులలో నిలదొక్కుకుని నిలిచే విధంగా ఉపాధ్యాయులు వాళ్ళను తయారు చేయడానికి పాఠ్య ప్రణాళికలోను, బోధనా విధానాలలోను మార్పులు తేవడమేకాక ఉపాధ్యాయుల దృక్పథాలు, విలువలు కూడ మార్పు చెందవలసి వుంది. ఉపాధ్యాయ శిక్షణ పద్ధతులలోనే మౌలికమయిన మార్పులు చేసి వారిలో మార్పు కలిగించవలసి వుంటుంది.

2.1 స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఎన్నోరకాల సంస్థలు వివిధ పరిధులలో గణనీయంగా అభివృద్ధి సాధించాయి. విద్యార్థుల సంఖ్యకూడా గణనీయంగా పెరిగింది. విద్య అత్యంతాధునికతనూ, వైవిధ్యాన్నీ సంతరించుకొన్నది. అయితే దేశ వ్యాప్తంగా జాతీయావసరాలు, ఆశయాలు, అభిలాషలు సాధించడానికి ఈ విద్యా ప్రగతి ఎంతమాత్రమూ అక్కరకు రావటంలేదు. దేశంలోని వివిధ ప్రాంతాలలో సమానమయిన అభివృద్ధినిగాని, గుణాత్మకతనుగాని విద్యారంగం సాధించలేదు. అక్షరాస్యత విషయంలో భారతదేశం ఇంకా ప్రపంచంలోని అనేక వెనుకబడిన దేశాల కోవలోనే వుంది. 1981 వ సంవత్సరం లెక్కలనుబట్టి జనాభాలో కేవలం 36.2 శాతం మాత్రమే చదవనూ, వ్రాయనూ నేర్చినవాళ్ళున్నారు. ఈ జనాభాలో మహిళల అక్షరాస్యత శాతం 24.9 మాత్రమే. షెడ్యూల్డ్ కులాలు, షెడ్యూల్డ్ జాతులవారిలో ఈ సంఖ్య కేవలం 21.4 శాతం, 16.4 శాతానికి మాత్రమే చేరుకుంది.

2.2 ప్రాథమిక విద్యను నూటికి నూరుశాతం దేశంలోని ప్రజలందరికి నేర్పాలనే ఆశయాన్ని, దానిని 1960 కల్లా సాధించాలనే రాజ్యాంగ పరమైన ఆదేశాన్ని కూడా ఈ నాటివరకు అమలు జరపలేకపోయినాము. ఈ వైఫల్యానికి ప్రధానమైన హేతువు ప్రాథమిక విద్యాభ్యాస కాలంలోనే అధికసంఖ్యలో (I-VIII తరగతులలో) విద్యార్థులు చదువు మానివేయడమే. ఈ విధంగా ఈ తరగతులలో చదివే విద్యార్థులు 75శాతం పైనే మధ్యలో చదువుమానుకుంటున్నారు. ఈ విధంగా మధ్యలో చదువుమానుకోవడం ఆడపిల్లలలో ఎక్కువ. షెడ్యూల్డు కులాల, షెడ్యూల్డు జాతుల పిల్లల విషయంలో ఇది మరీ ఎక్కువ.

## స్వాతంత్ర్య భారత దేశంలో విద్యారంగం సాధించిన అభివృద్ధి

2.3 1947 వ సంవత్సరములో మధ్యమ, ఉన్నత, ఉన్నతోన్నత తరగతులలో విద్యనభ్యసిస్తున్న పిల్లల సంఖ్య 22 లక్షలుండగా అది 1983 నాటికి 380 లక్షలకు పెరిగింది ఇప్పుడు మన దేశములో ఈ తరగతులకు విద్యబోధించే పాఠశాలలు 175,000 ఉన్నాయి. 1947 వ సంవత్సరంలో వీటి సంఖ్య 13,000 మాత్రమే.

2.4 1960-61 సంవత్సరపు లెక్కలనుబట్టి ఉన్నత సెకండరీ స్థాయిలో ఉత్తీర్ణులైన బాలబాలికల సంఖ్య 2.37 లక్షలుకాగా ఈ సంఖ్య 1981-82 సంవత్సరం నాటికి 8.40 లక్షలకు పెరిగింది అయితే చాలా విచారకరమయిన విషయమేమిటంటే 8,10,12 సంవత్సరాల పాఠశాల చదువు తరువాతకూడా అధికాధిక సంఖ్యాకులైన విద్యార్థులలో సహితం తన చుట్టూవున్న భౌతిక, సాంస్కృతిక లేదా సాంఘికార్థిక వాతావరణాన్ని గ్రహించగల శక్తిసామర్థ్యాలు ఏమీ పెంపొందకపోవడం. వాళ్ళు ఏ విషయమూ తమకుతామై ఆలోచించుకోలేకపోవడం. ఉద్యోగ విపణిలోకి వాళ్ళు కావలసిన ఆత్మ విశ్వాసంతో అడుగుపెట్టలేకపోవడం. ఉద్యోగానికి తగిన సామర్థ్యం ఏమీ వాళ్ళలో వుండదు. పోనీ వృత్తి విజ్ఞాన నైపుణ్యాలందామా అవి అసలే పూజ్యం. ఇంచుమించుగా హయ్యర్ సెకండరీ పరీక్షలలో కృతార్థులైన విద్యార్థులలో 83 శాతం మంది కళాశాలల్లో, విశ్వవిద్యాలయాల్లో ప్రవేశాన్ని అర్థిస్తారు. కేవలం 20 శాతం మాత్రమే ఇందులో వృత్తి విద్యాసంస్థల్లోనో, సాంకేతిక విద్యాసంస్థల్లోనో ప్రవేశం పొందగలుగుతున్నారు.

2.5 1968 వ సంవత్సరములో పార్లమెంటు ఆమోదించిన విద్యా విధాన నిర్ణయాలను అమలు జరిపివున్నట్లయితే 10+తరువాత స్థాయి ఉన్నత పాఠశాలా విద్యార్థులు 50 శాతం జీవనోపాధికి ఉపకరించే వృత్తివిద్యానైపుణ్యాన్ని ఆర్జించి వుండేవారు. కాని 1982–83 సంవత్సరం నాటికి వృత్తి విద్యాబోధన తరగతులలో+2 దశలో ప్రవేశం పొందిన వారిసంఖ్య సంవత్సరానికి 6.00,000 మాత్రమే చేరుకోగలిగింది.

2.6 స్వాతంత్ర్యం సంపాదించుకున్న కాలానికి కేవలం 700 కళాశాలలు, 20 విశ్వవిద్యాలయాలు మాత్రమే భారతదేశంలో ఉండేవి వాటిలో చదివే విద్యార్థుల సంఖ్య 4 లక్షలుండేది ఇప్పుడు దేశంలో 5,246 కళాశాలలు, 140 విశ్వవిద్యాలయాలు పని చేస్తున్నాయి వీటిలో 33.6 లక్షలమంది చదువుతున్నారు. ఇందులో 9.76 లక్షలమంది బాలికలు

3.1 1968 విద్యావిధాన నిర్ణయం, విద్యతో జీవితానికి మరింత సంబంధం ఉండేటట్లుగా అనువర్తింపచేయాలని ఆశించింది. విద్యావకాశాలు విస్తరింపచేయాలని, విద్యనుగుణాత్మకంగా మెరుగు పరచాలనీ, శాస్త్రీయ విజ్ఞానాన్నీ, సాంకేతిక విద్యనూ అభివృద్ధి చేయాలనీ, నైతిక సాంఘిక విలువలను పెంపొందించాలనీ గట్టిగా ఆశించింది. కొన్ని చెప్పుకోతగిన ఫలితాలు సాధించినప్పటికీ మొత్తంమీద చూస్తే ఉద్దేశించిన లక్ష్యాలను సాధించలేకపోయిందని చెప్పాల్సి వస్తున్నది. ఈ మధ్యకాలంలో కొత్త విద్యార్జన పద్ధతులు సమాజానికి అవసరమైనాయి. ఆర్థిక ,సాంఘిక రంగాలలోనూ, విజ్ఞాన శాస్త్ర, సాంకేతిక విద్యల్లోనూ ఎంతో పురోభివృద్ధి నెలకొన్నందువల్ల ఈ అవసరం ఏర్పడింది.

3.2. విద్యారంగానికి సంబంధించి కొత్తదైన దృక్పథం అవసరం. ఈ కొత్తవిధాన రూపకల్పనలో నేర్చుకునే విద్యకంటె నేర్చుకునే శక్తిని పెంపొందించడానికి అధిక ప్రాధాన్యం ఇవ్వడం జరగుతుంది. అవిచ్ఛిన్న విద్యకు ప్రత్యేక ప్రాధాన్యమివ్వటం జరుగుతుంది. సాంఘిక, నైతిక విలువలకు అధిక ప్రాధాన్యముంటుంది. లోపరహితమైన ప్రణాళిక రచనద్వారా విద్యార్జనకు సమానావకాశాలు, వివిధ ప్రాంతాలకు సమాన ప్రాధాన్యం, గుణాత్మకత సాధించడం జరుగుతుంది. ఇటువంటి విధాన రూపకల్పన చేసేముందు పూర్వానుభవాలను అంచనాకట్టడం, సాఫల్య వైఫల్యాలను పరిగణించటం, విధాన నిర్ణయాలను, నిధుల కేటాయింపును, భిన్న విభాగాలమధ్య సమన్వయం సాధించటం, నెరవేర్చటం, ప్రమాణాలను నిరూపించటం, అవసరాలను గురించి పనితీరును పరీక్షించటం, నెరవేర్చే యంత్రాంగాలను పరిశీలించవలసి వుంటుంది.

3.3 ఈ అభివృద్ధిలోని నత్తనడకకు ప్రధాన హేతువు అమితమైన నిధుల కొరత అనే విషయం స్పష్టంగా తెలుస్తూనేవుంది. విద్యాలయాలలో ప్రవేశించేవారి సంఖ్య సాలుసాలుకూ పెరుగుతూ ఉండటం, ధరల పెరుగుదల, బడ్జెట్‌లోని హెచ్చు కేటాయింపులను కూడా ఎప్పటికప్పుడు నిరుపయోగం చేస్తున్నాయి, మించిపోయేట్టు చేస్తున్నాయి విద్యార్థులపై పెట్టే తలసరి ఖర్చు ఇటీవలి సంవత్సరాలలో ఆ ఖర్చు క్రమంగా తగ్గుతూవస్తున్నది. యదార్థ సంఖ్యాపరంగా ఇది స్పష్టపడుతున్నది. విద్యా రంగానికి కేటాయించిన నిధులలో 90 శాతం పైగా ఉపాధ్యాయుల జీతభత్యాలకు, విద్యా నిర్వహణ ఖర్చులకే సరిపోతున్నది. నల్లబల్లలు, సుద్దముక్కలు, పటాలు తదితర విద్యాబోధన సామగ్రి కొనడానికి కాని, పాఠశాలకు తప్పనిసరి అయిన కనీస సౌకర్యాలు సమకూర్చుకోవటానికి కాని ఒక్క పైసా మిగలడం లేదు.

3.4 ఎవరికీ జవాబుదారీ వహించనిది నిష్ప్రయోజనమయినదని తాముకొంటున్న విద్యావిధానంపట్ల ప్రజలు ఉదాసీనులుగా ఉండిపోతూవున్నారు. పాఠశాలలు పనిచేసే విధానం చూడబోతే బ్రహ్మాండమైన అధికార దర్పం కింద అణగి మణగి పనిచేయాల్సిన స్థితికి దిగజారినట్లనిపిస్తున్నది. అవసరమైన మేరకైనా స్థానికుల జోక్యానికి అవకాశంలేని పరిస్థితి దాపురించింది. చురుకుతనమూ శ్రద్ధాసక్తులూ కల ఉపాధ్యాయులకు విద్యాబోధన నిరాశానిస్పృహ జనకంగా కూడా తయారైంది. ప్రజల నిరాశాజనక, నిస్సహాయ ధోరణి పర్యవసానంగా విద్యా వ్యవస్థను నడిపే బాధ్యత చాలవరకు ప్రభుత్వమే వహించాల్సివచ్చింది. పౌరులు తాము కూడా విద్యా విధానంలో భాగస్వాములై కలిసిమెలిసి తమవంతు పాత్రను నిర్వ

హించేట్లుగా నడుచుకోవాలంటే వాళ్ళకు కొన్ని అధికారాలు, బాధ్యతలు ఉండాలి. పాఠశాలలు, ముఖ్యంగా ఉపాధ్యాయులు తమవంతు కర్తవ్యాన్ని ఏ విధంగా నిర్వహించడం జరుగుతున్నదో వారు ఒక కంట కనిపెట్టి ఉండటానికి ఈ అధికారాలు, బాధ్యతలు అవసరం. కేవలం విద్యా వ్యవస్థ తాలూకు అతిశాయమే ఒక వింతదైన పరిస్థితిని సృష్టిస్తున్నది. ఈ మహా పరిమాణాత్మకమైన వ్యవస్థ వ్యక్తివ్యక్తిత్వం కోల్పోయిన చట్రంలో ఆయా ఉపాధ్యాయులకు కాని, ఆయా పాఠశాలలకు కాని నామరూపాలు లేకపోవడమే జరుగుతున్నది. వాళ్ళ ఉనికిని పట్టించుకునే అవకాశంలేదు. ఇందువల్ల ఈ పాఠశాల వ్యవస్థలో ఇది సాధించామనిగాని ఇది సాధించలేకపోయినామనిగాని అనుకోవటానికి స్థానంలేకుండాపోతున్నది. లోపాలుకానీ సృజనాత్మకతతో కూడిన ప్రతిభకాని లెక్కలోకే రావటంలేదు.

3.5 పేద కుటుంబాలకు చెందిన బాలబాలికలు వారి కుటుంబాల ఆదాయ గడింపులలో సహాయకారులుగా ఉండవలసి వస్తున్నందువల్ల పాఠశాలలకు నిత్యం హాజరు కాలేరు. అందువల్ల అటువంటి బాలబాలికలు కూడా విద్యా ప్రయోజనం పొందటానికి అనువుగా ఇప్పుడనుసరిస్తున్నవీ, నిర్ణీతమైనవీ కాని కొత్త విద్యాబోధన పద్ధతులను రూపొందించాలి. అయితే యీ పద్ధతులలో బోధన సామగ్రిని విరివిగా ప్రవేశపెట్టటమే కాక పట్టుదలతో పటిష్ఠంగా కార్యక్రమాలు నిర్వహించుకోవలసి ఉంటుంది. ఎప్పటికప్పుడు ఫలితాలను బేరీజు వేసుకుంటూ సమీక్షించుకోవాల్సి వుంటుంది.

3.6 కేవలం అంకెలను మాత్రమే పర్యవేక్షించినట్లయితే 1981వ సంవత్సరం నాటికి 1947 కన్నా ఎక్కువమంది నిరక్షరాస్యులున్నారని తేలుతున్నది. (1947లో 300మిలియన్లు, 1981లో 437 మిలియన్లు) అయినప్పటికీ జనాభా శాతాన్నిబట్టి చూస్తే దేశంలో 1951 వ సంవత్సరంలో 16.67 % గా ఉన్న అక్షరాస్యత, సుస్థిరంగా అభివృద్ధి పొందుతూ 1981వ సంవత్సరానికి 36.23%కు చేరుకొంది. అయితే యీ అభివృద్ధి నిష్పత్తిలో స్త్రీ పురుషుల మధ్య ఎంతో వ్యత్యాసం కనపడుతున్నది ఒక్క స్త్రీ పురుషులమధ్యనేగాక యీ వ్యత్యాసం ప్రాంతాలవారీగా కూడా కొట్టవచ్చినట్లు కనబడుతున్నది కేరళ గ్రామీణ ప్రాంతాలలోని స్త్రీల అక్షరాస్యత 64.7% ఉండగా రాజస్థాన్‌లో అది 5.4% మాత్రమే. బీహార్, మధ్యప్రదేశ్, ఉత్తర ప్రదేశ్‌లలో కలిపి మొత్తం దేశంలో గ్రామీణ కుటుంబాలు 38 % వరకు ఉండగా, ఈ రాష్ట్రాలలో స్త్రీల అక్షరాస్యత 6.99 నుంచి 10.77 శాతం మధ్య మాత్రమే వుంది దీన్నిబట్టి ప్రాథమిక విద్య, వయోజన విద్యావ్యాపన కార్యక్రమాలద్వారా సాధించిన ఫలితాలు విపరీతమైన జనాభా పెరుగుదలవల్ల లెక్కలోకి రాకుండా, ప్రయోజనం లేకుండా పోయినాయని విశదమవుతున్నది.

3.7 కుటుంబ నియంత్రణపట్ల వైముఖ్యానికి అక్షరాస్యతకూ విడదీయరాని సహసంబంధం కనపడుతున్నది. అంటే చదువుకున్నవాళ్ళు పరిమిత కుటుంబావశ్యకతను వెంటనే గుర్తించగలుగుతున్నారని. ఇందువల్ల ప్రాథమిక విద్యకూ, వయోజన విద్యకూ మనం అధిక ప్రాధాన్యం ఇవ్వవలసి ఉంటుంది ఇప్పటి ఈ పరిస్థితులు ఇదే విధంగా కొనసాగితే క్రీ॥శ॥ 2000 సంవత్సరము వచ్చేనాటికి భారత దేశంలో నిరక్షరాస్యుల సంఖ్య 500 మిలియన్లకు చేరుకుంటుంది.

3.8 విద్యావంతులున్న వారి కుటుంబాలకు, పాఠశాలల్లో చేరి చదివే పిల్లలకు కూడా ఒక విడదీయరాని లంకె కనబడుతున్నది. యునెస్కో వారి అధ్యయన పరిశీలనను బట్టి వయోజనుల అక్షరాస్యత 70 శాతం దాకా చేరుకొంటేనే గాని సార్వజనిక ప్రాథమిక విద్యావ్యాప్తి ప్రయత్నం సానుకూలం కానేరదు.

3.9 మాధ్యమిక విద్యాస్థాయిలో 22% మాత్రమే ఆయా వయోవర్గాల విద్యార్థులు చదువు సాగిస్తున్నారు. ఈ విధంగా పాఠశాలలలో చేరి చదువుతున్న ఈ కొద్దిమందికి కూడా సరిఅయిన పాఠశాలా సౌకర్యాలు లభించడం లేదు. కావలసిన భవనాలు, ప్రయోగశాలలు, గ్రంథాలయాలు, ఆటస్థలాలు మొదలైన కనీస వసతులుగల పాఠశాలలు చాలా తక్కువ సంఖ్యలోనే ఉన్నాయి.

3.10 1978లో జరిపిన అఖిల భారత విద్యా విషయక సర్వేను బట్టి ఎన్నో ప్రాథమిక, మాధ్యమిక పాఠశాలల్లో కనీసవసతి సౌకర్యాలు కూడా లేవు. 9% ప్రాథమిక పాఠశాలలకు అసలు భవనమంటూ లేనేలేదు. 41.5 శాతం పాఠశాలలలో నల్లబల్లలే లేవు 72 శాతం పాఠశాలలలో గ్రంథాలయమంటే ఏమిటో తెలియదు. 53 శాతం పాఠశాలలకు ఆటస్థలాలే లేవు. గ్రామీణ ప్రాంతాలలో 89 శాతం ప్రాథమిక, 70 శాతం మాధ్యమిక, 27 శాతం మాధ్యమికోన్నత, 10 శాతం ఉన్నత విద్యా పాఠశాలల్లో మరుగుదొడ్డి సౌకర్యాలు కూడా లేవు.

3.11 ఉన్నత మాధ్యమిక తరగతుల స్థాయిలో వృత్తి విద్యాబోధనను ప్రవేశపెట్టాలనేది 1968 వ సంవత్సరపు విద్యావిధాన నిర్ణయాల ప్రధాన ధ్యేయం. 10+2 దశలోవున్న 50% విద్యార్థులు ఉపాధి దొరికే వృత్తి విద్యలలో ప్రవేశించాలని సంకల్పించటం జరిగింది కాని అటువంటి లక్ష్యాన్ని సాధించింది మాత్రం స్వల్పాతిస్వల్పం. చేసిన అట్టి ప్రయత్నం ఏ మాత్రం లెక్కలోకి రానిది. దీనికి ప్రధాన హేతువు భౌతికమైన వసతి సౌకర్యాల విషయంకాని, ఉద్యోగావకాశాల లబ్ధికి చెందిన వివరాలతో కూడిన పూర్తి ఆచరణ ప్రణాళికకాని, విశదీకరణ ఏయే దశలలో అవసరమనే విషయంకాని, అనుగుణమైన పాఠ్యబోధన ప్రణాళికలుకాని, పట్టించుకోకపోవడమే. వృత్తి విద్యాబోధన చేయగల సుశిక్షితులైన ఉపాధ్యాయులు ఎక్కువగా లభించకపోవడం కూడా చాలావరకు ఈ పరిస్థితికే కారణమైంది వీటన్నింటికీ తోడుగా కాయకష్టంపై ఆధారపడిన వృత్తి విద్యను సమాజం దృష్టిలో గౌరవం లేకపోవడం కూడా వృత్తి విద్య బోధనకు ఆటంకంగా తయారైంది.

4.1 స్వాతంత్ర్యానంతరం కళాశాల విద్య: విశ్వవిద్యాలయ విద్యలు బాగా విస్తరించాయి. సగటుగా, స్థూలంగా చూస్తే కళాశాలల, విశ్వవిద్యాలయాల తీరుతెన్నులు ఆందోళనకరంగా ఉన్నాయి. వీటిలో ఎన్నో పచ్చి కులతత్వ, ప్రాంతీయ దురభిమాన దుగ్ధతలకూ, అవాంఛనీయ పరిస్థితులకూ జన్మక్షేత్రాలైనవి, బీజ సంవర్ధకాలైనాయి. అందులో కొన్ని రాజకీయమైన, ఇతర ఆవేశపూరితమయిన కక్షలకు యుద్ధభూములైనాయి. ఇలాంటి కొన్ని సంస్థలూ, రాజకీయపక్షాలూ,

ఇతరకక్షిదార్లూ ఉపాధ్యాయుల సహకారంతో ఇతర సిబ్బంది సహాయంతో అధికారంకోసం, అధిపత్యం కోసం ఎప్పటికప్పుడు పోరాడే రణరంగాలుగా పర్యవసించాయి. కొందరు ఉపాధ్యక్షులు తమ పదవీ కాలమంతా 'గృహనిర్బంధం' లోనే ఉండవలసి వస్తున్నది.

4.2 ఉన్నత విద్యాసంస్థల వ్యవహారాల్లో బయటివక్తులు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో జోక్యం కలిగించుకుంటున్నాయనే భావం సర్వేసర్వత్రా వ్యాపించి ఉంది. ఇందువల్ల స్వయం ప్రతిపత్తి ఎంత అవసరమో బోధపడగలదు అయితే, స్వయం ప్రతిపత్తితోపాటు జవాబుదారీ బాధ్యత కూడా నిర్వహించవలసి ఉంటుందని కూడా విస్మరించరాదు. స్వయం ప్రతిపత్తి అవసరం ఎంతముఖ్యమో స్వయం ప్రతిపత్తిని బాధ్యతాయుతంగా కాపాడుకోవాలనే నిబంధన కూడా అంతే ముఖ్యమనే సంగతి విశ్వవిద్యాయాలు జ్ఞాపకం పెట్టుకోవాలి. విశ్వవిద్యాలయ నిర్వహణలో తలమునకలు కావలసిన ఉపాధ్యక్షులు ఇటీవలికాలంలో తమపదవి గౌరవం క్రమంగా దిగ్గిపోతున్న పరిస్థితుల్లో పనిచేయవలసి వస్తున్నది. ప్రభుత్వాధికారుల పంచలలో విశ్వవిద్యాలయ నిర్వహణకు అవసరమైన నిధులకోసం తప్పనిసరిగా పడిగాపులు పడవలసివస్తున్నది. ఇంతేకాకుండా విశ్వవిద్యాలయ సంఘాల సహకారం పొందడానికి రాజీపడి పని గడుపుకోవలసి వస్తున్నది.

4.3 విశ్వవిద్యాలయ నిధుల మంజూరీ సంఘం వారు (యు.జి.సి.) విద్యా ప్రమాణాలను నెలకొల్పే విషయంలోను, ప్రతిభావంతమైన కార్యక్రమాలను ప్రోత్సహించే విషయంలోను చెప్పుకోదగినంత కృషిచేశారు. అయితే కళాశాలల, విశ్వవిద్యాలయాల విద్యా ప్రమాణాలు దిగజారకుండా చూడటంలోను, కనీస స్థాయిలోనైనా అవి ఫలితాలు చూపేట్లు పనిచేయడంలోనూ ఎంతవరకు కృతకృత్యులైనారనేది చర్చనీయాంశమే అవుతున్నది. ఈవిషయమై నిక్కచ్చిగా వ్యాఖ్యానించడం కష్టాలను కొనితెచ్చుకోవడమే. ఎన్నో సందర్భాలలో ఈ సంస్థలకు విరాళాలు నిలుపుచేయడానికో, తగ్గించడానికో పూనుకొంటే ఆ చర్య ఈ సంస్థలను నిర్వహించాల్సిన రాష్ట్రప్రభుత్వానికి, విశ్వవిద్యాలయ నిధుల మంజూరీ సంఘానికి ఆర్థిక వనరులు సమకూర్చే కేంద్ర ప్రభుత్వానికి వైమనస్యం, ఘర్షణ కలిగించే అంశంగా పరిణమిస్తున్నది.

4.4 కళాశాలల నుంచి వచ్చే పట్టభద్రుల విద్యాయోగ్యతలు కాని, ఉద్యోగావకాశాలుకాని సంశయాస్పదంగా తయారైనాయి. అలా జరగడానికి కారణం కళాశాలల్లో కళలు, మానవీయ శాస్త్రాలు అభ్యసించే విద్యార్థులు ఒకే గాడిలో అంటే ఒకే దిశలో ఎదుగూ బొదుగూ లేకుండా, వాస్తవిక జీవితానికి ఎటువంటి సంబంధం లేకుండా వ్యక్తిత్వం బహుముఖంగా వికసించడానికి దోహదకారులు కాకుండా ఆలోచనా సరళిని, తార్కికశక్తిని, అవగాహనా సామర్థ్యాన్ని ఏ మాత్రం పెంపొందించుకోకుండా పాఠాలు అభ్యసించడమే.

ఇక విజ్ఞానశాస్త్రాలు చదివే విద్యార్థులకు భావనలు మాత్రమే కేవలం విశదంగా పరిచయం చేయడం జరుగుతున్నది. కాని అధ్యయనం మరింత ప్రయోజనవంతం కావడానికి తగినట్లుగా ప్రయోగశాలా పరికరాలు, ఉపకరణ సామగ్రి సహాయంతో వాళ్ళు నేర్చుకోవడంలేదు.

5.1 మనదేశం సాధించిన ఆర్థికాభివృద్ధికి దేశీయ సాంకేతిక విజ్ఞాన పురోగతి ఎంతగానో సహాయపడిందని చెప్పలేం. అయినా ఈ వ్యవస్థలో కూడా ఎన్నో తీవ్ర సమస్యలు ఎదురవుతున్నాయి. పాతబడిపోయిన యంత్రాలూ, కాలదోషం పట్టిన పరికర సామగ్రి, నూతన సాంకేతిక పరిజ్ఞాన పద్ధతులను ప్రవేశపెట్టడానికి కావలసిన పరిశోధన, శిక్షణలు నిర్వహించే యంత్రాంగం కొరవడటం ఈ రంగంలో ముఖ్యమైన బాధకాలు. అయితే కేవలం నిలదొక్కుకోవటం కోసం ఈ లోపాలను కొంతవరకు పూడ్చటం జరిగింది.

5.2 సాంకేతిక విద్యా సంస్థల పని తీరుతెన్నులు మెరుగు పరచడానికి తీసుకోవలసిన చర్యలలో ముఖ్యమైనవి :

సమర్థులైన అధ్యాపకులను ఈ వృత్తిలోకి ఆకర్షించే మార్గాలన్వేషించడం; పరిశ్రమ రంగంతో పరస్పర సంబంధాలను వృద్ధిపరచుకోవడం; ఆధునిక సాంకేతిక విజ్ఞాన సౌకర్యాలను గ్రామీణ ప్రాంతంలోని సామాన్య వ్యక్తికి కూడా అందించే శక్తి సామర్థ్యాలు పెంపొందించడం ; రాష్ట్ర కళాశాలలకూ, ప్రాంతీయ కళాశాలలకూ, ఐ.టి.ఐ.లకూ మధ్య వుండే స్థాయీ భేదాలను తొలగించడం; వివిధ సాంకేతిక విద్యాసంస్థలమధ్య పరస్పర సంబంధాలు నెలకొల్పడం.

5.3 ఇంజనీరింగ్ విద్యా బోధనకు అయ్యే ఖర్చును ప్రజాధనం వెచ్చించి ఉదారంగా ఆదుకోవడం సమంజసం కాదని కూడా ఒక అభిప్రాయం వ్యక్తమవుతున్నది. నిజానికి ఈ వృత్తిలోని వారి సేవలను అధికంగా వినియోగపరచుకొనే వ్యవస్థీకృతమైన ప్రైవేట్ రంగంవారే ఈ ఖర్చులో కొంత భాగమైనా భరించడం సబబని కూడా వాళ్ళ అభిప్రాయం. సాంకేతిక విద్యా ఖర్చుకు పారిశ్రామిక రంగం కూడా బాధ్యత వహించాలి.

6.1 నేటివరకూ కొనసాగుతున్న నియత విద్యా బోధన వ్యవస్థలో ఉపాధ్యాయుడిదే కేంద్రస్థానం. ఆ విద్యావిధానం తాలూకు నిర్ణయాలు, విధానాలు, పని చేయడం ఆ ఉపాధ్యాయుడి వ్యక్తిత్వం పైనే ఆధారపడి ఉంటుంది. బోధన ఫలితాలు, విద్యార్థుల విద్యా ప్రమాణాలు ఉపాధ్యాయుడిపైనే ఆధారపడి ఉంటాయి. దురదృష్టవశాత్తు ఉపాధ్యాయుడికి కావలసిన ఆధునిక శిక్షణకు సంబంధించి సంబంధించి పాఠ్య ప్రణాళిక అంటూ రూపొందనేలేదు. కాబట్టి ఉపాధ్యాయుడికి కావలసిన ఆధునిక శిక్షణకు సంబంధించి పాఠ్య ప్రణాళిక అంటూ రూపొందనేలేదు. కాబట్టి ఉపాధ్యాయులకిస్తున్న శిక్షణ కార్యక్రమాలు వర్తమానావసరాలకు ఎంత మాత్రమూ అనుగుణమైనవి కావని తేలుతున్నది. దీనికి తోడు బతకలేక బడిపంతులు అనే ధోరణి ఇంకా మన సంఘంలో ప్రబలంగానే వుంది. మరే వృత్తి వెతుక్కోలేనక్కరలేనివాళ్ళే ఈ వృత్తిలోకి వస్తున్నారు.

6.2 కొందరు ఉపాధ్యాయులు పార్టీ రాజకీయాల ప్రమేయం పెట్టుకోవటం కూడా విద్యావ్యవస్థకు తీవ్రమైన చెరుపు కలుగజేస్తున్నదని చెప్పాలి. ఆ విధంగా పార్టీ ముద్రకు గురి అయిన ఉపాధ్యాయ

సంఘాలకు రాజకీయ పార్టీలవారి అండదండలు కూడా లభిస్తున్నాయి. ఇటువంటి పరిస్థితులు విద్యాలయాలలోని క్రమ శిక్షణను దెబ్బ తీస్తున్నాయి. చిరకాలంనుంచి ఎంతో గౌరవాన్ని పొందుతున్న ఉపాధ్యాయ వృత్తికి నేటి ఉపాధ్యాయులు అంకితం కాలేకపోతున్నారు. తమ కాలాన్ని, శక్తియుక్తులను పూర్తిగా వృత్తిపరం చేయలేకపోతున్నారు.

6.8 ఇటీవల ప్రవేశపెట్టిన 'యోగ్యతనబట్టి పదోన్నతి' అనే పద్ధతిపై కూడా ఉపాధ్యాయ వర్గంలో చాలా సంశయాత్మక చర్చా ప్రసంగాలు, అసంతృప్తి ధోరణులు వెల్లడి అయినాయి. ఉపాధ్యాయులలో చాలామంది ఒక వ్యక్తి తాలూకు ఉద్యోగకాలిక అనుభవాన్ని పదోన్నతి విషయమై పరిగణనలోకి తీసుకోవటంవల్ల ప్రయోజనం ఉంటుందా అని సందేహిస్తున్నారు. ఉపాధ్యాయుల విద్యా యోగ్యతలు, ప్రజ్ఞా పాటవాలు, శక్తిసామర్థ్యాలు లెక్కలోకి తీసుకోకుండా 'సర్వీసు'ను పరిగణిస్తే వృత్తిలో కష్టపడి పైకి వద్దామనే, విద్యా యోగ్యతలను మరింత మెరుగుపరుచుకుందామనే ధోరణికి ఆస్కారమే ఉండదని భావిస్తున్నారు.

7.1 మన విద్యా వ్యవస్థలో ఎన్నో తరతమ భేదాల లోపాలున్నాయి. విద్యా సదుపాయాల అందుబాటులో, సమానావకాశాల విషయంలో, విద్యావ్యాపన ఫలితాల దృష్ట్యా దేశం మొత్తం మీద ఎన్నో వ్యత్యాసాలు కనబడుతున్నాయి. జనాభాను బట్టి మనదేశ ప్రజల మొత్తంలో ¾ వంతు ప్రజలు గ్రామీణ జీవనం గడుపుతున్నవారే. వారికి విద్యా సౌకర్యాలు చాలా తక్కువగా వున్నాయి. వారికి అందే వనరులు అత్యల్పం. శ్రీమంతులైన వర్గాలవారు నగర ప్రాంతంలో ప్రైవేటు యాజమాన్యంవారు నిర్వహించే "గుణాత్మక" విద్యా సంస్థల్లోంచి తమ పిల్లలకు చదువులు చెప్పించి, సాంకేతిక విద్యా సంస్థలలో రిజర్వేషన్‌లు వర్తించని సీట్లలో అత్యధిక భాగం తామే కైవసం చేసుకుంటున్నారు. గ్రామీణ ప్రాంతాల పిల్లలకు ఇదొక పెద్ద అసౌకర్యంగా పరిణమించింది. గ్రామీణ ప్రాంతాలలో పనిచేసే పాఠశాలలు నగరాల్లోని పాఠశాలల కన్నా విద్యాబోధనా పద్ధతులలో, ప్రమాణాలలో బాగా వెనకబడి ఉంటున్నాయి.

7.2 గత దశాబ్ది కాలంలో బాలికలలో షెడ్యూల్డ్ జాతుల, షెడ్యూల్డ్ కులాలలో విద్య బాగా ప్రాపకం పెరిగింది. అయినప్పటికీ విద్యా వికాస స్థాయిలో వాళ్ళు ఇతరులతో పోలిస్తే ఇంకా అట్టడుగు స్థానంలోనే ఉన్నారు. సంఘంలో ఇంకా కొనసాగుతున్న కొన్ని అవాంఛనీయ ధోరణులవల్ల, గృహకృత్యాలూ, తమ్ముళ్ళ-చెల్లెళ్ళ సంరక్షణ భారమూ సాధారణంగా తమ పాలపడటంవల్లా ఆడపిల్లల చదువు ప్రోత్సాహకరంగా ముందుకు సాగటంలేదు ఇక షెడ్యూల్డ్ జాతులు, షెడ్యూల్డ్ కులాల వారి విషయంలో ఎన్నో జన్మసిద్ధమైన అవరోధాలున్నాయి. కేవలం సీట్ల రిజర్వేషన్‌తో అవి సమసిపోయేవి కావు. వాళ్ళలో అధిక సంఖ్యాకులు ఇప్పుడిప్పుడే చదువు నేరుస్తున్న మొదటి తరంవాళ్ళు కాబట్టి సహజంగా వెనుకబడిన భావనకు గురి అవుతుంటారు. ఇంతే కాకుండా పసితనంలో ఆహార లోపంవల్లా, సమాజానికి దూరమైన భావంతో, వెలిననుభవిస్తున్న మనస్తత్వంతో కూడా బాధపడతారు. ఇందుకుతోడు పనిపాటలకు అంతరాయం కలిగించని అలవాటులకు అవరోధం కలిగించే అనుకూల వేళల్లోకాక అనుకూల వేళల్లో విద్యనభ్యసించవలసి రావడం. చదువుకోవడానికి తమ తెలివితేటలను గూర్చిన అపనమ్మకం, తమకుకూడా చదువుకొనే శక్తిసామర్థ్యాలు ఉన్నాయనే ఆత్మవిశ్వాసం లేకపోవడం వాళ్ళను బాధించడం కద్దు. మామూలు విద్యార్థులతో సమాన స్థాయితో కలిసి మెలిసి ఉండడానికి అడ్డమయ్యే జంకు సంకోచాలు కూడా వాళ్ళను వదలవు. ఈ విధమైన మానసిక దౌర్బల్యాలకు గురి అయిన వీళ్ళ విషయంలో అదనంగా శ్రద్ధచూపుతూ వీళ్ళకోసం ప్రత్యేక కార్యక్రమాలను రూపొందించాల్సి ఉంటుంది. అప్పుడుకాని వాళ్ళ శక్తిసామర్థ్యాలు పెరిగి వాళ్ళు మామూలు పరిస్థితులకు అలవాటుపడరు. కావలసిన వ్యక్తిత్వపు సర్దుబాటు అప్పుడుకానీ సాధ్యం కాదు.

7.3 విద్యారంగానికి, ఉద్యోగ-ఉపాధిరంగానికి ఉండవలసిన పొత్తు పూరణ పూరక సంబంధం లేదా అనుబంధం ఏ మాత్రం ఉండటంలేదు. సాధారణ విద్యా యోగ్యతలకు లభించే ఉద్యోగావకాశాలు, ఉద్యోగార్థుల రోజురోజుకూ పెరుగుతున్న అనుపాతంలో పెరగటంలేదు. పరిస్థితి ఇట్లా ఉండగా సాంకేతికమైన పరిజ్ఞానం, శరీరశ్రమతో కూడిన నైపుణ్యం కావలసిన ఉద్యోగాలకు సుశిక్షితులైన అభ్యర్థులు కావలసిన సంఖ్యలో లభించటం లేదు. పనిదొరికే విద్య లేదా పనికి పనికివచ్చే విద్యా అనే భావం అసలు ఆలోచనకే రాలేదన్న విషయాన్ని కొట్టవచ్చినట్లు కనిపింపజేసే విద్యా ఉదాహరణలను మనం I—V, VI—VIII, IX—X విద్యాస్థాయిలలో, లేదా 10+ తరవాత విద్యార్జన స్థాయిలలో చూడవచ్చు. పాఠశాల విద్యాభ్యసన సరళిని, వ్యవస్థీకృత విభాగాలనుచూస్తే వ్యవసాయరంగలోనేకాని, దానికి సంబంధించిన గ్రామీణ జీవనాధార వృత్తులలో కాని ఏమాత్రం అభిరుచిని, పరిజ్ఞానాన్ని, నైపుణ్యాన్ని మెరుగుపరచే అవకాశమే కనబడదు.

8.1 1950-51 లో విద్యారంగం ఖర్చు రూ. 114 కోట్లు కాగా అది 1976-77 కల్లా రూ. 2804.16 కోట్లకు పెరిగినమాట నిజమే. అయితే ద్రవ్యోల్బణాన్ని, విద్యార్థుల సంఖ్యలోని పెరుగుదలను 1970-77 నాటి స్థిర ధరల ఆధారంగాకనక చూస్తే 1950-51, 1975-76 మధ్యకాలంలో సాలుసరి విద్యార్థిమీద తలసరి ఖర్చు తగ్గిపోయిన మాట కూడా నిజమే. కళాశాల విద్యాలయం విద్యార్థి పరంగా ఈ కాలంలో తల ఒక్కండికి రూ. 468.9/- నుంచి రూ. 380.9/- లకు దిగజారిపోయింది. అట్లానే వృత్తి విద్యారంగానికి సంబంధించి విద్యార్థిమీద చేసే సాలుసరి ఖర్చు రూ. 1640.4 నుంచి రూ. 890.1 లకు తగ్గిపోయింది. అయితే ఒక్క ప్రాథమిక విద్యారంగానికి సంబంధించి మాత్రం ఏదో కాస్త అభివృద్ధి - అంటే 1.1 శాతం వృద్ధి సాధించడం జరిగింది. తలసరి ఖర్చు రూ. 41.9/-ల నుంచి అది రూ. 43/-లకు పెరిగింది.

8.2 విద్యారంగంలో ప్రణాళికం రచనలో ప్రాథమిక విద్యకు రాజ్యాంగపరమైన ఖచ్చితమైన కేటాయింపు నిబంధన ఉన్నప్పటికీ, మొదటి ప్రణాళికలో కేటాయించిన సొమ్ములో ప్రాథమిక విద్యకు ఖర్చుపెట్టిన 56% నుంచి రెండో ప్రణాళికా కాలానికి 37%కి, మూడో ప్రణాళిక కల్లా 34%, నాలుగో ప్రణాళిక కల్లా మరింత తీసికట్టయి 30%కి క్రమంగా తగ్గిపోయింది. అయితే ఇందుకు భిన్నంగా మొదటి ప్రణాళికకూ, నాల్గవ ప్రణాళికకూ మధ్య

విశ్వవిద్యాలయం, కళాశాలల వంతు విద్యావ్యయం 9% నుంచి 10%కి పెరిగింది.

8.3 విద్యారంగానికి సంబంధించి ప్రణాళిక మొత్తం ఖర్చులో రాష్ట్రాలు 70% వరకు ఇంచుమించుగా సమకూరుస్తాయి. ఆయా రాష్ట్రాల స్థితిగతులనుబట్టి పేద రాష్ట్రాలైన బీహార్, ఉత్తర ప్రదేశ్, ఒరిస్సా, జమ్ము-కాశ్మీర్, మధ్యప్రదేశ్, రాజస్థాన్‌ల పిల్లల అభివృద్ధిని అభివృద్ధి పొందిన ఇతర రాష్ట్రాలతో పోల్చిచూస్తే చాలా లోటుకనిపిస్తుంది. పేద రాష్ట్రాలలో విద్యారంగపు తలసరి ఖర్చు చాలా తక్కువగా ఉంటోంది. 1982 – 83 సంవత్సరములో ఈ తలసరి సాలుసరి ఖర్చు ఉత్తరప్రదేశ్‌లో 40.5/- రూపాయలు, మధ్యప్రదేశ్‌లో రూ. 49.4/- లు బీహార్‌లో రూ. 51.2/- మాత్రమే వుంది. పంజాబుతో పోలిస్తే ఈ సంఖ్యలు ఎంత తక్కువో తెలుస్తుంది. పంజాబ్‌లో ఈ పద్దు రూ. 100/- దేశం మొత్తంమీద సగటు వ్యయం రూ. 68.2/- లు.

9.1 భవిష్యత్తును రూపొందించుకోవటంలో విద్యావిధాన నిర్ణయం ఎంతో తోడ్పడుతుంది. అది ముఖ్య ఉపకరణంగా పనికి వస్తుంది. పూర్తిగా ఒక తరాన్నే అది ప్రభావితం చేయగలదు, రూపు దిద్దగలదు. ఇది తమతమ అవగాహనను, దృక్పథాలను అనుసరించి ఏ కొద్దిమందితో కూర్చుని నిర్ణయించగలిగిందికాదు. విద్యారంగంలో పనిచేస్తున్నవారు, విద్యారంగంపట్ల అభిమానాసక్తులు ఉన్నవారు, అన్ని అంశాలనూ కూలంకషంగా చర్చించి, ఎటువంటి సంకోచాలు లేకుండాఇందుకు సంబంధించిన అన్ని అంశాలనూ, దృక్పథాలనూ నిర్ణయించాల్సిన తరుణం ఆసన్నమైంది.

9.2 శారీరకంగా ఆరోగ్యవంతులు, మేథాసంపన్నులు జీవిత సౌందర్యదృష్టి ఉన్నవారు సంపూర్ణ వ్యక్తిత్వం గలవారు అయిన పౌరులను తీర్చిదిద్ది వాళ్ళకు శాస్త్రీయ విజ్ఞాన దృక్పథం, ప్రజాస్వామిక విలువలు, సాంఘిక బాధ్యతావగాహన సిద్ధింపచేయటానికి విద్య సాధనం కావాలంటే అది విద్యార్థులలో శ్రమపడి, ఒళ్ళు వంచి పనిచేసే ఆకాంక్షను, శ్రమైక జీవన సౌందర్యాన్ని ఆరాధించే దృక్పథాన్ని పెంపొందింపచేయాలి. ఇంతేకాదు మతాభి వివేకరహితమైన లౌకిక ప్రవృత్తి, సాంఘిక న్యాయ నిబద్ధత కూడా వాళ్ళు అభిమానించేటట్లు చేయాలి. దేశ సమైక్య, గౌరవ సమగ్రాభివృద్ధులకు విద్యార్థులు స్వాయత్తమయ్యేటందుకు విద్య తోడ్పడాలి. వీటన్నింటితో పాటు ఆర్థికాభివృద్ధిని సాధించేందుకు ఉద్యోగ నియామకాల కోసం యువకులకు తగిన జ్ఞానాన్ని, నైపుణ్యాన్ని, సాధన సంపత్తులను విద్యారంగం చేకూర్చగలగాలి.

9.3 విద్య సామాజిక వ్యవస్థతో వ్యక్తిని సంలీనం చేయడమే కాక, మానవుల మధ్య అంతరాలను బాగా తగ్గించి వేస్తుంది. దీన్ని దృష్టిలో ఉంచుకొన్నపుడు సంఘంలోని పౌరులందరికి సమాన విద్యావకాశాలను ఆశించడం మన ముఖ్య కర్తవ్యం.

9.4 తక్కిన అన్నిరంగాల పురోభివృద్ధికి విద్యారంగం ఎంతో తోడ్పడుతుంది. అందువల్ల విద్యారంగం పురోభివృద్ధి కవస్ని తమ సహాయ సహకారాలు అందజేయాలి విద్యావంతులు కూడా జీవితంపట్ల గౌరవం, మంచి చెడ్డలపట్ల విచక్షణ చూపకపోతే శాంతి భద్రతల పరిరక్షణ వ్యవస్థ పనిచేయలేదు. ఇతరులు తమ అభిప్రాయంతో ఏకీభవించనప్పుడు వాళ్ళపట్ల సహనంతో సర్దుకొని పోవడమే నేర్పకపోతే ప్రజాస్వామ్యమూ, పౌరజీవితమూచిన్నాభిన్నమై పోతాయి. ధైర్యసాహస ప్రవృత్తి, నూతనాన్వేషణావిష్కరణలలో ఆత్మవిశ్వాసమూ పిల్లలలో పాదుకొలుపకపోతే ఆ దేశం అభివృద్ధిని సాధించలేదు సమస్త ప్రజలూ పాల్గొని సాధించాల్సిన ఏ అభివృద్ధి కార్యక్రమమైనా విద్యావంతుల సహాయ, సహకారాలు లేకుండా ముందుకు సాగనేసాగదు.

10.1 నామమాత్రమైన చిన్న చిన్న మార్పులతో విద్యా వ్యవస్థను మార్చడం సాధ్యంకాదనీ మౌలిక పరివర్తనకు సమయం వచ్చిందనీ ఇప్పుడు చాలామంది భావిస్తున్నారు. సంఘాన్ని పూర్తిగా మార్చివేయాలంటే ప్రయోజనవంతమైన విద్య ఉండాలి. విచ్ఛిన్నకర ధోరణులను అణచివేయాలంటేను, సంఘంలో సమానత, సౌహార్దం, సాంఘిక న్యాయం వర్ధిల్లే వాతావరణం సృష్టించాలంటేనూ, ఉత్పాదకతను ఆధునికం చేయాలంటేనూ ప్రయోజనకరమైన విద్య తప్పనిసరి. కొత్త విద్యాబోధనా పద్ధతుల ద్వారా విద్యావ్యాప్తినేగాక వాని సామాజిక విస్తరణను సాధించవచ్చనీ, ఆశ్చర్యకరమైన మార్పులు తేవచ్చనీకూడా గుర్తించడం జరిగింది.

10.2 విద్యా నిర్ణయాలు అమలు జరిపేటప్పుడు వాటిని అమలుపరచి నిర్వహించవలసిన వాళ్ళ చిత్తశుద్ధినీ, శక్తియుక్తులనూ, వాతావరణ నిరోధాలనూ, సాధక బాధకాలనూ విద్యా విషయక ప్రణాళిక రచయితలు సరియైన అంచనాలతో ముందుగానే యోచించకపోతే ఎంతమంచి నిర్ణయమైనా సక్రమంగా సాగవనే స్థిరనిశ్చయానికి వచ్చారు. విద్యావ్యవస్థలో మౌలికమైన మార్పులు తలపెట్టినప్పుడు ప్రస్తుత పరిస్థితుల్లో లాభపడిన స్వప్రయోజనపరులతో సంఘర్షణ అనివార్యమవుతుంది. పరీక్షా పద్ధతిలో మార్పు తీసుకుని రావటం, విద్యాబోధనలో ప్రతిభకు క్రమశిక్షణకు కట్టుదిట్టం చేయడం, యాజమాన్య పద్ధతుల పునర్వ్యవస్థీకరణ, పాలనాధికార వికేంద్రీకరణ మొదలైనవి గట్టి వ్యతిరేకతను ఎదుర్కోవలసిన వస్తుంది.

10.3 విద్యాసంస్థల్లో రాజకీయాల ప్రమేయం తొలగించటాన్ని తమతమ అనుయాయివర్గం చేజారిపోతుందనుకునే రాజకీయ వాదులతోపాటు తమ ఇష్టానుసారం వ్యవహరించేశక్తి పోగొట్టుకొనే ఉపాధ్యాయులూ, అధ్యాపకేతరులూ వ్యతిరేకించి తీరుతారు.

10.4 బోధన మాధ్యమపు ప్రస్తుత పద్ధతులు, కంప్యూటర్ల చేత పని చేయించగల సుశిక్షితులైనవారు లభ్యపడకపోవడం దూరదర్శినిలో విద్యావ్యాప్తికి మాత్రమే పూర్తిగా నిబద్ధమై ఉపకరించగల ప్రత్యేక ప్రసార వాహిక లేకపోవడం, దూర ప్రాంతాలకు విద్యా ప్రసరణం చేయగల సువ్యవస్థిత యంత్రాంగం లేకపోవటం లాంటి ఇబ్బందులను కొన్నాళ్ళదాకా ఎదుర్కోక తప్పదు.

10.5 పేదవారికి పుట్టుకతోనే సంక్రమించే కొన్ని ఇబ్బందులవల్ల చదువుకోవడానికి వాళ్ళు ముందుకు రాలేదు. సార్వత్రిక ప్రాథమిక విద్యావ్యాప్తికి ఇది చాలా ప్రధానమైన అవరోధమని గుర్తించాలి. పాఠశాలలకు నియమితమైన గంటలలో హాజరుకాలేని పిల్లలకు అనియత విద్యాబోధన, అప్పుడప్పుడు కొద్దికాలం చదువు చెప్పే పద్ధతిని అనుసరించడం మంచిది. దీనిని స్వచ్ఛంద సేవా సంస్థలు బాగా నిర్వహిస్తాయి. ఇటువంటిసంస్థలు పూనుకొని ముందుకు రాకపోతే చాలా ప్రాంతాలలో ఇటువంటి ప్రయత్నాలు ఫలించకపోగా శ్రమపడిన ప్రయత్నాలు అస్తవ్యస్తమైపోయే ప్రమాదం వుంది.

10.6 పేదవారి సంగతికి వస్తే ఇప్పుడు కొనసాగుతున్న పరిశోధన పద్ధతులు సాంకేతిక విద్యా సంస్థల అభివృద్ధి కార్యక్రమ నిర్వహణ పద్ధతులు కూడా కొన్ని సమస్యలను సృష్టించగలవు. ఈ విషయంలో కూడా కొన్నికష్టాలను అధిగమించవలసి ఉంటుంది. వాళ్ళను ఆధునిక విజ్ఞానాభిముఖులు చేయడంగాని, తమకు కావలసిన నూతన దృక్పథం అలవరచుకొనేటట్లు చేయడంగాని కష్టం. ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలోను వ్యవస్థితంకాని విభాగంలోనూ ఈ సమస్యలు ఎదుర్కోవలసి ఉంటుంది. సువ్యవస్థితమైన పారిశ్రామిక రంగంలో పనిచేసే వారికిలాగా బహుముఖమైన గుర్తింపుగాని, వస్తు లాభాలుగాని అవ్యవస్థిత రంగం సమకూర్చలేకపోవడమే ఇందుకు కారణం.

10.7 చాల వరకు చట్ట సంబంధమైన ఆటంకాలు తక్కిన అన్ని సమస్యల కన్నా ఎక్కువ క్లిష్టమైనవి. వర్తమాన పరిస్థితులలో విద్యారంగాన్ని ఉమ్మడిజాబితాలో చేర్చడానికి అవసరమైన రాజ్యాంగ సవరణ చేయాలంటే ఎదురయ్యే చిక్కులను సావధానంగా పరిశీలించాల్సిఉంది. కేంద్ర ప్రభుత్వం జాతీయ విద్యావిధాన నిర్ణయంలోనూ దాన్ని అమలుచేయటంలోనూ గుణాత్మకమైన అభివృద్ధి ఫలితాలు సాధించడంలో ఎంతవరకు ఏ పరిమితుల్లో తన పాత్రను విస్తరింప చేయాలో నిర్ణయించుకోవలసివుంది. తక్కిన ఇతర విషయాలతో పాటే రేపటి భారతదేశంలో భాష అనేది వ్యక్తుల సంచారాలకు అవరోధంగా కాకుండా ఏం చేయాలో, ఏ విధమైన చర్యలు తీసుకోవాలో నిర్ణయించాలి. ఈ ఆలోచన పరంగాను, జాతీయ సమైక్యాన్ని దృష్టిలో వుంచుకొని దేశవ్యాప్తంగా ఏక రూపమైన సమిష్టి జాతీయ బోధన ప్రణాళిక అవసరాన్ని, దాన్ని రూపొందించే విధానావశ్యకతను పరిగణించాలి.

10.8 వర్తమాన వాస్తవికాలకు అనుగుణంగా విశ్వవిద్యాలయాల యాజమాన్య నిర్వహణలో తగిన మార్పులు చేయాలంటే రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు తమ న్యాయచట్టాలను సవరించుకోవలసి వుంటుంది. విశ్వవిద్యాలయాలలో రాజకీయాల జోక్యంలేకుండా చేయటానికి వాటిని ఆధునికం చేయటానికి కేంద్ర ప్రభుత్వం తీసుకోతలపెట్టిన చర్యలను గురించి సంపాదించాలనుకుంటున్న అధికారాలను గురించి తర్జన భర్జనలు జరుగుతున్నాయి. ఈ విషయంలో కూడా పరస్పరం సంప్రదింపుల ద్వారా ఒక నిర్ణయానికి రావలసివుంది.

11.1 నిధులకొరతను గురించి వెంటనే పట్టించుకొని ఏదైనా పరిష్కారమార్గం ఆలోచించాలి. తగినన్ని నిధులు సమకూర్చుకోని పక్షంలో, ఆర్థికవనరులు చాలినంతగా లభ్యంకాని పక్షంలో, ప్రాథమిక విద్యను సర్వత్రా వ్యాపింపచేయాలన్న ఆశయం, వృత్తివిద్యా సౌకర్యాలను విస్తృతం చేయాలనే ప్రతిపాదనలు నిరక్షరాస్యతా నిర్మూలన, బోధనాపద్ధతులను మెరుగుపరచడం, ప్రథమశ్రేణీ సంస్థల స్థాపనం మొదలైనవి స్థాపించడం జరగదు. ఇందుకు అవసరమైన వనరులను ఏ విధంగా కూర్చుకోవడమనేది వెంటనే ఆలోచించి ఒక నిర్ణయానికి రావాలి. ఈ విషయం నిర్ణయించడానికి కేంద్ర, రాష్ట్రాల సంయుక్త సంఘాన్ని నియమించడం మంచిదనిపిస్తుంది. విద్యారంగానికి కావలసిన వనరుల సమస్యలను దీర్ఘకాలిక ప్రాతిపదికపై ఎలాంటి వ్యూహాలను అమలుపరిచి అట్టి వనరులను సమకూర్చుకోవాలి అనే విషయాలను ఈ సంఘం ప్రతిపాదించాలి.

11.2 మొత్తం సాంఘిక వ్యవస్థలో విద్య ఒక ప్రత్యేకమైన అంతర్ వ్యవస్థ ఎంతమాత్రమూ కాదు. సంఘంలోని వాతావరణాన్ని బట్టి విద్యారంగం పనిచేస్తుంది. సంఘాన్నిబట్టి దాని బాగోగులుంటాయి. సాంఘిక వ్యవస్థాపరమైన విస్పష్ట లక్షణాలు విద్యారంగంలో తప్పక ప్రతిబింబిస్తాయి. ఆ లక్షణాలే విద్యారంగంపై కూడా పనిచేస్తాయి. భారతీయ సమాజంలో కొత్త కొత్త భావాలకు, మార్పులు తేవాలనే ఊహకూ, ప్రయత్నాలకూ సహజంగా స్వాగతం లభించదు. శతాబ్దాలుగా ఈ దేశంలో తర్క కర్కశ తాత్త్విక విశ్లేషణను మేధావివర్గం కష్టపడి పోషించుకుంటూ వస్తున్నది. దీన్ని మేధావివర్గమూ, అధికార యంత్రాంగమూ కలిసికట్టుగా, తమకు అనుకూలంగా దుర్వినియోగ పరుస్తున్నాయి. కొత్త ప్రయత్నాలు ఏమాత్రం ప్రారంభం కాకుండా పైకిమాత్రం తమకేమీ తెలియనట్లే, తామేమీ ఎరుగనట్లే భంగపరచడం జరుగుతున్నది. ఈ కొత్తవైన మౌలిక యత్నాలను ఎన్నెన్నో షరతులకు ముందుగా గురిచేసి మరెన్నో నియమనిబంధన పూర్వపక్షాలను వర్తింపచేసి చివరకు అంగుళంకూడా ముందుకు సాగకుండా ఈ అధిష్ఠాన అవరోధకులు చేయగలరు.

11.3 ఇంకొక రెండు లక్షణాలను ప్రత్యేకించి పేర్కొనాలి. ఒకటి నిజమైన అధికారబద్ధమైన అజమాయిషీని ప్రజల ప్రయోజనకారులస్థాయికి బదిలీచేయడానికి ప్రభుత్వ విద్యా యంత్రాంగాలు ఇష్టపడకపోవడంవల్ల పాఠశాలలకు, ప్రజలకు ఉండవలసిన నిజమైన సంబంధం లేకుండా ఉండేందుకు వీలులేకుండా పోతున్నది. రెండోది ఈ వ్యవస్థ తాలూకు విడివిడి వర్గాలుగా వేరుపడి ఉండే లక్షణం. ఈ లక్షణం విద్యా రంగానికి ఇతర రంగాల పరస్పరం సంబంధించిన అభివృద్ధి కార్యక్రమాలతో సమాన స్థాయిలో కలివిడితనంతో కూడికలంకె ఏర్పరచుకొనే అవకాశం కలిగించడంలేదు.

12.1 జనాభా నియంత్రణ ఆశించినమేరకు ఫలవంతమవుతుందని సార్వత్రిక విద్యా వ్యాప్తి కూడా అనుకున్న విధంగా సాధ్యమవుతుందని అనుకుని ఉజ్జాయింపుగా బడ్జెట్ పద్దులో పాఠశాల విద్యకు ఎంతఖర్చు అవసరమవుతుందో లెక్కగట్టిచూస్తే 1990 నాటి ఏకీకృతవ్యయ ప్రమాణస్థిర సూచిక ప్రకారం 1980-81 కేటాయింపు పద్దుల స్థాయికి అది నాలుగురెట్లు ఎక్కువగా ఉంటుందని తెలుస్తున్నది. 1981 లో ఉన్న ఉపాధ్యాయ సిబ్బంది (21.7 లక్షలు) కన్నా 1990 నాటికి భారతదేశానికి సుమారు 22 లక్షల మంది ఉపాధ్యాయులూ, సిబ్బందీ అదనంగా కావల్సివస్తుంది. పాఠశాల విద్యాబోధన పద్ధతులలో ఎటువంటి మార్పు ఉండబోదని అనుకొన్నపుడు

మాత్రమే ఈ అంచనా సరిపోతుంది. కాని అట్లాఅనుకోవడం కుదరదు. కనీస వసతి సౌకర్యాలైనా వెంటనే సమకూర్చుకోక తప్పదు. ఈ విషయంలో ఇవి ఎంతమాత్రం బాగుచేయడానికి వీల్లేదు.

13.1 ఈ విధమైన రంగస్థలాన్ని పరిగణనలోకి తీసుకుంటే 11 సంవత్సరాల వయస్సు పైబడినదాకా అవిచ్ఛిన్న విద్యాభ్యాసం సాగే విషయంలో ఎదురయ్యే అవరోధాలను కూడా లెక్కలోకి తీసుకొని కొందరు విద్యా ప్రణాళిక రచయితలు విద్యకు సంబంధించిన ఒక సార్వత్రిక విధానాన్ని రూపొందించడం జరిగింది. ఈ విధానం ప్రకారం చేసిన సూచనలు: ప్రాథమిక పాఠశాలలలో ఇప్పుడున్న అంగన్‌వాడీలను కలిపివేసి పూర్వ ప్రాథమిక, ప్రాథమిక విద్యాబోధనను 5వ తరగతి దాకా నిర్వహించడం, ఆ పైని సార్వత్రిక పాఠశాలల ద్వారా దూర బోధన పద్ధతిలో VI వ తరగతి - VIII వ తరగతి స్థాయి వరకు పెద్ద ఎత్తున సామూహిక పద్ధతిలో సాగించడం. ఇదివరలో ఉద్దేశించిన విధంగా 10+2+3 ఏర్పాటులో మాదిరిగా కాకుండా ఇంకా చిన్న వయస్సప్పుడే వృత్తి విద్యలో నిమగ్నమయ్యే ప్రవృత్తివైపు పెద్ద ఎత్తున విద్యావిధానాన్ని మళ్ళించడం.

13.2 సంఘంలో విద్యావ్యాప్తి తగినంతగా వృద్ధిచేసే వ్యూహమూ, గుణాత్మకంగా విద్యాభివృద్ధిని సాధించే విషయమూ, ముఖ్యంగా ఒక అంశంమీద ఆధారపడి వుంటాయి. ఆ ప్రధానాంశం ప్రకారం సంఘంలో నిరంతర విద్యా వ్యాసంగం మీద అభిరుచి, ఉత్సుకత ఉన్న సామూహిక అధ్యయన తత్పర సమాజం అంటూ ఉండాలి. ఇటువంటి సమాజంలో అన్ని వయస్సులవాళ్ళూ విద్యావ్యాసంగాన్ని కొనసాగిస్తూనే ఉంటారు. వయోజనవిద్యాభివృద్ధికిగాను కంకణం కట్టుకొని ప్రయత్నిస్తేకానీ అటువంటి వాతావరణం సాధించలేము ఈ బ్రహ్మాండమైన పూనిక కేవలం అక్షరాస్యత సాధించడంతో ఆగిపోదు. ఇది ఆర్థికమైన సుస్థిరతను చేకూరుస్తుంది. అంతేగాక ఇందులో పాల్గొనేవాళ్ళ జీవిత స్థాయిని అది మెరుగు పరుస్తుంది. వయోజన విద్యావ్యాప్తి కార్యక్రమాలలో మహిళలకు కేంద్ర స్థానం కల్పించాలన్న విషయం గుర్తించడం జరిగింది. విద్యవల్ల సత్వర ప్రయోజనాలను వాళ్ళు గుర్తించగలిగేట్లు చేయగలిగితే సాధారణమైన ప్రాథమిక విద్యను సర్వేసర్వత్రా ప్రవేశపెట్టడంలో అట్టే కష్టం వుండదు. ముఖ్యంగా ఆడపిల్లలు విద్య నేర్చుకోవడంలో ఆటంకాలు తొలగి అది సులభ సాధ్యమవుతుంది. కుటుంబ సంక్షేమ కార్యక్రమాలు కూడా బాగా చురుకుగా, చైతన్యవంతంగా సాగుతాయి. ఇంకా దీనివల్ల శక్తి, వనరుల పరిరక్షణ, అటవీ సంపద సంరక్షణ, ఆరోగ్య సంవర్ధనం, రోగ నివారణ సామర్థ్యం సాధించగలుగుతాము, ఇంతేకాదు. ప్రజాస్వామ్య పునాది సుదృఢంగా విస్తరిస్తుంది

13.3 10+2 దశలో ఉన్నత విద్యా బోధన ఏర్పాటులో వృత్తివిద్యా కార్యక్రమాల విస్తరణకు ప్రత్యేకమైన ప్రాముఖ్యం ఇవ్వడం జరిగింది. ఇంతే కాకుండా ఈ దశకు ఇంకాముందు సమయంలోనూ, ఈ ఏర్పాటుకు సంబంధం లేకుండా కూడా ఇది జరిగింది. ఈ వ్యవస్థలో రూపొందించిన నిర్ణయం కేవలం పరిశ్రమల రంగంలో ఉద్యోగం సంపాదించడానికే. వృత్తి విద్యాబోధన పరిమితంకాదని, అది మాత్రమే దాని ధ్యేయం కాదని వ్యవసాయ రంగంతోను, ప్రభుత్వ సేవావిభాగంతోను గ్రామీణాభివృద్ధికి వర్తింపచేసే వివిధ కార్యక్రమాలతోను దానికి ఒక చక్కని సమన్వయం ఉంటుంది. అది తమ ఉపాధి తామే సంపాదించుకోవడాన్ని యువకులకు నేర్పాలి. వృత్తి విద్యార్జన అంటే చౌకగా ఏమీ ఖర్చు లేకుండా సాధించే వ్యవహారం అని ఎంతమాత్రమూ అనుకోకూడదు. చాలా మటుకు యంత్రసామాగ్రి కొనుగోలు, పరికర సామాగ్రి అవి పనిచేయడానికి కావలసిన పదార్థాలు, వీటిమీద కొంత పెట్టుబడి ఖర్చు ఎట్లాగూ తప్పదు. కనక వృత్తి విద్యారంగంలో ప్రవేశపెట్టే వ్యక్తుల సంఖ్యనూ, వాళ్ళకు ఆ తరువాత కల్పించగల ఉద్యోగావకాశాలనూ ముందు నిర్ధారణగా బేరీజు వేసుకొని మాత్రమే నిర్ణయించాల్సి ఉంటుంది.

13.4 వృత్తి విద్యావిధానాన్ని ప్రవేశపెట్టడంలో ఎదురయ్యే ప్రధానమైన అవరోధాలు: అంగబలం ఎంత అవసరమవుతుందో నిర్ధారణగా నిర్ణయించడానికి నమూనా అంచనా పద్ధతులు రూపొందించక పోవడం, కొన్నికులాల, వర్గాలవారు వృత్తి విద్యార్జనపట్ల వైముఖ్యం ప్రదర్శిస్తూ ఉండటం, వృత్తి విద్యాప్రవాహంలో ప్రవేశించిన వాళ్ళకు ఎదుగూ బొదుగూ ఉండదన్న అనుమానాలు - అంటే ఉద్యోగాభివృద్ధిలో పైమెట్టు కాని, విస్తరణావకాశంకాని ఉండదనే భావం, వృత్తి విద్యార్జనకూ, వృత్తి పరమైన విద్యకూ మధ్య ఖచ్చితమైన తేడా ఏమిటో స్పష్టంగా తెలుసుకోలేకపోవడం, వృత్తి విద్యార్జనకూ ఉత్పాదన కేంద్రాలకూ మధ్యగల సంబంధమేమిటో ఇదమిత్థంగా తెలియక పోవడం.

14.1 అన్నిరకాల విద్యలకు, సాంఘిక వ్యవస్థకు మధ్య ఉండే సంబంధాలను గురించిన ఇతర అంశాలు నొక్కిచెప్పడం జరిగింది. విద్యావ్యవస్థలో వికేంద్రీకరణను ప్రవేశపెట్టి విద్యాబోధ వివిధదశలను వాటిలో పాల్గొనే లేదా వాటివల్ల ప్రయోజనాన్ని పొందే సాంఘిక వర్గాల ప్రజలకు విద్యాలాభనూ, వాటి భారాన్ని అప్పగిస్తే అవి మరింత ప్రయోజనకరంగా రూపొందగలవన్న విషయాన్ని సూచించడం జరిగింది.

14.2 ముఖ్యంగా పాఠశాలా విద్యా నిర్వహణను ఆ గ్రామాలలోని పౌర సంఘాల అజమాయిషీకి క్రమంగా అప్పగించ పెట్టడమనేది విద్యా వ్యవస్థ వికేంద్రీకరణకు ధ్యేయం. ఈ గ్రామీణ పాఠశాలా నిర్వాహక సంఘాలనుంచే ఆ పాఠశాల సక్రమంగా నడప డానికి కావలసిన వనరులు, సహాయం, మార్గదర్శకం పొందడం జరుగుతుంది. జిల్లా విద్యా కేంద్రాలు, విద్యా ప్రణాళికలు రూపొందించడం లోను, శిక్షణ ఇవ్వడంలోను, విస్తరణ కార్యక్రమాలలోను, క్రియాశీల పరిశోధనలో కేంద్రస్థానాలుగా పనిచేస్తాయి. ప్రణాళికా రూపకల్పనలో ఉద్దేశించిన వికేంద్రీకరణ విధానంలో అంగవైకల్యం కలవారి విశేష అవసరాలనూ, అసాధారణమైన తెలివితేటలు, ప్రతిభ చూపగల పిల్లల ప్రత్యేక అవసరాలనూ నిర్లక్ష్యం చేయడం జరగదు.

14.3 ఉన్నత విద్యా రంగానికి సంబంధించినంత వరకు చాలామంది నొక్కి వెలిబుచ్చిన అభిప్రాయాలు ఈ విధంగా ఉన్నాయి. సాధారణ విద్యార్జనపట్ల విశేష శ్రద్ధాభిరుచి, నిమగ్నతలేని విద్యార్థులను వారి వారి అభిరుచికి చెందిన వృత్తివిద్యా శిక్షణవైపు మళ్ళించవలసి ఉంటుంది. ఇందుకు వాళ్ళు సూచించిన పద్ధతు

1. విద్యార్జనల్లో విద్యార్థుల పొందిక ప్రతిభా నిబద్ధతలను గుర్తించి పరీక్షలు నిర్వహించడం.

2. అటువంటి పరీక్షల ద్వారా మాత్రమే కళాశాలల్లో, విశ్వవిద్యాలయాలలో వారికి ప్రవేశార్హత కల్పించడం.

3. ఉద్యోగాలకు, డిగ్రీలకు లంకె లేకుండా చేయడం.

14.4 పట్టభద్రస్థాయి దిగువ విద్యకూ, పైవిద్యకూ మరింత సార్థక సంబంధాలను గుణాత్మకంగా పెంపొందింపచేయడానికి ప్రతిపాదించిన ఇతర చర్యలు :

1. క్రమక్రమంగా మరిన్ని పాఠశాలలకు స్వయంప్రతిపత్తిని కలిగించడం

2. తద్వారా చివరకు ఏక సమయంలో నిర్వహించే సార్వ విద్యార్థిక పరీక్షలకు స్వస్తి పలకడం

3. విశ్వవిద్యాలయాలకు కళాశాలల అనుబంధాన్ని రద్దు పరచడం.

కళల్లో, విజ్ఞాన శాస్త్రాల్లో మానవీయ శాస్త్రాల్లో కోర్సులను పునఃరూపొందించడంలో అవి సంపూర్ణమైన, స్వయంసమృద్ధమైన, సమర్థమైన శక్తితో స్వయందాలకంగా ఉండి సామాజిక అవసరాలతో, సాంఘిక ప్రయోజనాలతో, కర్మజగత్తుతో అత్యంత సన్నిహిత సంబంధం కలిగి ఉండేటట్లు చూడాలి.

ఈ పై విషయాలలో ఆయా కోర్సులను సిద్ధాంత జ్ఞానంతో, భాషలతో, ప్రసార నైపుణితో, సంస్కృతితో, క్రీడలతో, వృత్తి విజ్ఞాన పరమైన కార్యక్రమాలతో అభ్యసన యోగ్యంగా రూపొందించవచ్చు.

14.5 సంప్రదాయ బోధన పద్ధతిలో పనిచేసే కొత్త కళాశాలల స్థాపనంపై నిషేధాన్ని విధించాలన్న ప్రతిపాదన ఉన్నది. బహూకార్థసాధక ప్రయోజనాలు సాధించగల వృత్తి విద్యాబోధనకు అవకాశం ఉన్న కళాశాలల స్థాపనకు మాత్రమే అనుమతి లభింప చేయాలనుకోవడం జరిగింది. వ్యవసాయం, గృహఆర్థిక విజ్ఞానం, దేశీయార్థిక వ్యవస్థ, అటవీ విజ్ఞానం, భూ, జల వినియోగాభివృద్ధి విజ్ఞానం, నగరాభివృద్ధి, ప్రణాళికా రచన, రవాణా నిర్వహణ, ప్రభుత్వ శాఖల నిర్వహణ, కార్యాలయ నిర్వహణ మొదలైన వాటిలో సమగ్రమైన కోర్సులు రూపొందించి కార్యజగత్తుకు,జ్ఞాన జగత్తుకు కొత్త కళాశాలలు వారధిని నిర్మిస్తాయి.

నూతనవిద్యా విధానాన్ని అమలు చేయడంలో కావలసిన బహుముఖమైన వ్యూహరచనలో ప్రాథమిక విద్యను సార్వత్రికం చేయడానికి కావలసిన సాధన సంపత్తిని, అత్యంతాధునిక శక్తి, స్ఫూర్తులతో నూత్న, సాంకేతిక విజ్ఞాన ఫలితాలను సృజనాత్మక ప్రతిభతో వినియోగంలోకి తేగల అంగబలాన్ని సృష్టించుకోవడాన్ని, వైవిధ్య వికసితమైన వృత్తి విద్యాబోధన పద్ధతులను, వయోజన నిరంతర విద్యావ్యాసంగాన్ని ఇదోధికంగా వ్యాపింప చేయడాన్ని సమన్వయ పరచే సర్వ సమగ్ర స్ఫూర్తి నివ్వగల లక్షణాన్ని ప్రతిపాదించడమూ, ఆవిష్కరించడమూ జరిగింది. ★



పార్లమెంటులో కేంద్ర ప్రభుత్వం ప్రవేశపెట్టిన 'విద్యా రంగపు సవాలు' అనే ముసాయిదా పత్రం విస్తృత స్థాయిలో చర్చలకు విడుదల చేయబడింది. దాన్ని ప్రతినిధుల అవగాహన కొరకు ఈ బులెటిన్‌లోనే ముద్రిందాం. దానిపై యు. టి. యఫ్. అభిప్రాయాన్ని కూడా స్థూలంగా మహాసభ ముందుంచుతూ చర్చలకు ఆహ్వానిస్తున్నాము.

1936 లో కొఠారి కమిషన్ నియమింపబడింది. దాని ప్రాతిపదికగా 1968 లో జాతీయ విద్యావిధానాన్ని రూపొందించారు. దాని ప్రగతిని ప్రతి ఐదు సంవత్సరాల కొకసారి సమీక్షించాలని, కొత్త విధానాలను, కార్యక్రమాలనూ రూపొందిస్తూ వుండాలని భావించడం జరిగింది

ఎట్టకేలకు 17 సం॥ల తర్వాతనైనా దానిని సమీక్షించటం, కొత్త విధానాలను రూపొందించి చర్చలకు విడుదల చేయటం ముదావహం. అయితే పాత ఒక రోతగానో, కొత్త ఒక వింతగానో గాక ఇది రాజ్యాంగ లక్ష్యాలకు అనుగుణంగా వున్నదా? దేశాభివృద్ధికి పనికి వస్తుందా? సమాజ అవసరాలను తీరుస్తుందా? దీనిలో ఏ వర్గ ప్రయోజనాలు ఇమిడి వున్నాయి? ఈ విషయాలన్నీ సాంగోపాంగంగా పరిశీలిస్తే తప్ప నూతన విధానంలో మంచి చెడులు తెలియవు. ఈ దృష్టితో మనం నేడు కేంద్ర ప్రభుత్వం విడుదల చేసిన ముసాయిదా పత్రాన్ని పరిశీలించి, నిర్దుష్టమైన వ్యాఖ్యలు చేయాల్సి వుంది. ఇప్పటికే మన రాష్ట్రంలో అనేకమంది యీ అంశంపై వివిధస్థాయిల్లో సెమినార్లు జరిపారు. సభల్లో, గోష్టుల్లో, చర్చల్లో పలువురు విద్యావేత్తలు పాల్గొని తమతమ అభిప్రాయాలు తెలిపారు. ఈ సందర్భంగా వాటన్నిటిని పరిగణనలోకి తీసుకొని మనం మన అభిప్రాయాన్ని తెల్పాల్సి ఉంది

ఈ నివేదికలోని అంశాలను మూడు భాగాలుగా విభజింపవచ్చు. 1) నేటి లోపాల సమీక్ష 2) గుణపాఠాలు 3) నూతన విధానాలు. మొత్తం ముసాయిదాలో నేటి లోపాల సమీక్ష చాలా వివరంగా ఉన్నది. స్పష్టంగా అనేక లోపాలు అంగీకరింపబడ్డాయి. అయితే దానినుండి తీసుకొన్న గుణపాఠాలు గాని, అందుకు తెలిపిన కారణాలు గాని వాస్తవానికి దగ్గరగా లేవు. అందుచే నూతన కార్యక్రమంకూడా వివాదాస్పదంగా తయారయింది

## మన రాజ్యాంగ లక్ష్యాలు

ఏ విధానానికైనా మూలం రాజ్యాంగ నిర్దేశాలు. మన రాజ్యాంగ చట్టంలో "సామాజిక, ఆర్థిక, రాజకీయ న్యాయంమీద, సమాన హోదా, సమానావకాశాలమీద ఆధారపడివుండే సమాజాన్ని అది భావించింది" అంతేగాక దేశం సామ్యవాదానికి లౌకికతత్వానికి, ప్రజాస్వామ్యానికి నిబద్ధమై ఉందన్న విషయాన్ని కూడ రాజ్యాంగం నొక్కి చెప్పింది.

మన రాజ్యాంగంలోని 45వ పరిచ్ఛేదం ప్రకారం "ఈ సంవిధానం ప్రారంభం నుండి పది సంవత్సరముల గడువు లోపల పిల్లలందరకు పదునాలుగు సంవత్సరముల వయస్సు పూర్తియగునరకు ఉచిత నిర్బంధ విద్యను ఏర్పాటు చేయాలి." అయితే పై ముసాయిదాలో పేర్కొన్నట్లు 10 సం॥లు కాదుకదా నేటికి 39 సం॥లు గడిచినా ఈ లక్ష్యాలు 25 శాతం కూడ విజయం సాధించలేదు.

1981 జనాభా లెక్కల ప్రకారము 1985 నాటికే దేశంలో 6-14 సం॥ల వయస్సు పిల్లలు 15 కోట్లు ఉంటే వారిలో 9.8 కోట్ల మంది మాత్రమే ప్రాథమిక పాఠశాలల్లో చేరారు. అంటే అది 68.4% మాత్రమే. వారిలో 77% 14 సం॥లోపుగానే పాఠశాలను వదలివేస్తున్నారని ముసాయిదాలోనే పేర్కొన్నారు. పాఠశాలలో చేరినవారి సంఖ్య వందయితే వాస్తవంగా పాఠశాలకు హాజరవుతున్నవారి సంఖ్య వారిలో 75% మాత్రమే.

1981 జనాభా లెక్కల ప్రకారం మన దేశం అక్షరాస్యత 36 287. అంటే మన జనాభాలో 64 % చదువురానివారు అని అర్థం. వీరిలో కూడ పురుషులకంటే స్త్రీల సంఖ్య ఎక్కువగా ఉంది. దీనికి కారణాలేమిటి?

గత 6 పంచవర్ష ప్రణాళికలలో విద్యకు కేటాయింపులు క్రమంగా తగ్గిపోయాయని ముసాయిదాలో పేర్కొన్నారు.

ముసాయిదాలో పేర్కొన్నట్లు మొదటి పంచవర్ష ప్రణాళికలో విద్యారంగం వాటా 7.2శాతం కాగా 6వ పంచవర్ష ప్రణాళిక కాలానికిది 2.6 శాతానికి కుదించుకుపోయింది. దానిలో గూడ 95 శాతం ఉపాధ్యాయుల జీతభత్యాల క్రిందా, పాఠశాల నిర్వహణ క్రిందా మాత్రమే ఖర్చయిపోతున్నదని పేర్కొనబడింది.

మరి దీనికి బాధ్యత ఎవరిది? ఈ దేశాన్ని స్వల్పకాలం మినహా గత 39 సం॥రాలు అవిచ్ఛిన్నంగా పరిపాలించిన కాంగ్రెసు ప్రభుత్వమే దీనికి బాధ్యత వహించవలసి వుంటుంది. 14 ఏండ్ల వయస్సు వచ్చే వరకు నిర్బంధ ఉచిత ప్రాథమిక విద్య గరపడం రాజ్యాంగ బాధ్యత. అందుచే దీనిని నెరవేర్చడానికి కేంద్ర ప్రభుత్వం పూర్తి బాధ్యత వహించాలి. ప్రస్తుత ముసాయిదా దీనికి ఎంత వరకు బాధ్యత వహిస్తుందో పరిశీలించాలి.

15 సం॥లలో 21వ శతాబ్దంలో ప్రవేశించనున్నాము. కాబట్టి దానిలో ప్రవేశించ అర్హత కలిగేలా నూతన విద్యావిధానముండాలనేది ముసాయిదా లక్ష్యం. అయితే మనస్థితి ఎలా ఉన్నా 21వ శతాబ్దం రాకామానదు పోకామానదు. అందుచే 21వ శతాబ్దం కొరకు గాకుండా మన సమాజ అవసరాల దృష్ట్యా దీన్ని మనం ఆలోచించాలి. శాస్త్ర సాంకేతిక రంగాలలో ప్రపంచం శరవేగంతో అభివృద్ధి చెందిండికాబట్టి, నూతన యంత్రాలు అనేకం ప్రజల జీవనగమనంలోకి వస్తున్నాయి. కాబట్టి దానికి సరిపడునట్లు కొంత మందిని తయారు చేయాలా? జనాన్నంతటిని నూతన గమ్యంవైపు నడపాలా అన్నది నేటి సమస్య.

ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్యాలక్ష్యాన్ని 1990 నాటికి

చేరాలనుకుంటే 7వ ప్రణాళికలో 20వేల కోట్లు కేటాయించాలి. దానికి 22 లక్షల మంది అదనపు ఉపాధ్యాయులు కావాలి. అయితే 5% అభివృద్ధి సాధించాలన్న 7వ ప్రణాళికలో 18 మిలియన్ అమెరికా డాలర్లు అంటే 21 వేల 6వందల కోట్ల రూపాయల విదేశీ రుణం అవసరమవుతుంది అయితే మన ఎగుమతులు రెట్టింపు కాకపోతే ఈ రుణంలో 40% తిరిగి వడ్డీ చెల్లింపులకే సరిపోతుంది. ఈ ఆర్థిక పరిస్థితి యొక్క నేపథ్యంలో మనం ఆలోచించాలి.

## విద్య - సామాజిక పరివర్తన

సామాజిక పరివర్తనకు విద్య ముఖ్య పరికరము. అయితే సామాజిక పరివర్తన కేవలం ఒక్క విద్యవల్లనే సాధ్యంగాదు. విప్లవాత్మకమైన ఆర్థిక, రాజకీయ, సాంఘిక సంస్కరణలు చేస్తేగాని సాధ్యంగాదు. పాఠశాలలకు ఎక్కువమంది పిల్లలను పంపకపోవడానికి, పంపిన వారిలో ఎక్కువమంది మధ్యలోనే విరమించడానికి, అన్నిటికన్న ముఖ్యమైన కారణం తలిదండ్రుల ఆర్థికదుస్థితి. ఇదిపోవాలంటే సామాన్య ప్రజల ఆర్థికస్థితి బాగుపడాలి. ఆస్తి సంబంధాలలో మార్పు రావాలి. భూసంస్కరణలు, పట్టణ ఆస్తులపై గరిష్ట పరిమితి విధించడం మొదలైన మౌలిక సంస్కరణలు సామ్యవాద సూత్రాలకనుగుణంగా ఆర్థిక రంగంలో ప్రవేశపెట్టటం మినహా దీనికి గత్యంతరం లేదు.

## కేంద్ర రాష్ట్ర బాధ్యతలు

విద్య మొదట రాష్ట్ర జాబితాలో ఉండేది. కాని 1976 లో దాన్ని ఉమ్మడి జాబితాలో చేర్చారు. నూతన విద్యా విధానంలో క్రమంగా విద్యనంతటిని కేంద్రం గుప్పెటలో ఉంచుకోవాలనే ప్రయత్నం కనిపిస్తున్నది. వివిన్న జాతులు, మతాలు,భాషల సంస్కృతులతో పాటు ఆర్థిక వ్యత్యాసాలు కలిగిన మనదేశంలో విద్య ఆయా ప్రజల అవసరాలకు, సంస్కృతుల పరిరక్షణకు ఉపయోగపడాలంటే అది రాష్ట్ర బాధ్యతగా ఉండాలి. అయితే విద్యాభివృద్ధికి తగినట్లు ఖర్చుపెట్టుటకు తగిన ఆర్థిక వెసులుబాటు కల్పించాలి. అది కేంద్ర ప్రభుత్వ కర్తవ్యం.

## సార్వజనీన ప్రాథమిక విద్య

కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు రెండూ కూడా 1990 నాటికయినా 14 సం॥లోపు వారందరికి విద్య గరిపేదానికి ఆలోచించకుండా ఈ బాధ్యత నుండి తప్పించుకునే విధానాన్ని ఆలోచిస్తున్నాయి. దీనికి చిట్కా మార్గంగా అనియత విద్యను ప్రవేశపెడుతున్నారు. పాఠశాలకు రావడానికి వీలు లేని వారికి, పరిశ్రమలలో, వృత్తులలో పని చేసేవారికి నిరంతర విద్యగాను, తమ వృత్తులలో నైపుణ్యం పెంచుకోడానికి అనియత విద్య గరపడం అభిలషణీయం.

అయితే డబ్బు లేదనే సాకుతో నిర్బంధ ప్రాథమిక విద్య జయప్రదం చేయడానికి కావలసిన ఏర్పాట్లు చేయకుండా 14 సం" లోపు వయస్సు వారిని అనియత విద్యా కేంద్రాలలో చేర్చడం అంటే ఈ సమస్యను ప్రక్కదారులు పట్టించడమే అవుతుంది. అనియత విద్య నియత విద్యకు ప్రత్యమ్నాయంకారాదు, కాజాలదు.

పాఠశాలలో చేరి మధ్యలో వదలిపెట్టడానికి కారణాలు గమనించి తలిదండ్రులకు ఆర్థిక ప్రోత్సాహాలు కల్పించడం, పాఠశాల భౌతిక పరిస్థితులు మెరుగుపరచడం, ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తి శాస్త్రీయంగా వుండుటకు తగినంత మంది ఉపాధ్యాయులను నియమించడం చేయాలి. దానికయ్యే ఖర్చుపెట్టడానికిగాను దేశంయొక్క మొత్తంగమ్మాన్ని ఈ 5 సంవత్సరాలు విద్యవైపు మరల్చాలి.

## ప్రతిభా పాఠశాలలు

ప్రతిభగల విద్యార్థులను ఎన్నికచేసి జాతి మొత్తం ఖర్చులో వారిని ప్రత్యేకమైన పౌరులుగా తీర్చిదిద్దాలనే లక్ష్యంతోను కేంద్ర ప్రభుత్వ విధానాలను, భాషావిధానాలను నిర్బంధంగా రాష్ట్రాలమీద రుద్దాలనే ప్రయత్నమే ఈ ప్రతిభా పాఠశాలల లక్ష్యం. ప్రతిభగల పిల్లలకు ప్రత్యేక ప్రోత్సాహాలీయవచ్చు కాని, సామాన్యులకొక విద్య, ప్రతిభగల వారికొక విద్య, ధనవంతులకొక విద్య, పేదలకొక విద్య అయితే అది రాజ్యాంగ లక్ష్యాలకు విరుద్ధమని మా అభిప్రాయం. అందుచే ఈ పాఠశాలల ఆలోచన విరమించాలి. దానికి బదులు అన్ని పాఠశాలల సాధారణ పరిస్థితులు మెరుగుపరచటానికి కృషిచేయాలి. ప్రతిభగలవారికి వేసవిలో ప్రత్యేకమైన అదనపు శిక్షణ గరపవచ్చు.

## వృత్తి విద్య

ఈ విషయంలో మనదేశంలో అనేక ప్రయోగాలు జరిగాయి. గాంధీగారు బేసిక్ విద్యావిధానం వుండాలని సూచించారు మొదలియార్ కమిటీవారు 10, 11, 12, తరగతులలో సాంకేతిక విషయాలతో సహ బహూళార్థక ప్రయోజనాలు వుండాలన్నారు. కొఠారి కమీషన్ వారు 10+2 కాలంలో+2 కాలం వృత్తి విద్యకు ప్రాతిపదికగా వుండాలని, కనీసం 50శాతం మందికి+2 లో వృత్తి విద్యలు గరపడానికి వీలుండాలని సూచించారు. అంతేగాక+2 దశలో సాంకేతిక విద్య నేర్చుకున్నవారు చదువుమానుకొంటే ఉపాధికి తోడ్పడేదిగా అనైపుణ్యం వుండాలని మా అభిప్రాయం.

అయితే మనరాష్ట్రంలో 8 తరగతి నుండి కొన్ని పాఠశాలలో ఈ విద్య ప్రవేశపెడుతున్నారు. డిగ్రీ స్థాయి నిపుణులైన ఇంజనీర్లు, డాక్టర్లకు నిరుద్యోగం నెలకొనియున్న మనదేశంలో కూడా సాంకేతిక నైపుణ్యం కలిగివుండే సైన్యాన్ని తయారుచేసి పాఠశాల స్థాయి నుండి జీవితంలోకి నెట్టివేయడం ప్రమాదకర పరిణామాలకు దారితీస్తుంది. అందుచే ఈ కోర్సులు ప్రవేశపెట్టేటప్పుడు వీరిని ఇముడ్చుకునే విధంగా పారిశ్రామిక వ్యావసాయక విధానముండాలి. + 2 స్థాయి నుండి వృత్తివిద్య ప్రవేశపెట్టాలని కేంద్రము, 8 వ తరగతి నుండి ప్రవేశపెట్టాలనే రాష్ట్ర ప్రభుత్వ పథకాల మధ్య సమన్వయం ఉండాలి. పాఠశాల విద్య వరకు ఇది సాధారణ విద్యలో భాగంగానే ఉండాలి.

## ఉన్నత విద్య

ఉన్నత విద్య అందరికి అందుబాటులో ఉండాలా ? లేక దాని

ప్రవేశాన్ని నిరుత్సాహపరచాలా ? అనేది నేటి చర్చనీయాంశం. మన అవసరాలకు మించి గనుక నేటి కళాశాలలు, విద్యార్థులు ఉంటే తప్పకుండా మనం నిరుత్సాహపరచాల్సిందే. కాని ముసాయిదాలోనే పేర్కొన్నట్లు మనదేశంలో ఉన్నత విద్యను అభ్యసించదగిన ఈడు గల వారిలో 4.5 శాతం మంది మాత్రమే ఉన్నారు.

ఉన్నత విద్య సామాన్య జనానికి దూరం చేయటం ప్రమాదకరం. అంతేగాక నేడు అనేక రాష్ట్రాలలోను, అనేక ప్రాంతాలలోను ఇప్పటి కళాశాల విద్యకు సరియైన వసతులు లేవు. వారికే ఇది సమ్మెట పోటులాంటిది. మనం దీనిని గట్టిగా ప్రతిఘటించాలి.

అలాగే డబ్బు లేదనే పేరుతో క్యాపిటేషన్ ఫీజును ప్రోత్సహించడం, సాంకేతిక విద్యను ప్రైవేటు పారిశ్రామికవేత్తలకు అమ్మివేసే విధానం ప్రమాదకరమైనది.

## డిగ్రీలకు, ఉద్యోగాలకు ఉన్న సంబంధం విడగొట్టడం

డిగ్రీలకు, ఉద్యోగాలకున్న సంబంధాన్ని విడగొట్టడం విద్యావంతులైన యువకుల నిరుద్యోగ సమస్యను వదిలించుకోవడానికి చేసిన తెలివైన ప్రయత్నం తప్ప మరేమీకాదు. ఈ పద్ధతివల్ల ప్రభుత్వ యంత్రాంగానికి దగ్గరగా వుండే ఉద్యోగవర్గమూ, ఉన్నత వర్గాలే మొత్తం ఉద్యోగావకాశాలన్నీ దోచుకుంటాయి. సామాన్య ప్రజానీకానికి అర్హతనుబట్టి లభించే ఉద్యోగాలు పూజ్యమవుతాయి. పరీక్షా విధానంలో లోపాలను సవరించడానికి బదులు, ఈ పరీక్షల అనంతరం యిచ్చే సర్టిఫికెట్లు ప్రామాణికమైనవి కావనడం అశాస్త్రీయం. ఇది తామిచ్చే సర్టిఫికెట్లను తామే కించపరచుకోవటం అవుతుంది.

## విద్య — ఆధ్యాత్మిక విలువలు

మన చరిత్ర, సంస్కృతిలో నున్న అనేక విలువలు ఆనాటి సమాజానికి ఎంతో ఉపయోగపడ్డాయి. వాటిలో కొన్ని మాత్రమే అన్ని కాలాలకు ఉపయోగపడతాయి. మారే సమాజాన్ని బట్టి నైతిక విలువలు కూడ మారతాయి. పెరుగుతున్న శాస్త్రీయ విజ్ఞానాన్ని సంస్కృతి పేరుతో మత మౌఢ్యాలను, కులవ్యవస్థను పటిష్టం చేసే ప్రయత్నాన్ని ప్రతిఘటించాలి. అయితే దేశభక్తి, త్యాగం, సేవాభావం, ఉన్నత నైతిక ప్రమాణాలు పెంపొందించేందుకు కృషి జరగాలి.

## ఉపాధ్యాయ శిక్షణ

ఉపాధ్యాయుని నిరంతరం విద్యను అభివృద్ధిపరచే ఇన్ సర్వీస్ ఉపాధ్యాయ శిక్షణా విధానం మెరుగుపరచాలి. వృత్తియందు గౌరవం ప్రేమ కలిగి ఉన్నత ప్రమాణాలు గలవారిని ఉపాధ్యాయ వృత్తికి ఆకర్షించాలి. వారి ఆర్థిక పరిస్థితి సంతృప్తికరంగా మెరుగుపరచాలి.

## విద్య — సామాజిక అదుపు

ప్రాథమిక, మాధ్యమిక విద్య వరకు గ్రామాలలోను, పట్టణాలలోను ఉండే తల్లిదండ్రులు విద్యాభిమానులు ఎక్కువగా భాగస్వాములను చేయాలనటం మంచిదే. అయితే ఎందులో వారు భాగస్వాములు కావాలి ? పాఠశాలలకు భౌతిక వనరులు కల్పించడానికి, ఉపాధ్యాయుడు తన ధర్మాన్ని సక్రమంగా నిర్వర్తించే దానికి తోడ్పడేవరకే అది పరిమితం కావాలి. అంతేగాని ఉపాధ్యాయుల వేతనాలపైగాని, సర్వీసు విషయాలలోగాని వారి జోక్యం సహించరాదు. కొద్దిమంది సంపన్న వర్గాలే రాజకీయాధికారం చెలాయించే మన దేశంలో యిది మరింత ప్రమాదకరం.

## విద్యాలయాలు ప్రజాతంత్రం

విద్యా సంస్థల, విద్యార్థి ఉపాధ్యాయ సంఘాల ప్రజాతంత్ర కార్యక్రమాల గొంతు నొక్కడానికే ఈ ముసాయిదాలో ప్రయత్నం జరిగింది. యూనివర్శిటీ పాలక మండలికి గాని, విద్యార్థి సంఘాలకు గాని ఎన్నికలు జరుగరాదని సూచన చేయడం జరిగింది. ప్రజాస్వామ్యం రాజ్యాంగలక్ష్యంగా ఉన్న మన దేశంలో అడుగడుగునా ప్రజాస్వామ్యం కాపాడబడాలి. యదార్థానికి వాటిల్లో జోక్యం చేసుకొంటున్నది, సంక్షోభం సృష్టిస్తున్నది పాలకవర్గాలే. కేంద్రాధిపత్యంలో ఉండే గవర్నర్లు వైస్ ఛాన్సలర్ల నియామకాల్లో రాష్ట్ర ప్రభుత్వాలను త్రోసిపుచ్చిన అనేక ఘటనలు ఉన్నాయి. తమ దోపిడీ నిరాఘాటంగా సాగటానికి పాలక వర్గాలే పలుచోట్ల కల్లోల పరిస్థితుల్ని సృష్టిస్తున్నాయి. తమ లోపాల్ని ఇతరులమీద రుద్దడం పై సూచన పరమార్థం.

## సార్వత్రిక విశ్వ విద్యాలయాలు

వెనుక పేరాలలో చెప్పినట్లు అనియత విద్య కొనసాగింపుగా సార్వత్రిక విశ్వ విద్యాలయం ఉండాలి. కళాశాలలో చదువుకు వయస్సు దాటినవారికి, ఉద్యోగాలలోను, వృత్తులలోను ఉండేవారికి, గృహిణులకు విద్యావకాశాలు కల్పించుటకు మాత్రమే అవి వుండాలి. అయితే నేడు రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాల లక్ష్యం సార్వత్రిక విద్యాలయాలను పటిష్ఠపరచి మామూలు కళాశాలలవైపు విద్యార్థులను నిరుత్సాహ పరచటం. ఇది ప్రమాదకరం. కళాశాలలో చదివిన విద్యార్థికి కలిగే సమగ్ర మూర్తిమత్వం రేడియోలు, వీడియోలద్వారా విద్య నేర్చుకొనేవారికి రావటం అసంభవం. దీనివల్ల మన జాతి మొత్తం కొంత కాలానికి దిగజారిపోయే ప్రమాదముంది.

## భాషావిధానం

నూతన విద్యా విధానంలో భాషా విధానాన్ని గూర్చి ఎక్కడా చెప్పబడలేదు. కొఠారి కమీషన్ చెప్పిన త్రిభాషా సూత్రం కొన్ని రాష్ట్రాలలో మాత్రమే అమలు చేయబడింది. అచ్చట గూడ కేంద్రం సరైన సహాయం చేయనందున నామమాత్రంగానే జరిగింది. హిందీ ప్రాంతాలలో దక్షిణాది భాషలు నేర్పే ప్రయత్నం అసలు ప్రారంభమే కాలేదు. అందుచే ఈ భాషా విధానంపై తక్షణం ప్రభుత్వం తన విధానాన్ని ప్రకటించాలి. ప్రాథమిక ఉన్నత స్థాయి వరకు మాతృభాష నిర్బంధంగా ఉండాలి. ఆ తర్వాత 6, 7 తరగతులలో రెండవ భాషను ఐచ్ఛికంగా నేర్చుకునే అవకాశం కల్పించాలి. ఉన్నత తరగతులలో 3వ భాషను ఐచ్ఛికంగాను, రెండు భాషలను నిర్బంధంగాను నేర్చుకునే ఏర్పాట్లు జరగాలి.

రాజకీయ విజ్ఞానం, చైతన్యం ఉపాధ్యాయులలోగాని, విద్యార్థులలోగాని దేశ భక్తి పెంపొందించటానికి, దేశం ఎడ తనకున్న

బాధ్యతలను నిర్వర్తించటానికి ఉపయోగపడుతుంది. రాజకీయ చైతన్యం ప్రజాస్వామ్యం జయప్రదంగా సాగటానికి ఎంతో అవసరం. వివిధ రాష్ట్రాల్లో పాలక పక్షాలు గత 30 సం॥రాలుగా తాము పెంచి పోషించిన కుల, మత, ప్రాంతీయ తత్వాల వలననూ, తాము అనుసరించిన రాజకీయ విధానాలవలననూ జరిగిన అసంతృప్తికి వ్యతిరేకంగా విద్యార్థులలో ప్రజ్వరిల్లుతున్న వ్యతిరేకతను ప్రక్క దారులు పట్టించటానికే పాఠశాలలను, విద్యాలయాలను, విద్యార్థులను, ఉపాధ్యాయ సంఘాలను రాజకీయాలకు అతీతం చేయాలనే నిర్ణయం జరుగుతోంది. విశ్వవిద్యాలయాల స్వయం ప్రతిపత్తిని హరించి వాటిని విద్యాశాఖలో భాగంగా, ఉపాంగంగా, అధికారపార్టీ అధికారవర్గం కనుసన్నల్లో మెలిగే విధంగా మార్చే దారుణ ప్రయత్నం జరుగుతున్నది. అదే విధంగా నోరువిప్పి మాట్లాడి తాను ఆలోచించి, విద్యార్థులను ఆలోచింపచేసి వారిని భావి భారత పౌరులుగా, శాస్త్రవేత్తలుగా, మేధావులుగా తయారు చేయవలసిన ఉపాధ్యాయులను ప్రవర్తనా నియమావళి (కోడ్ ఆఫ్ కాండక్ట్) అనే కొరడా ఝుళిపించి నోరెత్తకుండా చేయాలనే ప్రయత్నం కూడా జరుగుతున్నది. ప్రభుత్వందృష్టిలో ఆలోచించి పాఠం చెప్పగల ఉపాధ్యాయుడు ప్రమాదకారి. అందుకే కాబోలు దృశ్య శ్రవణ యంత్రాలను ఉపాధ్యాయులకు ప్రత్యామ్నాయం చేసే ఆలోచన జరుగుతున్నది.

## నూతన విద్యా విధానంపై
## మహాసభ ఆమోదించిన తీర్మానం

నూతన విద్యా విధానం కూడ విద్యారంగానికి పెట్టే పెట్టుబడి భావితరాలను తీర్చి దిద్దేందుకు పెట్టే పెట్టుబడిగా గుర్తించ లేదు. 1960 నాటికే దేశంలో కోట్లాది ప్రజలను అక్షరాస్యులను చేయటంకొరకు రాజ్యాంగంలో లక్ష్యాన్ని పేర్కొన్నా అది విజయవంతం కాలేదు. తరువాత 1990 వరకు ఆ పని చేయాలన్నా అది జరిగే స్థితిలేదు. ఈ నూతన విద్యా విధానంలో ప్రజలందరినీ అక్షరాస్యులను చేసే కార్యక్రమం లేదు. లక్షలాదిమంది డిగ్రీలున్న వారికే ఉద్యోగాలులేని ఈ తరుణంలో డిగ్రీలతో ఉద్యోగాలకున్న సంబంధం తొలగించటం ఏ పరమావధికో అర్థంకాని విషయం. ప్రణాళికలకు-ఉద్యోగాలకు, ఉద్యోగాలకు-డిగ్రీలకు గల సంబంధం గురించి ఆలోచించటం జరుగలేదు. రాబోయే కంప్యూటర్ యుగానికి సరిపోయిన సాంకేతిక విద్యను ప్రవేశపెట్టినప్పటికి అలా తర్ఫీదు పొందిన విద్యార్థులందరికి ఉద్యోగం గ్యారంటీ గురించి ఈ విద్యా విధానం పల్లెత్తు కూడా మాట్లాడలేదు. అనేక కాలేజీలను ప్రైవేటు రంగానికి ప్రోత్సాహమివ్వటం, ఫీజులను విపరీతంగా పెంచి సామాన్యులకు పైచదువులకు అవకాశం కల్పించకపోవటం, ఉన్న అవకాశాలను తగ్గించివేయటం ఈ విధానం ప్రత్యేకతల్లో ఒకటి.

బ్రిటిషు కాలంనాడు ప్రవేశపెట్టబడిన మెకాలే విద్యా విధానానికి కొన్ని మెరుగులుపెట్టి కొనసాగించబడుతున్న ఈ విద్యారంగాన్ని నూతన సామాజిక అవసరాలకు అనుగుణంగా మార్చవలసియున్న విషయాన్ని ఎవరూ కాదనరు. కాని ఆ పేరుతో విద్యారంగాన్ని నూతన ప్రక్రియలకు ఆలవాలంచేసి కోట్లాది ప్రజల ఆశలకు, ఆకాంక్షలకు వ్యతిరేకంగాను, వారి ప్రయోజనాలకు భిన్నంగాను, కొన్ని ప్రత్యేక వర్గాల ప్రయోజనాలను కాపాడేందుకు తీసుకొనే చర్యలను ఈ మహాసభ ఖండిస్తున్నది.

నూతన విద్యావిధానం శాస్త్రీయ ప్రత్యామ్నాయ విధానమైనపుడే మన రాజ్యాంగంలో పొందుపరచిన లక్ష్యాల సాధన సాధ్యమౌతుంది కావున ఈ క్రింది కనీస లక్ష్యాలతో నూతన విద్యా విధానం రూపొందింపబడాలని ఈ మహాసభ విజ్ఞప్తి చేస్తున్నది.

1. 6-14 సంవత్సరాల మధ్య వయస్కులందరికి నిర్బంధ ఉచిత ప్రాథమిక విద్య గరపాలి.

2. ఆధునిక శాస్త్ర పరికరాల ద్వారా వ్యాప్తిచేయాలనుకొనే అనియత విద్య నియత విద్యకు తోడ్పాటునిచ్చేదిగా మాత్రమే ఉండాలి.

3. కాలేజీలు, యూనివర్శిటీల ద్వారా మాత్రమే ఉన్నత వ్యాప్తి చెందాలి. సార్వత్రిక విశ్వవిద్యాలయాలు సాంప్రదాయకంగా నున్న విశ్వవిద్యాలయాల కార్యక్రమానికి తోడ్పడేదిగా ఉండాలి.

4. 1968 విద్యాకమిషన్ సూచించిన విధంగా Neighbur hood Schools స్థాపించి మాతృభాష ద్వారానే విద్యాబోధన జరగాలి.

5. ప్రతి స్థాయిలో విద్యా సంస్థలను ప్రజాతంత్రయుతంగా నడపాలి.

6. ప్రణాళికలతో సమన్వయపరుస్తూ సెకండరీ, హైయర్ సెకండరీ (+2) స్థాయిలలో వృత్తి విద్యాబోధన జరగాలి. ఈ స్థాయి విద్యనుపూర్తి చేసినవారికి ఉద్యోగఅవకాశం కల్పించటంగాని, ఉన్నత విద్యాభ్యాసానికిగాని అవకాశం కల్పించాలి.

7. విద్యా రంగాన్ని ప్రైవేటు సంస్థల నుండి విముక్తి కలిగించి, ప్రభుత్వమే బాధ్యత వహించి నడపాలి.

8. ఉద్యోగాలకు డిగ్రీలతో సంబంధం లేదనే విధానానికి స్వస్తి చెప్పాలి.

9. పాఠ్య ప్రణాళికలలో మతఛాందస భావాలను, ప్రాంతీయ సంకుచిత భావాలను తొలగించి లౌకిక (మతాతీత) అంశాలను, జాతీయ సమైక్యతా, సమగ్రతా భావాలను పెంపొందించే అంశాలతో కూడి ఉండాలి.

10. విద్యను రాష్ట్ర జాబితాలో చేర్చాలి.

11. విద్య అత్యవసర అంశంగా గుర్తించి అవసరమైన నిధులను కేటాయించాలి. కేంద్ర బడ్జెటులో విద్యకు 7 % / 10 % కేటాయించి రాష్ట్రాలకు అందజేయాలి.

ఈ నూతన విద్యావిధానాన్ని శాస్త్రీయ ప్రాతిపదికపై నిర్మించటంలో పై లక్ష్యాలను అమలు జరపాలని, తల్లిదండ్రులతోను, అధ్యాపక-విద్యార్థి సంఘాలతోను, మేధావులతోను, సమగ్ర చర్చ జరిగిన తర్వాతనే సమగ్ర విద్యా విధానాన్ని రూపొందించాలని ఈ మహాసభ సూచిస్తున్నది.

# మహాసభలో ఆమోదించిన తీర్మానాలు

## సంతాప తీర్మానాలు

గత మహాసభ నుండి ప్రజాసేవలో పనిచేస్తూ అమరులైన అంతర్జాతీయ, జాతీయ స్థాయి రాజకీయ, ప్రజారంగ, ఉపాధ్యాయ కార్యకర్తలు మరియు ప్రమాదములలో మరణించినవారి అకాల మరణానికి ఈ మహాసభ సంతాపం తెలియజేయడం తన కనీస కర్తవ్యముగా భావిస్తున్నది.

1. భారతదేశ ప్రధాని, అలీనోద్యమ నాయకురాలు శ్రీమతి ఇందిరాగాంధీ మత ఛాందసులచే ఘోరంగా హత్యగావింపబడినారు. వారి మరణానికి ఈ మహాసభ తన ప్రగాఢ సంతాపాన్ని వ్యక్తం చేస్తోంది.

2 దక్షిణ భారతదేశంలో కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాత, "విశాలాంధ్రలో ప్రజారాజ్యం" పిలుపు ద్వారా ఆంధ్ర ప్రజలను మేల్కొలిపి ఆంధ్రప్రదేశ్ అవతరణకు అంకురార్పణ చేసిన మహనీయుడు, తెలుగుతల్లి ముద్దుబిడ్డ కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్య మరణానికి ఈ మహాసభ తన ప్రగాఢ సంతాపాన్ని తెలియజేస్తున్నది.

3. ఈ కాలములోనే రష్యా కమ్యూనిస్టుపార్టీ ప్రధాన కార్యదర్శి, సోవియట్ దేశ అధ్యక్షుడు కామ్రేడ్ చెర్నెంకో, ఆంద్రోపోవ్‌ల మరణానికి ఈ మహాసభ తన సంతాపాన్ని తెలియజేస్తున్నది.

4. ప. గో. జిల్లా సెకండరీ ఉద్యమ నిర్మాతగా, మన సంఘ ప్రారంభము నుండి ఉపాధ్యక్షులుగా పనిచేసిన కామ్రేడ్ పి. వి. సుబ్బరాజుగార్కి, మన కార్యకర్తలు యస్. ఏసురత్నం, కడలి గంగిశెట్టి, వెంకటరెడ్డి మొదలుగాగల వారి అకాల మరణానికి ఈ మహాసభ తన సంతాపాన్ని తెలుపుతోంది.

5. ఖమ్మంసమితి అధ్యక్షుడు కామ్రేడ్ రావెళ్ళ సత్యనారాయణ, కామ్రేడ్ చెలికాని రామారావు, కామ్రేడ్ ఆరుట్ల రామచంద్రారెడ్డి ట్రేడ్‌యూనియన్ నాయకులు కామ్రేడ్స్ మాలకొండారెడ్డి, బండారు చంద్రరావు, భీష్మారావు, సాలార్ మరియు స్వాతంత్ర్య సమరయోధుడు క్రొవ్విడి లింగరాజుగార్ల మృతికి ఈ మహాసభ తన ప్రగాఢ సంతాపాన్ని తెలియజేస్తున్నది

6. దక్షిణాఫ్రికా విప్లవకవి కామ్రేడ్ బెంజిమన్ మొలాయిజె, ఫిలిప్పైన్స్ ప్రజానాయకుడు అక్వినో దారుణహత్యలను ఈ మహాసభ ఖండిస్తున్నది వారి మృతికి ఈ మహాసభ తన సంతాపాన్ని తెలియజేస్తున్నది.

7. మెక్సికో నగర భూకంపం ప్రమాదములో మరియు కొలంబో అగ్నిపర్వత ప్రేలుడు ప్రమాదములో అకాల మరణానికి గురైన వేలాది ప్రజానీకానికి ఈ మహాసభ శ్రద్ధాంజలి ఘటిస్తున్నది.

8. భోపాల్ గ్యాస్ ప్రమాదములో, కనిష్క విమాన ప్రమాదములో దుర్మరణం పాలైనవారికి, శాస్త్రవేత్త నాయుడమ్మ మృతికి ఈ మహాసభ సంతాపాన్ని తెలియజేస్తున్నది.



శ్రీ జి. లక్ష్మయ్య

9. ఈ కాలములో ఉపాధ్యాయులుగా పనిచేస్తూ ఉద్యమానికి ప్రత్యక్షముగా మరియు పరోక్షముగా చేయూతనొసంగిన ఉపాధ్యాయులందరి మరణానికి ఈ మహాసభ తన సంతాపాన్ని తెలియజేస్తున్నది.

## ఉపాధ్యాయ సంఘాల గుర్తింపు

ఆంధ్రప్రదేశ్‌లో వివిధ యాజమాన్యాలలో పనిచేయుచున్న ఉపాధ్యాయులను ప్రాంతీయ, కేటగిరీ, యాజమాన్య భేదాలను పాటించకుండా సంఘములో చేర్చుకొని వారి హక్కుల సంరక్షణ కొరకు, వృత్తిభద్రతకు, విద్యా ప్రమాణాల పెంపుకు కృషిచేస్తున్న సంఘాలున్నవి. వాటిలో ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ ఒకటి. అది 23 జిల్లాలకు విస్తరించి, 60 వేల సభ్యత్వంతో నేడు పనిచేస్తున్నది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు బోర్డు మాత్రమే కలిగి, నిర్మాణము లేని ప్రాథమికోపాధ్యాయ ఫెడరేషన్ (శేషయ్యగారి సంఘం), ఒకే యాజమాన్యానికి ప్రాతినిధ్యము వహిస్తూ రాష్ట్ర వ్యాపిత నిర్మాణము లేని కొన్ని ఉపాధ్యాయ సంఘాలను గుర్తింపు గల సంఘములుగా పరిగణిస్తున్నారు. వేలాది ఉపాధ్యాయులను రాష్ట్ర వ్యాపితంగా విశాల ప్రాతిపదికపై సమీకరిస్తున్న సంఘాలకు గుర్తింపు లేకుండా వ్యవహరిస్తున్న ఈ ధోరణి అప్రజాస్వామికము, అవాంఛనీయము.

పశ్చిమ బెంగాల్ వామపక్ష ప్రభుత్వం ఆ రాష్ట్రంలో పనిచేస్తున్న అన్ని ఉపాధ్యాయ సంఘాలకు గుర్తింపు ఇచ్చింది. 10 వేలకు పైగా సభ్యులను కలిగి రాష్ట్ర వ్యాపిత ప్రాతిపదికపై విశాలమైన వేదికను నిర్మించుటకు పని చేస్తున్న ఉపాధ్యాయ సంఘాలన్నింటికి గుర్తింపునివ్వవలసిందిగా ఈ మహాసభ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తోంది.

# జనరల్ తీర్మానాలు

## ప్రపంచశాంతి – మన కర్తవ్యం

యుద్ధాలు మానవుడు కొన్ని శతాబ్దాలుగా సంతరించుకొన్న విజ్ఞాన సంపదల వినాశానికి హేతువు. మొదటి ప్రపంచ యుద్ధంలో ఒక కోటి యాభై లక్షలమంది ప్రజానీకం చనిపోయారు. 3 కోట్ల మంది క్షతగాత్రులయ్యారు. కొన్ని వేల కోట్ల సంపద నాశనమైంది. రెండవ ప్రపంచ యుద్ధం 6 కోట్ల ప్రజానీకాన్ని బలిగొన్నది. దాదాపు 1½ రెట్లు క్షతగాత్రులయ్యారు. 4 లక్షల కోట్ల డాలర్ల సంపద నాశనమయింది. రెండవ ప్రపంచయుద్ధం తుది రోజులలో హిరోషిమా నాగసాకీలపై వేసిన అణుబాంబులు 3 లక్షల ప్రజానీకాన్ని బలి గొన్నాయి.

అణుశాస్త్ర విజ్ఞానం పెంపొందింది. అత్యంత శక్తివంతమైన అణుబాంబులు కూడా తయారయ్యాయి. ప్రపంచాన్ని అరడజను సార్లు పూర్తిగా భస్మీపటలం చేయగల అణుబాంబులు తయార య్యాయి. ఈ భూగోళాన్ని 28 నిమిషాల కాలంలోనే భస్మీపటలం చేయగల స్థాయికి అణ్వాయుధాలు తయారై కూర్చున్నాయి. కొన్ని లక్షల సంవత్సరాలనుండి మానవ సంతతి సంతరించుకొన్న విజ్ఞానం, సంపద తృటిలో భస్మీపటలమొనర్చగల స్థాయిలో అణ్వాయుధాలు పెరిగున్నాయి. సోషలిస్టు రష్యా అణ్వాయుధ నిషేధానికి ప్రతిపాద నలు చేస్తుంటే రీగన్ నక్షత్రయుద్ధ పథకానికి రంగం సిద్ధం చేస్తు న్నాడు. మిగిలిన పెట్టుబడిదారీదేశాలు దానికి వంత పాడుతున్నాయి. ప్రపంచ ప్రజానీకం అణు వ్యతిరేక ఆందోళనలో లక్షోపలక్షలుగా పాల్గొంటున్నారు. అణు ప్రమాదాన్ని వారు గుర్తించారు.

మనం ఈ సమాజంలో భాగంగా ఈ దారుణ యుద్ధ ప్రమాదానికి ప్రతిస్పందించాలి. మానవ సమాజం అణుయుద్ధ ప్రమాదము నుండి రక్షింపబడకపోతే భవిష్యత్తు శూన్యము అనే విషయాన్ని ప్రజల ముందుకు తీసుకొనిపోవటంలో మనవంతు కర్తవ్యాన్ని మనం పూర్తిచేయాలి. కావున ప్రపంచశాంతి శక్తులకు మనం దోహదం చేయాలి. శాంతి ఉద్యమంలో చొరవతో పాల్గొనవలసిన కనీస కర్తవ్యం మన ముందున్నదనెడి అంశమును ఈ మహాసభ ఉపాధ్యాయ లోకానికి విజ్ఞప్తి చేస్తోంది.

## రాజ్యాంగంలోని 311 ఆర్టికల్‌ను ఎత్తివేయాలి

రైల్వే ఉద్యోగులు తమను తొలగించిన సందర్భంగా చేసు కొన్న అప్పీలుపై సుప్రీంకోర్టు ఒక తీర్పును ఇచ్చింది.

యజమాని ఒక ఉద్యోగి దేశ సంక్షేమానికి విరుద్ధంగా ప్రవర్తించినట్లు అభిప్రాయ పడినపుడు ఏ రకమైన సంజాయిషీ ఇవ్వ కుండానే రాజ్యాంగంలోని ఆర్టికల్ 311, 2(a) (b) (c) అనుమ తిస్తున్నట్లు తీర్పు సారాంశం.

ఈ తీర్పు ననుసరించి ఆయా యజమానులు ఉద్యోగులను వేదనకు గురిచేసే అవకాశాలు పెరిగినట్లు సుస్పష్టము. ఒక వ్యక్తి హత్యచేసి శిక్ష వేయబోవునపుడు అవకాశం ఇవ్వటమే గాకుండా తీర్పు తర్వాతకూడ పైకోర్టుకు అప్పీలు చేసుకొనే హక్కు వుంటుంది. కాని ఒక ఉద్యోగి తాను తొలగించబడినపుడు కోర్టుకు వెళ్ళే హక్కు కూడ తొలగించబడటం అప్రజాస్వామిక చర్యగా ఈ మహాసభ భావిస్తున్నది. అందువలన ఇట్టి అప్రజాస్వామిక చర్యలకు అవకాశ మిచ్చే రాజ్యాంగంలోని 311, 2(a) (b) (c) లను రాజ్యాంగం నుండి తొలగించాలని ఈ మహాసభ డిమాండు చేస్తున్నది.

## ప్రభుత్వ ఉపాధ్యాయుల సౌకర్యాలన్నిటిని ఎయిడెడ్ ఉపాధ్యాయులకు వర్తింపచేయాలి

ఎయిడెడ్ ఉపాధ్యాయులు విద్యాశాఖలో అత్యంత దీనావస్థలో గల విభాగానికి చెందినవారు. ప్రభుత్వ ఉపాధ్యాయులు ప్రతినెలా చివరిరోజునగాని, మరుసటినెల మొదటి రోజునగాని జీతనాతాలు పొందుతారు. ఎయిడెడ్ వారికి మాత్రం నెలల తరబడి జీతాలు రావు. గ్రాంటువున్నా మరుసటి నెల 10,15 తేదీల లోపల వస్తాయనికూడ నమ్మకం లేదు.

ప్రభుత్వ ఉపాధ్యాయులకున్న యల్. టి. సి. సౌకర్యం, నూతన గ్రూప్ ఇన్సూరెన్సు సౌకర్యం, కలవు సౌకర్యం మొదలైనవి ఎయిడెడ్ ఉపాధ్యాయులకు లేవు.

యాజమాన్యాలు చర్యలు తీసుకొన్నపుడు ఉపాధ్యాయులను రక్షించటానికి చట్టంలో తగిన రక్షణలు రూపొందించలేదు.

చివరకు వేతన నిర్ణాయక సంఘానికి ఇచ్చిన జాబితాలో కూడ ఎయిడెడ్ ఉపాధ్యాయుల వేతనాల విషయం లేదు.

పైన తెల్పిన ఎయిడెడ్ ఉపాధ్యాయుల దయనీయ స్థితిని ఈ మహాసభ గమనించింది. 1) ఎయిడెడ్ ఉపాధ్యాయులకు నాన్ బడ్జటరీ పద్ధతి ప్రవేశపెట్టి వేతనాలు నెల చివరిలో ఇవ్వాలనీ 2) ప్రభుత్వ ఉపాధ్యాయులకున్న యల్. టి. సి. 3) కలవు 4) నూతన గ్రూపు ఇన్సూరెన్సు పథకం మొదలగు సౌకర్యాలను వర్తింపజేయా లని, ఆంధ్రప్రదేశ్ విద్యా చట్టములోని ఉత్తరువులు ఎయిడెడ్ ఉపా ధ్యాయులకు తగు రక్షణ కల్పించునట్లుగా సవరణ చేయాలని, వేతన నిర్ణాయక సంఘం జాబితాలో ఎయిడెడ్ వారి వేతనాలు చేర్చాలని ఈ మహాసభ డిమాండు చేస్తున్నది.

## ప్రత్యేకోపాధ్యాయుల పోస్టులను వెంటనే రెగ్యులర్ పోస్టులుగా మార్చాలి

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు 1983 వ సంవత్సరములో ప్రభుత్వ ఉత్తర్వులు 429, 430 ల ద్వారా రాష్ట్ర వ్యాపితముగా 16,700 ప్రత్యేకోపాధ్యాయులు, పండితులు, పి.ఇ.టి. ల పోస్టులను రూ. 398/- ల స్థిరవేతనముపై మంజూరుచేసియున్నారు. ఈ పోస్టు లను ఏకోపాధ్యాయ మరియు ప్రాథమికోన్నతపాఠశాలలకు కేటాయించి

“ వెలుగుతున్న దీపమే ఇతర దీపాలను వెలిగింపగలదు.
నేర్చుకొన్నవారే ఇతరులకు నేర్పగలరు ”

— రవీంద్రనాథ్ ఠాగూర్



నవయుగ ఫిలిమ్స్

విజయవాడ - సికింద్రాబాద్

# కరువు ప్రాంతాలలో ఫీజులు రద్దు చేయాలి

నియామకములు జరిపియున్నారు. ఇది విద్యావంతులలో నెలకొని వున్న నిరుద్యోగ పరిస్థితిని ఆసరాగా చేసుకొని విద్యా రంగములో సరిక్రొత్త దోపిడీ పద్ధతిని ప్రవేశపెట్టుటయే. వారు పొందు వేతనము నాల్గవ తరగతి ఉద్యోగి వేతనము కంటే తక్కువ. రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులు పొందే ఇంకేవిధమైన అలవెన్సులు వారికి వర్తించవు. వారికెవ్విధమైన శలవు సౌకర్యములు లేవు. వారి ఈ కాలపు సేవలు సేవా కాలముగా పరిగణింపబడదు. ఈ స్థితి ఉపాధ్యాయ లోకము యొక్క ఆత్మాభిమానాన్ని కించపరచుటే. ఇది జాతి ఔన్నత్యాన్ని చాటదు. తెలుగువారి ఆత్మాభిమానాన్ని సంరక్షించుకొనే పద్ధతికాదు. కావున ఏకోపాధ్యాయ మరియు ప్రాథమికోన్నత పాఠశాలలలో నియమింపబడిన 16,700 ప్రత్యేకోపాధ్యాయులందరికి టైమ్ స్కేలు మంజూరీచేస్తూ నిర్ణయము గైకొనవలసిందిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారికి ఈ మహాసభ విజ్ఞప్తి చేస్తోంది.

అట్టి నిర్ణయము ఆంధ్రప్రదేశ్ ఉపాధ్యాయ లోకాన్ని ఊరట పరుస్తుంది. ఈ నిర్ణయము గైనుటలో జరిగే జాప్యము ఈ రాష్ట్రం లోని ఉపాధ్యాయ లోకాన్ని పొరుగు రాష్ట్రమైన తమిళనాడులోని తమ సోదరులు 12 వేల తాత్కాలికోపాధ్యాయుల సేవల క్రమబద్ధీకరణ కొరకు సాగించిన చారిత్రాత్మక పోరాటములాంటి పోరాటాని కాయత్తపరచే అవకాశాలు లేకపోలేదని ఈ మహాసభ హెచ్చరిస్తున్నది.

## ఉపాధ్యాయ - విద్యార్థి నిష్పత్తి

6-14 సంవత్సరముల మధ్య వయస్కులందరిని విద్యావంతులను చేయాలనే రాజ్యాంగ లక్ష్యము నెరవేరలేదు. విద్య మానవ ప్రగతికి, సాంఘిక ఉత్పాదనాభివృద్ధికి, తోడ్పడుతుందనే అంశము పూర్తిగా గుర్తింపబడలేదు. ఈ దశలోకూడ దిన దినము పాఠశాలలో విద్యార్థుల ప్రవేశములు ఉపాధ్యాయ-విద్యార్థి నిష్పత్తి శాస్త్రీయముగా లేదు. ప్రాథమి పాఠశాలల్లో ఉపాధ్యాయ విద్యార్థి - నిష్పత్తి 1:50 నుండి1:100 వరకున్నది. ప్రాథమికోన్నత, సెకండరీ పాఠశాలల్లో 1:60 నుండి 1:100 వరకున్నది. ఈ స్థితి ఆశించిన లక్ష్యాలు నెరవేరటానికి తోడ్పడదనే విషయం సుస్పష్టము. కావున ప్రాథమిక పాఠశాలలో ఉపాధ్యాయ - విద్యార్థినిష్పత్తి మైదాన ప్రాంతాలలో 1:20 గాను గిరిజన ప్రాంతాలలో 1:15 గాను, ప్రాథమికోన్నత, ఉన్నత పాఠశాలలలో 1:30 గాను వుండాలని ఈ మహాసభ కోరుతోంది. విద్యాప్రమాణాలు పెరగడానికి ఈ చర్య అవసరమని ఈ మహాసభ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తోంది.

## పాఠశాల భవనాల నిర్మాణం

ఆంధ్రప్రదేశ్ అనేక వేల ప్రాథమిక, ప్రాథమికోన్నత, ఉన్నత పాఠశాలలు చెట్లక్రింద పాకల క్రింద నడుస్తున్నాయి. ఉన్న భవనాలలో హెచ్చు భాగము జీర్ణస్థితిలో నున్నవి. సరియైన పాఠశాల భవనము లేకుండా విద్యాభివృద్ధి ఆశించిన ప్రమాణాలలో జరుగదు.



శ్రీ వి. సూర్యనారాయణరాజు

ఈ స్థితినుండి మనము గట్టెక్కాలి. అన్ని పాఠశాలలకు పక్కా భవనాలను ఏర్పాటు కావాలి. కావున ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారు ఐదేండ్ల కాలములో పాఠశాల నిర్మాణాలను పూర్తిచేయుటకు బడ్జెటులో సంవత్సరమునకు 25 కోట్లు ప్రత్యేకముగా కేటాయించాలని ఈ మహాసభ విజ్ఞప్తి చేస్తోంది.

## కరువు ప్రాంతాలలో ఫీజులు రద్దు

ఆంధ్రప్రదేశ్‌లోని 23 జిల్లాలలో అత్యధిక భాగము ఈ సంవత్సరము అనావృష్టికి గురయ్యాయి. తుపాను తాకిడికి కొన్ని జిల్లాల ప్రజలు అమితంగా నష్టపోయారు. ఈ ప్రకృతి వైపరీత్యాలు పేదలనే కాక ధనిక, మధ్య తరగతి రైతాంగాన్ని కూడా ఇక్కట్ల పాలు చేశాయి.

ఈపరిస్థితులలో తల్లిదండ్రులు పిల్లలపరీక్ష, ఫీజులు స్పెషల్ ఫీజులు చెల్లించుటకు అనేక కష్టాలెదుర్కొంటున్నారు. కావున కరువు ప్రాంతాలలోని కళాశాల, పాఠశాల విద్యార్థులకు ఫీజుల పూర్తి మాఫీ నొసంగవలసినదిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని ఈ మహాసభ కోరుతున్నది.

## ట్రైబల్ వెల్ఫేర్ ఉపాధ్యాయుల సమస్య పరిష్కరించాలి.

(ఎ) సర్వీసుల క్రమబద్ధీకరణ : గిరిజన ప్రాంతాలలో గిరిజన సంక్షేమ శాఖవారు పాఠశాలలను తెరిచారు. వానిలో పనిచేయుటకు ఉపాధ్యాయుల నియామకాలు చేస్తున్నారు. దాదాపు 15 సంవత్సరాలు గడిచినా ఈనాటికి వానిలో పనిచేయుచున్న ఉపాధ్యాయుల సర్వీసులను క్రమబద్ధీకరణ చేయలేదు. కావున వెంటనే ఆశ్రమ పాఠశాలలలో

పనిచేసే ఉపాధ్యాయుల సర్వీస్ క్రమబద్ధీకరణకు ఉత్తర్వులివ్వవలసినదిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని ఈ మహాసభ కోరుతోంది.

(బి) శిక్షణా సౌకర్యము : ఆశ్రమ పాఠశాలలో పనిచేయుటకుగాను శిక్షణార్హత లేనివారిని నియామకము చేసికొనుట జరిగినది. వారికి శిక్షణ లేదనే నెపముతో సర్వీసులో పొందవలసిన సౌకర్యములను పొందలేకపోవుచున్నారు. శిక్షణ యోగ్యతలేని, ఉపాధ్యాయులందరికి శిక్షణావకాశాలు జీతభత్యములతో కలుగజేయవలసినదిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారికి ఈ మహాసభ విజ్ఞప్తి చేస్తోంది.

(సి) నివాసగృహాల నిర్మాణము : గిరిజన ప్రాంతాలలో పనిచేయు ఆశ్రమ పాఠశాలలో పని చేయు ఉపాధ్యాయులు నివాస వసతి సౌకర్యములేక నానా బాధలు పడుచున్నారు. అద్దెకు కూడ వారు పనిచేయు ప్రాంతాలలో ఇల్లు దొరుకుట కష్టము. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు వెంటనే ఆశ్రమ పాఠశాలలలో పనిచేయు ఉపాధ్యాయులకు ఆ ప్రాంతాలలో గృహ నిర్మాణము చేపట్టవలసిందిగా ఈ మహాసభ కోరుతోంది

## మధ్యాహ్న భోజన పథకాన్ని తిరిగి ప్రవేశపెట్టాలి

1982లో ప్రాథమిక స్థాయిలోని విద్యార్థులకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంచే మధ్యాహ్న భోజన పథకం ప్రవేశపెట్టబడింది. సుమారు ఒక సంవత్సరం నిండిందో లేదో నిర్వహణలో అవకతవకలు జరుగుతున్నాయని ఆ పథకాన్ని రద్దు చేసింది.

మనది నిరుపేదల దేశం. అనేకమంది తల్లిదండ్రులు తమ చిన్నారుల కడుపునిండా తిండి పెట్టలేక బడికి పంపలేని స్థితియందున్నారు. మధ్యాహ్న భోజన పథకంలో ఎన్ని అవకతవకలు జరిగినప్పటికి చెప్పలేనంత మంచి జరిగింది. పాఠశాలలు క్రిక్కిరిసిపోయాయి. ఆ పథకం అమలు జరిగినన్నాళ్ళు బాల బాలికల సంఖ్య పెరిగింది. అనేక రద్దు కార్యక్రమాలతోపాటు పవిత్రమైన మధ్యాహ్న భోజన పథకం రద్దయింది చిన్నారుల సంఖ్య తగ్గింది.

అందువలన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వెంటనే మధ్యాహ్న భోజన పథకాన్ని తిరిగి ప్రవేశపెట్టాలని ఈ మహాసభ కోరుతున్నది. అవకతవకలు జరగటానికి ఉన్న అవకాశాలను తొలగించి పథకం జయప్రదంగా నడపడానికి చర్యలు తీసుకోవాలని ఈ మహాసభ విజ్ఞప్తి చేస్తున్నది.

## వేతన నిర్ణాయక సంఘం నివేదికను త్వరగా విడుదల చేయాలి

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారు నియమించిన వేతన నిర్ణాయక సంఘం, స్టాఫ్ మరియు ఉద్యోగ సంఘాలచే చేయబడిన సూచనలతో వెంటనే వేతన నిర్ణాయక నివేదికను విడుదల చేయాలని ఈ మహాసభ కోరుతున్నది.

## కంట్రిబ్యూషన్ పోస్టులకు వెంటనే గ్రాంటు మంజూరుచేయాలి

తల్లిదండ్రుల కమిటీలచే ఆయా నిర్ణీత మొత్తములను డిపాజిట్టు చేయించుకొని పాఠశాలలను అప్‌గ్రేడ్ చేయుట జరుగుతున్నది. ఆ డబ్బుతో పబ్లిక్ కంట్రిబ్యూషన్ పోస్టులను మంజూరీ చేయుచున్నారు. బాలుర పాఠశాలల్లో 5 సం॥ల వరకు, బాలికల పాఠశాలల్లో 8 సం॥ల వరకు ప్రభుత్వమునకు ఖర్చులేకుండా కంట్రిబ్యూషన్‌లో వేతనములను ఈయవలసియున్నది. కాని అట్టి కంట్రిబ్యూషన్ వేతనముల క్రింద త్వరత్వరగా ఖర్చయిపోయి ఉపాధ్యాయులు వేతనములు లేక బాధపడుతున్నారు. తల్లిదండ్రులు భరించుస్థితిలేదు.

అందువలన ప్రభుత్వము ఈ రకమైన గ్రాంట్-ఇన్-ఎయిడ్ పద్ధతులను మార్చి ఉపాధ్యాయులు నియమించబడిన వెంటనే గ్రాంటుకు అనుమతించవలసిందిగా ఈ మహాసభ కోరుతున్నది. ఇప్పటివరకు గల అన్ని పోస్టులకు వెంటనే గ్రాంటుకు అనుమతించవలసిందిగా ఈ మహాసభ డిమాండు చేస్తున్నది.

## ఉచితంగా పాఠ్యపుస్తకముల సరఫరా

ప్రస్తుతము పాఠ్యపుస్తకముల సరఫరా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికొక సమస్యగా తయారైంది. హరిజన, గిరిజన బాల, బాలికలకు సంక్షేమ శాఖవారు పాఠ్యపుస్తకముల సరఫరాకు బాధ్యత తీసుకొనినను సక్రమముగా సరఫరా చేయుటలేదు. ఆంధ్రప్రదేశ్‌లో పెక్కు కుటుంబములవారు అల్పాదాయ వర్గానికి చెందినవారే. తమ పిల్లలకు పాఠ్యపుస్తకములు కొనుటకు కూడ వారికి భారముగానే తయారవుతున్నది. సంక్షేమశాఖ వారినుండి హరిజన, గిరిజన వర్గాలకు సక్రమముగా సకాలములో పంపిణీ జరుగకపోవుట మూలమున విద్యార్థులు పాఠ్యపుస్తకములు లేకనే ఎక్కువ కాలము గడపవలసి వస్తున్నది. ప్రారంభ దినమునుండే విద్యార్థికి పాఠ్యపుస్తకములు అందుబాటులో నుండవలయునన్న ప్రభుత్వమువారే ఉచితముగా సరఫరాకు పూనుకొనవలయును. అన్ని వర్గాలవారి పిల్లలకు ఉచితముగా పాఠ్యపుస్తకములు సరఫరా చేసినను సంవత్సరానికి 10 కోట్లు మించి ఖర్చుకాదు. వందలకోట్లు అభివృద్ధి కార్యక్రమాలపై ఖర్చుచేసే మన ప్రభుత్వానికిది తలకుమించిన భారము కాదు. పశ్చిమ బెంగాల్ ప్రభుత్వమువారు చేపట్టిన ఈ సత్కార్యమును ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు కూడ స్వీకరించుట ఉచితము. పాఠ్యపుస్తకాలను పాఠశాలలకు ప్రారంభ దినమునాటికే ప్రధానోపాధ్యాయుల ద్వారా ఉచితముగా అందజేయవలసిందిగా ఈ మహాసభ విజ్ఞప్తి చేస్తోంది.

# హిందీ పండితులకు రక్షణ కల్పించాలి

## ఉపాధ్యాయులకు బోనస్ చెల్లింపు

పారిశ్రామిక కార్మికులకు 8 1/3 కనీస బోనస్ చెల్లిస్తున్నారు. రైల్వే, పోస్టల్ ఉద్యోగులకు బోనస్ చెల్లింపు జరుగుతున్నది. బోనస్ అనునది వాయిదాపడిన జీతముగా సర్వే సర్వత్రా అంగీకరింపబడింది.

విద్యా ఉత్పాదన పెంపుకు దోహదము చేస్తుందని శాస్త్రీయముగా విశ్లేషణ జరిగినది. విద్యారంగములో పనిచేసేవారు ఉత్పాదనా పురోభివృద్ధికి పరోక్షముగా తోడ్పడుతున్నారు. కావున ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు పారిశ్రామిక సంస్థలు, కేంద్రప్రభుత్వము చెల్లిస్తున్నట్లుగా సంవత్సరానికి ఒక నెలదినముల బోనస్ చెల్లించుటకు ఉత్తర్వులీయవలసినదిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారికి ఈ మహాసభ విజ్ఞప్తి చేస్తోంది.

## కుటుంబ సంక్షేమ పథకముక్రింద మినహాయించిన సొమ్మును జి.పి.ఎఫ్ లో కలపాలి

ఆగష్టు 1975 నుండి అక్టోబరు 1984 వరకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారు కుటుంబ సంక్షేమ పథకంక్రింద ఉపాధ్యాయుల నుండి నెలకు 10 రూ.ల చొ॥న మినహాయించినారు. గ్రూపు ఇన్సూరెన్సు పథకమును ప్రారంభించిన నాటినుండి ఈ మినహాయింపులను నిలుపుచేశారు. సదరు మినహాయింపుల మొత్తాలను ఆయా ఉపాధ్యాయుల జి.పి.ఎఫ్. ఖాతాలకు వెంటనే జమచేయాలని ఈ మహాసభ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తోంది.

## రీగ్రూపింగ్ స్కేళ్ళ సవరణ

కంబైండ్ క్యాటగిరీ (ప్ర.ఉ.లు, సెలక్షన్ గ్రేడ్ అసిస్టెంట్లు, డిప్యూటీ ఇన్స్పెక్టర్లు, ఇ. ఓ. ఎడ్యుకేషన్) పోష్టులలో పనిచేయుచున్నవారి 1978 స్కేలు రు, 750-1,300 లను రీగ్రూప్డ్ స్కేళ్ళలోని క్యాటగిరీ I రు. 900-1,500 లకు సమానం చేయాలి.

## ప్రధానోపాధ్యాయుల 10/15 సం॥ స్కేళ్ళు

పూర్వపు ప్ర. ఉ. స్కేలులోని సర్వీసును పరిగణించి అర్హులైన ప్రధానోపాధ్యాయులకు 10/15 సం॥ల స్పెషల్ గ్రేడ్, స్పెషల్ ప్రమోషన్ గ్రేడ్ అమలుజరపాలి.

## ట్రిబ్యునల్ ఉత్తర్వుల అమలు

ఆంధ్రప్రదేశ్ అడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యునల్ తీర్పులను వెంటనే అమలుజరపాలని ఈ మహాసభ కోరుతున్నది.

## బదిలీల కోడ్

అన్ని ఉపాధ్యాయ సంఘాలతో సంప్రదించి బదిలీల కోడ్ తయారు చేసి అమలుజరపాలి.



శ్రీ టి. అంజిరెడ్డి

## హిందీ పండితులకు రక్షణ కల్గించాలి

1986-87 విద్యా సంవత్సరమునుండి హిందీని 6,7 తరగతులలో తొలగించి, 8వ తరగతి నుండి మాత్రమే బోధించాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 525 జి.ఓ. యిచ్చింది. అందువల్ల ఏ ఒక్క ఉపాధ్యాయుడు ఉద్యోగం కోల్పోకుండా, ఎవరి ప్రమోషను అవకాశాలు నష్టపడకుండా, సీనియారిటీ దెబ్బతినకుండా, ప్రభుత్వం రక్షణ చర్యలు గైకొనాలని ఈ మహాసభ కోరుతున్నది. వారికి ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేసిన తర్వాత మాత్రమే ప్రభుత్వము సదరు ఉత్తర్వు అమలు జరపాలని డిమాండ్ చేస్తున్నాం.

## బి.ఇడి., గ్రేడు I పండితులకు టెస్టు మినహాయింపు

26-3-85 నాటి చర్చలలో ప్రభుత్వం హామీయిచ్చిన విధంగా బి.ఇడి. తదితర గ్రూపు II ఉపాధ్యాయులకు అక్కౌంట్ టెస్టు మినహాయింపు గ్రూపు III వారికివలె యిచ్చి 1-12-82 నుండి 10-15 సం॥రల స్కేల్సు అమలు జరపాలి; మరియు గ్రేడు I భాషా పండితులకు అక్కౌంట్ టెస్టు అర్హత కల్పిస్తూ, వారికి కూడా పైవారివలె ప్రమోషను టెస్టు మినహాయింపు యివ్వాలి.

## ఇన్ సర్వీసు బి. ఇడి. లను, పండితులను అప్ గ్రేడు చేయాలి

1-6-77 తర్వాత సెకండరీ గ్రేడు స్కేలులో పనిచేస్తున్న బి.ఇడి. ఉపాధ్యాయుల ప్రమోషను గురించి ప్రభుత్వం ఇంతవరకు చర్యలు గైకొనలేదు. వారు ఏ విధమైన ప్రమోషను లేకుండా సీనియారిటీకూడా కోల్పోవుచున్నారు. కొఠారి కమీషన్‌ను అర్హతబట్టి స్కేలు యివ్వమని చెప్పినా ఈ నాటికి దానిని అమలు జరుపలేదు. వెంటనే వారందరిని అప్ గ్రేడు చేసి బి.ఇ.డి. స్కేలు యివ్వాలి.

# చట్టబద్ధమైన విద్యాబోర్డులకు విద్యను అప్పగించాలి



శ్రీ యస్. విజయకుమార్

భాషా పండితులకు 10-8-83 న జి.ఓ. ఇచ్చినా 11-3-82 నాటికి క్వాలిఫికేషను వున్నవారికి మాత్రమే గ్రేడు I స్కేలు వర్తింపజేశారు. దీనివలన చాలామంది నష్టపోయారు. 11-3-82 తర్వాత క్వాలిఫికేషన్‌ను పొందినవారందరికి గ్రేడు I స్కేలు ఇవ్వాలని ఈ మహాసభ కోరుచున్నది.

## బాల్వాడీ టీచర్ల సమస్యలు పరిష్కరించాలి

బాల్వాడి, కిండర్ గార్డెన్, నర్సరీ స్కూల్సులో పనిచేస్తున్న వారికి ఒక వేతన విధానం లేదు. రకరకాలుగా జీతాలు ఇస్తున్నారు. వారందరిని విద్యాశాఖ ఆధీనం క్రిందకు తీసుకు రావాలని, వాటిని ప్రీ - ప్రైమరీ పాఠశాలలుగా పరిగణించి అందలి ఉపాధ్యాయులకు గ్రూపు III వేతనం రు. 530 - 750 స్కేల్సు ఇవ్వాలని కోరుతున్నాము.

బాల్వాడీ టీచర్లుగా శిక్షణ ఇస్తున్నవారికి ఏ విధమైన ఉద్యోగాలు యిచ్చుటలేదు. ఇచ్చిన శిక్షణ నిరుపయోగమేగాక వారందరు నిరుద్యోగులుగా వుండిపోతున్నారు. వారందరికి సెకండరీ గ్రేడ్ శిక్షణ ఇచ్చి ఉపాధ్యాయులుగా నియమించాలని ఈ మహాసభ కోరుతున్నది.

## చట్టబద్ధమైన విద్యాబోర్డులకు విద్యను అప్పగించాలి

పంచాయత్‌రాజ్ ఉపాధ్యాయులు ప్రొవిన్షలైజ్ కాబడ్డా వారి పరిస్థితులు ప్రభుత్వం చక్కబరచలేదు. మేనేజిమెంటు అపాయింటుమెంటు, ప్రమోషనులు అసందిగ్ధంగానే వుండిపోయాయి. వెంటనే అన్నిటిని చక్కబరచి కోఠారి చెప్పిన చట్టబద్ధమైన విద్యా బోర్డులకు పాఠశాలలను అప్పగించాలని యు.టి.యఫ్. నాల్గవ విద్యా వైజ్ఞానిక మహాసభలు ప్రభుత్వాన్ని కోరుతున్నవి.

## అదనపు విద్యార్హతలకు అదనపు ఇంక్రిమెంట్లు

అదనపు విద్యార్హతలకు అదనపు ఇంక్రిమెంట్లు రీగ్రూపింగ్ వేతనాలలో ప్రభుత్వం హామీ ఇచ్చినా ఇంతవరకు అమలు జరుపలేదు. వెంటనే ఎట్టి షరతులు లేకుండా అందరికి అమలు జరపాలని ఈ మహాసభ కోరుచున్నది.

## రిటైరైన తేదీకి పెన్షన్ ఇవ్వాలి

ఉపాధ్యాయులు రిటైరైన తేదీకి పెన్షన్, గ్రాట్యుటీ, ఇతర ఆర్థిక సౌకర్యాలు ఇవ్వాలని, ప్రయోగాత్మకంగా కృష్ణ, కర్నూలు, మహబూబ్‌నగర్ జిల్లాలలో అమలు జరిపిన విధంగా జిల్లా విద్యాశాఖాధికారులే పెన్షన్ మంజూరు చేసే విధంగా అన్ని జిల్లాలలో అమలు జరుపాలని కోరుతున్నాము.

## ఉపాధ్యాయులకు బస్ పాస్ సౌకర్యం

హైదరాబాదు పట్టణంలో యన్. జి. ఓ. లకు అమలు జరుపుతున్న బస్ పాస్ సౌకర్యం ఉపాధ్యాయులకు కూడా అమలు జరపాలని, సదరు సౌకర్యం ఇతర పట్టణాలకు కూడా వర్తింపజేయాలని కోరుతున్నాము.

## పాఠశాల కంటెన్‌జెన్సీలు పెంచుట

పాఠశాలల నిర్వహణకు కంటెన్‌జెన్సీ రేట్లు ఏనాడో నిర్ణయించినవి. కొన్నిచోట్ల అవి ఉపాధ్యాయునికి రు|| 25లు, స్వీపరుకు రు|| 0-75 చొ||న అర్థరహితముగా వున్నవి. వాటిని సరిజేసి, రాష్ట్ర వ్యాప్తంగా ఒక్క పద్ధతిలో అమలు జరిపించ కోరుచున్నాము.

## పరీక్షల నిర్వహణ వేల్యుయేషన్ రేట్లు పెంచాలి

పదవతరగతి పరీక్ష ఇన్ విజిలేషన్‌కు రు. 10-00 లు చొప్పున, పేపరు వేల్యుయేషన్‌కు ప్రతిపేపరుకు రు. 1-50 ల చొ||న పెంచాలి. 7 వ తరగతి వేల్యుయేషన్‌కు పేపరుకు రు. 1-00 చొ||న యివ్వాలని కోరుతున్నాము.

## ఇంగ్లీషు శిక్షణ అలవెన్సు పెంచాలి

ఇంగ్లీషు లాంగ్వేజి టీచింగు (ఇ యల్.టి.సి.) కి శిక్షణ కాలములో ఉపాధ్యాయులకు దినసరి బత్తెం రు. 15-00 లు చొ||న చెల్లిస్తూ ఒకేసారి యివ్వాలని కోరుతున్నాము.

## యల్. టి. సి. కి పాస్ పద్ధతి అమలు జరపాలి

ఉపాధ్యాయులకు అమలుజరుగుతున్న ప్రస్తుత యల్.టి.సి. కొన్ని అనర్థాలకు కారణమగుతున్నందున పాస్‌లు యిచ్చు పద్ధతి ద్వారా సవరించి అమలు జరిపింపగోరుతున్నాము.



శ్రీ యస్. ఆర్. పోలిశెట్టి

## పి. ఇ. టి. ల సమస్యల గురించి

700 దాటిన ప్రతి హైస్కూలులో పి.డి. పోస్టులు వెంటనే యివ్వాలని, షార్టెండు బి.పి.ఇ.డి., యం.పి.ఇ.డి. కోర్సులకు ఇన్‌సర్వీసు వారికి కోటా పెంచాలని, అన్ని జోనులలోను రీజినల్ ఫిజికల్ ఎడ్యుకేషన్ ఇన్‌స్పెక్టర్ పోస్టులు మంజూరు చేయాలని కోరుతున్నాము.

## మున్సిపల్ ఉపాధ్యాయులకు ప్రావిడెంట్ జేషన్ సౌకర్యాలు

ప్రభుత్వ, పంచాయతిరాజ్ ఉపాధ్యాయులు పొందుచున్న అన్ని సౌకర్యాలు మునిసిపల్ ఉపాధ్యాయులకు కూడా వర్తింప చేయాలని కోరుతున్నాము.

## విద్యాసౌకర్యాలకు ఆదాయ పరిమితి పెంపు

విద్యాసౌకర్యాలకు, ఫీజులు, స్కాలర్ షిప్పులు పొందుటకు 18 వేల ఆదాయపరిమితికి పెంచాలని కోరుతున్నాము.

## నిబంధనావళికి సవరణలు

1) 6 వ పేజి "3 నిబంధనావళి" అను శీర్షిక క్రింద 4 వ క్లాజుగా చిహ్నము :- వృత్తమునందు U, T. F. జెండా ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ చిహ్నముగా ఉండును" అని చేర్చబడును.

2) 7 వ పేజి క్రింద 6 వ క్లాజు "సభ్యత్వ రుసుములో సెంటర్ శాఖకు 0-50 పైసలున్నూ, సమితి లేక పట్టణ శాఖకు రు. 3-00 లున్నూ, జిల్లాశాఖకు రు. 3-50 లున్నూ, ప్రదేశ్ ఫెడరేషన్‌కు రు. 3-00 లున్నూ చెందును" అని యుండును.

3) నిబంధనావళియందలి - పాలసీ స్టేట్ మెంటు నందు తగు మార్పులు, చేర్పులు చేయుటకు ప్రత్యేక జనరల్ కౌన్సిలు జరుపుటకు ఈ మహాసభ అధికారాలు యిస్తూ తీర్మానిస్తున్నది.

# కవుల కలాల నుండి.... గాయకుల గళాల నుండి

## మహాసభల్లో ఎందరినో ఉత్తేజపరిచిన పాటలు

మహాసభల సందర్భంలో శ్రీ జగన్ (ప్రజానాట్యమండలి, కృష్ణా)పాడిన (1)జోహారు...జోహారు (2)వద్దనండి యుద్ధాలు అలాగే గుంటూరుజిల్లా నార్నెపాడు దళం సర్వశ్రీ యన్. సాంబశివరావు, ఐ. కామయ్య, బి. లలిత, బి జయలక్ష్మి, కె. కోటేశ్వరరావుగార్లు పాడిన వివిధ గేయాలు పాఠకులకు అందిస్తున్నాం.

శ్రీ ఓ. ఎస్. ప్రకాశం (నెల్లూరు) శ్రీ బగాది వెంకట్రావు (శ్రీకాకుళం) పాడిన పాటలు కూడా ప్రచురిస్తున్నాం.

మహాసభల్ని చూచి ఉత్తేజపడి వ్రాసిన గేయాల్ని కూడా పొందుపరుస్తున్నాం.

### మృతవీరులకు జోహార్లు !

అందుకోండి అందుకోండి జోహారులూ
అమర వీరులారా మీకివే విప్లవ జోహారులూ
మా విప్లవ జోహారులు
మీ ఆశయతారల వెలుగులలో
వికసించునులే – వికసించునులే
అణగారిన కృశియించిన
మోడిల్లిన మా ఎదలో ॥అందు॥

మీ త్యాగజీవితం మాకూ ఒరవడియై
మీరు నడిచిన బాటయే మాకూ ఆయుధమై
కడుచీకటి ధాత్రిని పగతీరా చీల్తుములే
పగతీరా చీల్తుములే ॥అందు॥

కడునిత్యం పీడించే దుర్మాదాంధ పాలనపై
నేడే నేడే—
పిడికిలీ బిగించి పోరాటం సాగిస్తాం !
మీకన్న కలలు పండిస్తాం ! ! ॥అందు॥

### కానీ .... ?

— శ్రీ జి. శ్రీమన్నారాయణ, కూనవరం, ఖమ్మంజిల్లా

అజ్ఞానాన్ని అంతమొందించి
విజ్ఞానాన్ని వెదజల్లవలసినవాడివి ...
పీడిత తాడిత ప్రజకు
ప్రగతి మార్గం చూపాల్సినవాడివి ...
జాతి నిర్మాతగా
జగతిని తీర్చి దిద్దాల్సినవాడివి ...
నీవే ... నీవుగాక మరి యెవ్వరు ?
కానీ ... ???

# మహోన్నత .... మహాసభలు !

— యస్. ఆర్. కదలి; వెం|్ర. ప॥గో॥ జిల్లా

అరుణారుణ వాడ ;
మన విజయవాడ ; ;
"మాంటిసోరి" నీడ–
సుబ్బరాజు వాడ

నాల్గేండ్ల పండుగ...
నాల్గింతలు పెరిగెను కొండగ ;
నాల్గుదిక్కులు పిక్కటిల్లగ...
వెల్గుబాటైంది నిండుగ ;

మేధావుల సందేశాలు...
ప్రగతి బాటకు దోహదాలు ;
"శాస్త్రీయ విద్య" కై – పోరాటం ;
నిరక్షరాస్యత నిర్మూలనకై – ఆరాటం ;
ప్రపంచ శాంతికై – పోరాటం ; ;
సోషలిజంకై ఆరాటం ; ; ;
పెద్దల మాటలు...
బంగరు మూటలు ; ;

ప్రభుత్వపు బూటకాలకు...
అద్దంపట్టిన నాటకాలు ;
నిత్యసత్యాలు...నృత్యాలు ; ;
రోగ నిరోధక మాత్రలు...
ఏక పాత్రలు ; ;
అన్నీ ఎన్నో సత్యాలు ;
మంచికి ఆణిముత్యాలు ; ;
వైజ్ఞానిక ప్రదర్శనలు...
వెల్గుబాటకు నిదర్శనలు ;

ఊరేగింపు...
ఏమని వ్రాయనా సొంపు ;
ఆనందోత్సాహాల నింపు...
అన్యాయాలకు గోరికట్టే... సైన్యమది ;
ఎనభై ఏండ్ల వృద్ధ టీచర్...
ఎనిమిదేండ్ల విద్యార్థిలా...
కేకలేస్తూ ... ఉరకలేస్తూ...
ఉక్కు పిడికిలి బిగించి...
ఓహ్ ... ఏమా దృశ్యం !
అదో ఉత్తుంగ తరంగం
జవసత్వాల తురంగం
ఆనందించె నా అంతరంగం ;
— అలా ... కృష్ణవేణి అలలా
చరిత్ర హత్తిన శిలలా
చిర ముద్రవేసింది నా గుండెలో ఈ మహాసభ ;
చిరస్థాయి అవుతుంది ఈ మహోన్నతసభ;

# ఉయ్యాలో - జంపాలో !

రచన : బగాది వెంకటరావు, శ్రీకాకుళం జిల్లా

ఉయ్యాలో......ఓ.......
ఇనుకోర నాకూన ఉయ్యాలో
బతుకు బండారవ్వూ ... జంపాలో – నీ బతుకు ...
పుట్టేవు నాకూన ఉయ్యాలో–నీకు
పుట్టెడూ కష్టాలు జంపాలో
పెరిగేవు నా కూన ఉయ్యాలో
తరగనీ కష్టాలు జంపాలో ॥

పుట్టిగోలా బెడితె ఉయ్యాలో
పట్ట పాలూలేవు జంపాలో
నీయమ్మ పస్తుంటె ఉయ్యాలో
పాలెట్టగొస్తాయి జంపాలో ... నీకు పాలెట్ట "ఇనుకోర"
అకలాకాలనీ ఉయ్యాలో
అల్లాడిపోయ్యేవు జంపాలో
కూడేడ దెచ్చేది ఉయ్యాలో – మనవి
కూలి బతుకూలాయె జంపాలో ...
బడికి పోతాననీ ఉయ్యాలో
బులిసిపోమాకురా జంపాలో
సదువంటె మాటలా ఉయ్యాలో–బండి
పుస్తకాలుండాల జంపాలో "ఇనుకోర"

యమ్మేలు సదివినా ఉయ్యాలో దాని
అమ్మమ్మ చదివినా జంపాలో
ఆఫీసు గుమ్మాలు ఉయ్యాలో –
అరగదీసేనురా జంపాలో
పెళ్ళీడుకొస్తివా ఉయ్యాలో
పిల్లతోడయ్యేను జంపాలో – నీకు పిల్ల
కాపురానికిపోతె ఉయ్యాలో
అపరేషనుపోరు జంపాలో ॥ఇన॥

ఏ నౌకరో చేసి ఉయ్యాలో
యాగాణి దెస్తివా జంపాలో –
మూణ్ణాళ్ళ గంటిరా ఉయ్యాలో
మిగిలింది పస్తురా జంపాలో
అన్యాయమని నువ్వ ఉయ్యాలో
అరవబోయేవురా జంపాలో
అల్లదిగో పోలీసు ఉయ్యాలో
ఆపైన జైలురా జంపాలో ... ॥నీకు ఆపైన॥
ఉయ్యాలో – జంపాలో
జంపాలో –ఉయ్యాలో

(మహాసభల్లో పాడిన పాట)

# నూతన విద్యావిధానం - ప్రసంగవ్యాసం



శ్రీ దశరథదేవ్

(త్రిపుర ఉప ముఖ్యమంత్రి, మరియు విద్యాశాఖామంత్రి)

విద్యావిధానం సామాజిక ఆర్థిక వ్యవస్థపై ఆధారపడి ఉంటుంది. సోషలిష్టు వ్యవస్థకైనా, పెట్టుబడిదారీ వ్యవస్థకైనా ఈ సూత్రం వర్తిస్తుంది. 'అందరికీ విద్య - అందరికీ ఉపాధి' సోషలిష్టు విధానం. విద్య నేర్చుకోవడంలో సమానావకాశాలు కల్పించకపోవడం, పెట్టుబడిదారులకు అవసరమైనంత మందికి, వారి పెట్టుబడులను పెంచడానికి మాత్రమే ఉపాధి కల్పించడం పెట్టుబడిదారీ విధానం.

మనదేశంలో పెట్టుబడిదారీ విధానం పరిమితంగా అభివృద్ధి చెందింది దేశవ్యాప్తంగా భూస్వాముల పట్టు పూర్తిగా సడలిపోలేదు. 38 సం॥ల క్రితం మనకు స్వాతంత్రం వచ్చింది. అది రాజకీయ స్వాతంత్ర్యం. ఇంకా ఆర్థిక స్వాతంత్ర్యం సాధించవలసి వుంది.

దేశం విదేశీ అప్పుల్లో కూరుకుపోయిఉంది. అంతర్జాతీయ ద్రవ్యనిధికి వున్న అప్పుతో సహా దాదాపు 24,000 కోట్ల రూపాయల విదేశీ అప్పులు ఉన్నాయి. అంటే తలసరి రు. 300లు. ఈ అప్పులు తీర్చడం సాధ్యపడేలా లేదు. మనం చేసే ఎగుమతులు తగ్గుతున్నాయి. దిగుమతులు పెరుగుతూ ఉన్నాయి.

సామ్రాజ్యవాద దేశాలు బహుళజాతి కంపెనీలు ఋణాలు ఇచ్చేందుకు షరతులు పెడుతున్నాయి. స్వదేశీ పెట్టుబడిదారులుకూడా విదేశీయ ఆధునిక, సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించుకొని పెట్టుబడులు పెంచుకొనే ప్రయత్నంలో వున్నారు. ఈ పరిస్థితులలో 1985 కేంద్ర బడ్జెట్ వచ్చింది వారికి వందల కోట్ల రూపాయల పన్ను రాయితీలు ఇచ్చింది. బహుళజాతి కంపెనీలకు దేశ ద్వారాలు పూర్తిగా తెరచి ఉంచడం జరిగింది. సామాన్య ప్రజలు తమ ప్రయోజనాలకొరకై చేపట్టే ఉద్యమాలను అణచివేత చర్యలకు దిగక తప్పనిసరి స్థితిలో పడిపోయింది ప్రభుత్వం. ఆర్థిక రంగంలో ఈ విధంగావున్న ప్రభుత్వం, విద్యారంగంలో భిన్నంగా ఎందుకుంటుంది?

ఆర్థికరంగ సంక్షోభం లోతుపాతుల్లోకి నేను పోవడంలేదు. కాని కొన్ని విషయాలను ప్రస్తావించకపోతే విద్యారంగంలోని సంక్షోభం అవగతంకాదు. ఎవరి ప్రయోజనాలను గమనంలో ఉంచుకొని నూతన విద్యా విధానం రూపొందింపబడింది? అల్ప సంఖ్యాకంగా వున్న ధనికుల ప్రయోజనాలనా? అధిక సంఖ్యాక వర్గంగా వున్న సామాన్యుల నిరుపేదల ప్రయోజనాలనా?

దేశాన్ని పరిపాలించే హక్కు భూస్వామ్య పెట్టుబడిదారీ ప్రతినిధుల చేతుల్లో వుంది. వారి ప్రయోజనాలను కాపాడే విధంగానే పెట్టుబడిదారీ విధానం దేశవ్యాప్తంగా కాక అక్కడక్కడ పరిమితంగానే అభివృద్ధి చెందుతున్నది. కొన్ని ప్రాంతాలలో పరిశ్రమలు అభివృద్ధి చెందాయి. వాటితోపాటు విద్యకూడ అభివృద్ధి అయింది. చాలా ప్రాంతాలు నిర్లక్ష్యానికి గురయ్యాయి. అక్కడ ఈనాడు కూడా పాత పద్ధతులలోనే వ్యవసాయం చేయబడుతున్నది. విద్యా పరమైన వెలుగు కిరణాలు ఈనాటికి చేరని ప్రాంతాలు వున్నాయి. దేశంలో 70% ప్రజల జీవనాధారం వ్యవసాయం. పరిమితంగానైనా అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ విధానం ఫలితాలు 10 శాతం ప్రజలకే దక్కుతున్నాయి. వ్యవసాయ యోగ్యమైన భూమిలో అత్యధిక భాగం కొద్ది మంది చేతుల్లోనే కేంద్రీకరింపబడి ఉంది. అత్యధికులుగానున్న మధ్యతరగతి పేద ప్రజానీకంలో నిరక్షరాస్యులు ఎక్కువ. 50 శాతం ప్రజలు దారిద్ర్యరేఖకు దిగువన ఉన్నారు.

దేశంలోని వేళ్ళమీద లెక్కించదగినన్ని కుటుంబాల ఆస్తులు పెరిగిపోతున్నాయి. సామాన్యులు, పేదలు మరీ పేదరికంలోకి నెట్టివేయబడుతున్నారు. ఇదీ మనం స్వాతంత్ర్యానంతరం 38ఏళ్ళలో సాధించిన ప్రగతి.

ఈ ఆర్థిక పరిస్థితుల ప్రభావం విద్యారంగంపై పడకుండా వుంటుందా? తప్పనిసరిగా పడుతుంది. ఆ విధంగా మనమిపుడు చర్చిస్తున్న జాతీయ విద్యావిధానంపై ఆర్థిక రంగం యొక్క ప్రభావం పడటం అనివార్యం. అందుకే ఈనాడు దేశం ఎదుర్కొంటున్న ఆర్థిక రంగ సంక్షోభాన్ని సంక్షిప్తంగా ప్రస్తావించవలసి వచ్చింది.

కేంద్రప్రభుత్వం ప్రవేశపెట్టిన జాతీయ విద్యా ముసాయిదాలో వున్న ముఖ్య అంశాలు: (1) సార్వత్రిక విద్య, (2) వయోజన విద్య, (3) అనియత విద్య, (4) మోడల్‌స్కూల్స్, (5) విద్యలో ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం, (6) వృత్తి విద్య, (7) విద్యను ప్రైవేటురంగానికి అప్పచెప్పడం, (8) సార్వత్రిక విశ్వవిద్యాలయం, (9) ఉన్నతవిద్య, (10) సిలబస్, (11) బోధనా భాష, (12) కేంద్ర రాష్ట్ర సంబంధాలు, (13) విద్యకి కేటాయింపబడే నిధులు, (14) విద్య స్వభావం, (15) విద్యాసంస్థల నిర్వహణ.



## సార్వత్రిక విద్య

సార్వత్రిక విద్యాలక్ష్యాన్ని 1960 నాటికి సాధించాలని మన రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాల్లో పొందుపరచుకొన్నాం. తరువాత 1990 నాటికని వాయిదా వేసుకున్నాం. కాని ఈనాటి పరిస్థితి ఏమిటి? ప్రపంచ జనాభాలో 40 శాతం నిరక్షరాస్యులు మనదేశంలోనే వున్నారు. నానాటికి నిరక్షరాస్యుల సంఖ్య పెరుగుతూ వుంది. 1951 లో 30 కోట్లు, 1961 లో 33 కోట్లు, 1971 లో 37 కోట్లు, 1981 లో 41 కోట్లు. ఈ పెరుగుదల ఇలాగే వుంటే ఈ శతాబ్దాంతానికి నిరక్షరాస్యుల సంఖ్య 50 కోట్లు చేరుకుంటుందని ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ విద్యామంత్రుల సదస్సులో చెప్పారు. పాఠశాలలో నమోదయి చదువు మానుకొనేవారి సంఖ్య కూడా ఎక్కువగానే వుంది. మధ్యాహ్న భోజన పథకాల్లాంటి వాటితో వీటిని కొంతవరకు తగ్గించవచ్చు. కాని సార్వత్రిక విద్యకై 7వ ప్రణాళికలో మొదటి సంవత్సరానికి కేటాయించింది 15.30 కోట్ల రూపాయలు మాత్రమే. నిధులను పెంచకుండా ఆ బాధ్యతను రాష్ట్రాలపై నెట్టివేస్తుంది కేంద్రం. ఫలితంగా మధ్యలో చదువుమానుకొనేవారి సంఖ్య పెరుగుతుంది. పాఠశాలల సంఖ్య, ఉపాధ్యాయుల సంఖ్య, విద్యార్థుల సంఖ్య ఏమీ పెరగవు ఆ పైన నిరక్షరాస్యుల, నిరుద్యోగుల సంఖ్య పెరుగుతాయి.

అనియత విద్య ద్వారా విద్యావ్యాప్తి సాగించాలంటుంది ప్రభుత్వం. పాఠశాలలు, ఉపాధ్యాయులు లేకుండా టి.వి., వీడియో, కంప్యూటర్లలాంటి సాంకేతిక పరికరాలతో విద్యావ్యాప్తి సాగించాలంటుంది. అనియత విద్యకు నిధుల కేటాయింపు పెంచకపోగా గత సంవత్సరం 21.79 కోట్ల రూపాయలు కేటాయించిన ప్రభుత్వం ఈ సంవత్సరం 12.2 కోట్లకు తగ్గించింది. మరొక అంశం టి.వి., వీడియోలు లాంటి పరికరాలు ఉపాధ్యాయులకు పరికరాలుగా ఉపయోగపడాలి కాని ఉపాధ్యాయులకు మారుగా కాదు.

## మోడల్ స్కూల్స్

జిల్లాకొక 'మోడల్ స్కూల్' పెట్టాలనే సూచన ముసాయిదాలో వుంది విద్యయొక్క వాసిని పెంచాలనే నినాదంతో ధనికుల పిల్లలకు మాత్రం ప్రవేశం కల్పించే పాఠశాలలవి. పారిశ్రామిక వేత్తల, బహుళజాతి కంపెనీలకు అవసరమైన సాంకేతిక సిబ్బందిని తయారు చేయడానికి ఉద్దేశించబడిన స్కూళ్ళు అవి

భవనాలు లేక, తగినంతమంది ఉపాధ్యాయులు లేక, బోధనకు కావలసిన కనీససదుపాయాలు సమకూర్చబడని పాఠశాలలు సామాన్యులకు. అన్ని వసతులు కల్పించబడి అధునాతన సాంకేతిక పరిజ్ఞానాన్ని అందచేసే పాఠశాలలు కొన్ని ఉన్నత వర్గాల వారికి.

మోడల్ స్కూల్స్‌లో గణితము, సామాన్యశాస్త్రాలకు ఇంగ్లీషు బోధనా భాషగా వుండాలని, మిగిలిన వాటికి హిందీ బోధనా భాషగా వుండాలని సూచించబడింది. వివిధ విద్యా కమీషన్‌లు, జాతీయ నాయకులు, అన్ని స్థాయిల్లో కూడా మాతృభాషలో విద్యా బోధన జరగాలని సిఫార్సు చేశారు. అలాంటి ప్రయోజనాత్మక సూచనలను విస్మరించి హిందీ, ఇంగ్లీషులను అన్నిప్రాంతాల వారిపై రుద్దడం జాతీయ సమైక్యతకు అవరోధంగా పరిణమిస్తుంది.

## వయోజన విద్య

వయోజన విద్యావ్యాప్తి టి. వి., వీడియో, ఇన్‌శాట్‌ల ద్వారా జరపాలని దీనినే 'దూరవిద్య' అని ముసాయిదాలో పేర్కొనబడింది. ఉపాధ్యాయులు లేకుండా అధునిక పరికరాలతో పాఠాలు చెప్పిస్తారట. వయోజన విద్యావ్యాప్తియెడల ప్రభుత్వానికివున్న శ్రద్ధఇది వయోజన విద్యకి కేటాయించిన నిధులు 89 కోట్లు మాత్రమే. వయోజన విద్య వద్దు అనకుండ రద్దుచేసే ప్రయత్నమిది

## వృత్తి విద్య

10+2 విధానం ప్రవేశపెట్టినపుడు వృత్తివిద్యా విషయమై విపరీతమైన ప్రచారం ఇవ్వడం జరిగింది. కాని విఫలమయింది. కారణం ప్రయోగశాలలకు, వర్కుషాపులకు నిధులను సమకూర్చలేకపోవడం. వృత్తివిద్య జయప్రదం కావాలంటే నిధుల కేటాయింపు పెంచాలి. వృత్తివిద్య పూర్తిచేసినవారికి ఉపాధి కల్పించాలి. వారికి బ్యాంకుల ద్వారా స్వయం ఉపాధి పథకాల ద్వారా రుణాలు ఇప్పించి, వారు తయారుచేసే వస్తువులకు మార్కెటు సౌకర్యం కల్పించాలి. కాని మన ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధి మార్కెట్ విలువలేని వృత్తివిద్య అనవసరం అంటున్నారు. అన్ని రంగాలలో అధునాతన సాంకేతిక పరికరాలను ప్రవేశపెట్టిన 21వ శతాబ్దంలోకి ఈ దేశాన్ని తీసుకెళతామంటున్నారు. అంటే ఆధునిక సాంకేతిక పరికరాలను బహుళజాతి కంపెనీలనుండి దిగుమతి చేసుకోవలసి ఉంటుంది.

ఉన్నత విద్యా స్థాయి తగ్గిపోతుందని, స్థాయిని పెంచాలని ప్రభుత్వం ప్రకటించిన ముసాయిదాలో చెప్పబడింది కాలేజీలలో విశ్వ విద్యాలయాలలో విద్యార్థుల రద్దీ ఎక్కువయిందని ఆందోళన చెందుతుంది ప్రభుత్వం. కాలేజీలు, విశ్వ విద్యాలయాల స్థానంలో కొన్ని "సెంటర్స్ ఆఫ్ ఎక్సలెన్స్" తెరవబడుతాయి. క్రింది స్థాయిలో మోడల్ స్కూల్స్‌లో చదివిన కొద్దిమందికి ఈ సెంటర్స్‌లో ప్రవేశం లభిస్తుంది. ఇలా చేయడంలో ఉద్దేశ్యమేమిటి? విద్యారంగంలో కూడ అధునిక సాంకేతిక పరిజ్ఞానం, పరిశోధనలలో నిపుణతగల ఒక ఉన్నత వర్గాన్ని సృష్టించి పారిశ్రామిక వేత్తల పెట్టుబడులను పెంచడానికి కావలసిన యంత్రాంగాన్ని సృష్టించడం.

ఉన్నత విద్యా వ్యాప్తికి అడ్డుకట్టలు వేయాలని చూస్తుంది కేంద్రప్రభుత్వం. అందుకే రాసికి బదులు వాసిని పెంచాలంటున్నది. నానాటికి పెరుగుతున్న విద్యావంతులైన నిరుద్యోగుల్ని చూసి ఆందోళన చెందుతున్నది. ఉపాధి కల్పించలేని ప్రభుత్వం చదువుకొనటానికి అవకాశాలు లేకుండ చేయాలని సంకల్పిస్తున్నది. విద్యపై అదనంగా ఖర్చు పెట్టడం నిరుపయోగమని భావిస్తున్నది విద్య వ్యక్తి చైతన్యాన్ని పెంచుతుంది హక్కులను గుర్తింపచేస్తుంది. పాలకవర్గం అందుకే విద్యా వ్యాప్తిని చూసి ఆందోళన చెందుతున్నది.

విద్యలో వాసి తగ్గిపోతుందని ఆందోళన చెందడం కూడ పూర్తిగా క్రొత్త విషయం కాదు. 1902 లో మన దేశంలోని కళాశాలలు, విశ్వ విద్యాలయాలలో పెరుగుతున్న జాతీయాభిమానాన్ని చూచి ఆందోళన చెందిన వైస్రాయ్ లార్డ్ కర్జన్, వాల్టర్ రేలీ అధ్యక్షతన ఒక విద్యా కమిషన్ నియమించాడు. అప్పుడు వారు కూడా రాసి పెరగడంతో వాసి తగ్గుతుందనే అన్నారు. బ్రిటిషు పాలకుల రాజకీయ ప్రయోజనాలకొరకు ఆనాడు విద్యావ్యాప్తికి అవరోధాలు కల్పించారు. మరి ఈ నాడు? అలాంటి ప్రయోజనాల నాశించే ఈ నాడు క్రొత్త విద్యా విధానం పేరుతో విద్యకి అడ్డుకట్టలు వేస్తుందా? ఈ విషయం నిశితంగా ఆలోచించాలి.

## సార్వత్రిక విశ్వవిద్యాలయాలు

దేశంలో చాలాచోట్ల సార్వత్రిక విశ్వవిద్యాలయాలు స్థాపించాలని సూచిస్తున్నది. నూతన విద్యావిధానం. కళాశాలలు, విశ్వవిద్యాలయాల్లో రద్దీ ఎక్కువయిందని, రాజకీయాలతో వాతావరణం కలుషితమయిందని ఆపాదిస్తున్నది. అంటే క్రొత్త కళాశాలలకు, విశ్వ విద్యాలయాలకు అనుమతి నిరాకరించి వాటి స్థానంలో సార్వత్రిక విశ్వవిద్యాలయాలు వెలుస్తాయి. అక్కడ అధ్యాపకుడు చెప్పడం విద్యార్థి నేర్చుకోవడం వుండదు. ఫలానా తరగతి వరకు చదివి వుండాలనే నియమం లేకుండా అందరూ వారి పేర్లను నమోదు చేసుకోవచ్చు. అందరికీ అవకాశాలు కల్పిస్తూ చాలా విశాల దృక్పథంతో వీటిని పెట్టినట్లు పైకి కన్పిస్తుంది. కాని వీటివలన నిజంగా విద్యావ్యాప్తి జరుగుతుందా అనే సందేహం వుంది. ఎక్కువ మొత్తాలు వసూలుచేసి నడిపే కరస్పాండెన్స్ కోర్సులు యివి. ఈ సార్వత్రిక విశ్వవిద్యాలయాలు పెట్టడంలో ఉద్దేశ్యం ఏమిటని నిశితంగా ఆలోచిస్తే మనకు రెండు కారణాలు స్పష్టంగా కన్పిస్తాయి. ఒకటి: కళాశాలల్లో ప్రవేశం లభించని విద్యార్థులకు మనంకూడ ఏదోఒకటి చదువుతున్నామనే తృప్తి కలిగించడం. రెండు: ఉన్నత విద్యపై పెట్టే ఖర్చు తగ్గించడం. అందరికి ఉన్నత విద్యావకాశాలు కల్పించినట్లు కన్పించినా వాస్తవంగా అరికట్టినట్లే కారణం ఈ డిగ్రీల వలన ఎలాంటి ఉపయోగం ఉండదు. కనుక పాలకవర్గాల వర్గప్రయోజనాలను కాపాడుకొనడానికి యిది క్రొత్త ఎత్తుగడ.

## ప్రైవేటు వ్యక్తులకు విద్యని అప్పగించటం

ప్రైవేటు వ్యక్తులు, సంస్థలు విద్యావ్యాప్తికి సహకరించాలంటుంది క్రొత్త విద్యా విధానం. వ్యక్తిగాని, సంస్థగాని తమ ప్రయోజనాలకొరకు అనుకూలమైన విద్యాసంస్థలను పెట్టుకోవచ్చు. విద్యను లాభాలు తెచ్చిపెట్టే వ్యాపారవస్తువుగా ఉపయోగించుకొనడానికి అనుమతిస్తున్నది ప్రభుత్వం. విశ్వ విద్యాలయాలలోని పరిశోధనలు వాటి ఫలితాలు ప్రైవేటు వ్యాపార సంస్థలకు ప్రభుత్వ ఖర్చుతో లభిస్తాయి విద్యను వ్యాపార వస్తువుగా ప్రైవేటు వ్యక్తుల చేతుల్లో పెట్టిన తరువాత సార్వత్రిక విద్య, నిరక్షరాస్యతా నిర్మూలన సాధ్యపడతాయని ఆశించడం అవివేకమే అవుతుంది.

## డిగ్రీలకు – ఉద్యోగాలకు లంకె తెగగొట్టటం

ప్రభుత్వం ప్రకటించిన ముసాయిదాలో డిగ్రీలకు-ఉద్యోగాలకు లంకె తెగగొట్టాలనే సూచన వుంది. యువకులకు పైచదువులపై ఆసక్తి తగ్గించడం, చదువుకొన్నవారు ఉద్యోగాల కొరకై చేసే ఆందోళనను అట్టుకొనడం కష్టం అనే ఉద్దేశంతో ఈ సూచన చేయబడి ఉంటుంది. పాలక వర్గాలకు సన్నిహితంగా ఉండే ధనిక వర్గాలవారిని అధికార అందలాలపై ఎక్కించే వర్గప్రయోజనం యిందులో వుంది. డిగ్రీలు చదివినవారికే కాక చదువుకొనని వారికి కూడా ఉద్యోగాలు వస్తాయనే ఆశ సామాన్య యువకులలో కల్పించడం ఉంది. ఎలాగూ ఉద్యోగాలు రానప్పుడు ఎందుకు కాలేజీల వెంట పరుగెత్తడం? అని యువకులను పైచదువులకై పరుగులు తీయడాన్ని ఆపివేయమని సలహా యివ్వడం ఉంది.

ఇప్పటి సంక్షోభాన్ని కొంత కాలానికి నెట్టివేసే ఎత్తుగడ ప్రభుత్వం అవలంబిస్తుంది తప్ప, ఎలాంటి సత్ఫలితాలు దీనివల్ల సాధింపబడవు.

## కేంద్ర జాబితాలో విద్య

మొదటి నుండి విద్య రాష్ట్ర జాబితాలో వుంటూ వచ్చింది 1949 లో పండిట్ జవహర్‌లాల్‌నెహ్రూ, డాక్టర్ అంబేద్కర్ ఈ అవసరాన్ని నొక్కి వక్కాణించారు. బ్రిటీషు పాలనాకాలంలో కూడ 1935 విద్యా చట్టం ప్రకారం కూడ విద్య రాష్ట్ర జాబితాలోనే వుంది. కాని 1976లో ఎమర్జెన్సీ ప్రకటించిన అప్పటిప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ రాజ్యాంగ చట్టం 42 వ సవరణ ద్వారా విద్యను ఉమ్మడి జాబితాలోకి మార్చారు. అప్పటినుంచి విద్యారంగంపై కేంద్రం పెత్తనం పెరుగుతూ వచ్చింది.

అప్పటినుండి కేంద్రం విద్యాభివృద్ధికై వలసినన్ని నిధులను కేటాయించకపోవడమేగాక విద్యారంగ సంస్థల, ప్రజాస్వామ్య హక్కులపై దాడులు తీవ్రతరం చేసింది. మొదటి ప్రణాళికలో ప్రణాళికా వ్యయంలో 7.6 శాతం కేటాయించిన కేంద్రం 7 వ ప్రణాళికలో దాన్ని దాదాపు 7 వ వంతుకు తగ్గించివేసింది.

## ప్రజాస్వామ్య హక్కులపై దాడి

రాజకీయాలు విద్యా సంస్థలలో ప్రవేశించడం వలన వాతావరణం కలుషితమవుతుందని పత్రంలో పేర్కొనబడింది. విశ్వవిద్యాలయాలలోని ప్రజాస్వామ్య వ్యవస్థలైన సెనేట్ సిండికేట్‌లను రద్దు చేయాలంటున్నది. వైస్‌ఛాన్సలర్ల అధికారాలను పెంచాలంటున్నది. అదే సందర్భంలో ఎన్నికలలో ప్రజలచే తిరస్కరింపబడినవారిని వైస్‌ఛాన్సలర్లుగా, రిజిష్ట్రార్లుగా నియమించడం జరుగుతున్నది. యు. జి సి. అధికారాలు విశృంఖలంగా పెరుగుతున్నవి.

అంతేగాదు దీనిలో విద్యార్థుల, ఉపాధ్యాయుల, విద్యారంగంలో పనిచేసే ఇతర ఉద్యోగుల ప్రజాస్వామ్య ఉద్యమాలపై నిర్బంధాలను

ప్రకటించాలనే సూచనలు ఉన్నాయి. పాఠశాల విద్యలో కూడా అలాంటి కేంద్రీకృత అధికారాలు అవసరమని యన్.సి.ఇ.ఆర్.టి. సూచించింది.

ఈ విధంగా ప్రజాస్వామ్య సంస్థలపై పాలకవర్గం పెత్తనం సాగిస్తూ వస్తున్నది. నూతన విద్యావిధానం కూడ దాని కొనసాగింపు మాత్రమే.

కేంద్ర ప్రభుత్వం ప్రవేశపెట్టనున్న నూతన విద్యావిధానం- అది ఎవరి ప్రయోజనాలను కాపాడేది - దానిలోని ముఖ్యాంశాలు - సాధక బాధకాలపై - నా అభిప్రాయాలను సంక్షిప్తంగా మీ ముందుంచాను. విద్యావేత్తలు, ఉపాధ్యాయులు విపులంగా చర్చలు జరిపి దీనిలో ఇమిడి ఉన్న క్రొత్త అంశాలను వివరిస్తారని ఆశిస్తున్నా. విధానంపై కొన్ని సూచనలు చేసి ముగిస్తాను.

1. సార్వత్రిక విద్యా లక్ష్యాన్ని విడనాడరాదు.

2 టి. వి. వీడియోలద్వారా చెప్పదలచిన అనియత విద్య సాధారణ విద్యకు ప్రత్యామ్నాయం కాదు. టి. వి. వీడియోలు బోధనోపకరణాలు మాత్రమే.

3. ఉన్నత విద్యా వ్యాప్తికి అడ్డుకట్టలు వేయరాదు. కళాశాలలు, విశ్వ విద్యాలయాలు పెంచాలి.

4. సాంప్రదాయంగా వస్తున్న విశ్వ విద్యాలయాలకు, సార్వత్రిక విశ్వ విద్యాలయాలు సహాయకారిగా వుండాలిగాని వాటికి మారుగా కాదు.

5. మోడల్ స్కూల్స్ (వర్గ విభేదాలను పెంచేవి) పెట్టడంపై నిర్ణయం జరిగితే వాటిలో విద్యాబోధన మాతృభాషల్లోనే జరగాలి.

6. విశ్వ విద్యాలయాల యాజమాన్యం ప్రజాస్వామ్య యుతంగా ఎన్నికైన సెనేట్లు, సిండికేట్లు నిర్వహించాలి.

7. ఆయా ప్రాంతీయ అవసరాలనబట్టి వృత్తి విద్యా కోర్సులను ప్రవేశపెట్టి పూర్తయిన తరవాత ఉపాధి సౌకర్యాలు కల్పించాలి.

8. విద్యను ప్రైవేటు వ్యక్తుల, సంస్థలకు అప్పచెప్పే ఆలోచనను విరమించుకోవాలి.

9. డిగ్రీలకు-ఉద్యోగాలకు లంకె తెగకొట్టాలన్న పథకాన్ని విరమించుకోవాలి.

10. జాతీయ సమైక్యత పరిరక్షణ పేరుతో ఆయా సంస్కృతుల, ఆయా తెగల ప్రయోజనాలను కుదించివేయరాదు. తాత్విక పరిజ్ఞానం పేరుతో మతపరమైన అంశాలకు పాఠ్యాంశాలలో స్థానం కల్పించరాదు

11. విద్యను ఉమ్మడి జాబితానుండి తొలగించి రాష్ట్ర జాబితాలో చేర్చాలి.

12. విద్యా రంగానికి నిధుల కేటాయింపు పెంచాలి.

కేంద్ర ప్రభుత్వం ప్రవేశపెట్టనున్న విద్యా విధానంలోని సామాన్య ప్రజల ప్రయోజనాలకు వ్యతిరేకమైన అంశాలను నిశితంగా చర్చించి, విస్తృతంగా ప్రచారమిచ్చి ఇతర ప్రజా సంఘాల సహకారంతో తిరస్కరించి, ఆ స్థానంలో అసంఖ్యాకమైన సామాన్య ప్రజలకు అనుకూలమైన శాస్త్రీయ విద్యా విధానం కొరకు తీవ్రంగా కృషి చేయవలసిందిగా కోరుతున్నాను. నా అభిప్రాయాలను ఇన్ని వేలమంది ప్రజలతో పంచుకొనేందుకు అవకాశం కల్పించిన 'ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్'కు కృతజ్ఞతలు.

## నా స్మృతి పథంలో....

శ్రీ వడ్లమాను వెంకటేశ్వర్లు, తెనాలి

ఉపాధ్యాయ, ఉద్యమానికి
యు. టి. యఫ్., తలమానికమని
మరోమారు, మారుమ్రోగె
విజయవాడలో, విజయదుందుభి.

ఉద్యమం, ఉవ్వెత్తున లేవ
ఉత్సాహం, ఉరకలెత్త
పరువులెత్తి వచ్చిరి పదివేల మంది
పంతులయ్యలు, పలు ప్రదేశాల నుండి

ఆకాశమంతటి పందిరి క్రింద
అరుణకాంతులు హారతి పట్టగ
'ఒజ్జ'లందరు, ముక్తకంఠంతో
ఎలుగెత్తి చాటిరి 'దునియా-కె-ఉస్తాద్-ఏక్‌హై' అని.

కష్టాల నష్టాల కడగండ్ల వడగండ్ల విముక్తికి
నవ సమాజ, సమ సమాజ నిర్మాణానికి
మార్క్సిజమే తరుణోపాయమని
మానవజాతికి అదే మనుగడయని విజ్ఞులు విశదీకరించిరి.

నూనూగు మీసాల నూత్న యవ్వనులు
ఉద్యమాలలో తలపండిన ఉద్దండులు
విజ్ఞాన ఖనులైన, ఎందరో విద్యావేత్తలు
మధించిరి విద్యా సాగరాన్ని, సుధలు తెట్టలు తేల

'బందరు' రోడ్డులో, "గలగల పారే" సెలయేరులా
"బీసెంట్ 'రోడ్డులో'" డిసెంటు'గా
"ఏలూరు, రోడ్డులో 'ఎర్రని' సెలయేరులా
పయనించె ఊరేగింపు – కన్నుల పండుగగా.

కార్యకర్తలందరు, కదలి వెళ్ళిరి
మరపురాని, మధుర స్మృతులతో
ఉత్సాహభరితమైన, హృదయాలతో
కర్తవ్య దీక్షా కంకణధారులై

"విద్యకూ, సామాజిక ఉత్పత్తికి తోడ్పడే శ్రమకూ సన్నిహిత సంబంధం ఉండాలి"

— లెనిన్

# అవనిగడ్డ పంచాయతీ సమితి టీచర్సు ఎంప్లాయీస్ కో-ఆపరేటివ్ క్రెడిట్ సొసైటీ లిమిటెడ్,

## నెం. H 492, అవనిగడ్డ

| | | |
|---|---|---|
| Date of Registration | | 26-12-1973 |
| Date of Starting | | 10-1-1974 |
| No. of Members | | 383 |
| Members share Capital | Rs. | 1,25,545-00 |
| KCC Bank share Capital | Rs. | 63,500-00 |
| KCCB. Loans | Rs. | 3,43,162-00 |
| Members Loans out standing | Rs. | 3,77,472-00 |
| 84-85 Profit | Rs. | 3,036-31 |
| 12-1-86 తేదీన పంచిపెట్టబడిన లాభములు, డివిడెంట్లు | రూ. | 13,700-00 |

ప్రెసిడెంటు :
వంగల గోవిందరావు, యం.ఏ., బి.ఇడి.

కార్యదర్శి :
కొల్లి ఉమామహేశ్వరరావు

డైరెక్టర్లు

యం. వెంకటేశ్వర్లు

కె. రాజేశ్వరరావు

కె. సైమన్

టి. వాయునందనరావు

టి. కోటేశ్వరరావు

# అధ్యయనం - అధ్యాపనం - పోరాటం!



శ్రీ ఆరుద్ర

(సాహితీ సదస్సును ప్రారంభిస్తూ శ్రీ ఆరుద్ర యిచ్చిన ఉపన్యాసానికి సంక్షిప్త రూపం)

ఒకరి భావాలు మరొకరికి వ్యక్తంచేయడానికి ఉపకరించే సాధనం భాష. ఆదిలో మానవునికి భాషలేదు. పరిణామ క్రమంలో వానరంనుండి నరుడు వచ్చాడు. మానవునిది కోతిది, అరచేయి ఒకే విధంగా వుంది కాని బొటనవ్రేలిని పూర్తిగా స్వాధీనంలోనికి తెచ్చుకొనడంలో మానవుని ప్రత్యేకత ఆధిక్యత ప్రారంభమయింది. బొటన వ్రేల్ని ఇతర వ్రేళ్ళతో కలపగలగడంతో మానవుడు చాలా ఎదిగాడు. పనిముట్లను ఉపయోగంలోకి తెచ్చుకోగలిగాడు. తయారుచేసుకోగలిగాడు. నాగరికత సాధించి పురోగమించగలిగాడు.

భాషలేనప్పుడు మానవుడు తన భావాలను సంజ్ఞలతో వ్యక్తపరచేవాడు. భావాలను వ్యక్తపరచడానికి వ్రేళ్ళను ఉపయోగించేవాడు. భాష నేర్చిన తరువాత భావ వ్యక్తీకరణ సులభతరమయింది. లిపికూడ కనిపెట్టిన తరువాత ఎదుటివారితోనే గాక సుదూరాల్లో వున్నవారికి కూడ అంతరాంతరాల్లోని విషయాలను స్పష్టంగా వ్యక్తం చేయగలిగాడు.

మన తెలుగుభాష చాలా ప్రాచీనమైనది. సంస్కృతీ సాంప్రదాయాలు గలది. ప్రతి అభిప్రాయాన్ని వ్యక్తీకరించడానికి నిర్దిష్టమైన పదజాలం మన భాషలో వుంది. మన భాషా సంస్కృతులకు సంబంధించిన ఎన్నో విషయాలను అధ్యయనం చేయాలి.

అధ్యయనం – అధ్యాపనం – పోరాటాలే మానవజాతి చరిత్ర.

మన ప్రాచీన సమాజంలో స్త్రీలకు అత్యంత ప్రాధాన్యత వున్నది. 'విత్తుముందా ? చెట్టుముందా ?' లాంటి చర్చలు అనవసరం. స్త్రీలు లేకుండా పుట్టడమనేది జరగదు. నాగరికత అభివృద్ధికి స్త్రీలు ఆద్యులు. వ్యవసాయం కనిపెట్టింది స్త్రీలు. చక్కని బట్టలు కట్టుకొనడం, కడుపునిండ తినడం నేర్పింది స్త్రీలు. ఆహారోత్పత్తికి మూలకారణమైన పెంపుడు జంతువులను మచ్చిక చేసుకొనడం నేర్పింది స్త్రీలు. ఋతువుల మార్పులు తెలిసికొన్నది స్త్రీలు. మొక్కలు నాటడం నేర్పింది స్త్రీలు. నాగరికత పెరుగుదలతో వర్షాధారంతోనే గాక దూరంనుండి నీటిని తెప్పించి వ్యవసాయం కూడా చేయడం నేర్చుకొన్న తరువాత పురుషాధిక్యత ప్రారంభమయింది. ప్రాచీన భారత దేశంలో మాతృ స్వామ్య వ్యవస్థలు వున్నాయి. 'గౌతమి పుత్ర శాతకర్ణి' అనే పేరులో గౌతమి అనే పదం మాతృ స్వామ్య వ్యవస్థ కలదనడానికి నిదర్శనం. అందువలన మన ప్రాచీన సంస్కృతీ సంప్రదాయాలు ఎలా మారుతూ వచ్చాయో అధ్యయనం చేయాలి

ఆదిమ గణ సమాజం, కుటుంబ వ్యవస్థ, కుటుంబ వ్యవస్థలో పురుషాధిక్యత, కులమతాలు, ఆచారాలు, ఆర్థిక వ్యవస్థ ఎలా ఉనికిలోనికి వచ్చాయి ? ఏ యే మార్పులకు గురవుతూ వచ్చాయి ? లాంటి ప్రశ్నలను మార్క్సిస్టు దృక్పథంతో అధ్యయనం చేస్తేనే తప్ప సమాజ స్వరూపం, దానిలో మన పాత్ర అర్థంకాదు.

మార్క్సు మహాశయుడు సమాజానికి సంబంధించిన వివిధ శాస్త్రాలను అధ్యయనం చేసి వివిధ సామాజిక వ్యవస్థలు ఎలా వచ్చింది, ఆయా సామాజిక వ్యవస్థలలోని అంతర్గత వైరుధ్యాలు ఎలా పెరిగి పెద్దవయ్యేది, ఏయే శక్తుల ప్రమేయంతో ఆ వ్యవస్థలు కుప్ప కూలిపోయి కొత్త వ్యవస్థలు ఉనికిలోకి వచ్చిందీ, పెట్టుబడిదారీవ్యవస్థ పెట్టుబడులను పెంచుకొనే ఒకేఒక ధ్యేయంతో దానిని కూల్చివేసే కార్మికవర్గాన్ని ఏ విధంగా పెంచవలసి వస్తుందీ, ఆ వ్యవస్థ అనివార్యంగా నాశనం కాక తప్పనిసరి పరిస్థితులు 'దాస్ కేపిటల్'లో వివరించారు. అది మానవాళికి విజ్ఞాన దీపిక. అందుకే సమాజం అర్థం కావాలంటే మార్క్సిజం అధ్యయనం చేయాలి.

ఎప్పుడూ ఒక యుగధర్మం ఉంటుంది. నిన్నటి యుగధర్మం ధనస్వామ్యం. రేపటి యుగ ధర్మం సామ్యవాదం. ఆ యుగధర్మాన్ని మనం అధ్యయనం చేసి రేపటి పౌరులతో అధ్యాపనం చేయించాలి.

ఆయా సామాజిక వ్యవస్థలలోని ఆధిపత్యాన్ని, దురహంకారాన్ని ప్రశ్నించి ఆయా కాలాలలో అభివృద్ధి కాముకులుగా వున్న ప్రాచీన కవులు, రచయితలూ వున్నారు. "అరయతిక్కు వేరె ఆకలొకటె" అంటాడు వేమన. ఆయా ప్రాంతాలలో లభించే ఆహారాన్ని తింటున్నప్పటికి అంతర్గతంగా మానవత ఒకటే. మానవులంతా ఒకటే అంటాడు వేమన.

అలాగే "కులము గలుగువారు గోత్రమ్ము గలవారు
విద్యచేత విఱ్ఱవీగువారు
పసిడి కలుగువాని బానిస కొడుకులు
విశ్వదాభిరామ వినురవేమ"

అన్నాడు వేమన. కులగోత్రాల ఆధిక్యతను నిరసించాడు. అంతే గాదు; ఆయా సామాజిక వ్యవస్థలలోని ఆధిపత్యాన్ని దురహంకారాన్ని ప్రతిఘటించకపోగా వాటి మనుగడ కొనసాగింపుకు దోహదపడిన విద్యావంతుల్ని నిరసించాడు.

ఆరోగ్యకరమైన ఆధునిక సాహిత్యానికి ఆద్యులు వీరేశలింగం పంతులుగారు. 20 వ శతాబ్దం ప్రారంభంనాటి పరిస్థితులను కథలలో చక్కగా చిత్రీకరించారు. మూఢవిశ్వాసాలు, ఆచారాలు స్త్రీలలో ఎక్కువగా వుండడం వలన బాల్యవివాహాలను వ్యతిరేకించడం, వితంతు వివాహాలను ప్రోత్సహించడమేగాక వారిని విద్యావంతులను చేయడానికి ఎనలేని కృషిచేసిన మహోన్నతుడు వీరేశలింగం పంతులుగారు

ఈనాడు కట్నాలు కానుకలు ఆశించినమేరకు తీసుకొని రావడంలేదని యువతులను హత్యలకు ఆత్మహత్యలకు గురిచేస్తున్న సంఘటనలు వింటున్నాం. పాతరోజుల్లో కట్నాలులేవు. శ్రమచేసి ఉత్పత్తికి తోడ్పడే వ్యక్తి ఒక కుటుంబంనుండి మరొక కుటుంబంలోకి పోతుంది కనుక ఆ కుటుంబానికి ఓలి చెల్లించవలసి వచ్చేది. కాని ఈనాడు అమ్మాయి కుటుంబంనుండి కట్నం కావాలి. అమ్మాయి శ్రమచేసే శక్తిని దోచుకోవాలి. ఈమధ్య ఒక స్త్రీ భరణం కొరకు సుప్రీంకోర్టుకి వెళ్ళింది. సుప్రీంకోర్టు ఆమెకి భరణం యివ్వమని తీర్పు చెప్పింది. 'నాకు భరణం అక్కరలేద'ని ఆమె చేతనే చెప్పించాయి మతపరమైన ఒత్తిడులు. కొందరు కులపెద్దలు, పార్లమెంటు సభ్యులు ప్రధానితో కూడా మంతనాలు జరిపారు. స్త్రీ సమస్య సమాజంలో ఎంత జటిలంగా వుంటో గమనించండి స్త్రీ సమస్య కూడ ఈ సామాజిక వ్యవస్థ సృష్టించే సమస్యలలో అంతర్భాగం మాత్రమేనని మనం గుర్తించాలి.

కొంతమంది విప్లవకారులమని చెప్పకొనే వారున్నారు. వారు నాలాంటి రచయితను పెన్నువద్దు, గన్ను పట్టుకొన మంటున్నారు. మనకున్న వర్గ శత్రువులెవరు ? అభిప్రాయాలతో విభేదించే వారంతా వర్గ శత్రువులేనా ? ప్రజలను మార్చడానికి చేసిన ప్రయత్నాలేమిటి ? అవి ఎందుకు విఫలమవుతున్నాయి ? చేసే ప్రయత్నాలలో లోపాలేమిటి ? — ఈ విధమైన మౌలికమైన విషయాలను ఆలోచించని మీరు విప్లవకారులు కాదు; విధ్వంసనకారులు.

కొన్ని పత్రికలు క్షుద్రసాహిత్యాన్ని ప్రచురిస్తున్నాయి. సైంటిఫిక్ ఫిక్షన్ పేరుతో దయ్యాల భూతాల సాహిత్యాన్ని ప్రచురిస్తున్నాయి. దినపత్రికలలో డెయిలీ సీరియల్ ఏమిటి ? 19 వ శతాబ్దంలో ఇంగ్లీషు పత్రికలు ఈ పనిచేసేవి. 21 వ శతాబ్దంలోకి అడుగు పెట్టనున్న తెలుగు పత్రికలు వాటిని అనుకరిస్తున్నాయి.

మీరంతా ఉపాధ్యాయులు. చదువు చెప్పేవారు.

'చదవని వాడజ్ఞుండగు
చదివిన సదసద్వివేక చతురత గలుగున్'

అంటాడు భాగవతంలో హిరణ్య కశిపుడు ప్రహ్లాదునితో. ప్రహ్లాదుడు చదువుకొన్న తరువాత "చదివించిరి నను గురువులు ... ... చదువులలో మర్మమెల్ల చదివితి తండ్రీ" అంటాడు. అతణ్ణి చదవమన్నది ఒకటి. చదివింది మరొకటి. ఈనాటి ఉపాధ్యాయుల పరిస్థితి అలాగేవుంది. చెప్పమంటున్నది ఒకరకమైన చదువు. చెప్పవలసింది మరొక రకమైన చదువు. తిండిపెట్టే, బ్రతుకు దెరువు చూపించే చదువు కావాలి. ఈ వ్యవస్థకి అనుకూలమైన విషయాలు మాత్రమే వుంటాయి పాఠ్యాంశాలలో. ఉపాధ్యాయులు బోధిస్తూ వీటిలోని లోపాలను, వక్రీకరణలను ఎత్తిచూపాలి. రానున్న వ్యవస్థకు దారి చూపవలసినవారు ఉపాధ్యాయులు.

కాబట్టి ఉపాధ్యాయులు సమాజాన్ని, జీవితాన్ని మార్చివేస్తు దృక్పథంతో అధ్యయనం చేయాలి. రేపటి పౌరులకు అధ్యాపనం చేయాలి. సమస్యల పరిష్కారానికి పోరాట పథంలో పురోగమించాలి. 'అధ్యయనం – అధ్యాపనం – పోరాటం' నినాదాలతో పురోగమించాలి.

★

---

## చెణుకులు

- విష్ణువుకు ఇప్పటిదాకా పది అవతారాలున్నాయి. ఇప్పుడు పదకొండో అవతారం హైదరాబాదులో వెలిసింది (ఎన్. టి. రామారావుపై ఆరుద్ర ఛలోక్తి)
- తెలుగు భాష దిక్కుమాలిన భాష. తూర్పు పడమరలేగాని ఉత్తర దక్షిణాల్లేవు.
- సైన్స్ ఫిక్షన్ పేరిట అమెరికాలో వున్న క్షుద్ర సాహిత్యమంతా మక్కికిమక్కి దించేస్తున్నారు. పత్రికల వ్యాపార ధోరణి వల్ల సొమ్ము చేసుకోడానికి రచయితలు ఎగబడుతున్నారు.
- కళాకారుణ్ణే గాని కళవల్ల డబ్బు చేసుకుని 'కారు' కొన్న వాణ్ణి గాదు.

• • •

ఆరుద్ర ఉపన్యాసం సాగుతున్నప్పుడు మధ్యలో ఒక నిర్వాహకుడు వచ్చి 'కూర్చొని మాట్లాడండి' అని మెల్లిగా సలహా యిచ్చారు. ఆరుద్ర వెంటనే "బాబో వద్దు, నన్ను నాలుగు కాలాల పాటు నిలబెట్టండి" అనగానే సభలో నవ్వులు ప్రతిధ్వనించాయి.

---

"విషం తన ప్రభావాన్ని ఒక్కసారే చూపుతుంది. కాని చెడ్డ పుస్తకం చాలాకాలం వరకు మనుషుల్ని, మనసుల్ని విషమయం చేస్తూనే ఉంటుంది"

— జాన్ ముర్రే

"చెడ్డ పుస్తకానికి మించిన దొంగ లేదు"

— ఇటాలియన్ సామెత

---

# విద్యావిధానం - పాలకవర్గాలు



శ్రీ సీతారాం ఏచూరి

(అధ్యక్షుడు, S. F. I)

వివిధ సామాజిక వ్యవస్థలలో చరిత్రలో ఏదైనా ఒకానొక కాలంలో విద్యయొక్క స్వరూప స్వభావాలను తెలియచేసే అంశాలేవి ? 'అవి పాలకవర్గాల ప్రయోజనాలని' మనకు మానవజాతి చరిత్ర చెపుతున్నది. కాబట్టి విద్యారంగంలో మార్పులు ఎవరు, ఎందుకు తీసుకొని వస్తారు ? అనే ప్రశ్నకు పాలకవర్గాలు, వారి ప్రయోజనాల కొరకు అనేది స్పష్టమైన జవాబు.

విద్య అనేది కేవలం భాష, కొన్ని విషయాలను బోధించేది మాత్రమేగాక ఆ సామాజిక వ్యవస్థ కనుకూలమైన చైతన్యాన్ని కూడ యిచ్చేది. అంటే విద్య సామాజిక స్పృహనూ, చైతన్యాన్ని కలిగించేది.

స్వల్ప మార్పులతో యిప్పటికీ కొనసాగే విద్యా విధానం బ్రిటీషు పాలకులు ప్రవేశపెట్టింది. ఈ విద్యా విధానం ప్రవేశపెట్టడంలో అప్పటి వలస పాలకుల ప్రయోజనాలు యిమిడివున్నాయి. యూరప్‌లో, బ్రిటన్‌లో పారిశ్రామిక పెట్టుబడులు కేంద్రీకృతం కావడం వలన వారి వ్యాపారానికి మార్కెట్లుగా ఉపయోగపడే వలస దేశాలలో ఇంగ్లీషు భాష, సంస్కృతులను విస్తరింపచేయడం అవసరమయింది అందుకే మెకాలే 1835 లో కొంతమంది స్థానికులకు ఇంగ్లీషు నేర్పడం అవసరమని చెబుతూ "మనం పాలించే కోట్లాది ప్రజలకు మనకు అనుసంధానకర్తలుగా పనికి వచ్చేవారిని అంటే "రక్తం, రంగులో భారతీయులకు, అభిరుచులు, అభిప్రాయాలు నైతిక విలువల్లో మనకు సన్నిహితంగా వుండేవారిని తయారు చేసికొనడం అవసరం" అంటాడు. భారతీయులకు ఇంగ్లీషు నేర్పడం వలన ఎవరో విదేశీయులు తమను పరిపాలిస్తున్నారనే భావం కొంతవరకు తగ్గిపోతుంది. వలస పాలకుల పాలనా యంత్రాంగ నిర్వహణకు కొంతమంది ఉద్యోగులు అవసరం. 1833 నాటికి ఈస్టిండియా కంపెనీ ఆర్థిక ఇబ్బందుల్లో వుంది. యూరప్ ఉద్యోగులకు బదులుగా స్థానికులతో తక్కువ జీతానికి పనిచేయించుకోవచ్చు. బ్రిటిషు అభిరుచులు, విలువలు ప్రవేశపెట్టడం ద్వారా బ్రిటన్ వస్తువులకు ఇండియాను మార్కెట్‌గా మార్చవచ్చు. భారతదేశంలో ఇంగ్లీషు విద్యావ్యాప్తి అప్పటి పాలకవర్గాల ప్రయోజనా మేరకు, వారి పాలన కొనసాగింపు కొరకే జరిగింది.

1837 లో అధికారభాష, కోర్టుభాషగానున్న పర్షియన్‌భాషకు బదులు ఇంగ్లీషు ప్రవేశపెట్టబడింది. ఇంగ్లీషు నేర్చుకొన్న భారతీయులకు సివిల్ సర్వీసులో ప్రాధాన్యత కల్పించబడుతుందని, 1844 లో ప్రభుత్వం ప్రకటించింది. ఈ రెండు చర్యలతో భారతదేశంలో ఇంగ్లీషు ప్రాధాన్యత పెరిగింది. ఇతర భాషల చదువు తగ్గిపోయింది.

1857లో భారతదేశంలో 3 విశ్వ విదాలయాలు-బొంబాయి, కలకత్తా, మద్రాసులలో స్థాపించబడ్డాయి. ఉన్నత తరగతులవారికి పైచదువులకు అవకాశాలు కల్పించి ఉన్నతోద్యోగాలు యివ్వడంకూడ ఆనాటి వలస పాలకులకు అవసరమయింది.

ఆ తరువాత 5 దశాబ్దాల కాలంలో విద్యా సంస్థలు త్వరత్వరగా విస్తరించాయి. విద్యార్థులలో పెరుగుతున్న జాతీయ భావాలు బ్రిటిషు వారిని కలచివేశాయి. జాతీయ భావాలు పెరిగిపోతే వలసపాలన కొనసాగడం కష్టం. జాతీయ భావాలు విద్యావ్యాప్తితో పెరిగాయి. కాబట్టి విద్యావ్యాప్తికి అడ్డుకట్టలు వేయడం ఆనాటి పాలకవర్గాలకు అవసరమయింది.

జాతీయ భావాల పెరుగుదలను ఆపివేసే విధంగా విద్యారంగంలో సంస్కరణలు చేయవలసివచ్చింది. 1902 లో రేలీ కమీషన్‌ను నియమించింది ప్రభుత్వం. విద్యాభివృద్ధిని ఆటంకపరుస్తూ విశ్వవిద్యాలయ నిర్వాహణ తీరులో మార్పులు చేస్తూ రేలీ చేసిన సిఫార్సులను 1904 లో అమలు జరిపింది. 'రాసి కాదు వాసి కావాలి' అన్నది రేలీ కమీషన్ ప్రధానమైన సిఫార్సు. సరిగ్గా 80 సం॥ల తర్వాత ఇప్పటి మన పాలకవర్గాలకు అదే నినాదం అవసరమయింది. రేలీ సూచనలే ఈనాడు అవసరమయ్యాయి మన పాలకవర్గాలకు. అవి (1) క్రొత్త కాలేజీలకు, విశ్వవిద్యాలయాలకు అనుమతి నిరాకరించడం, (2) ప్రజాస్వామ్యయుతంగా ఎన్నికైన సిండికేట్, సెనేట్లను రద్దు చేయడం, (3) విద్యార్థుల, ఉపాధ్యాయుల ఎన్నికలను రద్దు చేయడం.

ఇదేదో యాదృచ్ఛికంగా జరిగింది కాదు. ఆనాటి వలస పాలకులకు వారి పాలన కొనసాగింపుకు ఆ సంస్కరణలు ఎలా అవసరమయ్యాయో, అదేవిధంగా ఈనాటి స్వతంత్ర భారతదేశ పాలకులకు వీరి పాలన కొనసాగింపుకు ఈ సంస్కరణలు అవసరమయ్యాయి.

స్వాతంత్ర్యానంతరం పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ అల్లాబాద్ విశ్వవిద్యాలయంలో స్నాతకోపన్యాసంయిస్తూ "విశ్వవిద్యా

లయాలు మారవలెను, పురోగమనానికి, క్రొత్త ఆలోచనా విధానానికి ప్రతీకగా వుండాలి. నాగరికత పురోగమనానికి తోడ్పడాలి. విశ్వ విద్యాలయాల నిర్వహణ పరిస్థితులు సక్రమంగావుంటే దేశ పరిస్థితులు సక్రమంగా వుంటాయి. ఈనాడు మన కర్తవ్యం మనం సాధించు కొన్న రాజకీయ స్వాతంత్ర్యాన్ని ఆర్థిక స్వాతంత్ర్యంగా మార్చు కొనడం" అన్నారు.

ఉన్నత విద్యపై సూచనలు యిచ్చేందుకు డాక్టర్ రాధా కృష్ణన్ అధ్యక్షతన 1948 లో ఒక కమీషన్‌ను, సెకండరీ విద్యపై సూచనలు యిచ్చేందుకు డాక్టర్ లక్ష్మణస్వామి మొదలియార్ అధ్యక్షతన ఒక కమీషన్‌ను నియమించింది ప్రభుత్వం. రాజకీయ స్వాతంత్ర్యాన్ని ఆర్థిక స్వాతంత్ర్యంగా మార్చుకోవాలంటే పెట్టుబడి దారీ పంథాలో పరిశ్రమలు, పరిశ్రమలు నడపడానికి సాంకేతిక నిపుణులు అవసరం. పరిశ్రమల పెరుగుదలతో ఉత్పత్తి అధికమవుతుంది. ఉత్పత్తి పెరుగుదలతో దేశ ఆర్థికరంగం పురోగమిస్తుంది. అంటే ఆనాటి పారిశ్రామిక వేత్తలకు అత్యవసరమైన ఇంజనీర్లను తయారు చేయాలి. అందుకే ఆ కాలంలో విపరీతంగా ఇంజనీరింగ్ కాలేజీలు, పాలిటెక్నికల్ కళాశాలలు బహుళార్థసాధక పాఠశాలలు విస్తారంగా ప్రారంభించబడ్డాయి. ఈ రెండు కమీషన్లుగూడ పెట్టుబడి దారీ విధానం శీఘ్రంగా అభివృద్ధి చెందడానికి అవసరమైన విధంగా విద్యా సంస్కరణలు జరగాలని సూచించాయి. అప్పటి పాలక వర్గాలు వారిని చేయమన్న పని అదే.

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ భాక్రానంగల్ ప్రాజెక్టుకు శంఖుస్థాపన చేస్తూ చేసిన ప్రసంగంలో "ప్రాజెక్టులు ఆధునిక భారత దేశపు దేవాలయాలు. వీటిని నిర్మించిన ఇంజనీర్లు పూజారులు. వీరి సహాయం లేకుండ ఆధునిక భారతదేశాన్ని నిర్మించలేము. రాజకీయ స్వాతంత్ర్యాన్ని ఆర్థిక స్వాతంత్ర్యంగా మార్చలేము" అంటారు. ఇది కూడ పైన చెప్పిన విషయాన్ని ధృవ పరుస్తుంది.

10 సం॥ల తరువాత అంటే 1960-62 నాటికి ఆర్థికరంగం పెరుగుదల ఆగిపోయిన పరిస్థితి వచ్చింది. చదువుకొన్న నిరుద్యోగుల సంఖ్య పెరిగింది. అంటే మన పాలకవర్గాలకు పారిశ్రామిక వేత్తలకు ఇక్కడి విద్యావంతులైన వారిని ఇముడ్చుకోలేకపోయిన పరిస్థితి వచ్చింది పాలకవర్గాలకు ఆర్థిక రంగానికి అప్పటివరకు ఉన్న విద్యా విధానం యొక్క అవసరం తీరిపోయింది. వారి ప్రయోజనాలకు అనుగుణంగా విద్యావిధానాన్ని మార్చవలసి వచ్చింది. ఇదీ కొఠారి కమీషన్‌ను నియమించేటప్పటికి వున్న పరిస్థితి.

1964లో కొఠారి కమీషన్‌ను నియమించడం జరిగింది. 1966లో కమీషన్ తన సిఫార్సులను ప్రభుత్వానికి సమర్పించింది. సిఫార్సులలోని కొన్నిటికి మాత్రం అంటే పాలకవర్గాలకు ఆమోద యోగ్యమైన వాటికి మాత్రం పార్లమెంటు ఆమోదం తెలిపింది. నాటినుండి నేటి వరకు అమలుజరపబడుతున్న సిఫార్సులు కొఠారి కమీషన్ సూచించినవే. కాని ఈ కాలంలో అంటే 1964-68 సంవత్సరంలో రాజకీయ ఆర్థిక పరిస్థితులలో స్పష్టమైన మార్పులు వచ్చాయి. కొన్ని రాష్ట్రాలలో మొట్టమొదటిసారిగా స్వతంత్రభారత దేశంలో కొన్ని రాష్ట్రాలలో కాంగ్రెస్ ప్రభుత్వాలు పడిపోయాయి. నిరుద్యోగులు కానున్న విద్యార్థుల ప్రజాస్వామ్య ఉద్యమాలు పెరిగాయి. దేశంలో ఈ మార్పులు రావడంవలననే కొఠారి కమీషన్ సిఫార్సులలో పాలకవర్గాలకు అనుకూలమైన వాటిని మాత్రమే పార్లమెంటులో ఆమోదించడం జరిగింది.

అప్పటినుండి ఇప్పటి వరకుగల దేశరాజకీయ ఆర్థిక పరిస్థితులను ఆలోచించి చూస్తే కొన్ని విషయాలు స్పష్టమవుతాయి. ఆర్థికరంగం సంక్షోభంలో చిక్కుకుంది. రూపాయి మారకపు రేటు నానాటికి తగ్గిపోతున్నది. ఎగుమతులు తగ్గుతున్నాయి. దిగుమతులు పెరుగుతూ వున్నాయి. నిరక్షరాస్యత పెరుగుతూ వుంది. నిరుద్యోగం పెరుగుతూ వుంది. ప్రపంచ నిరక్షరాస్యుల్లో 40 శాతం నిరక్షరాస్యులు మన దేశంలోనే వున్నారు. ఈ పరిస్థితుల్లో దేశాన్ని 21వ శతాబ్దంలోకి తీసుకెళతామంటున్నారు మన ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ. ఆయన తీసుకెళ్ళినా లేకున్నా 21 వ శతాబ్దం వస్తుంది. మనం 21 వ శతాబ్దం లోకి వెళ్తాం. వేరే రంగంలో మనకి నాయకత్వంవున్నా లేకపోయినా నిరక్షరాస్యతలో మనకి నాయకత్వం వుంటుంది: ప్రపంచ నిరక్షరాస్యుల్లో 50 శాతం భారతీయులే వుంటారు. నిరుద్యోగంలోమాత్రం నాయకత్వం ఉంటుంది.

పాలక వర్గాల ప్రయోజనాలు దెబ్బ తినేటప్పుడు అప్పటివరకు అమలులో వున్న విద్యా విధానాన్ని రద్దుచేసి వారి ప్రయోజనాలకు అనుకూలంగా వుండే విధంగా విద్యా విధానంలో మార్పులు తీసికొని వస్తారని యింతకుముందే వివరించాను. ఇప్పుడు మరలా పాలక వర్గాలకు ఆ అవసరం వచ్చింది. మన దేశాన్ని పెట్టుబడిదారీ పంథాలో ముందుకి తీసుకొనిపోవడం పాలక వర్గాలకు అవసరం. అది వారి మనుగడకు అవసరం. కాని దేశంలోని మార్కెటుమీద ఆధారపడి పెట్టుబడిదారీ విధానాన్ని పురోగమింపచేయడం సాధ్యంకాదని వారికి చాలా స్పష్టంగా అర్థమయింది. కాబట్టే వారికి అత్యంత నిపుణతగల సాంకేతిక పరిజ్ఞానం అవసరం. సాంకేతిక పరికరాలు అవసరం. ఈ పరికరాలతో పని చేయగల మేధావంతులైన పనివంతులు అవసరం. పరికరాలను దిగుమతి చేసుకోగలరుగాని నిపుణులైన పనివాళ్ళను దిగుమతి చేసుకొనడం సాధ్యంకాదు. కాబట్టి నిపుణులైన పనివారిని తయారు చేయడం ఈనాటి అవసరం. వారిని తయారుచేసే విధంగా విద్యా విధానంలో మార్పులు తీసుకొని రావడం ఈనాటి పాలక వర్గాలకు అవసరం. అందుకే ఈ నూతన విద్యా విధానం.

ఇప్పుడు ప్రవేశపెట్టబోతున్న నూతన విద్యా విధాన స్వరూపం ఎలావుంది ? ఒకవైపు స్కూలుస్థాయిలో మోడల్‌స్కూల్స్, పై స్థాయిలో సెంటర్స్ ఆఫ్ ఎక్సలెన్స్, రెండవవైపు పాఠశాల స్థాయిలో అనియత విద్య. పై స్థాయిలో సార్వత్రిక విశ్వవిద్యాలయాలు. ఈ దేశంలో పెట్టుబడిదారీ విధానం పురోగమించేదుకు పారిశ్రామిక వేత్తలకు అవసరమైన కొద్దిమందిని మోడల్‌స్కూల్స్ సెంటర్స్ ఆఫ్ ఎక్సలెన్స్‌లో తయారుచేసుకోవచ్చు. ఇంకా తగ్గించాలంటే మోడల్‌స్కూల్స్

స్థాయిలో పడిపోత పోయవచ్చు. అందుకే 1902-04 లో కర్జన్ వల్లించిన 'వాసి-రాసి' (క్వాలిటీ వర్సెస్ క్వాంటిటీ) నినాదం ఈనాడు మన పాలకవర్గాలకు అవసరం అయింది. ఇది వాసిగల విద్య. ఈ వాసిగల విద్యవలన పాలకవర్గాలకు అవసరమైన సాంకేతిక నిపుణుల్ని తయారు చేసుకోవచ్చు. ఇంక రెండవవైపు అనియత విద్య సార్వత్రిక విశ్వవిద్యాలయాలు సామాన్య ప్రజానీకానికి. 'మేము మీకు చదువుకొనడానికి అవకాశాలు కల్పిస్తున్నాం' అని పాలకవర్గాలు చెప్పుకొనడానికి పనికివచ్చే విద్య ఇది. "సార్వత్రిక విశ్వవిద్యాలయాల్లో ప్రవేశానికి ఏం చదువుకున్నారు? స్థాయి ఏంటి?" అనే ప్రశ్నలతో సంబంధం లేదు. కొంత వయో పరిమితి దాటిన వారందరికీ అందులో ప్రవేశం ఉంటుంది. చేరిన తరువాత 3 సం॥లకో 4 సం॥లకో ఏదో ఒక డిగ్రీ వస్తుంది. ఆ డిగ్రీవలన ఏం ప్రయోజనం వుంటుంది.? — అనేది వేరే విషయం. అందరికి అవకాశాలు కల్పిస్తున్నాంగదా? అని పాలకవర్గాలు చెప్పుకోడానికి పనికొస్తుంది విద్యలో వర్గ దృక్పధం యిప్పుడుకూడా వుంది. అది క్రింది స్థాయినుండి అంటే 1 వ తరగతి నుండి రెండు రకాల విద్య ప్రవేశపెట్టటం. క్రొత్త విద్యా విధానం మోడల్‌స్కూల్స్, సెంటర్ ఆఫ్ ఎక్సలెన్స్‌లు కలవారికి మాత్రమే! ఉన్నత వర్గాల్లో అవికూడా కొందరికే. అనియత విద్య, సార్వత్రిక విశ్వ విద్యాలయాలు మాత్రం పేదలకు ...!

ప్రభుత్వం ప్రకటించిన నూతన విద్యావిధాన పత్రంలో ఇంతవరకూ జరిగిన లోపాలను ఒప్పుకుంటున్నారు. ఈ లోపాలను అభివృద్ధి కాముకులైన ఉపాధ్యాయులు, విద్యార్థులు చాలాకాలం నుండి ఎత్తి చూపిస్తున్నారు. కాని పాలకవర్గం అప్పుడు లోపాలకు ఒప్పుకోలేదు. ఈనాడు ఒప్పుకుంటున్నది. ఎందుకని? ఈనాడు వారికి అనుకూలమైన విద్యావిధానం ప్రవేశపెట్టుకొనేందుకు గాని, మనం కోరే శాస్త్రీయ విద్యావిధానం ప్రవేశపెట్టేందుకు గాదు. 'వాసి-రాసి' నినాదం వారిది. మనం కోరేది అందరికి వాసి గలవిద్య నేర్పాలని. వారు జిల్లాకొక మోడల్‌స్కూల్ పెడుతున్నామని చెబుతున్నారు. ప్రతి స్కూలు ఒక మోడల్‌స్కూలు కావాలని మనం కోరాలి.

జిల్లాకొక మోడల్‌స్కూలు పెట్టడంలో పాలకవర్గాల ప్రయోజనాలతో పాటు రాజకీయ ప్రచారం కూడా వుంటుంది. ఈ విధానాన్ని వ్యతిరేకిస్తూ మనం ఏమైనా చెపితే స్థానిక ప్రజలు "మా జిల్లాలో ఒక మంచి పాఠశాల పెడితే మీకేం బాధ?" అంటారు. అప్పుడు మనం ప్రస్తుతం పాఠశాలల దుస్థితి వారికి వివరించాలి. మోడల్‌స్కూల్స్‌లో సీటు దొరకడం లాటరీలలో లక్షలు రావడం లాంటిదని చెప్పాలి. అందరికి విద్య - అందరికి ఉపాధి కొరకు పోట్లాడుతున్నామని అందుకు వారి సహకారం కూడ కావాలని కోరాలి.

డిగ్రీలకు ఉద్యోగాలకు గల సంబంధాన్ని తెగగొట్టడం మరొక అంశం. ఇది ప్రమాదకరమైన అంశమని మేధావులు ఆలోచనాపరులు అభిప్రాయపడుతున్నారు. కాని పాలకవర్గాలు దీనినే వారికనుకూలంగా ప్రచారం చేసికొనడానికి వినియోగించవచ్చు. వారు యువకులతో "ఇప్పటివరకు మీకు డిగ్రీలు లేవుకాబట్టి ఉద్యోగాలు యివ్వలేకపోయాం. ఇప్పుడు డిగ్రీలకు - ఉద్యోగాలకు గల సంబంధాన్ని తెగగొట్టాం కాబట్టి ఇక యిస్తాం" అని చెప్పి వారికొరకే ఈ సంస్కరణ చేసినట్లు చెప్పవచ్చు. కాని స్వతంత్ర భారతదేశంలో పాలకవర్గాలు మొట్టమొదటిసారిగా విద్యావంతులైన నిరుద్యోగులకంటె నిరక్షరాస్యులైన నిరుద్యోగులుండటం మేం కోరుకుంటున్నామని స్పష్టంగా చెపుతున్నాయి. (అందుకే మోడల్‌స్కూల్స్, సెంటర్స్ ఆఫ్ ఎక్సలెన్స్, డిగ్రీలకు - ఉద్యోగాలకు సంబంధం తెగగొట్టడం)

హిట్లరు ప్రజల నాకర్షించే నినాదాలతో ప్రజావ్యతిరేకమైన చర్యలు ఏ విధంగా చేపట్టాడో అదే విధంగా ఈనాటి పాలకవర్గాలు పైన చెప్పిన వాదాలతో ప్రజావ్యతిరేకమైన విద్యావిధానం చేపట్టుతున్నారు.

స్వతంత్ర భారతదేశంలో పాలకవర్గాలు నిర్బంధ ఉచిత ప్రాథమిక విద్య అందరికి అందచేయడం మాకు సాధ్యంకాదని మొట్టమొదటిసారిగా ఒప్పుకుంటున్నాయి. 7 వ ప్రణాళికలో 1990 నాటికి 13.7 కోట్లమందికి పాఠశాల విద్య నందచేయడం సాధ్యంకాదని అనియత విద్య ద్వారా వారిని అక్షరాస్యుల్ని చేస్తామని పాలకవర్గాలు ప్రకటించాయి. ఇదికూడ తప్పుడు లెఖ్ఖ. జనాభా పెరుగుదల రేటు 1.5 గా పరిగణిస్తే వారు చెప్పింది ఒప్పవుతుంది. కాని ఈనాటి జనాభా పెరుగుదల రేటు 2.5 శాతం.

కొఠారి కమీషన్ ప్రణాళికా వ్యయంలో 6 శాతం విద్యకి కేటాయించాలని సిఫార్సు చేసింది. కాని విద్యార్థి సంఘాలు, ఉపాధ్యాయ సంఘాలు 10 శాతం కేటాయించాలని కోరుతున్నాయి. కాని ఈనాటి ప్రణాళికా వ్యయంలో 6 శాతం కేటాయించినా సార్వత్రిక ప్రాథమిక విద్యను జయప్రదం చేయవచ్చు. అంతేగాక ఉన్నత విద్య, వయోజనవిద్యా పథకాలు కూడ జయప్రదం చేయవచ్చు. కాని ఆ మాత్రం గూడా విద్యకై ఖర్చుపెట్టడం పాలకవర్గాలకు యిష్టంలేదు. నిర్బంధ ప్రాథమిక విద్య అనవసరం అనే అభిప్రాయంతో వుంది పాలకవర్గం.

1950 లో మన రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాలలో నిర్బంధ ప్రాథమిక విద్యను చేర్చినప్పుడు ఎంత ఖర్చవుతుందో తెలియదులావుంది. తరువాత 10 సం॥లకు తెలిసింది ఎక్కువ ఖర్చవుతుందని. 20 సం॥లకు తెలిసింది చాలా ఎక్కువ ఖర్చవుతుందని 30 సం॥లకు తెలిసింది అంత డబ్బులేదని, చేయలేమని.

ఇన్‌శాట్ 1 బి ద్వారా దూరవిద్యను బోధిస్తామంటున్నాయి పాలకవర్గాలు. ఉపాధ్యాయుల అవసరం ఇకమీదట వుండదు. అందుకే ప్రభుత్వ పత్రంలో "విద్యారంగానికి అయ్యే ఖర్చులో 90 శాతం ఉపాధ్యాయుల జీతాలకే అవుతుంది" అని వుంది. ఉపాధ్యాయుల్ని తొలగిస్తే 90 శాతం ఖర్చు తగ్గుతుంది. అలాగే వయోజన విద్య కూడా టి.వి లలో చూపించి ఒక సంవత్సరం తరువాత గణాంక

వివరాలు సేకరించి 'యింతమందికి వయోజన విద్య నేర్పాము' అని ప్రకటించుకొన్నా ఆశ్చర్యపోవలసిందిలేదు. వయోజన విద్యకై కేటాయింపు 3 2 నుండి 0.5 కి తగ్గించివేసింది ప్రభుత్వం.

## వృత్తి విద్య

వృత్తి విద్య ఎలా వుండాలో ప్రభుత్వ ప్రకటనలో స్పష్టంగా లేదు. కారణం వృత్తి విద్య అవసరం వారికిలేదు. మార్కెటులో నిరుద్యోగులు చాలామంది వున్నారు. వారికే ఉద్యోగాలు లేవు. అయినప్పటికీ+2 స్థాయి కొనసాగుతున్నది. పై చదువులకు పోకుండ వడపోతగా ఉపయోగపడుతున్నది.

1959 లో అమెరికాలో ఆర్థిక సంక్షోభం వచ్చింది. ఉన్నత విద్యావ్యాప్తిని నిరోధించేందుకు ప్రభుత్వం ఒక కమీషన్‌ని నియమించింది. జూనియర్ కాలేజి (+2) ని సిఫార్సు చేసింది కమీషన్. 1974 నాటికి 80,000 మంది ఉన్నత విద్యకి పోకుండా ఆపివేయగలిగింది.

మనదేశంలో కూడ +2 స్థాయికి, వృత్తివిద్యకి సంబంధం లేదు. కాని అది విద్యార్థులు పై చదువులకు పోకుండ అడ్డుకట్టగా పనికివస్తుంది.

## విద్యను ప్రైవేటు వ్యక్తులకు అప్పచెప్పడం

ప్రైవేటు వ్యక్తులుగాని, సంస్థలుగాని విద్యాసంస్థలు నెలకొల్పితే వారి పన్నులపై రాయితీలు యిస్తామంటుంది ప్రభుత్వం. వీరు ఎలాంటి ఫీజులు వసూలు చేస్తారనేది ప్రభుత్వానికి అనవసరం. అంటే కేపిటేషన్‌ఫీజుని సమర్థిస్తున్నది. వున్నవారు చదవుకుంటారు. లేనివారు మానుకుంటారు. విద్యావకాశాలు కల్పించేపూచీ తనది కాదంటుంది ప్రభుత్వం.

దేశ వ్యాప్తంగా నూతన విద్యావిధానంపై చర్చలు జరుగుతున్నాయి చర్చించి ఏమి సలహాలు యిస్తారో అని ప్రభుత్వం వేచి చూడటంలేదు. అన్ని నిర్ణయాలు జరిగిపోయాయి. కొన్నిచోట్ల అప్పుడే మోడల్ స్కూల్స్ పెట్టబడ్డాయి. సార్వత్రిక విశ్వవిద్యాలయాలు ప్రారంభించబడ్డాయి. సెంటర్స్ ఆఫ్ ఎక్స్‌లెన్స్ కి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఏడవ ప్రణాళికకు నిధుల కేటాయింపుతో నూతన విద్యావిధానం అమలు జరపడం ప్రారంభమయినట్లే.

## రాజకీయాలకు అతీతంగా విద్య

నూతన విద్యావిధానం అమలు జరిపితే పెల్లుబికే ఉద్యమాలను కూడ అణచివేయడానికి కూడ పాలకవర్గాలు నిర్ణయాలు చేశాయి.

"ముందు ముందు ప్రజల ఆర్థిక పరిస్థితులు క్షీణిస్తాయి. ఇప్పుడు మనకేం ఫరవాలేదు అనుకునేవారి పరిస్థితులుకూడ క్షీణిస్తాయి. నిరక్షరాస్యత, నిరుద్యోగాలు పెరుగుతాయి. ప్రజలు ఉద్రిక్తతకు లోనవుతారు. తిరగబడతారు. శాంతి భద్రతలు క్షీణిస్తాయి. ఆందోళనలను అణచివేయడం శాంతియుత ప్రజాస్వామ్య సోషలిజంపై విశ్వాసమున్న ప్రభుత్వ బాధ్యత" అని ప్రభుత్వం నూతన విద్యావిధానంపై విడుదల చేసిన పత్రంలో రాజకీయాలకు అతీతంగా విద్య అనే శీర్షిక క్రింద ప్రకటించింది.

విద్యా విషయంలో ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్య నిధి సంస్థలకు ఎలాంటి దృక్పథం వుందో అలాంటి దృక్పథమే మన పాలకవర్గాలకు వుంది. "అల్పాదాయ ప్రజలున్న భారతదేశం లాంటి దేశాలలో దూరవిద్య అవసరం. పెట్టుబడులను పెంచడానికి అవసరమైనంతవరకు మాత్రమే విద్యారంగానికి ఖర్చుపెట్టడం మంచిది." అంటుంది ప్రపంచ బ్యాంకు సెక్టర్ పేపర్ ఆన్ ఎడ్యుకేషన్"లో.

ఈ నూతన విద్యావిధానం విద్యార్థుల,ఉపాధ్యాయుల ప్రయోజనాలకు భిన్నమైనది మాత్రమేగాదు. బహుళజాతి సంస్థల, పెద్ద వ్యాపార సంస్థల ప్రయోజనాలు కాపాడడానికై ఇప్పటి పసిపిల్లల, ఇక పుట్టబోయే బిడ్డల జీవితాలను అంధకారబంధురం చేసేది.

కాబట్టి ఉపాధ్యాయ సంఘాలు, విద్యార్థి సంఘాలు, ఇతర ప్రజా సంఘాల సహకారంతో సామాన్య ప్రజానీకం సహకారంతో (వారి బిడ్డల భవితవ్యం దీనితో ముడిపడివుంది గనుక) ఈ నూతన విద్యావిధానాన్ని రద్దు చేయించడానికి ఉవ్వెత్తుగా ఉద్యమించడం ఈనాటి తక్షణ కర్తవ్యం.

### ఈ దేశం ఎటుపోతుందో !

ఈ దేశం ఎటుపోతుందో
బ్రతుకన్నది ఏమౌతుందో – ఈ దేశం ఎటుపోతుందో
మన పూర్వులుచేసిన త్యాగం-ఎందుకనీకొరగాకుందో
ఎపుడైనా పరికించారా – అణుమాత్రం యోచించారా ॥ఎపు॥

అవినీతి అందలమెక్కె – నిరుపేదల బాధలు హెచ్చె
పాలించుటమరిగిన దొరలు – ఏనాడో ప్రజలను మరచె
కష్టానికి ప్రతిఫలమూ – కడగండ్లూ – కన్నీళ్ళూ
సోమరులకు దినదినమూ – అత్తర్లూ – పన్నీర్లూ
హక్కులకై నిలబడితే – లాఠీలూ – తూటాలూ
మన రక్తం పీల్చేటందుకు సంపన్నుల పోటీలూ ॥ఎపుడైనా॥

ఉరికంబా లెక్కారూ – చెరసాలల మగ్గారూ
ప్రాణాలను హారంగా-దేశమాతకిచ్చారూ
ఆ వీరుల త్యాగఫలం-ఎవరి చేతికొచ్చిందో
ఇన్నేళ్ళా స్వాతంత్ర్యం – మనకేమీ ఇచ్చిందో ॥ఎపుడైనా॥

పై చదువులు చదివినగాని-ఉద్యోగం ఎందుకులేదో
రోగాలూ వచ్చినగాని-మందుచుక్క ఎందుకు లేదో
రైతులు పండించే పంటకు-గిట్టుబాటుధర ఎందుకులేదో
మేడిపట్టి దున్నేవాడికి – సెంటుభూమి ఎందుకు లేదో
ఇకనైనా పరికించండి – ప్రగతిబాట పయనించండి ॥ఈదేశం॥

# ప్రపంచశాంతి - మేధావులు



డా॥ వి. బ్రహ్మారెడ్డి

"ప్రపంచ శాంతి" అనే సమస్య సమకాలీన ప్రపంచంలో అన్ని సమస్యల్ని ప్రక్కకునెట్టి అజెండాలోనికి వచ్చింది. "యుద్ధ ప్రమాదం" మన ముంగిట్లోకి వచ్చింది కాబట్టే ప్రపంచ శాంతిని పరిరక్షించే కార్యక్రమం ముందుకొచ్చింది. ఇంతకీ యుద్ధ ప్రమాదానికి కారకులెవ్వరు ? ప్రపంచశాంతిని పరిరక్షించాల్సిందెవ్వరు ? ఈ క్రమములో మేధావులమని అనుకొనే మీ, మా పాత్ర ఏంటి ? ఈ విషయాన్ని కాస్త లోతుగా పరిశీలిద్దాము.

## యుద్ధాలంటే ఏమిటి ?

"బుద్ధిలేక పుట్టానీ అద్దదిద్దాల లోకంలో" అనుకొని ఎవరైనా గొంతుకు ఉరేసుకొని చనిపోతే దాన్ని "ఆత్మహత్య" అంటాము. పూర్తిగా చావకుండా పోలీసుల చేతికి దొరికితే "ఆత్మహత్యా నేరం" క్రింద అరెస్టు చేసి, ఆ పైన నిజంగానే చనిపోయే ఏర్పాటు చేస్తారు.

ఒక మనిషి ఇంకో మనిషిని పొడిచి చంపితే "హత్య" అంటాము. హత్య చేసినవాణ్ణి పోలిసు స్టేషన్, కోర్టు, జైలు అనే చోట్ల త్రిప్పి, ఆపైన "ఉరిశిక్ష" అనే పేరుతో చట్టబద్ధంగా హత్య చేస్తాము. హత్యకు హత్యే జవాబు అని నిరూపిస్తాము.

ఒక ఇంకో గుంపుమీద దాడి చేస్తే "దొమ్మీ" అంటాము. ఇందులోనూ కొంతమంది చనిపోతారు. లేదా చంపబడ్తారు.

ఒక దేశం ఇంకో దేశంమీద దాడి జరిపి ఓపికున్నంత వరకు నరికి పోగులు పెడితే "యుద్ధం" అంటాము. ఇందులో పాల్గొన్న సైనికులకు తుపాకులు, బట్టలు, తిండి వగైరా మనమే ఇచ్చి "శభాష్" అని భుజం తట్టి, తర్వాత బిరుదులిచ్చి సత్కరించి, ఉత్సాహపర్చి, మరీ అవతలి వాడిని చావగొట్టి రమ్మంటాము. "యుద్ధంలో ఎవరూ చావరు. హత్యలు చేయబడ్తారు" అన్నట్లుగా జరిగే ఈ మూకుమ్మడి హత్యాకాండను 'యుద్ధము' అనిపిల్చి మర్యాద చేస్తాము.

## యుద్ధాలెందుకు వస్తాయి ?

"కోరికలే సకల అనర్థాలకు మూలం, వాటిని చంపుకోండి, ఏ బాధలూ అంటవని గౌతమ బుద్ధుడు చెప్తే, అందరూ బుద్ధిగా విన్నారు. కాని ఎవరూ కోర్కెలు చంపుకోలేదు.

"నీ తోటి వాణ్ణి నీకు మాదిరిగా ప్రేమించు" అని ఏసుక్రీస్తు చెప్తే "సరే" అన్నారు. ఆపైన 'ప్రేమ'గా తోటి వాణ్ణి చావమోది తన అవసరాలు తీర్చుకున్నారు.

"సత్యం, అహింస" అంటూనే ఉన్నాడు గాంధీ. "హే! రాం!!" అని అరచి చనిపోయేట్లుగా గురిచూసి కాల్చాడు గాడ్సే.

ఇంతమంది ప్రవక్తలు, మంచి మనుషులు ఇంతింత లావుపాటి నీతి బోధలు చేసినా జనం ఎందుకు చంపుకొంటున్నారు ? ఎందుకు యుద్ధాలుచేస్తున్నారు ?

చావాలనే సరదానా ?! చంపాలనే కోరికా !! వీర స్వర్గం పిలైతే అలంకరించి, పనీ పాటా లేకుండా ఇంద్రుడి లోకంలో త్రాగి తందనాలాడ్దాం అనా ?

"యుద్ధం చేయాలి. ప్రక్కవాణ్ణి చంపాలి" అనే లక్షణం మానవనైజంలోనే ఉంది. కాబట్టి యుద్ధం అనివార్యము అని 'హెర్బర్ట్ స్పెన్సర్' అని ఒక "అతి మేధావి" సెలవిచ్చాడు. యుద్ధాలు జరిగితే లాభాలు పొందే వారికే 'స్పెన్సర్' మాట అమృతప్రాయంగా ఉంటుంది.

## మరి వాస్తవమేమిటి ?

జంతువుల్లోంచి విడిపడిన మానవులు గుంపులుగా నివసించారు. గుంపులుగా వేటాడారు. ఒకరితో ఒకరు సహకరించుకొన్నారు

పంటలు పండించే రైతుకు నాగలి చేసే వడ్రంగి సహకరించాడు. నాగలి చేసే వడ్రంగికి నాగలి కర్రు చేసే కమ్మరి సహకరించాడు. పంటలు పండించేవాడు పరిశ్రమలు నడిపే కార్మికులకు సహకరించాడు. పరిశ్రమల్లో తయారయిన ఎరువులు, పురుగు మందులు, తదితర పస్తువులందించి సహకరించారు కార్మికులు.

ఆ విధంగా నేటి సమాజమంతా పరస్పర సహకారంమీదనే ఆధారపడి మనుగడ సాగిస్తోంది.

"ఆర్థిక దృష్టితో చూస్తే సైనిక వ్యయమనేది ... ఆయా దేశాలు తమ పెట్టుబడిలో కొంత భాగాన్ని ఏట్లో పడవేసిన దాన్నితో సమానం"

— కార్ల్ మార్క్స్

అంత దూరం అవసరం లేదు. మన శరీరంలోనే కళ్ళు, నోరు చేతులు, కాళ్ళు, పొట్ట ఒకదానితో ఒకటి సహకరించుకొంటూనే ఉన్నాయి. అంతేగాని తగాదాలు పడి తన్నుకోటంలేదు.

మానవ శరీరంలో సమాజంలో ప్రతిచోటా పరస్పర 'సహకారమే' కన్పడుతుందిగాని 'సంహారం' కన్పట్టంలేదు. అందు వలన మానవ నైజంలో 'హెర్బర్ట్ స్పెన్సర్' అన్నట్లుగా "యుద్ధం చేయాలి, చంపుకోవాలి" అనే అంశం ఎక్కడా లేదు.

## యుద్ధాలు ఎన్ని రకాలు ?

పారిశ్రామికంగా అభివృద్ధిచెందిన దేశాల్లోని పెట్టుబడిదారులకు తమ తమ సరుకుల్ని అమ్ముకోవాల్సిన అవసరం వచ్చింది తమ దేశంలోని జనాన్ని ఆ పాటికే సరిపడా దివాలా తీయించి ఉంటే, క్రొత్తగా దివాలా దీయించటానికి జనం కావాల్సి వచ్చింది వారికి. వెనుకబడిన దేశాన్ని యుద్ధాలు చేసి, లొంగదీసుకొని "వలసలుగా" మార్చుకొన్నారు. ఆ విధంగా సామ్రాజ్యాలు కావాలనుకొనే సామ్రాజ్య వాదులు వలసలకోసం యుద్ధాలు చేశారు.

సామ్రాజ్యవాదులు ప్రపంచాన్ని పంచుకొన్నారు. వీరిలో గల అసమాన అభివృద్ధి వలన, త్వరగా ఎదిగేవారికి ఎక్కువ వలసలు కావాల్సి వచ్చాయి. ఎక్కడినుంచి వస్తాయి వలసలు క్రొత్తగా? ఈ పాటికే పంచుకొన్న ప్రపంచాన్ని మరలా పంచుకోవాలి. "ప్రపంచ పునర్విభజన" జరిగితే నష్టం జరగబోయే వారికి లాభం పొందబోయే వారికి మధ్య యుద్ధాలు జరిగాయి. రెండు ప్రపంచ యుద్ధాలూ ఆ ప్రకారంగా సామ్రాజ్యవాదుల మధ్యే మొదలయ్యాయి.

అణగ ద్రొక్క బడటం ఇష్టంలేని జనానికి అణగద్రొక్కి లాభాలు సంపాదించాలనుకొనే పాలకులకూ మధ్య కూడా యుద్ధాలు జరిగాయి. వీటిని "అంతర్యుద్ధాలు" అన్నాము.

అలాగే దురాక్రమణ యుద్ధాలు కొన్ని ఆత్మరక్షణ యుద్ధాలు మరికొన్ని.

వియత్నాంమీద అమెరికా చేసింది దురాక్రమణ యుద్ధం. వియత్నాం చేసింది ఆత్మరక్షణ యుద్ధం. గ్రెనడా మీద అమెరికా చేసింది దురాక్రమణ యుద్ధం. ఫాక్‌ల్యాండ్స్ మీద బ్రిటన్ చేసింది దురాక్రమణ యుద్ధం. లిబియా మీద నిన్న, క్యూబామీద మొన్న అమెరికా చేయాలనుకొన్నది దురాక్రమణ యుద్ధం.

అందువలన "ఆత్మరక్షణ" ప్రతి ఒక్కని ప్రాథమిక హక్కుగా గుర్తించే మనము యుద్ధాలన్నిటినీ ఒకే గాట గట్టి, "మేము యుద్ధాలన్నింటికి వ్యతిరేకం" అని బోర్డు కట్టుకోము. మనం దురాక్రమణ యుద్ధాలకు వ్యతిరేకం. ఆత్మరక్షణ యుద్ధాలకు అనుకూలం.

కష్టజీవులకూ, దోపిడీ దార్లకూ మధ్య అంతర్యుద్ధం వస్తే, మనం "కష్టజీవులం" కాబట్టి, కష్టజీవులు చేసే ఆత్మరక్షణ యుద్ధాన్ని సమర్థిస్తాము. దోపిడీదార్లు చేసే దురాక్రమణ యుద్ధాన్ని వ్యతిరేకిస్తాము.

"ఆశయాలు సంఘర్షించేవేళ, ఆయుధాలు అలీనం కావు" అని మనకు బాగా తెలుసు.

## యుద్ధాలు ఎవరి లాభాలకొరకు ?

లాభాలే పరమావధిగాగల పెట్టుబడిదారులు అందుకే సరుకులు తయారు చేస్తారు. లాభాలు వస్తాయి అని తెలిస్తే, అన్నీ మానేసి శవపేటికలయినా తయారు చేస్తారు. ఆ శవ పేటికలకోసం అవసరమైనన్ని శవాల్ని తయారు చేస్తారు.

తిండి పదార్థాలు తయారు చేసి అమ్మితే జనం పొట్ట పట్టినంతే తింటారు. మరలా ఆకలయ్యేవరకూ తిండిసరుకులు కొనరు. బట్టలు తయారుచేసి అమ్మితే, జనం తమ శరీరాన్ని కప్పుకోటానికి అవసరమైనంతే కొంటారు. అవి చినిగిపోయేంతవరకూ బట్టల దుకాణాల ఛాయలకురారు. ఇటువంటి సరుకుల వినియోగానికి పరిమితి ఉంది. ఆ విధంగా ఆయా సరుకులు తయారుచేసే పెట్టుబడిదారుల లాభాలకూ పరిమితి ఏర్పడుతుంది.

అలాంటి పరిమితి లేకుండా విపరీతంగా అమ్ముకోటానికి వీలయ్యే సరుకేది ? ప్రపంచంలో యుద్ధాలున్నంతకాలం యుద్ధ సామగ్రి నలా హద్దూ, పద్దూ లేకుండా అమ్ముకోవచ్చు.

ఒక ఎఫ్-14 ఫైటర్ విమానం యుద్ధంలో కూలిపోతే. ఇరవై కోట్ల నలభై లక్షల రూపాయల విలువైన ఇంకో విమానానికి గిరాకీ వస్తుంది.

ఒక బి-58 బాంబరు విమానం కూలిపోతే 20 కోట్ల 70 లక్షల రూపాయలు ఖరీదుచేసే ఇంకో విమానం అమ్ముకోవచ్చు.

ఒక జలాంతర్గామి అయితే 200 కోట్ల రూపాయలు, విమాన వాహకనౌక అయితే 2000 కోట్ల రూపాయలు అలా అలా సొమ్ము చేసుకోవచ్చు.

అమెరికాలో 4500 గుత్తసంస్థలు 5000 ఆయుధ కర్మాగారాలు నడుపుతున్నాయి. అలాగే అన్ని పెట్టుబడిదారీ దేశాలునూ.

ఒక్క అమెరికాయే సంవత్సరానికి 24,000 కోట్ల రూపాయల విలువచేసే ఆయుధాలు వివిధ దేశాలకు అమ్ముతూంది. ఇవన్నీ ఖర్చయితేనేగదా మరలా సరుకులు (యుద్ధసామాగ్రి) తయారు చేసుకొనేదీ, అమ్ముకొని లాభాలు సంపాదించుకొనేదీనూ.

అందువలన ప్రపంచంలో ఏదోమూల యుద్ధం జరక్కపోతే ఉద్రిక్త వాతావరణం లేకపోతే, అమెరికా ఆయుధాల అవసరం ఉండదు. ముఖ్యంగా "అణు ఆయుధాలు గుట్టలుపడి ఉన్నాయి. కొన్నయినా ఖర్చుపెట్టుకొందాం కాంపిల్‌గానయినా, ఐరోపాలో పరిమిత అణుయుద్ధం చేసుకొందామా" అని అమెరికా రీగన్ వారు

సోవియట్‌ను అడిగింది రెండేండ్ల నాడు. దాంతో ఐరోపా రాజ్యాలు గుదుపుమండి, తిప్పికొడితే అప్పటికి నోర్మూసుకొంది అమెరికా.

ఇప్పుడు క్రొత్తగా "ఇదేంకాదు గాని ఆకాశంలో తారాజువ్వల మాదిరిగా అణ్వాయుధాలు విసిరేసుకొందాం రారాదూ" అని "నక్షత్ర యుద్ధాని"కి పథకాలు వేస్తుంది అమెరికా సామ్రాజ్యవాదం.

"ప్రపంచ ప్రజలారా! చక్కగా యుద్ధాలు చేసుకొని, మా ఆయుధాలు ఖర్చుచేసి చంపుకోండి, చావండి. చంపేదెవ్వరు? చచ్చే దెవ్వరు? అంతా నా మాయ అనే కృష్ణ భగవానుడి గీతా మకరం దాన్ని మరీ త్రాగి తన్నుకు చావండి. మేము లాభాలు సంపాదించు కొంటాము." అంటోంది అమెరికా.

ప్రపంచంలో యుద్ధాలు ఆగిపోయేట్లయితే ఆ ముందురోజే అమెరికా ఆర్థిక వ్యవస్థ దివాళాదీస్తుంది. ఇది పచ్చినిజం.

## రెంటినీ ఒకేగాట కట్టేస్తామా?

దారినపోయేవాణ్ణొక రౌడీ కొట్టాడనుకోండి, ఆత్మరక్షణ కోసం ఆ దారినబోయే దానయ్య తిరగబడి రౌడీని తన్నాడనుకోండి, ఇప్పుడీ ఇద్దర్నీ ఒకే గాటగట్టి పరిశీలిస్తామా! రెచ్చగొట్టిన రౌడీకొక సూత్రం, ఆత్మరక్షణ చేసుకొన్న దానయ్యకొక సూత్రం విధిగా పాటిస్తామా? లేదా?

అలాగే అమెరికా, రష్యా రెండూకారణమే యుద్ధ ప్రమాదానికి అని వాదించే వారూ ఉన్నారు. ఈ క్రింది పరిశీలన గమనించాక మీరేమంటారో ఆలోచించండి.

1945 న ఆగస్టు 6 వ తేదీన హిరోషిమా మీద, ఆగస్టు 9 వ తేదీన నాగసాకి మీద అమెరికా మొట్టమొదటిసారిగా అటంబాంబులు వేసింది. 32 దేశాల్లో 5 లక్షల సైనికులతో 1500 పైగా సైనిక స్థావరాలు పెట్టింది అమెరికా.

వియత్నాం, లావోస్, కంపూచియా, కొరియా, అంగోలా, మధ్య ఆసియా, గ్రెనడా మొదలగుచోట్ల "రావణాసురుడి" కాష్ఠంలా యుద్ధాలు చేసింది. చేస్తూంది అమెరికానే.

అటంబాంబు అమెరికా 1945 లో తయారు చేస్తే, రష్యా 1949లో తయారు చేసింది. హైడ్రోజన్ బాంబు అమెరికా 1951లో చేస్తే, రష్యా 1953లో చేసింది. ఖండాంతర రాకెట్లు అమెరికా 1955 లోనూ, రష్యా 1957 లోనూ చేసింది. అణుయుద్ధ నౌకలు అమెరికా 1956లో చేస్తే రష్యా 1962లో చేసింది. ఆత్మరక్షణ కోసం ఎవరు ఆయుధాలు తయారుచేసుకొన్నారో, దురాక్రమణకోసం ఎవరు చేసుకొన్నారో దీన్నిబట్టి కొంత అర్థం కావాలి మరి!

"మేముగా ఎవరిమీద ముందుగా అణ్వాయుధాలు ప్రయోగించం" అని రష్యా అధినేత గోర్బచెవ్ హామీ ఇస్తే, అమెరికా అధ్యక్షుడు రీగన్ అలాంటి ప్రకటన ఎందుకు చేయలేకపోతున్నాడు?

తనంత తానుగా ఆయుధ సామగ్రిని రష్యా తగ్గించుకుంటే, నక్షత్ర యుద్ధం చేయాలని అమెరికా ఎందుకు ఉబలాట పడ్తూంది?

అందుకే దురాక్రమణవాది అమెరికానూ, ఆత్మరక్షణవాది రష్యాను ఒకే గాట కట్టెయ్యటం నైతికంగా సరయింది కాదు.

## సామ్రాజ్యవాదం బ్రతికున్నంతకాలం ....

... ... యుద్ధ ప్రమాదం తప్పదు. చావుమీద, శవాలమీద వ్యాపారం చేసే సామ్రాజ్యవాదం ఒక వ్యవస్థగా బ్రతికున్నంతకాలం ప్రపంచ శాంతికి ప్రమాదం పొంచే ఉంటుంది.

మొదటి ప్రపంచ యుద్ధంలో 1 కోటి మంది చనిపోయారు. రెండుకోట్ల మంది వికలాంగులయ్యారు. 30 వేల కోట్ల డాలర్ల విలువైన సంపద నాశనమైంది.

రెండవ ప్రపంచ యుద్ధంలో 5 కోట్లమంది చనిపోయారు. 9 కోట్లమంది వికలాంగులయ్యారు. 4 లక్షల కోట్ల డాలర్ల ఆస్తులు బుగ్గిపాలయ్యాయి.

1945 తర్వాత 150 యుద్ధాల్లో కోటిమందికి పైగా 'హత్య' చేయబడ్డారు. 7 లక్షల 50 వేల కోట్ల డాలర్ల సరుకు అమ్ముడైంది.

ఇప్పటివరకూ జరిగిన యుద్ధాల్లో ఇప్పటి ప్రపంచ జనాభాతో సమానమైనంతమంది చనిపోయారు. అయినా తీరలేదు శవదాహం సామ్రాజ్యవాదులకు.

## ఎంతెంత ఖర్చు?

ఒక్కరోజు ఆయుధాల తయారీకి పెట్టే ఖర్చుతో

— ఒక నాగార్జునసాగర్ డాం లాంటిది కట్టవచ్చు. 60 లక్షల ఎకరాల భూమి సాగులోనికి తీసుకురావచ్చు.

— భిలాయ్ ఉక్కు ఫ్యాక్టరీ లాంటిదొకటి కట్టవచ్చు. 80 లక్షల టన్నుల ఉక్కు తయారు చేయవచ్చు.

— 50 కోట్ల మందికి బట్టలు.

— 400 కోట్ల మంది కొకపూట భోజనం.

— 20 కోట్ల మందికి ఇంటివసతి కల్పించవచ్చు.

ప్రపంచంలో సైనికవ్యయం గంటకు 75 కోట్ల రూపాయలు. కాని ప్రపంచంలో 60 కోట్ల మందికి పోషకాహారం లేదు. 80 కోట్ల మందికి విద్యలేదు. 150 కోట్ల మందికి వైద్యం అందుబాటులో లేదు,

ఒక సైనికునిమీద రెండు లక్షల రూపాయలు ఖర్చు జరుగుతూంటే, ఒక విద్యార్థిమీద సగటున మూడు వేల రూపాయలు ఖర్చు చేస్తున్నారు.

ఆయుధాలకు ఖర్చయ్యే ఈ ధనమంతా ప్రజోపయోగ అవసరాలకు వినియోగించి ఉంటే ఆకలి, దరిద్రం, నిరుద్యోగం, అనారోగ్యం ఈ ప్రపంచంలో ఏనాడో ఆత్మహత్య చేసికొని ఉండేవి. ఈ బాధలతో క్రుంగిపోయ్యే కష్టజీవులకు, సాధారణ జనానికి యుద్ధోన్మాదులు మొదటి శత్రువులు అంటే అతిశయోక్తి కాదు.

## వస్తుందా మూడవ ప్రపంచయుద్ధం ?

అని ఒక శాస్త్రజ్ఞుణ్ణి అడిగితే ఆయన "మూడవ ప్రపంచ యుద్ధం వస్తుందో రాదో చెప్పలేను. నాల్గవ ప్రపంచయుద్ధం మాత్రం ఖచ్చితంగా రాదు. అప్పటికి యుద్ధం చేసికోటానికి మనుష్యులుండరు కాబట్టి" అన్నాడట.

20 వేల మెగా టన్నుల టి.యన్.టి. శక్తిగల 50 వేల అణు ఆయుధాలున్నాయి ప్రపంచంలో. వీటిలో, ఈ ప్రపంచాన్ని అనేక సార్లు సీరియల్‌గా ధ్వంసం చేయవచ్చు. ఒకసారి ధ్వంసం చేసిన తర్వాత ఇంకోసారి నాశనం చేయటానికింకేమీ మిగలదు అనేది వేరే సంగతి.

ఒకసారి అణుయుద్ధం అంటూ మొదలయితే ప్రజలందరితో పాటు, సామ్రాజ్యవాదులూ, వారి ఆస్తులూ, పలుకుబడులూ, ప్రాబల్యాలూ అన్నీ మంటగలసి పోతాయని వారికి కూడా తెలుసు. లాభమే పరమావధిగాగల సామ్రాజ్యవాదులు భయంకరమైన జూదం మొదలు పెట్టారు. అదే ఆయుధపోటీ; అయితే ఆయుధాలు తయారు చేసిన మానవులకన్న, ఆయుధాలు మిన్న కాదు. అవి ప్రపంచ భవితవ్యాన్ని నిర్ణయించేదంతకన్నా కాదు. ఆ విధంగా తాత్వికంగా పరిశీలిస్తే మూడవ ప్రపంచ యుద్ధం రావటానికి వీలులేదు. మానవులు సంపూర్ణంగా అంతరించి పోవటానికి వీలులేదు.

తరతరాలుగా ప్రకృతికి వ్యతిరేకంగా మానవుడు చేసిన పోరాట మహాప్రస్థానంలో మానవత్వం అజేయంగా నిలవాలితప్ప అంతరించటానికి వీలులేదు. ప్రపంచానికి భయంకర శాపంగా తయారు చేయబడిన అణ్వాయుధ తదితర మారణాయుధాలు సామ్రాజ్యవాదుల కుటిల దృక్పథంతో తయారయ్యాయి.

ఎటూరాని మూడవ ప్రపంచ యుద్ధానికి వ్యతిరేకంగా ఈ హడావిడి ఏమిటి? అనుకొనే మిత్రులు లేకపోలేదు. ఒకవైపు సోవియట్ నాయకత్వాన సభ్య ప్రపంచం, సామ్రాజ్యవాద దేశాల్తో సహా అన్ని దేశాలలోని సామాన్య ప్రజలు ముక్తకంఠంతో అడ్డుగోడగా నిలువబడినందువల్లనే నేడు ప్రపంచ శాంతి కాపాడబడగల్గే స్థితిలో వుంది. అదే అలసత్వంతో వుంటే యుద్ధప్రమాదం మన ముంగిట్లోనే వుంటుంది. ఈ కర్తవ్య నిర్వహణలో మేధావుల పాత్ర ఏమిటి ?

## మేధావు లెవరు ? వీరి పాత్రేమిటి ?

ప్రధానంగా మేధస్సుతో శ్రమ చేసేవాడు, మానసిక శ్రమ ప్రధాన నిత్యజీవిత వ్యవహారంగా గలవాడు మేధావి అనబడ్తాడు. డాక్టర్లు, ఇంజనీర్లు, లాయర్లు, శాస్త్రజ్ఞులు, ఉపాధ్యాయులు, కళాకారులు తదితరులు మేధావుల కోవ క్రిందికి వస్తారు. వీరు కష్టజీవుల కోసం తమ జీవితాల్ని వినియోగిస్తే "కష్టజీవుల మేధావుల"వుతారు. దోపిడీదార్ల కోసం పనిచేస్తే 'దోపిడీ మేధావుల'వుతారు.

అటంబాంబుకు కావల్సిన సూత్రాన్ని కనిపెట్టింది "ఆల్బర్టు ఐన్‌స్టీన్" అనే మేధావి. దాని దుష్ఫలితాలు చూసిన ఆయన తర్వాత శాంతి ఉద్యమంలో చురుకుగా పాల్గొన్నాడు.

బాంబులకుపయోగించే "టి. యన్. టి." అనే పదార్థాన్ని కనిపెట్టింది "ఆల్ ఫ్రెడ్ నోబుల్" అనే మేధావి. దానివలన జనం గుట్టలుగా చావడంచూసి మనసు కకావికలై తన యావదాస్తినీ శాస్త్ర పరిశోధనల్లోనూ, శాంతిపరిరక్షణలోనూ ప్రముఖంగా నిల్చిన వారికి బహుమతులుగా యివ్వమని రాసిచ్చాడు. అవే నోబుల్ బహుమానాలు.

యుద్ధంలోగాని, శాంతికాలంలోగాని ప్రజలకు పనికొచ్చే ఎన్నెన్నో వస్తుజాలాలు మేధావుల కృషి ఫలితంగా తయారవుతున్నాయి. అవి ఎలా ఉపయోగించబడుతున్నాయనేది నిజంగా ముఖ్యమైన విషయం.

ఎలక్ట్రిక్ తీగల్ని పట్టుకొని వేలాది మంది చనిపోయారంటే ఆ తప్పు ఎలక్ట్రిసిటీదికాదు. దాన్ని కనిపెట్టిన 'మైకేల్ ఫేరడే'దీ కాదు రైళ్ళ క్రింద పడి జనం చనిపోతే ఆతప్పు రైళ్ళదికాదు. వాటిని పట్టాల మీద నడిపించిన 'స్టీవెన్ సన్'దీ కాదు. 'ఎన్రికో ఫెర్మి' అణుబాంబును రూపొందిస్తే ఆ బాంబు హిరోషిమా, నాగసాకిలలో 8 లక్షల మందిని క్షణంలో పొట్టన పెట్టుకొంది అంటే ఆ తప్పు అణుశక్తిదికాదు.

ఎలక్ట్రిసిటీ, రైళ్ళు, అణుశక్తి వీటితో వేలాది ఉపయోగాలున్నాయి ప్రజలకు. అలా ఉపయోగించుకోకుండా, మానవ సంహారానికుపయోగించుకొంటే, ఆ తప్పు విజ్ఞానానిదికాదు. వాటినలా వినియోగించిన మానవులదే అవుతుంది. ఆ పాపం అణుశక్తిని బాంబులుగా వినియోగించాలనుకొనే సామ్రాజ్యవాదులకు దక్కలు అవుతుంది. ఇంత శక్తివంతమయిన విజ్ఞానాన్ని తయారుచేస్తున్న మేధావుల సామాజిక చైతన్యమెలా ఉందనేదికూడా ఒక్కొక్కసారి అంతుబట్టకుండా ఉంటున్నది.

## మేధావులు కొంతమంది

తమ పరిశోధనలు, తమపనేదో తమదిగా ఉంటుంటారు తప్ప దాని ఫలితాలు సమాజంమీద ఎలా పడుందోకూడా చూడరు. అలాంటి మేధావుల్లో ఒకాయన "మానవ శరీర నిర్మాణ శాస్త్రం"లో పరిశోధన చేస్తూన్నాడు. దానికోసం ఆయనకు విరివిగా శవాలు కావాల్సివచ్చాయి. ఆయన అవసరంమేరకు ప్రభుత్వాసుపత్రి సూపరింటెండెంట్ శవాలు

శుభాకాంక్షలతో

మన్నికకు నాణ్యతకు

# శ్రీ లక్ష్మీ టైమ్ & సౌండ్ సెంటర్

## రేడియోలు, గడియారముల షోరూమ్

**ఉదయభాస్కర్ రోడ్, భద్రాచలం - 507 111.**

మావద్ద : ఫిలిప్స్, బుష్, మర్ఫీ, కెల్ట్రాన్, సంతోష్ కంపెనీల రేడియోలు, స్టీరియోలు, టేప్‌రికార్డర్లు.
హెచ్. యం. టి., ఆల్విన్, రికో (ఇండియా) లేడీస్ & జంట్స్ కి, ఆటోమేటిక్, క్వార్ట్జ్ చేతిగడియారములు
హెచ్. ఇ. ఎస్., స్వీటో, టైమ్‌కాల్ టేబుల్ గడియారములు మాస్టర్, సిటిజన్, బిమ్‌బామ్ గోడ గడియారములు
సరసమైన ధరలకు అమ్మబడును మరియు రిపేర్ చేయబడును.

న్యూ వెరైటీస్ క్వార్ట్జ్ గడియారములు మా ప్రత్యేకత.
అన్నిరకముల రికార్డెడ్ క్యాసెట్లు లభించును.

**నేడే మా షోరూమ్‌కి దయచేయండి**

ప్రొ॥ కె. వి. సుబ్బారావు & బ్రదర్స్

---

శుభాకాంక్షలతో

ఫోన్ : 10

# లిటిల్ ఫ్లవర్స్

## కాన్వెంట్

**భద్రాచలం - 507 111**



ఎల్ కె. జి. నుండి 10 వ తరగతి వరకు
తెలుగు & ఇంగ్లీష్ మీడియం హాస్టల్ వసతి కలదు.

---

శుభాకాంక్షలతో

# సంగీత ఎంటర్‌ప్రైజెస్

## యు. బి. రోడ్ - భద్రాచలం

మావద్ద ఫిలిప్స్ రేడియోలు, స్టీరియోలు టి. వి. లు,
హెచ్. ఎం. టి, ఆల్విన్ వాచీలు కంపెనీ ధరలకు లభించును.

---

శుభాకాంక్షలతో

ఫోన్ : 227

# భగవాన్ స్వీట్స్

## యు. బి. రోడ్ - భద్రాచలం

మావద్ద టీ పార్టీలు, వివాహాది శుభకార్యములకు అన్నిరకముల
స్వీట్లు మీ ఆర్డర్లపై లభించున

సప్లై చేయలేకపోయాడు. దాంతో ఆయనొక శవాలు సరఫరాచేసే కాంట్రాక్టరును కుదుర్చుకున్నాడు. కాంట్రాక్టరు క్రమం తప్పకుండా సప్లై చేస్తున్నాడు.

ఊళ్ళో ఉన్న శ్మశానాల్లో పూడ్చేసిన శవాలు మాయమవుతున్నాయని ప్రజలంతా గగ్గోలుగా చర్చించుకోటం మొదలయింది. అవన్నీ కంట్రాక్టరు ద్వారా మేధావి దగ్గరకు చేరాయన్నమాట. అయినా ఆయన పీసమంతకూడా పట్టించుకోలేదు.

మరి కొన్నాళ్ళకు రాత్రిళ్ళు ఊళ్ళో ఎవరయినా ఒంటరిగా తిరిగితే పర్మినెంటుగా మాయమవుతున్నారని అర్థమయింది. వారు కూడా ముందు మాయమై, తర్వాత కంట్రాక్టరు చేతులు మీదుగా శవాలుగా మారి మన డాక్టరుగారి టేబుల్ మీదకు పరిశోధన నిమిత్తం చేరుతున్నారన్నమాట. అయినా ఈయనకు చీమకుట్టినట్లుకూడా లేదు. అలా సాగుతున్నది పరిశోధన. ఒకరోజు ఉదయమే హుషారుగా టేబుల్ దగ్గరకివచ్చి శవం ముఖం మీదున్న గుడ్డ తీశాడు డాక్టరు. ఆ శవం ఎవరిదో కాదు. డాక్టరుగారి ఒక్కగానొక్క కూతురు నిర్జీవంగాఉంది టేబుల్ మీద. అప్పుడయినా డాక్టరుగారు చేసిన తప్పేంటో గుర్తిస్తాడా? సమాజంతో సంబంధం లేకుండా ఆలోచించే యిలాంటి మేధావులింకా వున్నారు ఇప్పుడు కూడా.

31 సంవత్సరాల 'టోయ్ హైడ్' యువ శాస్త్రజ్ఞుడు తాను తయారుచేసే రోదసీ నౌకలో తాను ప్రయాణం చేసేలోగానే "రష్యన్లు ప్రపంచాన్నంతటినీ ఆక్రమించుకొంటారేమో" నని అదిరిపోతున్నాడు. ప్రపంచాన్ని ఆక్రమించుకొనేగుణం తానివ్వుడుంటున్న అమెరికాదేనని సామాజిక జ్ఞానంకూడా లేదీ యువ మేధావికి.

"పీటల్ హెగెల్ స్టీకన్" ది 29 సంవత్సరాల వయస్సు వుంటుంది అమెరికాలో ఎక్సరే - లేజర్ కిరణాల ఉపయోగము కనుక్కొని వాటిని వైద్యంలో వాడే విధానాన్ని రూపొందించినందుకు నోబెల్ బహుమతి వస్తుందని ఆశపడ్డాడు. కలలు కన్నాడు. పట్టించుకొన్న నాధుడులేడు. ప్రస్తుతం అమెరికా యుద్ధ సంస్థ 'పెంటగన్'లో లేజర్ కిరణాల్తో మనుషుల్నెలా చంపాలని పరిశోధనలు చేస్తున్నాడు.

## మేధావులెలా తయారయ్యారు?

మేధావులు కూడా మనలాంటి మనుష్యులే. వారు జీవించటానికవసరమయ్యే తిండి, రైతాంగం కష్టపడి పండిస్తేనే వచ్చింది. ఆ తిండే లేకపోతే ఆయన మేధస్సంతా నీరసించిపోతుంది. మేధస్సు తిని బ్రతుకలేడుగా మరి!

రైతులు, జిన్నింగు మిల్లు, నూలుమిల్లు, బట్టల మిల్లు కార్మికులు కష్టపడి పనిచేస్తేనే మేధావులు బట్టలు కడుతున్నది.

పేపరు మిల్లు కార్మికుడు పనిచేస్తేనే శాస్త్రజ్ఞుడుపయోగించే కాగితం వచ్చేది. పెన్నుల కర్మాగారంలోని కార్మికుడు కోపగిస్తే మేధావి చేతిలో పెన్ను మాయమై పోతుంది.

మందుల ఫ్యాక్టరీ కార్మికుడు పనిచేస్తేనే డాక్టరు అనే మేధావి వైద్యం చేయగల్గేది.

అందువలన శారీరక శ్రమ చేసే వారికి (శ్రామికులు), మానసిక శ్రమ ప్రధానంగా చేసే వారికి (మేధావులు) విడదీయరానిబంధం ఉంది. అంతేగాక మేధావులూ ఎంతో కొంత శారీరక శ్రమ చేస్తుంటారు. శ్రామికులూ ఎంతో కొంత మానసిక శ్రమచేస్తూ వుంటారు.

సమాజ పరిణామ క్రమంలో శ్రమ విభజన అనివార్యమైంది. దాని ఫలితమే మేధావులూ, శ్రామికులూ, ఒకరికంటే ఇంకొకరు ఎక్కువనో తక్కువనో తన్నుకు చావాల్సిన అగత్యం లేదు.

రేపొద్దున సామ్రాజ్యవాదులు భూగోళమనే టైంబాంబుకు నిప్పెడితే మేధావులూ, శ్రామికులూ తరతమ తేడాలు లేకుండా మృత్యువు ముందు క్యూలో నిలబడాల్సిందే మరి.

## అందుకనే

1948 ఆగస్టు 28న ప్రపంచ మేధావుల సభ జరిగింది. ప్రపంచ శాంతి పరిరక్షణకూ, అణ్వాయుధ వ్యాప్తినిరోధానికి మేధావులంతా నడుం కట్టండని పిలుపు ఇచ్చింది

ఐన్‌స్టీన్ సహచరుడూ, ప్రఖ్యాత పోలిష్ శాస్త్రజ్ఞుడూ అయిన "లియో పాల్డ్ ఇన్ఫెల్డ్" చొరవతో 1957 జూలై 6 నుండి 8 వరకూ "ప్రపంచ విజ్ఞాన శాస్త్రజ్ఞుల సభ" న్యూక్లియర్ ఆయుధ నిషేధాన్ని కోరింది.

1962 జూన్ 9 నుండి 14వరకు, 121 దేశాలనుండి వచ్చిన 2,469 మంది మేధావులతో "ప్రపంచ నిరాయుధీకరణ సదస్సు" జరిగింది మాస్కోలో.

1982లో బాన్‌లో 3 లక్షలమంది, వాషింగ్టన్‌లో 5 లక్షల మంది, ఇటలీలో 50 వేలమంది, సిసిలీలో 20 వేలమంది, హాలండ్‌లో 10 వేలమంది, ఆస్ట్రేలియాలో 60 వేలమంది, ఇంకా లక్షలాది జనం ప్రపంచ వ్యాప్తంగా ప్రపంచ శాంతికోసం ప్రదర్శనలు జరిపారు.

అమెరికా హృద్రోగ నిపుణుడు డాక్టర్ "బెర్నాడ్ లౌన్" ప్రసిద్ధ సోవియట్ వైద్యవేత్త "యెవ్ గెనిభా జోవ్"లు లక్షలాది వైద్యుల్ని ప్రపంచ వ్యాప్తంగా అణ్వాయుధాలకు వ్యతిరేకంగా సమీకరిస్తున్నారు నేడు.

## 'మేధావులు' గా ఉపాధ్యాయుల పనేమిటి?

"నిచ్చెన" లాంటివారం మేము. నిచ్చెనమీదుగా పైకి పంపుతున్నట్లుగా, మా చేతుల మీదుగా పిల్లలందర్నీ పై పై చదువులకు పంపుతుంటాము. మేమిక్కడే వుంటాము. మా గతి యింతే. అని

ఐక్యఉపాధ్యాయకు హార్దిక శుభాకాంక్షలతో

# THE GANNAVARAM PANCHAYATH SAMITHI
# &
# ZILLA PARISHAD SCHOOLS' EMPLOYEES

## Co-op House Building Society Ltd. No. K. R. 207

## GANNAVARAM

స్థాపితం : 4-1-1979

- ★ ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ సహకారంతో మన రాష్ట్రంలో ప్రప్రథమంగా స్థాపింపబడిన గృహనిర్మాణ సహకార సంఘం.
- ★ విద్యానగర్ కాలనీ పేరిట, గన్నవరం నూతన బస్టాండ్ ఎదురుగా ఉపాధ్యాయులకు 60 ప్లాట్లు ఏర్పాటు చేయబడినవి.
- ★ ముందుగానే 60 వేల రూపాయలతో మంచినీటి సరఫరా కొరకు ఓవర్ హెడ్ టాంకు నిర్మించి, విద్యుత్ కూడ సరఫరా చేసి, ఉపాధ్యాయుల గృహనిర్మాణమునకు తోడ్పడటమైనది.
- ★ నూతనంగా ఈ సంవత్సరం అమరజీవి 'సుందరయ్య విద్యానగర్' పేరిట, 170 ప్లాట్లతో మరొక కాలనీ ఏర్పాటు చేయుటకు చురుకుగా ప్రయత్నాలు సాగుతున్నాయి.
- ★ ఉపాధ్యాయుల ఆదరాభిమానాలు అసాధారణంగా కన్పడుతున్నాయి.



ప్రెసిడెంట్ : శ్రీ కె. శ్రీరామారావు

వైస్ ప్రెసిడెంట్ : శ్రీ ఆర్. అప్పారావు

సెక్రటరీ : శ్రీమతి పి. అరుణ

డైరెక్టర్లు : శ్రీ షేక్ మస్తాన్

శ్రీ ఎ. వరేంద్రబాబు

శ్రీ పి. వెంకటేశ్వరరావు

శ్రీమతి యం. శివశదుర్గ

నిరాశ పడవద్దు. నిచ్చెనే లేకపోతే పైకి ఎవ్వరూ వెళ్ళలేరనే విషయం గురించి ఉపాధ్యాయులుగా మనం చాలకాలంగా కర్తవ్యం నిర్వహిస్తున్నామనే విషయం సర్వదా మననం చేసుకొని ఆత్మ విశ్వాసం పెంచుకోవాలి.

ఆంధ్రలో పేరెన్నికగన్న సంఘ సంస్కర్త వీరేశలింగం ఒక ఉపాధ్యాయుడు. ప్రఖ్యాత నవలారచయిత ప్రేమచంద్ ఉపాధ్యాయుడు. లిబియా విముక్తి పోరాటం నడిపిన 70 ఏండ్ల ఓమర్ ముక్తార్ ఉపాధ్యాయుడు. చాల విలువైన వృత్తి ఇది. ఇంకొక తరం జనాన్ని అభ్యుదయ కాముకుల్ని, శాంతి పరిరక్షకుల్ని తయారు చేయటం ఇప్పుడు మీ చేతుల్లో ఉంది. పాఠశాలల్లో మీరు చెప్పే పాఠాల్లో వీటిని రంగరించాలి. మీ నిత్య జీవిత సమస్యల పరిష్కారానికి చేసే పోరాటాన్ని ప్రపంచ శాంతిపై జరిగే పోరాటంలో జత చేయాలని నా విజ్ఞప్తి.

## ఆదమరిచామంటే ....

.... ఆహుతై పోతాము. నాకేం పట్టదని గోడమీద పిల్లుల మాదిరిగా ఉన్నా మనమీద యుద్ధప్రభావం తప్పక పడుతుంది. భూమండలం మాడి మసైపోయేట్లయితే అందులో మనమొక్కరమే చిరంజీవులుగా మిగలము. అంతా జరిగిపోయాక మన చావులకు కనీసం మూకుమ్మడి సంతాపసభలు పెట్టాలన్నా దిక్కుండదు. తీర్మానం చదివేవాడూ దొరకడు. ప్రపంచమంతా శ్మశానమే. మిగిలేదంతా బూడిదా, శవాలూనూ. అందులో అమెరికా అధ్యక్షుడు రీగన్ గారి శవం కూడా ఉంటుందనుకోండి. అది వేరే సంగతి.

అందుకే యుద్ధోన్మాదుల చేతులూ, కాళ్ళూ ఇప్పుడే కట్టేద్దాం రండి. అసలే పిచ్చివాడు సామ్రాజ్యవాది. అతని చేతిలో అణ్వాయుధాలనే "రాళ్ళు"న్నాయి. ఎవరిమీద ఎప్పుడు వేస్తాడో తనకే తెలియదు. ముందతని చేతిలోని రాళ్ళను ఊడపెరకాలి. ఆ తర్వాత సామ్రాజ్యవాది పిచ్చి కుదర్చాలి.

— సామ్రాజ్యవాది ఉన్నంతకాలం యుద్ధప్రమాదం తప్పదు.
— బ్రతకాలనే కోర్కె గల్గిన మానవాళిని నాశనం చేయటం ఎవరి తరమూ కాదు.
— ఆయుధాలకన్నా, వాటిని తయారు చేసిన మానవులే మిన్న.
— ఎటూ సామ్రాజ్యవాదం మూడవ ప్రపంచయుద్ధం చూడకనే గుటుక్కుమంటుంది.
— అంతదాకా అది పిచ్చిపనులు చేయకుండా అప్రమత్తంగా ఉండాలి.

అందుకే ప్రపంచ మేధావులారా, మీరెటువైపు అంటే ...
— "ప్రపంచ శాంతికోసం,
యుద్ధోన్మాదానికి వ్యతిరేకంగా.
నవ సమాజ స్థాపనకు.
సామ్రాజ్యవాదుల సర్వనాశనానికి" అని అనాలి...
ఆచరించాలి!

* *

## ఏ పక్షం ? ఏ శిబిరం నీది ?

రచన – డా॥ సి. నారాయణరెడ్డి

చిరంజీవి మానవుడా – పురోగామి మానవుడా
ఏ పక్షం – ఏ శిబిరం – ఏమిటి నీ కర్తవ్యం ?

ఒకటి యుద్ధ శిబిరం – ఒకటి శాంతినిలయం
ఏ పక్షం నీది – ఏ లక్ష్యం నీది ॥చిరం॥

ఒకటి మృత్యు ఘోష – ఒకటి శాంతిభాష
ఏ వాదం నీది – ఏ నినాదం నీది
స్వార్థంగా – ధూర్తంగా – సమరం పరమార్థంగా
విధ్వంసం కోరేది ఒక పక్షం
సామ్యంగా – సౌమ్యంగా – సమభావం గమ్యంగా
ఏ పక్షం నీది – ఏ లక్ష్యం నీది ॥చిరం॥

శిథిల శిథిల నగరాలు చెదిరిన కంకాళాలు
గురుతులుగా చూపించేదొక పక్షం
పచ్చని పంటపొలం – విచ్చిన దరహాసాలూ
పతాకలై నిలిచేది ఒక పక్షం
ఏ పక్షం నీది – ఏ లక్ష్యం నీది ॥చిరం॥

## ఉపాధ్యాయ జ్యోతి

రచన:- మన్నం చిన్నసోమయ్య, వావిలేటిపాడు, ప్రకాశంజిల్లా

ఇది ఉపాధ్యాయ జ్యోతి,
ఇది యు. టి. యఫ్. ఉద్యమ జ్యోతి,
విశ్వమునకు వెలుగునిచ్చు
విజ్ఞానారుణ అమరజ్యోతి ॥ఇది॥
ప్రతిఘటనయె ప్రమిదగా,
పోరాటము వత్తిగా,
సంఘటిత శక్తి తైలంగా
సంతరించుకొని వెలిగే జ్యోతి ॥ఇది॥
అజ్ఞానాంధకారమును
అంతరింపజేసే జ్యోతి,
విజ్ఞానపు వీచికలను
విరజిమ్మే విశ్వజ్యోతి ॥ఇది॥
బాల మనో మందిరాల
భావ తరంగాలు రేపి,
విశ్వ విజేతలుగ జేయు
విజ్ఞానపు విరిజల్లుల జ్యోతి ॥ఇది॥
తరతరాల సంస్కృతిని
తన వెలుగున నింపుకొని,
ఆధునిక సమాజానికి
అందించే అరుణ జ్యోతి ॥ఇది॥
ఇది ఉపాధ్యాయ జ్యోతి
ఇది యు. టి. యఫ్. ఉద్యమ జ్యోతి
విజయవాడ మహాసభల
వెలిగించిన విజయ జ్యోతి ॥ఇది॥

# స్వాతంత్ర్య భారతావనిలో ప్రయాణం పట్టిన ప్రజాస్వామ్యం - పౌరహక్కులు




డా॥ వై. రాధాకృష్ణమూర్తి

(ప్రధాన కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం)

ఆగస్టు 1947 మనకు స్వాతంత్ర్యం సిద్ధించిన రోజు. 26 జనవరి 1950 మన ప్రజలకు ప్రాథమిక హక్కులు గ్యారంటీ చేయబడిన రాజ్యాంగం ప్రతిపాదించబడిన రోజు. ఇలాంటి మహాసభల సందర్భాలలో మనం ఆశించింది, ఆచరణతో లభించింది బేరీజు వేసుకోవడం జరుగుతుంది.

పౌరహక్కుల పరిరక్షణలో ప్రధాన ఘట్టమైన "అత్యవసర పరిస్థితి" ప్రకటించి సరిగ్గా పదేళ్ళు నిండాయి. ప్రపంచంలో మానవ హక్కుల ఉల్లంఘన వివిధ దేశాలలో జరుగుతూ వున్నది. ఆయా ఘటనలను యావత్ప్రపంచ ప్రజల దృష్టికి తీసుకురావడానికి దాదాపు 20 ఏళ్ళ క్రితం 'ఆమ్నెస్టీ ఇంటర్నేషనల్' సంస్థ అవతరించింది. మన దేశంలో జరుగుతున్న మానవహక్కుల ఉల్లంఘనల వివరాలను కూడ ఆ సంస్థ కోకొల్లలుగా ప్రచురిస్తున్నది.

మన దేశంలోకూడా పౌరహక్కుల ఉద్యమం ఏటో ఒక స్థాయిలో గత రెండు దశాబ్దాలుగా సాగుతూ వస్తున్నది. అఖిలభారత స్థాయిలో కొన్ని సంస్థలు, రాష్ట్రస్థాయిలో కొన్ని సంస్థలు పని చేస్తున్నాయి. ఈ సంస్థలన్నీ స్వతంత్ర భారతదేశంలో మానవ ప్రాథమిక హక్కుల ఉల్లంఘన నిత్యం ఏదో ఒకమూల జరగడాన్ని వేలెత్తి చూపిస్తున్నాయి.

## జాతీయోద్యమం

ఆ వివరాలలోకి పోయేముందు పౌరులు, ప్రాథమిక హక్కులకు సంబంధించిన పూర్వరంగాన్ని స్థూలంగా సమీక్ష చేసుకుందాం.

1918లో బొంబాయి నగరంలో జరిగిన భారత జాతీయ కాంగ్రెస్ భారతదేశ ప్రజలందరికి సమానమైన, చట్టపరమయిన న్యాయం కావాలనే అంశంతోపాటు ప్రాథమిక హక్కుల ప్రకటన తేవాలని డిమాండు చేసింది. 1919లో విచారణ లేకుండా అరెస్టుచేసే అధికారం ప్రభుత్వానికి కలిగిస్తూ నాటికి, నేటికి భారత ప్రజలందరిలో అసహ్యించుకోబడుతున్న రౌలట్ చట్టాన్ని ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వం ప్రతిపాదించింది. అలాంటి నిరంకుశ చట్టాలకు వ్యతిరేకంగా ఆనాడు దేశవ్యాప్తంగా జరిగిన ప్రదర్శనలో భాగమే జలియన్ వాలాబాగ్ దుర్ఘటన (13 ఏప్రిల్ 1919) అన్న విషయాన్ని మర్చిపోలేం. అదే సంవత్సరం అమృతసర్‌లో జరిగిన కాంగ్రెస్ మహాసభలో కూడా పౌరహక్కుల సాధనకు ప్రాధాన్యం యిచ్చి తీర్మానించడం జరిగింది. ఈ హక్కుల కొరకై అసెంబ్లీలోను, బయటకూడ పోరాటం జరగాలని సూచించబడ్డది. భారత ప్రజల ప్రాథమిక హక్కులు ఉపసంహరణ జరగడానికి వీలులేని విధంగా గ్యారంటీ చేయబడేందుకై జాగ్రత్త వహించడం మన ప్రథమ కర్తవ్యమని 1928 లోనే మోతీలాల్ నెహ్రూ కమిటీ సిఫార్సు చేసింది.

1931లో జరిగిన కరాచీ కాంగ్రెస్‌లో ప్రాథమిక హక్కులు అనే అంశంపై మరింత వివరణ యివ్వబడింది. సమ్మె హక్కుతో పాటు, విచారణ లేకుండా నిర్బంధించడానికి వ్యతిరేకంగా ప్రజలకు గల హక్కు దేశంలో ప్రతి వ్యక్తికి గ్యారంటీ చేయబడాలని భావించింది. సైమన్ కమిషన్ మన డిమాండ్‌ను తిరస్కరించింది. 1936లో జరిగిన లక్నో కాంగ్రెసులో అధ్యక్షత వహించిన పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ తన అధ్యక్షోపన్యాసంలో "విచారణ లేకుండా ఖైదు చేసే విధానంపై ఆధారపడే ప్రభుత్వానికి పరిపాలించే అర్హతలేదు" అని ఉద్ఘాటించారు.

## మన రాజ్యాంగం

పై లక్ష్యాలకు అనుగుణంగానే స్వతంత్ర భారత రాజ్యాంగంలో ప్రాథమిక హక్కులకై ప్రత్యేకించి ఒక అధ్యాయం (పార్టు 3) కేటాయించబడింది. అందులోని 19 వ ఆర్టికల్‌లో భావ, వాక్, సభా, ప్రకటన వగైరా స్వాతంత్ర్యాలు ప్రకటించబడ్డాయి. అయితే ఇదే ఆర్టికల్‌లో దురదృష్టవశాత్తు కొన్ని మినహాయింపులు కూడా చేయబడ్డాయి. ఈ అవకాశాన్ని ప్రభుత్వాలు అనేక నిర్బంధ చట్టాలను చేయడానికి ఉపయోగించుకుంటున్నవి. 21 వ ఆర్టికల్‌లో ప్రాణానికి, వ్యక్తి స్వేచ్ఛకి భద్రత కల్పించబడ్డాయి. 22 వ ఆర్టికల్‌లో అరెస్టు, డిటెన్షన్ విషయాలలో కొన్ని భద్రతలు గ్యారంటీ చేయబడ్డాయి.

## ఐక్యరాజ్యసమితి

రెండవ ప్రపంచ యుద్ధానంతరం ఐక్యరాజ్యసమితి ఏర్పడింది. సభ్యదేశాలలో పౌరహక్కులను గ్యారంటీచేసే విషయమై ఆ సంస్థ

చర్చించింది. 10–12–1948 తేదీన ఐక్యరాజ్యసమితి మానవహక్కుల ప్రణాళికను ఆమోదించింది. దాన్నే "విశ్వమానవ హక్కుల ప్రకటన" అంటున్నాం. ఇందులోని కొన్ని అంశాలు గమనించదగ్గవి. 5వ ఆర్టికల్ ప్రకారం ఎవరినీ అవమానకరంగా, అమానుషంగా, క్రూరంగా చూడరాదు. అలాంటి శిక్షకు లోనుచేయరాదు. 9 వ ఆర్టికల్ ప్రకారం ఎవరినీ అడ్డదిడ్డంగా అరెస్టు చేయడంగాని, జైలులో ఉంచడంగానీ, ప్రవాసానికి పంపడంగానీ జరగరాదు. 12 వ ఆర్టికల్ ప్రకారం ప్రతి వ్యక్తియొక్క కుటుంబ, సంసార ఉత్తర ప్రత్యుత్తరాల గోప్యతలో జోక్యం కలిగించుకోరాదు. 19 వ ఆర్టికల్ ప్రకారం ఏ అభిప్రాయమైన కలిగివుండటానికైనా దాని ప్రకటనకు, సమాచార అన్వేషణకు పూర్తి స్వేచ్ఛ కల్పించబడింది. భారతదేశం కూడా ఈ ప్రకటనకు ఆమోదాన్ని తెలుపుతూ సంతకం చేసిందన్న విషయం గుర్తుంచుకోదగ్గది.

మనకు స్వాతంత్ర్యం వచ్చిన నాటినుండి మనదేశంలో ప్రజాస్వామిక సూత్రాలు (ఇది మన రాజ్యాంగంయొక్క ఉపక్రమణికలో పేర్కొనబడ్డ సూత్రం), ప్రాథమిక హక్కులు, పౌరస్వేచ్ఛ అమలు జరుగుతూవున్న తీరు పరిశీలించినపుడు పైన ఉదహరించిన పూర్వరంగాన్ని దృష్టిలో వుంచుకోవడం సహాయకారిగా వుంటుంది.

ఇక్కడే మరొక విషయం కూడా స్పష్టం చేయాలి. పౌరహక్కులు, ప్రజాస్వామిక హక్కులు అంత పూర్తిగా వేరు వేరుగా చూడటానికి వీలుకాదు. ఒకదానికి మరొక దానికి విడదీయరాని సంబంధం వున్నది. ఒకదానిపై మరొకదాని ప్రభావం వుంటుంది.

## ప్రివెంటివ్ డిటెన్షన్

ప్రాథమిక హక్కుల గ్యారంటీ అలంకరణతో మన రాజ్యాంగం 1950 జనవరి 26న ఆవిష్కరింపబడిందని చెప్పుకున్నాం. సరిగ్గా ఒక మాసం రోజులలోనే పార్లమెంటులో ఆనాటి హోంమంత్రి సర్దార్ పటేల్ ఒక చట్టాన్ని ప్రవేశపెట్టారు. 1950 ఫిబ్రవరి 25వ తేదీన ప్రవేశపెట్టబడిన ఆ బిల్లే "ప్రివెంటివ్ డిటెన్షన్ బిల్లు". రాజ్యాంగాన్ని ప్రకటించాక ప్రవేశపెట్టబడిన రెండవబిల్లు ఇదే. అంటే ఆరోపణలు లేకుండా అరెస్టు చేసే అధికారాన్ని పొందడానికి స్వతంత్ర భారత ప్రభుత్వం ఎంత ఆత్రుతపడ్డదో అర్థమౌతుంది. ఈ చట్టం అదే పేరుతో కొన్ని దశాబ్దాలు కొనసాగింది. ముచ్చటయిన మారుపేరులతో తర్వాత ఈనాటి వరకు కొనసాగుతూనేవుంది

## చైనా – పాకిస్తాన్‌లతో ఘర్షణకాలం

1962లో చైనాతో మన దేశానికి సరిహద్దు తగాదా వచ్చింది. చిన్నపాటి యుద్ధమూ జరిగింది. దీనిని పురస్కరించుకొని దేశభద్రతకు ప్రమాదం ఏర్పడిందన్న పేరుతో అత్యవసర పరిస్థితి ప్రకటించబడింది. వేలాదిమంది కమ్యూనిస్టు నాయకులను దేశభద్రతా చట్టం క్రింద ఆరోపణ, విచారణ, తీర్పులేని – నిర్బంధానికి గురిచేశారు. అదే సందర్భంలో మనదేశానికి, పాకిస్తాన్‌కు యుద్ధం ప్రారంభమైంది. మళ్ళీ అదే నిర్బంధ విధానం కొనసాగించబడింది.

1964లో భారత కమ్యూనిస్టుపార్టీ చీలి భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) అవతరించిన సందర్భంలో దానిని మొగ్గలోనే త్రుంచివేయాలన్న అభిప్రాయం ఆనాటి ప్రభుత్వానికి కలిగింది దేశ వ్యాప్తంగా ఆ పార్టీ నాయకత్వాన్ని, కార్యకర్తల్ని వేలాదిగా దేశ భద్రతాచట్టం క్రిందనే కోర్టుల ప్రమేయం లేకుండా ఏడాదిన్నరపాటు నిర్బంధించారు.

ఈ చర్యపై 1965 జూన్ 20 తేదీన విజయవాడలో జరిగిన ప్రథమ ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల మహాసభలో మాజీ న్యాయమూర్తి, పార్లమెంటు సభ్యుడైన శ్రీ ఎన్. సి చటర్జీ ఇలా వ్యాఖ్యానించారు: "పౌరుల ప్రాథమిక పౌరసత్వాలను సర్వనాశనంచేయడానికి, మన ప్రజాస్వామిక సంస్థల పునాదులను అవంతైన సంక్షోభం లేకుండా అణచివేయడానికి మన ప్రభుత్వ నాయకులు ప్రయత్నించారు ......... ప్రస్తుతం వెయ్యిమందికి పైగా నాయకులు, కార్యకర్తలు కేంద్ర ప్రభుత్వం, వివిధ రాష్ట్ర ప్రభుత్వాల, జిల్లా మేజిస్ట్రేట్ల, చివరకు పోలీసు కమీషనర్ల ఉత్తర్వులపై నిర్బంధింపబడ్డారు. అత్యవసర పరిస్థితి మిషపై కార్యనిర్వాహకవర్గం అధికారాలు దళలు పరుచుకొని ప్రజాస్వామ్యాన్నే నాశనం చేస్తున్నది. కార్యనిర్వాహకవర్గ దయాదాక్షిణ్యాలద్వారా ప్రజాస్వామ్యం మనజాలదు...... ప్రాథమిక హక్కులను గుర్తించని ఏ ప్రభుత్వమైనా, అలాగే పౌరుల జీవితాల స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలను అరికట్టే ప్రజాస్వామిక లెజిస్లేచర్ సహితం — నిరంకుశ ప్రభుత్వంగానే పరిగణింపబడుతుంది. మన పౌరుల జీవితాల, స్వేచ్ఛాయుత హక్కుల విషయంలో ప్రభుత్వాన్ని ఎంత తక్కువ విశ్వసిస్తే అంత మంచిది ......... ఈ డిటెన్షన్ ఉత్తర్వులను ఒక ప్రత్యేక పస్థిరితిగల దశలో జారీచేయడాన్ని బట్టి చూస్తే అవి రాజకీయపార్టీని అణచివేయడం కోసమే స్పష్టంగా ఉద్దేశించబడ్డాయని అర్థమౌతుంది."

ఈ సందర్భంగా ప్రఖ్యాత బ్రిటిష్ తత్వశాస్త్రవేత్త బెర్ట్రాండ్ రస్సెల్ చేసిన వ్యాఖ్య గమనించదగ్గది. "భారతదేశంలో మూకుమ్మడిగా జరిగిన కమ్యూనిస్టుపార్టీ నాయకుల అరెస్టులను ఖండిస్తున్నాను. దేశ రక్షణ పేర జరిగిన ఈ అరెస్టులు ప్రజాస్వామ్యం పైన, పౌరహక్కులపైన జరిగిన దాడి మాత్రమే. ఎవరైన ఒక వ్యక్తి నేరం చేసినప్పుడు చట్టప్రకారం అతనిని కోర్టులో హాజరుపర్చి విచారణ జరిపించి శిక్షించాలి. ఇలా కాకుండా అకారణంగా జైల్లో పెట్టడం, వారిపై తమ రాజకీయ పగసాధించడం నిష్పక్షవాదుల హృదయాలలో ఈ అరెస్టులు తీవ్రమయిన ఆందోళన కలుగజేస్తాయి. ప్రజాతంత్రవాదులు, పౌరహక్కులను కోరేవారు ఈ అరెస్టులను ఖండించాలి.

## భక్షణ చట్టాలు

ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టంతో ప్రారంభించి కాలక్రమేణా ప్రజల, కార్మికుల ప్రాథమిక హక్కులను కుంచింపచేసే అనేక నిర్బంధ చట్టాలు చేయబడుతూ వచ్చాయి. భారత రక్షణ చట్టం, భారత రక్షణ రూల్స్, అంతరంగిక భద్రతా చట్టం, జాతీయ భద్రతా చట్టం,



అత్యవసర సర్వీసుల రక్షణ చట్టం, కల్లోలిత ప్రాంత చట్టం, గూండా చట్టం, ప్రత్యేక కోర్టుల చట్టం, తీవ్రవాద నిరోధక చట్టం వగైరాలన్నీ ఈ కోవకు చెందినవే.

## పత్రికలపై ఆంక్షలు

ప్రజాస్వామ్య పరిరక్షణకు పత్రికా స్వేచ్ఛ మూలస్తంభం లాంటిది. రాజ్యాంగంలో ప్రాథమిక హక్కులో చేర్చబడింది. కాని ప్రభుత్వానికి అనుకూలంగా లేని పత్రికలపై ఆంక్షలు, నిర్బంధాలు అనేక విధాల పెడుతూనే వస్తున్నారు. చివరకు పత్రిక నోళ్ళకు సీళ్ళువేసే నిర్బంధ పత్రికా చట్టాలను కూడా తీసుకురావడానికి పాలక వర్గ ప్రభుత్వాలు ప్రయత్నాలు చేస్తున్నాయి. ఒరిస్సాలో, తమిళ నాడులో ఒక మేరకు అలాంటి చట్టాలు చేయబడ్డాయి. ఇటీవల బీహారులో మరింత క్రూరమయిన "బీహారు ప్రెస్ బిల్లు" తీసుకువచ్చే ప్రయత్నం జరిగింది. బిల్లు అసెంబ్లీలో ప్రవేశపెట్టబడింది కూడా. ఇది ఐ పి సి. సెక్షన్ 292, సి. ఆర్. పి. సి. సెక్షన్ 455 పూర్తిగా మార్చడానికి చేసిన ప్రయత్నాలే. పాలకవర్గానికి రుచించని ఏ వ్రాత వ్రాసినా దానిపై అతి తీవ్రమైన కఠిన చర్యలు మేజిస్ట్రేట్ స్థాయి ప్రభుత్వోద్యోగులే తీసుకోవడానికి అవకాశం కల్పించే చట్టమది. అయితే తీవ్రమైన వ్యతిరేక, ఆందోళన ఫలితంగా ఆ బిల్లు ఉపసంహరించుకోబడింది. ఇటీవల అహ్మదాబాద్‌లో తమకు వ్యతిరేకంగా వార్త రాశాడన్న నెపంతో పోలీసులే పోలీసు వాహనాలలో వెళ్ళి ఆ పత్రికల ఆఫీసులను ధ్వంసం చేయడం జరిగింది. ఈ చర్యకు ప్రభుత్వపు మద్దతు పరోక్షంగా వున్నట్లు చెప్పబడుతుంది. తమకు గిట్టని పత్రికలకు ప్రకటనలు ఆపుచేయడం ద్వారా వాటిని ఆర్థికంగా దెబ్బతీయాలనే ప్రయత్నం సర్వత్రా జరుగుతున్నది.

## న్యాయవ్యవస్థపై దాడి

అత్యవసర పరిస్థితిలో న్యాయవ్యవస్థకు పట్టిన గతి ఇంతకు ముందు కొద్దిగా పరిశీలించాం. ప్రజాస్వామ్య పరిరక్షణలో ప్రభుత్వాల నిరంకుశ విధానాలకు వ్యతిరేకంగా ప్రజలకు ఒక మేరకైనా న్యాయం కలుగచేయడానికి న్యాయస్థానాల యొక్క స్వతంత్ర ప్రతిపత్తి చాలా ముఖ్యం. కాని న్యాయవ్యవస్థను కూడా "కమిటెడ్ జ్యుడిషరీ" అనే నినాదంతో ప్రభుత్వపు ఉపాంగంగా తయారుచేయడానికి ప్రయత్నాలు కొనసాగుతూనే వున్నాయి. తమకు అనుకూలంగావున్న వ్యక్తులనే న్యాయాధిపతులుగా నియమించాలని ప్రభుత్వం పట్టుదలతో ఉంది. ఇటీవలనే పదవీ విరమణచేసిన సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ చంద్రచూడ్ ఈ విషయాన్ని బట్టబయలు చేశారు. ప్రభుత్వం ప్రతిపాదించిన వ్యక్తుల పేర్లకు ప్రధాన న్యాయమూర్తి అభ్యంతరం చెపితే ఆ ఖాళీలను భర్తీచేయకుండా అట్టే పెట్టేస్తున్నారని, దీనివల్ల కోర్టులలో పని సాగకుండా పేరుకు పోతున్నదని ఆ దృష్టితో తమకు ఇష్టం లేకపోయినా కొన్ని పేర్లను తాము ఆమోదించక తప్పడం లేదని ఆయన చెప్పారు. ఆయనే మరొక ఆసక్తిదాయకమైన సంగతి కూడా బయటపెట్టారు. న్యాయాధిపతులుగా నియమించ దలచుకున్న వ్యక్తుల రాజకీయ పూర్వరంగాన్ని కూడా తడిమి చూస్తున్నారని, జనతా ప్రభుత్వంలో అయితే ఇతను కాంగి అనుకూలుడా అని, ఇప్పటి ప్రభుత్వంలో అయితే అతను ఆర్. ఎస్. ఎస్ అభిమానా, కమ్యూనిస్టు అభిమానా అని పరిశోధిస్తున్నారని చెప్పారు. అంటే ప్రతిభ ఉన్న వారి రాజకీయ విశ్వాసాలు ఆ పదవిలో నియమింపబడ డానికి అడ్డు వస్తున్నాయన్నమాట. ఇంతటి కుటిలత్వం ఉన్నత స్థాయిలో చోటుచేసుకుంటే న్యాయస్థానాల ప్రతిపత్తిని కాపాడడం అసంభవం. కాలక్రమేణ న్యాయవ్యవస్థ కేవలం పూర్తి ప్రభుత్వ ఉపాంగం కావడానికి మరెంతోకాలం పట్టకపోవచ్చు.

ప్రభుత్వానికి అనుకూలంగా సమ్మతిని తెలియజేసిన న్యాయమూర్తి ఎ. యన్. రేని సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తిని చేశారు. ఆ ముగ్గురు సీనియర్ లాయర్లు 'మాకీ బెంచి వద్ద'ని రాజీనామా చేసి వెళ్ళిపోయారు.

1976 ఎమర్జెన్సీలో చాలా మంది అర్ధరాత్రి తలుపులు తట్టి లేపి చాలా మందిని జైళ్ళకు పంపారు. నిర్బంధాన్ని సవాలు చేస్తూ సెక్షన్ 32 క్రింద సుప్రీంకోర్టుకు సెక్షన్ 226 క్రింద హైకోర్టుకు వెళ్ళే హక్కు వుందా? లేదా? అనే ధర్మసందేహం వచ్చింది. సుప్రీం కోర్టులో 4-1గా తీర్పు చెప్పబడింది. 4 మెజారిటీ. 1 డిసెంటు. ఎమర్జెన్సీలో అన్ని హక్కులు హరింపబడతాయిగనుక రిట్ స్వీకరించడానికి వీలు లేదని నలుగురు న్యాయమూర్తులు చెప్పారు. జస్టిస్ ఖన్నా తన డిసెంటును తెలియజేశారు. జస్టిస్ ఖన్నా సీనియారిటీ లిస్టులో రెండవవారు. అప్పుడున్న ప్రధాన న్యాయమూర్తి పదవీ విరమణ చేయగానే జస్టిస్ ఖన్నా చీఫ్ జస్టిస్ కావాలి, కాని నీకు చీఫ్ జస్టిస్ అయ్యే అర్హత లేదు పొమ్మన్నారు. ఆ తరువాతి సీనియర్‌ని చీఫ్ జస్టిస్‌ను చేశారు. ఆయన జస్టిస్ బేగ్.

స్వతంత్ర వ్యవస్థగా వుండవలసిన న్యాయ వ్యవస్థలో జోక్యం వలన పౌర హక్కులు ఏ విధంగా హరింపబడతాయో చూశాం.

అలాగే మంత్రులు జోక్యం చేసుకొన్న సంఘటనలు ఆ మధ్య 'ఇలస్ట్రేటెడ్ వీక్లీ'లో కేరళ ముఖ్యమంత్రి హైకోర్టు ప్రధాన న్యాయమూర్తికి ఫోన్‌లో చెప్పిన విషయాలు ప్రచురించారు. ఆ పత్రిక టెలిఫోన్ ఆపరేటర్ రికార్డుచేసిన వాటి ఫోటోస్టాట్ కాపీని ప్రచురించింది.

## పోలీసు యంత్రాంగం

శాంతి భద్రతలను కాపాడవలసింది పోలీసు యంత్రాంగం. 'భద్రత' అన్న పదంలో వ్యక్తి ప్రాణభద్రత, వ్యక్తి స్వేచ్ఛ ఇమిడి వున్నాయి శాంతి భద్రతల పరిరక్షణకోసం వ్యక్తులపై పోలీసు యంత్రాంగం తీసుకునే చర్యలు రాజ్యాంగం వ్యక్తులకు గ్యారంటీచేసిన ప్రాథమిక హక్కులకు లోబడి వుండాలి. కాని వాస్తవంలో ప్రజల ప్రాథమిక హక్కులకు పీసమెత్తుకూడా గౌరవం లభించటం లేదు. చట్టాలు, నియమ నిబంధనలు తమకేమి పట్టనట్లు పోలీసు యంత్రాంగం పనిచేస్తున్నది. వ్యక్తి స్వేచ్ఛను తృణప్రాయంగా చూస్తున్నది. చీటికి మాటికి వ్యక్తులను పోలీసు స్టేషనుకు తీసుకుపోయి కేసు నమోదు చేసు

## చెట్లు కొట్టినందుకు కాల్పులు    చేపలు పట్టినందుకు కాల్పులు!

కొనకుండా రోజులు, వారాలకాలం తరబడికూడా లాకప్‌లో ఉంచటం, చిత్రహింసలు చేయడం అతి సాధారణమైనదిగా తయారైంది. పోలీసు నిర్బంధంలో మరణించిన సంఘటనలు ఏదో ఒక మూలనుండి ప్రతి రోజు వినిపిస్తూనే వున్నాయి. పట్టించుకునే నాధుడులేడు. పోలీసులకు పట్టపగ్గాలు లేకుండా పోతున్నాయి. పోలీస్ స్టేషన్‌లలోనే మానభంగాలు జరుగుతున్నాయి. అనేక సందర్భాలలో ఇలాంటి ఘోరాలను కూడా సమర్థించి దోషులను వెనుకవేసుకు రావడానికి ప్రభుత్వాలు వెనుకాడటంలేదు. పెట్టుబడిదారుల, ధనికవర్గాల, భూస్వాముల చేతులలోని కీలుబొమ్మలుగా పోలీసుశాఖ దాదాపు దేశమంతటా వ్యవహరిస్తూంది. అమాయకులైన కార్మికులపైనా, బలహీనవర్గాలపైనా చట్టరహితమైన హింసాకాండ ప్రయోగించబడుతున్నది. చేపలుపట్టినందుకు, చెట్లుకొట్టినందుకు, వెట్టి చేయనందుకు నిర్దాక్షిణ్యంగా హరిజన, గిరిజన, పేద వర్గాలపై తుపాకులతో కాల్చిచంపిన ఘటనలు కోకొల్లలు. అధికారపార్టీ, పాలనా యంత్రాగం, పోలీసు, సంఘ వ్యతిరేకశక్తులు కలిసి అపవిత్ర కూటములుగా ఏర్పడి ప్రతిపక్షాల కార్యకర్తలపైన, వారి వెనుకవున్న ప్రజలపైన అమానుషమైన దాడులు జరుపుతూవున్న ఘటనలకు కొదువలేదు.

మధ్యరాత్రి గాదు మధ్యాహ్నమే అరెస్టులు చేస్తున్నారు. వారెంటుచూపి చేస్తున్న సంఘటనలు బహు తక్కువ. పోలీసుల నిర్బంధంలో 24 గంటలకంటె ఉంచడానికి వీలులేదు. మేజిస్ట్రేటుకు తెలియజేసి రిమాండుకు పంపాలి. కాని ఆ పని 24 గంటల లోపల జరిగితే ఆశ్చర్యపోవలసిన విషయంగా తయారయింది. 24 రోజులుకాదు 24 వారాలు అంతకుపైగా వుంచిన సంఘటనలు చాలా వున్నాయి. అరెస్టుచేసినవారిని పోలీసులు విపరీతమైన చిత్రహింసలకు గురిచేస్తారు. అరికాళ్ళపై కొడతారు. అందుకే దిటెన్యూలు ఆస్పత్రులకు కుంటుతూ వస్తారు. పోలీసు కస్టడీలో ప్రాణాలు కోల్పోయిన సంఘటనలు కోకొల్లలు. స్త్రీలను అవమానపరచడం, పోలీసు స్టేషన్లలో మానభంగాలు నిత్యకృత్యాలైపోయాయి. పేపర్లలో ఇలాంటి వార్తలు చూస్తూనేవున్నాం.

### లాఠీ చార్జీలు; కాల్పులు

నిరసన ప్రదర్శనలు జరిపేవారిపైకూడా లాఠీచార్జీ జరపడం సామాన్యమైపోయింది. ప్రెస్‌వాళ్ళు, లాయర్లనే విచక్షణకూడా పాటింపబడడంలేదు. ఆమధ్య అన్నవరెడ్డిపల్లె అనే గ్రామంలో గిరిజనులపై కాల్పులు జరిపారు. నలుగుర్ని చంపారు. వారు చేసింది ఘోరమైన నేరమేంకాదు. చెరువులో పండుగరోజు చేపలుపట్టుకొనడమే. అలాంటిదే టంగుటూరులో రైతులపై కాల్పులు జరపడం. అక్కడ ఇద్దరో ముగ్గురో చనిపోయారు. ఇక భాగల్‌పూర్, సమస్తిపూర్ సంఘటనల పైశాచికాలు చెప్పనవసరంలేదు.

భీమ్‌సింగ్ కాశ్మీరులో యం. యల్. ఎ. అక్కడి అసెంబ్లీలో అధికారపార్టీ బలం అంతంత మాత్రంగా వుంది. ఆయన్ని అసెంబ్లీకి వెళ్ళకుండా పోలీసులు ఎత్తుకెళ్ళారు. తరువాత ఆయన సుప్రీంకోర్టుకి వెళితే ఆ ప్రభుత్వాన్ని రూ. 50,000లు నష్టపరిహారం చెల్లించమంది.

అలాగే మణిపూర్‌లో ఇద్దరు సామాన్య పౌరులను పోలీసులు ఎత్తుకెళ్ళారు. వారి ఆచూకీ తెలియలేదు. వారి తరపున సుప్రీంకోర్టుకి వెళితే ప్రభుత్వాన్ని మందలిస్తూ రెండు కుటుంబాలకు చెరొక లక్ష చెల్లించమంది.

ఖాజీపేట స్టేషన్‌లో యస్. ఐ. ని ఎవరో కాల్చిచంపారు. నక్సలైట్లని జనవాక్యం. మరునాడు పోలీసులు, పోలీసు ఆఫీసర్లు వరంగల్లు పట్టణంలో ఊరేగింపు జరిపారు. మెయిన్‌రోడ్‌లో వున్న డాక్టర్ రామనాథంగారిని ఎవరో కాల్చిచంపారు. పోలీసుల ఊరేగింపు నుండి వచ్చినవారే చేశారని ప్రజాభిప్రాయం. న్యాయవిచారణ జరిపించమని పౌరహక్కుల సంఘాలు ఆందోళన చేశాయి. 'న్యాయ విచారణ అక్కరలేదు. సి. బి. సి. ఐ. డి కి అప్పజెపుతా'మంది ప్రభుత్వం.

చట్టవిరుద్ధంగా పోలీసు స్టేషన్‌లలో కాల పరిమితికిమించి వ్యక్తులను నిర్బంధంలో వుంచిన సందర్భాలలో కొందరు కోర్టులకు వెళ్ళి న్యాయంకోసం పోరాడిన ఘటనలున్నాయి. సెర్చ్ వారంట్ కోర్టులనుండి తీసుకొని పోలీసు స్టేషన్‌లకు వెళ్ళిన న్యాయవాదులను అవమానించడం, వారిపై చేయి చేసుకోవడం కూడా జరుగుతూంది. పోలీసుల చేతిలో న్యాయవాదులకూ రక్షణ లేదు.

పోలీసు యంత్రాంగం బ్రిటిషు వలస ప్రభుత్వ వారసత్వాన్నుండి ఇంకా బయట పడలేదని, ఈ పరిస్థితిని సరిదిద్దేందుకు అనేక పోలీసు కమిషన్‌లను నియమించటం కూడా జరిగింది. కాని ఆ రిపోర్టులు పోలీసు యంత్రాంగానికి ప్రభుత్వ పార్టీకి ఇబ్బందికరంగా ఉండటంవల్లనేమో, వెలుగు చూసే అదృష్టానికి నోచుకోలేదు. వ్యక్తులు పోలీసు నిర్బంధంలో చనిపోయిన సందర్భాలలో తమ నిర్దోషిత్వాన్ని రుజువు చేసుకునే బాధ్యత పోలీసులపైనే వుండాలని ఇటీవల ఒక రిపోర్టులో చూపించబడింది. ఇది ఎంతైనా హర్షణీయం. దీనిని అమలు చేయడానికి ప్రజాందోళన అవసరం.

### భాగల్పూర్ పైశాచికత్వం

పోలీసు యంత్రాంగంయొక్క అదుపులేని రాక్షసత్వానికి భాగల్పూర్ ఉదంతం కలికితురాయిలాంటిది. దొంగతనం తదితర నేరాలు చేస్తున్నారన్న అనుమానంతో 32 మందిని పట్టుకొని వారి కళ్ళలో దబ్బనాలు గుచ్చి, ఆసిడ్ పోసి వారిని శాశ్వతంగా అంధులను చేసి జైళ్ళకు తరలించిన పైశాచిక ఘటన బయటకు వచ్చినపుడు యావత్ ప్రపంచం దిగ్భ్రాంతి చెందింది.

జైలులో నేరాలు రుజువై శిక్ష అనుభవించేవారు వుంటారు. తమ తమ నేరాలు ఇంకా కోర్టులో రుజువు కాకుండా విచారణలో వున్నవారు వుంటారు. ఎవరైనా కనీస మానవతా దృష్టితో చూడవలసిన వారే. కాని ఒకసారి జైలులోకి వెళితే అతనికి ఏ ప్రాథమిక హక్కులు వర్తించవన్నట్లు జైలు అధికారులు ప్రవర్తిస్తున్నారు. దేశంలోని అనేక జైళ్ళ పరిస్థితి బ్రిటిష్ పాలన నాటికంటే ఏమంత మెరుగుగా లేదు.

## ఉద్యోగాలకు పోలీస్ వెరిఫికేషన్

మన రాజ్యాంగంలోని 16 వ ఆర్టికల్ ప్రభుత్వ ఉద్యోగాలలో పౌరులందరికీ సమాన అవకాశాలు ఉండాలని నిర్దేశించింది. అదే ఆర్టికల్‌లోని రెండవ క్లాజ్ ఇలా చెబుతుంది. "జాతి, మతం, కులం, లింగం, పుట్టిన లేక నివసిస్తున్న ప్రదేశం వీటిలో దేనివల్లగాని ప్రభుత్వ ఉద్యోగానికి అనర్హులుగా చూపబడరాదు". కాని ఆచణలో మనం నిత్యం చూస్తున్నాం. ఏ సాధారణ ఉద్యోగానికైనా నియమించే ముందు "పోలీస్ వెరిఫికేషన్" జరుగుతుంది. ప్రతిపక్ష పార్టీలతో ఏ మాత్రం సంబంధం ఉన్నా, లేక ప్రభుత్వ పార్టీ యెడల ఏ విధమైన భిన్నాభిప్రాయం ఉన్నా ఆ వ్యక్తిని నిర్దాక్షిణ్యంగా ఉద్యోగానికి అనర్హుణ్ని చేస్తున్నారు. దీనిపై తీవ్రమైన విమర్శ చేస్తూ ఆంధ్ర ప్రదేశ్ హైకోర్టు రెండు మూడు తీర్పులు వెలువరించింది. అయినా పరిస్థితిలో ఏ విధమైన మార్పు వచ్చిన సూచనలు ఈనాటికీ కన్పించవు. ఈ సందర్భంగానే ఇటీవల సుప్రీంకోర్టు ఆర్టికల్ 311 (బి, సి) క్రింద యిచ్చిన తీర్పు దురదృష్టకరమైనది. దీనివల్ల ప్రభుత్వానికి ఉద్యోగినుంచి ఏ రకమైన సంజాయిషీ కోరకుండానే అతడిని ఉద్యోగం నుంచి తొలగించే అవకాశాన్ని కల్పిస్తుంది. అసలే నిరంకుశంగా వ్యవహరిస్తున్న ప్రభుత్వాలకు ఈ తీర్పు వరప్రసాదం లాంటిది. ఉద్యోగుల సర్వీసు భద్రతకు విద్యుద్ఘాతంలాంటిది. అవసరమైతే రాజ్యాంగంలోని ఈ క్లాజ్‌ను సవరించడానికి దేశవ్యాప్తంగా ఆందోళన చేయవలసి ఉంటుంది.

## పౌరహక్కులు హరింపబడడానికి కారణాలు

1. నిరంకుశ ప్రభుత్వాల అధికారాన్ని పదిలంచేసికొనడానికి, శాశ్వతం చేసికొనడానికి ప్రయత్నాలు చేస్తాయి. అందుకైవున్న చట్టాలను వక్రీకరణ చేస్తాయి. దుర్మార్గపు చట్టాలను చేస్తాయి.

2. ప్రభుత్వ యంత్రాంగం స్వతంత్రంగా వ్యవహరిందాలనడం పైకి చెప్పడం మాత్రమే. కాని వాస్తవంగా అధికారంలో ఎవరుంటే వారికి అనుకూలంగా వ్యవహరిస్తుంది. ఇది యింతకు ముందు సత్యం. ఇప్పుడూ అంతే. ముక్కుసూటిగా వ్యవహరిస్తాం అనే బురఖాలు తగిలించుకొన్నవారి ముసుగులు తొలగిస్తే వారి అసలు వ్యవహారం అధికారంలో వున్నవారికి విధేయతగా వ్యవహరించడం తప్ప మరేమీ కాదు. ముఖ్యంగా పోలీసు డిపార్టుమెంటు పైవారిని మెప్పించడానికి శ్రుతిమించి వ్యవహరించడం మామూలైపోయింది. అంతేగాక శాంతి భద్రతల పరిరక్షణ పేరుతో లాఠీలు, తూటాలు ప్రయోగించడం సామాన్యమైపోయింది.

3. సమాజంలోని బలమైన సంపన్నవర్గాలనుండి భూస్వామ్య వర్గాలనుండి పౌరహక్కులపై దాడులు జరుగుతున్నాయి. కారంచేడు, పొదిలికుప్పం, కీలవేన్మణి, యింకా బీహార్, ఉత్తరప్రదేశ్‌లోని అనేక సంఘటనలు ఇలాంటివే.

బలమైన వర్గాలకు ప్రభుత్వ అండదండలుంటున్నాయి. ఈ వర్గాలు ఆర్థికంగా, సామాజికంగా బలహీన వర్గాలపై దాడులు సాగిస్తున్నాయి. డబ్బున్న పార్టీలు, అధికారంలోవున్న పార్టీలు స్వీయ ప్రయోజనాలకై సంఘ వ్యతిరేక శక్తుల్ని అనధికార పోలీసు యంత్రాంగంగా ఉపయోగించుకొంటున్నాయి. బలహీనవర్గాలపై దాడులకు పంపిస్తుంటాయి.

## పురుషాధిక్యత

ఒకే పని చేస్తున్నప్పటికి స్త్రీ పురుషులకు సమాన కూలీ సంబంధం లేదు. కట్నాల దురాచారం నిరాఘాటంగా సాగిపోతూ వుంది. సమాజంలో ధనస్వామ్యంతోపాటు పురుషస్వామ్యం కూడ అమలులో వుండడం వలన జనాభాలో సగభాగంగావున్న స్త్రీల పౌరహక్కులు మరీ దారుణంగా హరింపబడుతున్నాయి.

## పౌరహక్కుల్ని పరిరక్షించుకొనడమెలా ?

1. రాజ్యాంగం, కోర్టులు, చట్టాలు పౌరునికి యిచ్చే హక్కులేమిటో తెలిసికోవాలి. విద్యావంతులు వీటిని సామాన్యులకు వివరించాలి.

2. అన్యాయాన్ని, అక్రమాన్ని స్పష్టంగా, బాహాటంగా చెప్పగలగాలి.

3. ఏదైనా అక్రమం జరిగితే, నాకు జరగలేదుగదా ... నాదాకా వచ్చినప్పుడు చూద్దాం,అనేధోరణి ప్రమాదకరం. ఆ తరువాత అది నీకే జరుగుతుంది.

## ఆహ్వానించదగిన మార్పులు

వెట్టిచాకిరి, నిర్బంధంగా బాలురచే శ్రమచేయించడం, జైళ్ళలో వున్నవారికి జరిగే అన్యాయాలు కోర్టుల దృష్టికి తీసికెళితే వాటిని రిట్ పిటీషన్లుగా స్వీకరిస్తాయి. అలాగే పరిసరాల కాలుష్య సంఘటనలు కూడా. పౌరహక్కుల సంఘాలు వీటిని కోర్టులకు తీసికెళ్ళి బాధితులకు న్యాయం కలిగించడానికి కృషి చేయాలి.

## పౌరహక్కుల సంఘం ఎలా వుండాలి ?

'ఆర్థిక, సామాజిక న్యాయం జరగకుండ పౌరహక్కులు రక్షింపబడవు' అనే వాదనవుంది. నిజమే కాని యిప్పుడేం చేయాలి ? ఆర్థిక, సామాజిక న్యాయం జరిగేందుకు ఏంచేయాలి ? నిరాశా నిస్పృహలతో కాలం గడిపేయాలా ? లేక చేయగలిగిందేమైనా చేయాలా, వున్నవ్యవస్థలోనే పరిమితుల మేరకు ప్రజాస్వామ్య హక్కుల్ని కాపాడుకోవాలి.

కేవలం ఉగ్రవాదుల్ని రక్షించడానికి పౌరహక్కుల సంఘాలు, ఉద్యమాలు పనిచేస్తున్నాయనే విమర్శవుంది. కాని అందరి పౌరహక్కులు పరిరక్షింపబడాలనేది నా ఆకాంక్ష.

రాజ్యాంగాన్ని ధిక్కరించినవారు, రాజ్యాంగం అక్కరలేదనే వారు అంతర్యుద్ధం చేస్తున్నారు. ఇది నా మాటకాదు. వారి వాదన అది. అంతర్యుద్ధంలో ప్రజాస్వామ్య హక్కుల్ని గురించి ప్రాథమిక

హక్కుల్ని గురించి ఎవరైనా ఆలోచిస్తారా? అరాచక ఉద్యమాలకు మాత్రమే రక్షణ కల్పించాలంటే హక్కులు రక్షింపబడవు.

వ్యక్తి స్వేచ్ఛతోపాటు పదిమంది ప్రయోజనాల (Group Intrests) కాపాడబడాలి. బూటకపు ప్రజాస్వామ్య ముసుగుని తొలగించి చూపడంకూడ పౌరహక్కుల పరిరక్షణలో భాగమే. ఉదాహరణకు ప్రజలెన్నుకున్న ప్రభుత్వాన్ని గవర్నర్ రామ్‌లాల్ బర్తరఫ్‌చేస్తే వ్యతిరేకత ప్రదర్శించాం. ఆ మేరకైనా ప్రజాస్వామ్యాన్ని పరిరక్షించుకోవాలి

మరి ఈ పరిస్థితిని మార్చడానికి మార్గమేమిటన్న ప్రశ్న సహజంగానే ముందుకు వస్తుంది ఇక్కడ పౌరహక్కుల ఉద్యమాల యొక్క అవసరం, ప్రాముఖ్యత కన్పిస్తుంది.

## పౌరహక్కుల ఉద్యమాలు - మేధావుల పాత్ర

అన్నింటికన్నా ముఖ్యమైన కర్తవ్యం ప్రజల్ని నిత్య జాగరూకులుగా చేయడం. ప్రజాస్వామ్య పౌరహక్కుల మనుగడకు ప్రజల నిత్యజాగరూకతే శ్రీరామరక్ష. నియంతృత్వ శక్తులు తలయెత్తే ప్రమాదం ఎల్లప్పుడూ వుంటుంది. ప్రజలు ప్రమత్తులుగా, ఉదాసీనులుగా, నిర్లిప్తులుగా ఉన్నప్పుడు వాటికి మరింత బలం, వేగం వస్తుంది. ఆదిలోనే ప్రజాభిప్రాయం బలంగా వ్యక్తం కాబడినట్లయితే ఆ శక్తులు తప్పక వెనుకంజ వేస్తాయి. అది కన్పించనపుడు మరింత సాహసంతో తమ స్వార్థ ప్రయోజనాలను ముందుకు తీసుకు వస్తాయి. ప్రజాస్వామ్య పరిరక్షణా ప్రాముఖ్యతను గురించి, పౌరహక్కుల పవిత్రతను గురించి ప్రజలను చైతన్యవంతులుగాను, జాగరూకులుగాను చేసేబాధ్యత సహజంగానే విద్యావంతులమీద వుంటుంది. ఆ విద్యావంతులే పిరికివారై, ఆత్మాభిమానాన్ని పరిస్థితులకు తలవొగ్గి, జీవనయాత్ర సాగించే ధోరణి ప్రదర్శిస్తే మన దేశానికి - ఏ దేశానికి కాని ఉజ్వలమైన భవిష్యత్తులేదు. పైగా బానిస బ్రతుకు మాత్రం ఖాయం. ఆ బానిసత్వం స్వదేశీ పాలకులదైనా కావచ్చు, విదేశీపాలకులదైనా కావచ్చు.

శ్రీ నార్ల వారిమాటల్లో శాంతిలాగానే స్వేచ్ఛకూడా అవిభాజ్యమైనది. ఇతరుల స్వేచ్ఛ హరింపబడుతూ వున్నప్పుడు నీవు పట్టనట్లు ఊరుకుంటే నీ స్వేచ్ఛకు ప్రమాదం ముంచుకురావడానికి ఎక్కువ కాలం పట్టదు.

జస్టిస్ చిన్నపరెడ్డి ఇటీవల ఒక ప్రసంగంలో "ప్రజాస్వామ్యానికి పెద్ద ప్రమాదం బాధ్యులైన ప్రజలు పౌరహక్కుల ఎడల చూపించే ఉదాశీన వైఖరిలోనే ఉంటుంది" అన్నారు. 'ఈ ప్రమాదాన్నుండి బయట పడాలంటే న్యాయవాదుల్లాంటి మేధావులు వారి వారి రాజకీయ అభిప్రాయాలతో నిమిత్తం లేకుండా పౌరహక్కులపై ఎప్పుడు దాడి ప్రారంభమైనా దానిని ఖండించాలి. నియంతృత్వ కృూర పరిపాలనా ధోరణులను సకాలంలో ఏక కంఠంతో నిరసించాలి' అని ఉద్ఘాటించారు.

జాన్ ఆడమ్స్ వ్యంగ్యంగా వ్రాస్తాడు... గుర్తుంచుకోండి. "ప్రజాస్వామ్యమన్నది త్వరలోనే క్షీణించి, కృశించి తనను తాను చంపుకుంటుంది. ఆత్మహత్య చేసుకోని ప్రజాస్వామ్యాన్ని ఇంత వరకు చూడలేదు. నిత్య జాగరూకులుగా ప్రజలు లేకపోవడమే ప్రజాస్వామ్యం హత్య చేసుకోవడం.

చివరిగా ఒక విజ్ఞప్తి. మనసు, మమత వున్న మేధావులు మీరు. ఉన్నత మానవత్వం మూర్తీభవించిన ఉపాధ్యాయులు మీరు. కనుకనే నిరంకుశ అధికార కేంద్రాలు, కరుడుగట్టిన బుర్నాకసీ అధికారులు, రాక్షసత్వం సంతరించుకొన్న శాంతి భద్రతా రక్షకులు వున్న సమాజాన్ని పరిశీలించండి. వీరి లోహ పదఘట్టన క్రింద నలుగుతున్న అమాయక, అసహాయ వ్యక్తుల, బలహీన శక్తుల, దీనాలాపన ఒక్కసారి ఆలకించండి. వీటి ఫలితమే ప్రజాస్వామ్యం బలికావటం. నిత్య జాగరూకతే ప్రజాస్వామ్యానికి శ్రీరామరక్ష. ప్రజాస్వామ్యం, పౌరహక్కులు మంటగలిసిననాడు ఏ ఉద్యమం మింటికెగరలేదు. మేధావులు ఉదాసీనంగా వుంటే, నిరంకుశత్వం గజ్జెగట్టి కరాళ నృత్యం చేస్తుంది. ఇరుగు పొరుగు దేశాల ఉదాహరణలు మనకుమేలు కొలుపు కావాలి. అందుకే నేను కోరుకుంటున్నాను పౌరహక్కుల పరిరక్షణ మీ ఉద్యమంలో చోటు చేసుకోవాలని. ★

---

## మన గమ్యం

— రచన : ముసిలోడు

నీ గమ్యమేదిరా ఓ తెలుగు సోదరా
నీ ధ్యేయమేదిరా ఓ తెలుగు సోదరా

ఆశయాల నంగడిలో
అమ్ముతున్న రోజులురా
అభాగ్యులా నెందరినో
అణచివేయు రోజులురా
ఓటు నోటు మాటలే
నేటి యుగపు పాటలురా
నయవంచన చేయుటయే (వి)నాయకుల బాటలురా
॥నీ గమ్యం॥

తెల్లవారు కొల్లగొట్టి రెన్నెన్నో ఆస్తులను
ఈ నల్లవారు గుల్లచేసి రెన్నెన్నో బ్రతుకులను
బొర్ర పెరుగుచుండెరా-బుర్ర తరుగుచున్నదిరా
ఆశయమే ఎరగనోడు-రాజకీయ నాయకుడా ॥నీ గమ్యం॥

నిదురించే చైతన్యం - ఎదిరించీ నిలవాలి
అదలించే చెదపురుగుల - విదిలించీ బ్రతకాలి
విజయాలకు సారధివై-యు.టి యఫ్. కు చూపాలి.
॥నీ గమ్యం॥

# సమాజం - స్త్రీలు




**శ్రీమతి గోదావరి పెరులేకర్**

ఈనాటి సమాజంలో పురుషాధిక్యత వుంది. స్త్రీలు కూడ తమ సామాజిక స్థాయి పురుషుల కంటె తక్కువ అనే అభిప్రాయంతో వున్నారు. ఈ వివక్షత అనాదిగా వుందా? లేక మధ్యలో వచ్చిందా? ఎందుకు వచ్చింది? ఎప్పుడు లేకుండాపోతుంది? —లాంటి ప్రశ్నలకు జవాబులను సంక్షిప్తంగా ప్రస్తావిస్తాను.

పురుషాధిక్యత సమాజంలో అతి ప్రాచీన కాలంలో లేదు. మన ప్రాచీన నాగరిక సమాజంలో మాతృస్వామ్య వ్యవస్థలు ఉన్నాయి. శిశువు తల్లిదండ్రులలో ఎవరికి చెందాలి? అనే వివాదంలో ఒకానొకప్పుడు తండ్రికి చెందాలి అని తీర్పు చెప్పడం జరిగింది. అప్పటి నుండి స్త్రీ పతనం ప్రారంభమయింది. వ్యక్తిగత ఆస్తి ఉనికి లోకి వచ్చింది. వ్యక్తిగత ఆస్తితో పురుషాధిక్యత ప్రారంభమయింది. స్త్రీ పురుషునిపై ఆధారపడి జీవించవలసివచ్చింది. బహు భార్యాత్వంతో స్త్రీ స్థితి మరీ అధ్వాన్నమయింది.

ఈనాడు స్త్రీలు కూడ ఉద్యోగాలు చేస్తున్నారు ఇతర పనులు చేస్తున్నారు. వారి సంపాదనతో వారు బ్రతకగలిగే స్థితిలో వున్నారు. అంటే ఆర్థికంగా పురుషునిపై ఆధారపడవలసిన అవసరం లేదు. అయినప్పటికి వారికి పురుషులతో సమానమైన సామాజిక స్థాయి లేక పోవడం మనం చూస్తూనే వున్నాం. స్త్రీలకు పురుషులతో సమాన హక్కులున్నట్లు చట్టాలున్నాయి. కాని చట్టాలు మాత్రమే సమస్యల్ని పరిష్కరించలేవు.

చట్టాలు అమలు కాకపోవడానికి కారణాలేమిటి? దేశంలో నిరక్ష రాస్యులు 64 శాతం వున్నారు. వారిలో మహిళా నిరక్షరాస్యుల శాతం మరీ ఎక్కువ. వారికి వున్న హక్కులేమిటో, బాధ్యతలేమిటో, రాజ్యాంగం వారికెలాంటి రక్షణలు కల్పిస్తుందో వారికి తెలియదు. ఇలాంటి పరిస్థితులలో స్త్రీల సమస్యలు ఎలా పరిష్కారమవుతాయి?

సమాజంలో స్త్రీలకు పురుషులతో సమానమైన స్థాయి లేకపోవ డానికి కారణం పురుషులేనని భావించి పురుషుల యెడల ద్వేషభావం పెంచుకొనే స్త్రీలూ వున్నారు. ముఖ్యంగా విద్యావంతులైన కొందరు స్త్రీలు ఇలాంటి భావాన్ని వ్యక్తం చేస్తుంటారు. ఇలాంటి భావాలు, నిర్ణయాలు వారి సామాజిక అవగాహనలోని లోపాన్ని తెలియ జేస్తాయి. సమాజంలోని స్త్రీలు, పురుషులు అంతా ఈ పెట్టుబడిదారీ వ్యవస్థలోని వారే. వ్యవస్థాగత లోపాలే వ్యక్తులలోనూ ప్రతిఫలిస్తుం టాయి. అలాగే పెట్టుబడిదారీ సంస్కృతికి లోనైన స్త్రీలు తమ భర్తలను, పిల్లలను నిర్లక్ష్యం చేస్తూ ఉన్నతస్థాయిగల జీవితం గడుపు తున్నామనుకొని ఆత్మవంచన చేసికొనే వారూ వున్నారు. చీట్ల పేకలు, విందులు, వినోదాలని క్లబ్బులవెంట తిరిగేవారూ వున్నారు. విశృంఖ లంగా వ్యవహరించే పాఠశాల, కళాశాల విద్యార్థులను (అబ్బాయిలను, అమ్మాయిలను) మందలించి, వారి తల్లిదండ్రులను కలిసి "పిల్లల ఖర్చులకు, అవసరాలకు మించి డబ్బు ఇవ్వడంవలన పిల్లల విలాసాలు, అవలక్షణాలు, విశృంఖలత్వం పెరుగుతున్నాయ"ని చెపితే "మా పిల్లలు... మా ఇష్టం" "మాకు వుంది... మేమిచ్చుకొంటాం మీకెందుకు!" అని జవాబులు చెప్పి హేళనగా చూసే విపరీత సంస్కారవంతులూ వున్నారు.

వ్యభిచార ప్రవృత్తి వ్యవస్థాగతమైనదే. నగరాల్లో, పట్టణాల్లో వ్యభిచార గృహాలు వ్యాపించి వున్నాయి. మైనరు బాలికలను మభ్య పెట్టి తీసుకెళ్ళి వ్యభిచార గృహాల్లో అమ్ముకొనటం జరుగుతున్నది. ఇలాంటి సంఘటనలను ప్రభుత్వం అంతగా పట్టించుకోలేకపోవడంతో వ్యభిచార గృహాలను నడిపేవారు పోలీసుల అండదండలతోనే తమ కార్యకలాపాలు సాగిస్తున్నారు. 'ఒక నాణెం యొక్క బొమ్మ బొరుసు ల్లాంటివే పెట్టుబడిదారీ విధానం – వ్యభిచారం' అంటాడు లెనిన్. కనీసావసరాలైన కూడు గుడ్డ నీడ గడవక వ్యభిచారం వృత్తిగా స్వీక రించేవారు, బలవంతుల దౌష్ట్యానికి గురయి గత్యంతరం లేక చేసే వారు, కట్నాలు కానుకల్లాంటి దురాచారాలను నిర్మూలించి స్త్రీలను ఉద్ధరించడానికి అవతరించినట్లు నటించేవారికి లొంగిపోయేవారు, పెట్టుబడిదారీ విష సంస్కృతిని ప్రచారం చేసే పత్రికల, సినిమాల వలన వ్యభిచారులుగా మారేవారు రకరకాల కారణాలతో యీ ఊబిలో కూరుకుపోయే వారున్నారు. ఎవరెలా లొంగిపోయినా కారణాలు మాత్రం వ్యవస్థాగతమైనవేగాని వ్యక్తిగతమైనవి కావు. అంతేగాదు. ఎవరైతే రకరకాల ఎరలు చూపి స్త్రీని లొంగదీసుకుంటాడో అతడే దాహం తీరిన తరువాత అదే స్త్రీని హీనంగా చూడడం కూడా ఈ సంస్కృతిలో ఒక భాగమే. వ్యాపార ప్రకటనలకు స్త్రీని మోడల్‌గా ఉపయోగించుకొనడం, కళా రూపాలుగా చెప్పబడే వాటిలో స్త్రీని విలాసవస్తువుగా చిత్రీకరించడం కూడ వ్యవస్థాగతమైనవే. బీహార్ ఉత్తరప్రదేశ్ లాంటి రాష్ట్రాలలో భూస్వాములు కూలినాలి స్త్రీలపై జరిపే అఘాయిత్యాలకు సంబంధించిన వార్తలు తరచుగా మనం పత్రికలలో చూస్తుంటాం.

స్త్రీల సమస్యలను కొందరు సంస్కర్తలుగాని, మహిళా సంఘాలు గాని పూర్తిగా పరిష్కరించడం జరగదు. కొన్ని పరిమితులకు లోబడి సాంఘిక న్యాయం అందజేయడానికి తోడ్పడతాయి. ఒక్క సోషలిస్టు వ్యవస్థ మాత్రమే స్త్రీ సమస్యని పరిష్కరించగలుగుతుంది.



అభివృద్ధి చెందామని చెప్పుకుంటున్న ఈనాడుకూడ ఒకేపనికి కూలి నిర్ణయించడంలో స్త్రీ పురుష వివక్షత వుంది. ఉద్యోగాలు యివ్వడంలో వివక్షత వుంది. స్త్రీ గర్భం దాల్చడం, కనడం ప్రకృతి ధర్మాలు. కొంతకాలానికి మెటర్నిటీ సెలవు మంజూరుచేసి పూర్తి జీతమో, సగం జీతమో యివ్వవలసివస్తుంది. అసలు ఉద్యోగమే ఇవ్వకుండావుంటే ఈ సమస్య వుత్పన్నంకాదు. లాభాలు గడించడం, పెట్టుబడులు పెంచుకొనడం తప్ప ఎలాంటి నైతిక విలువలను గురించి ఆలోచించలేని పెట్టుబడిదారీ దృక్పథం యిది. మరి ఈ వ్యవస్థలో స్త్రీ సమస్యలెలా పరిష్కారమవుతాయి ?

పురుషులు, స్త్రీలు కష్టబడి కలిసిమెలిసి పనిచేస్తారు. సాయంత్రం ఇంటికి రాగానే స్త్రీ ఇంటిపని చూసుకోవాలి. పురుషుడు తాపీగా చుట్టకాలుస్తూనో కబుర్లు చెప్పుకుంటూనో వరండాలో కూర్చుంటారు. స్త్రీ పొలంపని చేయాలి. ఇంటికి వచ్చిన తరువాత పిల్లల సంరక్షణ చూసుకోవాలి. పిండివిసరాలి. రొట్టెలు చేయాలి. పొద్దస్తమానం తనతోకూడా పనిచేసింది కాబట్టి ఇంటిపనికూడా ఇద్దరం చేసుకోవాలి. అని ఆలోచించే పురుషులెంతమంది వుంటారు ?

వివాహం విషయానికి వస్తే అమ్మాయి అందంగావుందా ? చదువుకొన్నదా ? కట్నం ఎంత ఇవ్వగలరు?—లాంటి ప్రశ్నలు సామాన్యాలు. కట్నకానుకల రూపంలో వీలైనంత మొత్తం రాబట్టుకొనడానికి ప్రయత్నాలు. ఇరువురూ ఇష్టపడి పెళ్ళిచేసుకొనేటప్పుడు డబ్బు ఎందుకు అడగాలి ? యివ్వాలి ! ఇంకా ఎక్కువ డబ్బును చేసుకొనేందుకు. ఆ పెద్దమొత్తాన్ని ఇంకా పెద్దమొత్తంగా పిల్లలు పెట్టించేందుకు ఈ విధంగా ఇది తీరని దాహం. కట్న కానుకలు పెట్టుబడిదారీ అనాగరిక ఆటవిక 'పాశవిక' సంస్కృతీ దుర్లక్షణాలు. కట్నాల దాహంలో ఎన్నికుటుంబాలు, ఎందరు స్త్రీలు హత్యలకు ఆత్మహత్యలకు గురవుతున్నారో మనం నిత్యం పత్రికలలో చూస్తూనే వున్నాం. ఈ విషయాన్ని కొంచెం నిశితంగా ఆలోచించండి. పెళ్ళిచేసుకొనడం అంటే పురుషుడికి స్త్రీ లోబడివుండాలి. కట్నంరూపంలో పెద్ద మొత్తాలు ఇవ్వాలి. ఆ తరువాత ఆమె శ్రమశక్తిని జీవితాంతం దోచుకోవాలి ! ఎంత పాశవికమైన ఆలోచనా సరళి ! మనది కేవలం ధనస్వామ్య వ్యవస్థేగాదు, పురుషస్వామ్యవ్యవస్థకూడా.

మన సమాజంలో బాలికల మానసిక ఎదుగుదలను అరికడుతున్నాం. అమ్మాయిలకు ఇంట్లో పనులు అందరూ చెపుతారు. తల్లిదండ్రులే కాదు, అన్నలు, తమ్ములు కూడ. 'ఆడపిల్ల పెద్దలు, పిన్నలు అందరు చెప్పిన పనులు చేయాలి' అనే అభిప్రాయం కలిగిస్తాం. దానితో చిన్నప్పటినుండి అబ్బాయిలలో ఆధిక్యతా భావం, అమ్మాయిలలో న్యూనతా భావం ఏర్పడతాయి. ఆ భావాలు వారి జీవితాంతం కొనసాగుతుంటాయి. ఇది పాత సమాజంలోనేగాక ఈ నాటికీ కొనసాగుతున్నది.

స్త్రీని చులకనగా, హేళనగా చూడ్డం కూడ సర్వసామాన్యం. స్త్రీలు ఒకరిద్దరు వెళుతుంటే వెంటపడి వేధించేవారున్నారు. గమనించి కూడ తమకేమీ సంబంధం లేనట్లు ఏమీ పట్టించుకోకుండా పోతుంటారు చాలామంది. కారణం ఆ స్త్రీ ఆ వేధించేవాడి తల్లికాదు. గమనించేవాడి తల్లికాదు. వారి చెల్లెలు కాదు. వారి భార్యకాదు. కాని మరొకరి చెల్లెలు. మరొకరి భార్య. మరొకరి తల్లి..

మనం విదేశాలు వెళితే అక్కడ ఎవరైనా మీ సమాజంలో స్త్రీల స్థానం ఏమిటి ? మీ సమాజంలో స్త్రీలకు ఎలాంటి రక్షణ కల్పించబడుతున్నది ? శిశు సంరక్షణకై మీ ప్రభుత్వం ఏంచేస్తున్నది ? లాంటి ప్రశ్నలు వేస్తే సిగ్గుతో తలవంచుకోవలసి వస్తుంది.

మేము ఉత్తర కొరియా వెళ్ళాం. అక్కడ అన్ని రంగాలలో స్త్రీలు పనిచేస్తున్నారు. మేము విద్యా మంత్రిని కలిసి దేశంలోని నిరక్షరాస్యతను గురించి అడిగాము. నిరక్షరాస్యులు లేరని చెప్పారు వారు. "మరి స్త్రీలలో ?" అడిగాము "లేరు" జవాబు "అంత త్వరగా ఎలా సాధించారు?" అని అడిగాము. జవాబుగా వారొక సంఘటన చెప్పారు. 'ఒక చదువురాని స్త్రీ తన సమస్యను వివరిస్తూ కిమ్-ఇల్-సంగ్‌కు మరొకరి చేత ఉత్తరం వ్రాయించింది. "నీవు త్వరలో చదువు నేర్చుకొని స్వయంగా వ్రాయి. నీ సమస్యని పరిష్కరిస్తాను" జవాబు వచ్చింది. కొద్ది నెలల్లో ఆమె స్వయంగా వ్రాసింది. ఇది కిమ్-ఇల్-సంగ్ నిరక్షరాస్యతా నిర్మూలనా విధానం' అని చెప్పారు.

శిశు సంరక్షణ కేంద్రాలను గురించి అడిగాం. "1 నుండి 5 సంవత్సరములలోపు బిడ్డల సంరక్షణా కేంద్రాలను ప్రభుత్వం నడుపుతుంది. కొందరు తల్లులు నెలలో రెండు రోజులు మాత్రం బిడ్డలను ఇళ్ళకు తీసుకెళతారు. మరికొందరు ప్రతి శని, ఆదివారాలు తీసుకెళతారు. చాలామంది ప్రతిరోజు సాయంత్రం వారి పని పూర్తికాగానే తీసుకెళతారు" అని చెప్పారు. ఇలాంటి శిశు సంరక్షణా కేంద్రాలను మన దేశంలో ఊహించగలమా ?

ఈ ప్రభుత్వం మహిళలను ఉద్ధరిస్తుందనే విశ్వాసం నాకు లేదు. ఈ సందర్భంగా ఒక చిన్న సంఘటన. ఒకసారి మధ్యప్రదేశ్ చంబల్ లోయ గుండ ఆ రాష్ట్ర మంత్రులు పోలీసు రక్షణతో వెళుతుండగా బందిపోట్లు అడ్డుతగిలి చాలా తెలివిగా పోలీసుల్ని నిరాయుధుల్ని చేశారు. మంత్రులు పట్టుబడ్డారు. బందిపోట్లు మంత్రులతో అన్నారు : "మీరూ మేమూ అన్నదమ్ములమే. ఇరువురం దోచుకుంటాం. మీరు పేదవాళ్ళని, మేము ధనవంతుల్ని" అని.

వీరేశలింగం, గోఖలే, స్త్రీ విద్య, వితంతు వివాహాలు మొదలుగా గల సమస్యలపై ఆనాటి సమాజంతో రాజీలేని పోరాటం సాగించారు. అలాగే డాక్టర్ అంబేద్కర్ హరిజనులకొరకేగాక స్త్రీల కొరకు ఎనలేని కృషి చేశారు. వారి కృషికి సంబంధించిన సమాచారం సేకరించి పుస్తకాలుగా ప్రచురించి ప్రజలలో చైతన్యం కలిగించడానికి ప్రయత్నించాలి. ముఖ్యంగా ఈనాటి బాల బాలికలచే ఆ పుస్తకాలు చదివించాలి.

తరతరాలుగా స్త్రీని వంటఇంటికి పరిమితం చేయడం వలన మూఢాచారాలు మహిళలలో ఎక్కువగానే వున్నాయి ఈనాటికీ.

(మిగతా 104 వ పేజీలో)

శుభాకాంక్షలతో

# ది గన్నవరం పంచాయతీ సమితి స్కూల్స్ ఎంప్లాయీస్

## సహకార పరపతి సంఘము లిమిటెడ్, నెం. కె. ఆర్. 2

## గన్నవరం : : కృష్ణాజిల్లా

స్థాపితం : 1971 — సభ్యుల సంఖ్య : 182

వాటాధనము రు. 95,030/-

సభ్యులనుండి రావలసిన అప్పులు రు. 5,14,701/-

నిర్బంధ పొదుపు రు. 27,239/- (30-6-84 నాటికి)

సెంట్రల్‌బ్యాంక్ చెల్లింపవలసినది రు. 4,74,000/- (షుమారు)

నిర్బంధ పొదుపుపై 10 శాతం వడ్డీ యివ్వబడును.



పాలకవర్గం

శ్రీ యస్. నాగలింగం, అధ్యక్షుడు

శ్రీ పి. గోపాలకృష్ణయ్య, ఉపాధ్యక్షుడు

శ్రీ డి. జగన్మోహనరావు, కార్యదర్శి

డైరక్టర్లు

సర్వశ్రీ వి. సత్యనారాయణరాజు, బి. నాగేశ్వరరావు, వి. సోల్మన్, బి. వెంగళయ్య

శ్రీ వి. వెంకటేశ్వరరావు (గుమాస్తా)



కృష్ణాజిల్లా కార్యకర్తలు ఆరు మాసాలుగా ఆర్థిక సేకరణలో అపార కృషిచేశారు. రాత్రింబవళ్ళు శ్రమించారు. ప్రతి ఉపాధ్యాయుని కలిశారు. ప్రతి పైసా ప్రోగుచేశారు. వివిధ గ్రామాలలో దాతలెందరో ప్రేమాదరాలుచూపి ఎనలేని సహకారం అందించారు. అదొక మహా సంకల్పంగా, మహా యజ్ఞంగా క్యాంపెయిన్ సాగించారు. మహాసభల విజయానికి ప్రధాన కారకులయ్యారు.

కృష్ణా, వరంగల్, నల్గొండ, యం. నగరి, చిత్తూరు, విశాఖ, ఆదిలాబాద్ జిల్లాలు కోటాల్ని అధిగమించాయి. మూడు లక్షలకు పైగా ఆహ్వానసంఘానికి అందించటం జరిగింది.

విశాఖజిల్లా యు.టి.యఫ్. ప్రధాన కార్యదర్శి శ్రీ ఎస్.ఎస్. శాస్త్రి వారంరోజులపాటు రాత్రింబవళ్ళు శ్రమించి ముఖద్వారాన్ని రూపొందించటమేగాక వేదిక సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దారు. అన్ని జిల్లాల బ్యానర్లు, స్వాగతాలు ఎంతో శ్రమకోర్చి రూపొందించారు.

## ప్రజల ఆదరణ

ఇక ప్రజల ఆదరణకు అంతులేదు. డబ్బు రూపేణేగాకుండా వస్తురూపేణ ఆయా జిల్లాశాఖలకు బియ్యం, కూరగాయలు, చింతపండు అనేకం అందించారు.

తూ.గో. జిల్లాలోని ముమ్మిడివరం, అమలాపురం, రాజోలు, గన్నవరం, కొత్తపేట, కోరుకొండ సమితులనుండి అరటి ఆకులు 24,692, అరటికాయలు 680, కొబ్బరికాయలు 1,484 నిమ్మకాయలు 360, గుమ్మడికాయలు 18, వంకాయలు 86 కిలోలు, కరివేపాకు 2 బస్తాలు, సొరకాయ 1, టమాటో కిలో మొత్తం మూడు వేల రూపాయిల విలువగలవి తెచ్చారు.

అలాగే పశ్చిమగోదావరి జిల్లానుండి అరటి ఆకు, అరటి కాయలు, కొబ్బరికాయలు తెచ్చారు.

కృష్ణాజిల్లా అవనిగడ్డ సమితినుండి అరటికాయలు 52 గెలలు, అరటి ఆకులు 4,500, కాలీఫ్లవర్ 50, కొబ్బరికాయలు 50, నిమ్మకాయలు 50, వంకాయలు 1 గంప మొత్తం వేయి రూపాయల విలువైనవి తెచ్చారు.

చిత్తూరుజిల్లా నుండి ఒక బస్తా చింతపండు 700/-విలువైనది, నెల్లూరు జిల్లా గూడూరునుండి 6 వేల నిమ్మకాయలు రు. 600/- విలువగలవి తెచ్చారు.

విజయవాడ కిరాణా వర్తకసంఘం వారు బస్తాలకొలది వంకాయలు, టమాటో, క్యాబేజీ, అరటికాయలు, పచ్చిమిర్చి, కంద, కేరట్, మొదలగునవి మొత్తం 2 వేల విలువ గలవి అందజేశారు.

పశ్చిమగోదావరిజిల్లా గణపవరం నుండి రు. 1,700 విలువ గల బియ్యము, కృష్ణాజిల్లా బంటుమిల్లి సమితి నుండి 4 కట్ల బియ్యము రు. 1,000 విలువ గలవి అందజేశారు.

## భోజనాల ఏర్పాట్లు

పదివేలమంది భోజనాలు సునాయాసంగా చేసే ఏర్పాట్లు, కాలం వృధాగాకుండా ఒక్కసారే వడ్డించే పద్ధతులు, ప్రతినిధులకే గాక పరిశీలింప వచ్చినవారికికూడా ఇంద్రజాలంగా తోచింది. ఈ భోజన ఏర్పాట్లలో విద్యార్థి, యువజన, మహిళా, రైతు, వ్యవసాయ, కూలీ, మునిసిపల్, ముఠావర్కర్స్ మొదలగు ప్రజాసంఘాల కార్యకర్తలు, ఉద్యోగ సంఘాల కార్యకర్తలు వందలాది మంది వలంటీర్లుగా రాత్రింబవళ్ళు పనిచేసి ఎనలేని సహకారాన్నిచ్చారు.

అందరికీ ... వారందరికి పేరుపేరునా ఇవే మా కృతజ్ఞతాభివందనాలు!

## పతాక శీర్షికలిచ్చిన పత్రికలు

మూడు రోజులపాటు జరిగిన మహాసభల కార్యక్రమానికి ప్రత్యేక ప్రాధాన్యతనిచ్చి విజయవాడ నుండి వెలువడే అన్ని దిన పత్రికలూ పతాక శీర్షికలిచ్చి ప్రముఖంగా ప్రకటించాయి. ఫొటోలతో సహా విస్తృత ప్రచారమిచ్చాయి. వైట్ కాలర్ ఉద్యమానికి – పత్రికా రచయితలకూ గల అవినాభావ సంబంధాన్ని ధృవపరిచాయి. ఆ వివరాలు విడిగా అట్టపైన యిస్తున్నాం.

## సినిమా థియేటర్ల యజమానుల తోడ్పాటు

ప్రతినిధులకు కేటాయించిన వసతుల్లో సరిపడా లెవెట్రీ సౌకర్యం లేకపోవటంతో అలంకార్, శైలజ, రామాటాకీస్, వెంకటేశ్వర సినిమా థియేటర్ల యజమానులు తమ ఆవరణలోగల వాటిని వినియోగించుకొనేందుకు అడిగిందే తడవుగా అత్యాదరంతో అంగీకరించారు. అలంకార్ థియేటర్ వారు చివరిరోజు ప్రతినిధులకు వేన్నీళ్ళు కూడా సప్లయి చేశారు.

## మహాసభల వీడియో

మహాసభల సన్నివేశాలన్నింటినీ ఆ మూలాగ్రం వీడియో దృశ్యంగా చిత్రీకరింపజేసి శాశ్వతరూపాన్ని కల్పించారు ప్రాథమిక విద్య సంపాదకులు శ్రీ యన్. యం. కొండయ్యగారు. మహాసభల సందర్భంలో అతిథులకు ఒక టాక్సీ ఏర్పాటుచేసి ఎంతో సహకరించారు. అన్నిటినీ పర్యవేక్షిస్తూ ముఖ్య కార్యకర్తగా పనిచేశారు.

---

(102 వ పేజీ తరువాయి)

స్త్రీ విద్యని ప్రోత్సహించాలి. స్త్రీ విద్యావంతురాలైతే కుటుంబం అంతా సంస్కారవంతమవుతుంది. పురుషులతో సమానంగా వున్న స్త్రీలు పాల్గొనకుండా ఏ ఉద్యమం జయప్రదం కాలేదు. ఉపాధ్యాయ సంఘాలు లాంటి ప్రజా సంఘాలలో ప్రజా ఉద్యమాలలో స్త్రీల భాగస్వామ్యం పెరగాలి. ముఖ్యంగా మహిళలు వారి కుటుంబ సమస్యలకు వారి వ్యక్తిగత సమస్యలకు మహిళా సమస్యలకు మాత్రమే పరిమితమైయుండక ఈ సమాజం మొత్తాన్ని వేధించే సమస్యల్ని విశాల దృక్పథంతో అర్థం చేసుకోవాలి. సామాజిక ప్రగతికి అన్ని రంగాలలో స్త్రీ పురుష వివక్షత లేకుండా ముందుకు రావాలి. అప్పుడే మనమాశించే సోషలిజాన్ని సాధించగలుగుతాము. ★

# చతుర్థ మహాసభల్లో సాంస్కృతిక చైతన్యం

# ఉత్సాహం, ఉత్తేజం వెల్లివిరిసిన కళారూపాలు

సమీక్ష: 'కోణార్క'




(ఎడమ నుండి) అట్లూరి శోభన్‌చంద్, శైలజ, బాల, రాఘవయ్య నృత్య భంగిమల దృశ్యం

విజయవాడ విద్యా వైజ్ఞానిక మహాసభల సందర్భంగా జనవరి 8, 9 తేదీలలో అనేక వైజ్ఞానిక కళా ప్రదర్శనలు ప్రదర్శింపబడ్డాయి. పగలంతా నిర్విరామ చర్చలూ, గోష్ఠులూ, ఉపన్యాసాలూ విని కూడా అర్ధరాత్రి రెండు గంటలదాకా వేలాది ఉపాధ్యాయులు వీటిని తిలకించారు. ప్రశంసించారు. ఈ రెండు దినాల సాంస్కృతిక కార్యక్రమాలను పర్యవేక్షిస్తూ రంగస్థల నిర్వాహకులుగా శ్రీ శాంతారావు (ప్రజా నాట్యమండలి) వ్యవహరించి వీటిని జయప్రదం చేశారు.

ఈ కళా రూపాల్లో ప్రక్రియా వైవిధ్యం ఒక ప్రత్యేకతకాగా, దాదాపు అన్నింటా వస్తువు విద్యారంగం లేదా తత్సంబంధితంకావడం ఒక విశిష్టత. ఈ కళాకారులంతా ఉపాధ్యాయులు లేదా విద్యార్థులు. ఎవ్వరూ వృత్తి కళాకారులు కాదు. అంతా ఔత్సాహికులే. రెండు నాటికలు మినహాయించితే అన్నింటి స్క్రిప్టు తమ అనుభవాలు ఆధారంగా ఆయా ఉపాధ్యాయులే - చాలావరకూ కళాకారులే తయారు చేసుకొన్నారు. దీని వెనక మన ఉద్యమ చైతన్యం ఉంది. ప్రదర్శనా పాండిత్యం, ప్రక్రియా నైపుణ్యం, సాంకేతిక పరిణతి, వస్తు వైవిధ్యం దృష్టినుంచి గాక ఉద్యమచైతన్యం, అనుభవాల సంపద, సమస్యల సాన్నిహిత్యం, అభ్యుదయ దృక్పథం దృష్టితో వీటిని బేరీజు వేయవలసివుంది. అర్థం చేసుకోవలసి వుంది.

జనవరి 8వ తేదీ వైజ్ఞానిక ప్రదర్శనల ప్రారంభోత్సవ సభకు ఐక్య ఉపాధ్యాయ ప్రధాన సంపాదకులు శ్రీ మైనేని వెంకటరత్నం గారు అధ్యక్షత వహించగా, 'సప్తగిరి' పత్రిక ఉప సంపాదకులు శ్రీ మేడసాని మోహన్‌గారు ప్రారంభించారు. ఆంధ్రుల నృత్య కళా కాణాచి కూచిపూచి సిద్ధేంద్ర నృత్య కళాశాల చిన్నారి బాలికలు చిరంజీవుల్లు శైలజ, బాలల సాంప్రదాయక నృత్యంతో ప్రదర్శనలు ప్రారంభం అయ్యాయి. దశావతార నృత్యాన్ని చిరంజీవి రాఘవయ్య ప్రదర్శించాడు. చిదిమితే పాలుగారే వయసులో కళా సరస్వతి కాలి అందెల రవళి వీరి భంగిమల్లో ఘల్లుమన్నది చిరంజీవి అట్లూరి శోభన్‌చంద్ (కానూరు, కృష్ణాజిల్లా) జానపద నృత్యాలు రెండూ సృజనాత్మకమైనవి. అర్ధనారీశ్వరుడులా రెండు పాత్రాల రెండు రూపాలతో ఎంకిగా ఎంకడుగా యుగళగీతానికి ఈ 5వ తరగతి అబ్బాయి చేసిన నృత్యాభినయం ప్రతిభావంతమైనది. ప్రేక్షకుల్ని దోచుకున్న ఈ చిరంజీవికి చక్కని భవిష్యత్తు వుంది. "కులం ... మతం" పౌర సామాజిక రుగ్మతల్ని ఎండగడుతూ శ్రీ యం. వి. అప్పారావుగారు (మర్లపాడు, ప్రకాశం జిల్లా) నృత్యాభినయాన్ని, శ్రీ రామారావుగారు (వాకాడు, నెల్లూరు జిల్లా) జానపద నృత్యాన్ని ప్రదర్శించారు. అప్పారావుగారు స్క్రిప్టు కూడా స్వయంగా తయారు చేసుకొన్నారు.

ఈ ప్రదర్శనలకే మకుటాయమానం తూర్పుగోదావరిజిల్లా ముమ్మిడివరం సమితివారి "సమితి భాగవతం" అనే నృత్యనాటిక. అక్రమ బదిలీలకు వ్యతిరేకంగా తాము జరిపిన వీరోచిత పోరాటాన్ని కళాత్మంగా మలచుకొని కార్యకర్తలే కళాకారులై ప్రదర్శించడం దీని విశిష్టత. ప్రజా పోరాటాలనుంచి కళారూపాలు, కళారూపాలు నుంచి ప్రజా పోరాట చైతన్యం పరస్పరాశ్రయంగా అభివృద్ధి చెందుతాయి. ప్రజా సంఘాలు పోరాటనుభవాలకు కళాత్మకతా రూపం కలిగించినపుడు అది జీవితానికి అద్దం పడుతుంది. తూ. గోదావరి జిల్లాశాఖ




'సమితి భాగవతం' దృశ్యం

"కదిలించటం కళాకారుని కర్తవ్యం. నిద్రపోయే వాళ్ళను మేల్కొలపటం అతనివిధి. అతడు ఈ ప్రపంచానికి చెందిన అజ్ఞాత గతాన్ని గుర్తు చేస్తాడు. వర్తమానాన్ని కళ్ళెదుట నిలుపుతాడు. నూతన జీవితానికి దారి చూపుతాడు" — డా॥ నార్మన్ బెతూన్



'ఆహుతి' ఏకపాత్రాభినయం శ్రీ యస్. ఆర్. కదలి
'హరికథ' శ్రీ సలాది భాస్కరరావు
'పిచ్చివాడు'గా శ్రీ బి. వి. యస్. గోపాలం అభినయ దృశ్యాలు

ఈ కృషిలో గొప్ప విజయం సాధించడమే కాదు. పరిణతి చెందిన ప్రజాసంఘంగా ఆదర్శవంతంగా నిలిచింది. ప్రేక్షకుల నుంచి దీనికి మంచి రెస్పాన్స్ వచ్చింది.

నెల్లూరు జిల్లాశాఖనుంచి "మనుషులొస్తున్నారు జాగ్రత్త" ఆదిలాబాదుజిల్లానుంచి "కొక్కొరోకో" అనే నాటికలు వచ్చాయి. రెండింటి వస్తువూ నిరుద్యోగం. రెండూ పలు వేదికలనుంచి ప్రదర్శింపబడ్డ ప్రసిద్ధ నాటికలే. అర్థంలేని చదువులు చదివి జీవితాన్ని ఎంప్లాయిమెంటు ఆఫీసుకు బలి పెట్టుకున్న యువజనుల ఆలోచనా రీతులను, వక్రమార్గాలను, ఆదర్శాలకూ అవసరాలకూ మధ్య సంఘర్షణలనూ ఇవి రెండూ హృద్యంగా చిత్రించాయి. మొదటి దానిలో సంభాషణా పటిమ ఎక్కువ. రెండవది ఆధునిక నాటక కళాసాంకేతిక విలువలుగల నాటిక. "ఆలోచిస్తే అన్నీ అవసరమే" అనే నాటిక కృష్ణాజిల్లా బందరు పట్టణశాఖ నుంచి ప్రదర్శితమైంది. దేశంలోని ప్రాంతీయ భాషోన్మాదాలు వలెనే చదువుల్లో సబ్జక్టుల దురభిమానమూ మనకు తక్కువేంకాదు. సమిష్టితత్వం, సమన్వయ దృక్పథం లేని విద్య వెర్రితలలు వేస్తుంది. ఈ సందేశాన్ని విద్యార్థులు కళాత్మకంగా ప్రదర్శించారు. ప్రకాశంజిల్లా మేదరమెట్ల నుంచి వచ్చిన "చదువుల చదరంగం" నాటిక మన పంచాయతీరాజ్ వేలిముద్ర రాజకీయ నాయకుల కరుణా కటాక్షాల కటకటాల వెనుక బక్కబడి పంతుళ్ళు ఎలా నలిగిపోతున్నదీ కళ్ళకు కట్టించింది. ఇవిగాక ఆంధ్రప్రజానాట్యమండలివారి నూతన తరహా నాటిక "గప్ చుప్" ఒక భాగం కూడా ప్రదర్శింపబడింది

ఏక పాత్రాభినయాల్లో 'ఆహుతి' 'నిరుద్యోగి' రెండూ మన విద్యారంగ కర్మాగారపు కాలుష్యాన్ని మ్రింగి బ్రతుకులను బలిచేసుకొన్న నిరుద్యోగుల బాధామయగాథలు. "ఆహుతి"ని శ్రీ ఎస్. ఆర్. కదలి (వేంద్ర, ప. గోదావరిజిల్లా) "నిరుద్యోగి"ని శ్రీ బి. శ్రీనివాసరావు (కొత్తపల్లి, ఖమ్మంజిల్లా) ప్రదర్శించారు. సమస్యకు సామాజిక పరిష్కారం వీరు చూపగలిగారు. విజ్ఞానాన్ని పంచడానికే శక్తినంతా ధారపోసి ఈ దుష్ట సమాజపు కోరలకు చిక్కి "పిచ్చివాడు"గా మారిన బడిపంతుల్ని సీనియర్ కార్యకర్త శ్రీ బి. వి. సుందరగోపాలం (గోపాలపట్నం, విశాఖజిల్లా) ప్రదర్శించారు. ఇంతటి వృద్ధాప్యంలోనూ వారి ఉత్సాహం ప్రశంసింప దగింది.

శ్రీ టి. శ్యామలరావు (ఖమ్మం) గారి 'దృశ్య ప్రదర్శన' ఒక నూతన ప్రక్రియ. ఇది ప్రేక్షకులనెంతో ఆకర్షించింది. వేషంతోసహా రంగస్థల హంగులేవీ లేకుండా ఒక సంఘటనను సృష్టించుకొని, సమస్యను హాస్య సరళిలో పరిచయం చేయడం దీని ప్రత్యేకత. వీరి సృజనాత్మకత మెచ్చుకో దగింది. ఔత్సాహికులకు ఈ ప్రదర్శన ఎంతైనా ఆదర్శవంతంగా వుంది. తరువాత శ్రీ జి. యన్. ప్రసాదరావు. (పాలకొల్లు, పశ్చిమగోదావరి జిల్లా) ఇంద్రజాలిక ప్రదర్శనలోని మెళకువలను విశదీకరించారు.

హరిదాసుల తలాతోకలేని కథాప్రసంగాలను వ్యంగ్యాత్మకంగా దుయ్యబట్టే 'హరిదాసుగా' శ్రీ వై. వి. రమణమూర్తిగారు, (చెయ్యేరు,



'దృశ్య ప్రక్రియ'లో శ్రీ టి. శ్యామలరావు,

"కళ ప్రజలది. ప్రజానీకం మధ్య దానిని దృఢంగా పాదుకొలపాలి. అది ప్రజలకు అర్థంగావాలి. వారు దానిని ప్రేమించాలి. ప్రజానీకంయొక్క అనుభూతుల్ని, ఆలోచనల్ని, అభీష్టాల్ని అది ప్రతిబింబించాలి. వారిని ఉన్నతపరచాలి" — లెనిన్

> "మన పూర్వ కవులు తమ రచనల్లో ప్రకృతి సౌందర్యాన్ని కీర్తించడంలో పరవశించిపోయారు. కాని ... ఈ నాడు మన కవితలలో ఉక్కు ... ఇనుం కూడా ఉండాలి. మన కవులు ప్రతిఘటనకు సైతం సిద్ధపడి ఉండాలి" — హోచిమిన్




'హరిదాసు'గా శ్రీ వై. వి. రమణమూర్తి
ముమ్మిడివరం సమితి శాఖ 'బుర్రకథ' దృశ్యం

ప॥ గో॥ జిల్లా) శ్రోతల్ని ఆకర్షించగలిగారు. కొంత సంయమనం పాటించగలిగితే ఇది మరింత రాణించేది. శ్రీ సలాది భాస్కరరావుగారి 'హరికథ'లో కథ నేతిబీరకాయలోని నెయ్యి సామెతగా ఉన్నా వందలాది పిట్టకథలు, వేలాది చణుకులతో నసాళానికంటే విమర్శ చేయడం వీరికి వెన్నతో పెట్టిన విద్య. ఒకగంటసేపు శ్రోతల్ని తాము శ్రోతలమన్న సంగతి మరిచేలాగా ఆకట్టుకున్న కళానైపుణ్యం భాస్కరరావుగారికే సాధ్యమైంది "ఎర్రబాట" పేర అల్లూరి సీతారామరాజు కథను బుర్రకథగా శ్రీ బాబూరావు మేష్టారు (రామచంద్రపురం, తూ॥ గో॥ జిల్లా) గానం చేశారు. ఆవేదన, ఆవేశం, శ్రోతల్ని తట్టిలేపి పరుగులెత్తించగల వచో విన్యాసం వున్న ఈ బుర్రకథ రాత్రి 2గంటల సమయాన చెప్పబడింది. తూ॥ గో॥ జిల్లా ముమ్మిడివరం సమితి శాఖవారు ఆద్యంతం విపులంగా సిద్ధం చేసుకొన్న చెన్నుపాటి జీవిత కథను బుర్రకథగా వినిపించారు. అమరజీవి జీవిత ఘట్టాలు, మేరునగ ధీరమైన వారి వ్యక్తిత్వం. ఉపాధ్యాయ ఉద్యమ నిర్మాణం, పట్టుగట్టి సంఘ కార్యాలయంలో తుది శ్వాస విడవడం కథారూపంగా వింటున్నపుడు ఆ త్యాగమూర్తి కన్నకలలకు ప్రతిరూపమైన ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ కార్యకర్తలుగా సభ్యులుగా శ్రోతలకు మధురానుభూతి కలిగించింది. దీన్ని మరింత కళాత్మకంగా మలుచుకొని, పరిమిత సమయంలో గానం చెయ్యబడేలాగ సిద్ధంచేసి మన ఉద్యమంలోని కొత్తతరానికి వెలుగుబాటగా ఉపయోగించుకొనాలి.

మొత్తంపై మన ఉద్యమ వికాసాన్ని ఈ కళారూపాలు ప్రతిబింబిస్తున్నాయి. వీటిని మరింత మెరుగుపరచుకొని ప్రదర్శించుకొనేలా మన ఉద్యమం కృషి చేయవలసివుంది. ఒక విస్తృత పునాది నేర్పరచుకొన్న ప్రజాసంఘంగా మనకున్న ఆ అపార అవకాశాల బీజాలు ఈ కళా ప్రదర్శనల్లో స్పష్టంగా కనిపించాయి.

## బహుమతులు

### నాటికలు

1. కొక్కొరొకో : కళ్యాణఖని ఆదిలాబాద్ జిల్లా (పథమ బహుమతి)
2. మనుషులొస్తున్నారు జాగ్రత్త : నెల్లూరు జిల్లాశాఖ (ద్వితీయ బహుమతి)
3. 'ఆలోచిస్తే అన్నీ అవసరమే' : బందరు పట్టణశాఖ (సాధారణ బహుమతి)
4. చదువుల చదరంగం : మేదరమెట్ల దళం, ప్రకాశం (సాధారణ బహుమతి)
5. గప్‌చిప్ : ఆంధ్రప్రజానాట్యమండలి, ఎడ్లపాడు, గుంటూరు (కన్సొలేషన్)

### ఏకపాత్రాభినయాలు

1. ఆహుతి — శ్రీ యస్. ఆర్. కడలి, వేంద్ర, ప. గో.) (ప్రథమ బహుమతి)
2. మేజిక్ — శ్రీ జి.యస్. ప్రసాదరావు, పాలకొల్లు, ప. గో. (కన్సొలేషన్ ప్రైజ్)
3. హరిదాసు — శ్రీ వై.వి. రమణమూర్తి, చెయ్యేరు, తూ.గో. (కన్సొలేషన్ ప్రైజ్)
4. దృశ్య ప్రదర్శన ప్రక్రియ — శ్రీ టి. శ్యామలరావు, ఖమ్మం (కన్సొలేషన్ ప్రై
5, పిచ్చివాడు — శ్రీ సుందరగోపాలం, గోపాలపట్నం, విశాఖ (సాధారణ బహుమతి)
6. నిరుద్యోగి — బి. శ్రీనివాసరావు, కొత్తపల్లి, ఖమ్మం (సాధారణ బహుమతి)

### నృత్యాలు

1. (a) దశావతార నృత్యం — మాష్టర్ రాఘవయ్య (ప్రథమ బహుమతి)
   (b) కూచిపూడి నృత్యం — సిద్ధేంద్ర నృత్యకళాశాల, కూచిపూడి శైలజ, బాలకృష్ణ (కన్సొలేషన్ ప్రైజ్)
2. జానపద నృత్యం — చిరంజీవి అట్లూరి శోభన్‌చంద్, కానూరు, కృష్ణా (ద్వితీయ బహుమతి)
3. డప్పు నృత్యం — శ్రీ సి హెచ్. రామారావు. వాకాడు, నెల్లూరు (సాధారణ బహుమతి)

> "ఓ గాయకా ! ధనికుల నాట్యగృహాల్లో అమృతపు సోనలు కురిపిస్తే యేంలాభం? దీనులు ... దరిద్రులయిన కోట్లాది ప్రజల్ని నీ పాటలతో ఉత్తేజపరచు ... మేల్కొలుపు ... వారిలో చైతన్యాన్ని ప్రేరేపించు ... నీ గొప్పతనానికి రాచబాట అదే" — గోర్కీ

## నృత్యనాటకాలు

1. వీధి భాగవతం— ముమ్మిడివరం సమితిశాఖ, తూ.గో. (ప్రథమ బహుమతి)
2. కులం...మతం— శ్రీ యం.వి. అప్పారావు, మర్లపాడు, ప్రకాశం (ద్వితీయ బహుమతి)

## బుర్రకథలు

1. ఎర్రబాట— శ్రీ బాబూరావు మేష్టారు, రామచంద్రపురం, తూ. గో. (కన్సొలేషన్)
2. చెన్నుపాటి జీవితచరిత్ర— ముమ్మిడివరం దళం, తూ. గో. (కన్సొలేషన్ ప్రైజ్)

## హరికథ

శ్రీ సలాది భాస్కరరావు, కాకినాడ, తూ. గో. (ప్రత్యేక బహుమతి)

## పాటల దళాలు

1. నార్నెపాడు దళం, గుంటూరుజిల్లా (ప్రథమ బహుమతి)
2. ఏలూరు దళం, (ద్వితీయ బహుమతి)
3. శ్రీ జగన్, ప్రజానాట్యమండలి, కృష్ణా (ప్రత్యేక బహుమతి)

## డెకరేషన్

1. శ్రీ కే. యస్.యస్. శాస్త్రి, అనకాపల్లి, విశాఖ (ప్రత్యేక బహుమతి)
2. శ్రీకాంతారావు (సాధారణ బహుమతి)
3. పి. ధర్మారావు ( „ )

## వైజ్ఞానిక ప్రదర్శనల కమిటీ

సర్వశ్రీ యం. నరహరి, పి. సోమయ్య, యన్. రామకోటేశ్వరరావు రంగస్థల నిర్వహణ : శ్రీ కాంతారావు (ప్రజానాట్య మండలి)

## ఎగ్జిబిషన్ కమిటీ

సర్వశ్రీ యస్. రామకోటేశ్వరరావు, యస్. మల్లిఖార్జున రావు జి.సి. లక్ష్మిరెడ్డి, నిర్వహణ : వై. నరసింహారావు (ఎస్.ఎఫ్.ఐ)

## బహుమతుల కమిటీ

వైజ్ఞానిక ప్రదర్శనలు : సర్వశ్రీ యం. వెంకటరత్నం, వి. బాలసుబ్రహ్మణ్యం, ఓ. యస్. ప్రకాశం, ఎగ్జిబిషన్ : సర్వశ్రీ కె. కేశవరెడ్డి, సి. రామయ్య, సి.యస్. చారి. యస్. రామకోటేశ్వరరావు




— కె. యస్.

యు. టి. యఫ్. విద్యా మహాసభల సందర్భంగా ఏర్పాటు చేసిన ఎగ్జిబిషన్‌ను జనవరి 8 మధ్యాహ్నం శ్రీ వై రవి (డైరెక్టర్, ఎస్. సి. యి. ఆర్. టి.) ఆవిష్కరించారు. మాంటిసోరి కళాశాల మీటింగు హాలులో 6 వరుసల్లో విజ్ఞానానికి చెందిన వివిధ అంశాలు ప్రదర్శింపబడ్డాయి.

భారత విద్యార్థి ఫెడరేషన్ కార్యకర్తలు ఏర్పాటుచేసిన ప్రదర్శనలో కొన్ని వందల పుస్తకాల పరిజ్ఞానాన్ని 42 పటాలలో సంక్షిప్తీకరించటమేగాక, చరిత్ర, జీవితం, సమాజంపై శాస్త్రీయ దృక్పథాన్ని తేటతెల్లంజేశారు.

ప్రకాశం జిల్లా మార్కాపురం లైబ్రేరియన్ శ్రీ తుమ్మల మధుసూదనరావు నెబ్యులా, గెలాక్సీ, సౌర కుటుంబ ప్రారంభం నుండి డార్విన్ జీవ పరిణామ సిద్ధాంతం వరకు విజ్ఞానశాస్త్ర రంగంలో ప్రసిద్ధి చెందిన వ్యక్తులనందరినీ రెక్సిన్ క్లాత్‌మీద క్రమపద్ధతిలో వరుసగా తీర్చిదిద్ది ప్రదర్శించారు.

గుంటూరు జిల్లా వెల్లటూరు, నవరంగ్ చిత్రకళా నికేతన్ నిర్వాహకులు శ్రీ వెల్లటూరి పూర్ణానందశర్మ చిత్రకళా నైపుణ్యానికి అద్దంపట్టే వివిధ కాలాల చిత్రాల్ని ప్రదర్శించారు.

గుంటూరు, కృష్ణా, నెల్లూరు, చిత్తూరు, ప్రకాశం, ప.గో. జిల్లాలకు చెందిన వివిధ పాఠశాలల విద్యార్థులు, ఉపాధ్యాయులు పలు సైన్స్ మోడల్స్ తెచ్చి ప్రదర్శించారు. వాటిలో సోలార్ కుక్కర్,



శ్రీ ఆరుద్ర ఎగ్జిబిషన్ దర్శిస్తున్న ఓ దృశ్యం



శ్రీ దశరథదేవ్ దంపతులు, శ్రీ యం. జె మాణిక్యాలరావు ప్రదర్శన దర్శిస్తున్న మరో దృశ్యం

ఆయిల్ డ్రిల్లింగ్ మిషన్, అగ్నిపర్వతం, ప్రొజెక్టర్, కుట్టులేకుండా అల్లిన దిండు కవరు, సబ్బుమీద బొమ్మలు ఎన్నో ఉన్నాయి.

ప. గో. జిల్లా, భీమవరం, డి.యన్.ఆర్. కాలేజి అధ్యాపకులు టి. సత్యనారాయణరాజుగారి 'గణితం గమ్మత్తులు' ఎందరినో ఆకర్షించాయి.

మహాసభలు జరిగిన మూడురోజులూ ప్రతినిధులేగాక, వేలాది నగర ప్రజలు ప్రదర్శనను దర్శించి విలువయిన సూచనలిచ్చారు. విరాళాలిచ్చి తోడ్పడ్డారు. ఐచ్ఛికంగా డబ్బాలో వేసిన విరాళం రు. 625-30 దాకా ఉన్నది.

ప్రదర్శనలోని విషయాలను విద్యార్థి కార్యకర్తలు వివరిస్తుంటే అనేకమంది ఆసక్తి కనపరిచారు. ఈ ఎగ్జిబిషన్‌ను మరింత అభివృద్ధి చేసి, గ్రామీణ ప్రాంతాలలోనూ, వివిధ విద్యాసంస్థల్లోనూ ప్రదర్శిస్తే ఎంతో ఉపయోగకరంగా ఉంటుందని సూచనలిచ్చారు.

ఎగ్జిబిషన్ కమిటీ అన్నిటినీ పరిశీలించి ఎన్నిక చేసిన వాటికి ముగింపు సభలో బహుమతులివ్వబడ్డాయి.

## బహుమతులు పొందిన ప్రదర్శనలు

1. గంజినీళ్ళు మాకు - పరమాన్నం మీకు :
   యస్. యఫ్. ఐ. విజయవాడ నగర కమిటీ
2. రాష్ట్రాలలో కేంద్రం పెట్టుబడులు :
   ప్రజా చైతన్య వేదిక, గుంటూరు.
3. వ్రేళ్ళతో ఎక్కాలు :
   శ్రీ. టి సత్యనారాయణరాజు, డి.ఎన్.ఆర్.కాలేజి, భీమవరం.
4. సాయంసంధ్య :
   నవరంగ చిత్రకళానికేతన్, వెల్లటూరు, గుంటూరుజిల్లా.
5. అగ్నిపర్వతం :
   శ్రీ ఎం. మధుబాబు, ఎన్.ఎన్.ఎస్.ఎం.హైస్కూల్, తెనాలి.
6. నేతలో దిండు కవరు :
   శ్రీ. పి. నాగమల్లేశ్వరరావు, శ్రీ. బి. డి. రామప్రసాద్ — ఎం. హెచ్. స్కూలు, రేపల్లె

## అర్హతల కమిటీ నివేదిక

కన్వీనర్ : శ్రీ యం. రాయన్న

### మేనేజిమెంటువారీ

1. ఎయిడెడ్ 7%, 2. పంచాయితీరాజ్ 84%, 3. మునిసిపల్ 4%, 4. గవర్నమెంట్ 5%

### విద్యాసంస్థలు

1. ఎలిమెంటరీ 73%, 2. సెకండరీ 26%, 3. కాలేజీ 1%

### విద్యార్హతలు

1. పోస్ట్ గ్రాడ్యుయేట్ 7%, 2. గ్రాడ్యుయేట్ 37%, 3. అండర్ గ్రాడ్యుయేట్ 56%.

### సర్వీసు

1. 5 సంIIలలోపు 19%, 2. 5-10సంIIలలోపు 16%, 3. 11-20 సంIIలలోపు 33%, 4. 20 సంIIరాల పైన 32%.

### వయస్సులు

1. 25 సంIIలోపు 7%, 2. 25-35 సంIIలోపు 25%, 3. 36-45 సంIIలోపు 36%, 4. 46-55 సంIIలోపు 27% 5. 55 సంIIపైన 5%.

### ఉద్యమానుభవం

1. 5 సంIIలలోపు 39%, 2. 5-10 సంIIలలోపు 32%, 3. 11-15 సంIIలలోపు 17%, 4. 16-20 సంIIలలోపు 4%, 5. 21-25 సంIIలలోపు 5% 6. 25 సంIIలపైన 3%.

— పై నివేదికననుసరించి ఉద్యమానుభవం గలవారు గణనీయంగా వచ్చారని, అందులో యువశక్తి 68 శాతం ఉన్నదనీ, ఉద్యమ పురోగమన శీలతకు ఇది నిదర్శమనీ తేలుతున్నది.

---

7. little work in frame loon :
   శ్రీ కే. రాజారావు, చిII జి. ప్రసాద్, ఎ. భగవాన్
8. మినీ రేడియో ట్రాన్స్‌మీటర్
   శ్రీ పి. వెంకటేశ్వరశాస్త్రి, చిII ఎస్. రుకునుద్దీన్. కె. వెంకటరమణ.
9. ఫర్నేస్ దే నైట్స్ మోడల్ :
   ఎ.పి ఆర్. గరల్స్ హైస్కూలు, కమ్మనపల్లి, చిత్తూరుజిల్లా
10. ఎంక్వాయిన్ అవిష్కరణ :
   ఎన్. కె. వి. హైస్కూలు, కూచిపూడి, కృష్ణాజిల్లా.
11. Scaning of T. V. :
   ఎ. వి. ఆర్. జడ్. పి. హైస్కూలు, యడ్లపల్లి, గుంటూరు.
12. ఆయిల్ రిగ్ మోడల్ :
   పి. శంకరరావు, జడ్.పి.హెచ్.యస్, మొవ్వ, కృష్ణా.
13. చిత్ర శిల్ప కళా ప్రదర్శన :
   శ్రీ వెంకయ్య, జడ్.పి.హెచ్.ఎస్, పూటుకూరు, నెల్లూరుజిల్లా.
14. సోలార్ కుక్కర్ : తెనాలి.
15. ప్రపంచ పరిణామం - డార్విన్ జీవ పరిణామ సిద్ధాంతం :
   శ్రీ టి. మధుసూధనరావు, లైబ్రేరియన్, మార్కాపురం, ఐక్య ఉపాధ్యాయ

# ఫ్యాప్టో పోరాట కార్యక్రమం జయప్రదం చేయండి!

రాష్ట్రప్రభుత్వం ఉపాధ్యాయుల సమస్యల పరిష్కారంపట్ల ఏ మాత్రమూ చొరవ చూపక చివరకు గతంలో ఒప్పందం కుదిరిన అంశాలపై కూడా ఉత్తర్వులు వెలువరించలేదు. అనేక విషయాలలో ఒప్పందాలకు భిన్నంగా కూడా ఉత్తర్వులు యిస్తూ యిచ్చిన హామీలను ఉల్లంఘిస్తున్నది.

ఉద్యోగులకు ఇస్తున్న సౌకర్యాలు ఉపాధ్యాయులకు వర్తింపచేయక విభజించి పాలించే విధానాన్ని ప్రదర్శిస్తోంది. శాంతియుతంగా ఉద్యమాలు చేబడుతూన్న ఉపాధ్యాయులపై పాశవికంగా పోలీసు లాఠీలను ప్రయోగిస్తూ ఉద్యమాన్ని అణచివెయ్యాలని ప్రయత్నిస్తోంది.

పలుమార్లు ప్రభుత్వానికి ప్రాతినిధ్యం చేసినప్పటికినీ, ఉపాధ్యాయుల శక్తిని తక్కువగా అంచనా వేస్తున్న ప్రభుత్వం, తగిన చర్యలు తీసుకోని కారణంగానే ప్రత్యక్ష చర్యకు పిలుపునిస్తూ ఫ్యాప్టో కార్యనిర్వాహక వర్గం తీర్మానించింది. ఉద్యమాన్ని తీవ్రతరం చేసి విజయవంతం చేయవలసిందిగా ఉపాధ్యాయ లోకాన్ని, కార్యకర్తలను కోరుతున్నాము.

## ప్రత్యక్ష కార్యక్రమం

2-2-1986 జిల్లా కన్వీనర్ల ఎన్నిక.

10-2-1986 నల్లబ్యాడ్జీలు ధరించి నిరసన దినంగా పాటించుట.

16-2-1986 ఫెడరల్ కౌన్సిల్ సమావేశం.

17-2-1986 బ్రహ్మాండమైన ఊరేగింపు.

ఉ॥ 11-00 గంటలకు గాంధీభవన్‌నుండి - సచివాలయం వరకు గౌరవ ముఖ్యమంత్రికి మెమోరాండం సమర్పించుట.

6-3-1986 నుండి నిరవధిక సమ్మె.

పోరాట నిధికి ప్రతి ఉపాధ్యాయుడు మూడు రూపాయల విరాళము యివ్వవలసినదిగా విజ్ఞప్తి చేస్తోంది.

10-2-1986 న నిరసన దినం

17-2-1986 న చలో హైదరాబాద్

6-3-1986 నుండి నిరవధిక సమ్మె

## ఫ్యాప్టో డిమాండ్లు

1. నెలకు 398/- రూపాయల నిర్ణీత వేతనముపై పనిచేస్తున్న ప్రత్యేక ఉపాధ్యాయులను, ప్రత్యేక భాషా పండితులను, ప్రత్యేక P. E. T. లను వెంటనే టైమ్‌స్కేలు ఇచ్చి రెగ్యులర్ చెయ్యాలి.

2. 1-6-77 తర్వాత S.G,B.T.లుగా పనిచేస్తున్న B.Ed. ఉపాధ్యాయులకు B.Ed. స్కేలు వర్తింపచెయ్యాలి. మరియు B.P. Ed. అర్హతలున్న పి.ఇ.టి. లను అప్‌గ్రేడ్ చెయ్యాలి.

3. ఎయిడెడ్ ఉపాధ్యాయులకు నాన్ బడ్జెటరీ విధానము ఏర్పాటుచేసి జీతాల చెల్లింపు పద్ధతి సులభతరం చెయ్యాలి. ఉద్యోగ భద్రత కల్పించాలి.

4. రాష్ట్రీయకరణం చేసిన పంచాయత్‌రాజ్ ఉపాధ్యాయులకు ఉన్నత పదవులకు ప్రమోషన్, S. T. O. ల ద్వారా వేతనాల చెల్లింపు, L, T. C. అదనపు నిధులు కేటాయింపు మున్నగు ఆర్థిక ప్రయోజనాలను కల్పించాలి.

5. G. O. M. s. No. 525 తేదీ 3-12-85 ని రద్దుచేసి, 6, 7 తరగతులలో ద్వితీయ భాష హిందీని యధాతధంగా ఉంచాలి.

6. ప్రధానోపాధ్యాయుల మొత్తం సర్వీసును పరిగణనలోనికి తీసుకొని 10, 15 సం॥ల స్కేళ్ళు వర్తింపజేసి పూర్వపు ఇంక్రిమెంటు తేదీకి ఇంక్రిమెంటు ఇవ్వాలి.

7. క్యాటగిరీ II లోని ఉపాధ్యాయులకు టెస్టులతో నిమిత్తం లేకుండా 15 సం॥ముల స్కేల్సు ఇవ్వాలి.

8. 1-1-74 కు పూర్వం పట్టభద్రులైన వారికి సూపర్ న్యూమరీ స్కూల్ అసిస్టెంటు పోస్టులు సృష్టించి 10,15 సం॥ముల స్కేల్సు వర్తింపచెయ్యాలి.

9. ఎయిడెడ్ మరియు మున్సిపల్ ఉపాధ్యాయులకు కూడా L. T. C. తదితర ఆర్థిక సౌకర్యాలు కల్పించాలి.

10. అన్ని క్యాటగిరీలలోని ఉపాధ్యాయులకు రీ-గ్రూపింగు స్కేళ్ళలో అదనపు విద్యార్హతలకు అదనపు ఇంక్రిమెంట్లు ఇవ్వాలి.

11. ప్ర. ఉ. 428 తేదీ 19-8-83 కు భిన్నంగా జరిగిన బదిలీలను రివ్యూ చేయటానికి "రివ్యూకమిటీ" ప్రతి సం॥ సెప్టెంబరు 15 లోగా విధిగా సమావేశం కావాలి.

12. స్పెషల్ క్యాటగిరీ (సెలక్షన్ గ్రేడ్) ఉపాధ్యాయులకు మూడు వెయిటేజీలు ఇవ్వాలి.

13. ఉపాధ్యాయులకు నెలరోజుల వేతనం "అడ్‌హాక్ పే"గా ఇవ్వాలి.

14. వారానికి 5 రోజుల పనిదినాల విధానం పాఠశాలలకు కూడా వర్తింపజేయాలి.

15. ఉపాధ్యాయులందరకు పనిదినాల నిష్పత్తి ప్రకారం 'ఎరండ్ లీవ్' ఇవ్వాలి.

16. ఉన్నత పాఠశాలల ప్రధానోపాధ్యాయులకు స్పెషల్ పే ఇవ్వాలి.

17. జూనియర్ కళాశాలల్లో పనిచేయుచున్న ఆధ్యాపకుడు ఉపాధ్యాయులకు పూర్తిసర్వీసు పరిగణించి సెలక్షన్ గ్రేడు L.T.C. తదితర సౌకర్యాలు కల్పించాలి.

18. ప్రైవేటు విద్యా సంస్థలను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలి.

19. బాల్వాడి ఉపాధ్యాయులకు శిక్షణ సౌకర్యం కల్పించి వారికి టైంస్కేలు ఇవ్వాలి. ఇంతకు పూర్వము అనుత్తీర్ణులకు, బాలవాడి ఉపాధ్యాయులకు టి. టి సి. పరీక్షల అవకాశం కల్పించాలి.

20. గతంలో ఫ్యాప్టోతో అంగీకారానికి వచ్చిన అన్ని అంశాలపై వెంటనే ఉత్తర్వులు ఇవ్వాలి.

(U. T. F. మహాసభలకు స్పెషల్ సి. యల్స్.)

GOVERNMENT OF ANDHRA PRADESH
EDUCATION DEPARTMENT

Memo. No : 74816 / 'T'E 1 / 85-1

Date : 23-12-1985

Sub : Edn. -4th Educational Conference of A. P. United Teachers Federation Vijayawada-8th 9th and 10 the January, 1986-Permission on duty Participating Requested.

Ref : 1. Govt. Memo No 67839 / TE1 / 85-1, dated 29-11-1985.

2. From A. P. United Teachers Federation, U.T.F. Bhavan, Domalaguda, Hyderabad, dated : 12-12-1985.

A Copy of the riference second cited is enclosed.

The D. S. E. is informed that the Teachers who are participating in the above conference may be allowed "Special Casual Leave" for nat more than three (3) days.

Sd /- S. SANTANAM,
Secretary to Government

(8వ తరగతి నుండి హిందీ బోధన)

GOVERNMENT OF ANDHRA PRADESH
ABSTRACT

Education-Upper Primary and Secondary - Ten Year School Education - Certain modifications in the structure and curriculum - Teaching of Hindi from VIII Class and English from VI Class with effect from the academic year 1986 - '87 Orders-Issued.

EDUCATION (TE) DEPARTMENT

G.O. Ms. No. 525. Dated : 3-12-1985

Read the following :

1. G. O. Ms. No. 1205, Education (k), dated 26-12-78

ORDER

According to the orders issued in the G.O. read above the scheme of teaching of three languages in the ten year school course is as follows :

(a) teaching of mother tongue or regional language shall start from Class - 1 and extend upto Class - X.

(b) teaching of Englesh shall start from Class -V and extend upto Class-X; and

(c) teaching of Hindi as Second Language shall start from Class-VI and extend upto Class -x.

2. The proposal to start teaching of English from VI class and Hindi from VIII Class has been under consideration of Government for some time past in the context of their education policy. After careful considaration of the matter, Government hereby order that the scheme of teaching of three languages in the ten year school course shall be as follows with effect from the academic year 1986 - '87 :-

(a) teaching of mother tongue or regional language shall start from Class-I and extend upto Class-X;

(b) teachidg of English shall start from Class -VI and extend upto Class-X; and

(c) teaching of Hindi as Second Language shall start from Class-VIII and extend upto class-X.

3. The Director of School Education, Hyderabad shall prescribe the number of instruction periods in each of the above two subjects namely English and Hindi and activities per week and he shall take necessary advance steps for implmentation of the orders in para - 2 above with effect from the academic year 1986 - '87.

(By order and in the name of the Government of Andhra Pradesh)

K. UMAPATHY,
Secretary to Government:

(గ్రూపు II వారి ప్రమోషన్ స్కేలు గురించి)

PROCEEDINGS OF THE DIRECTOR OF SCHOOL EDUCATION : A. P. HYDERABAD.

RC. No. 356 / SCC 85. Dated : 2-1-86

Sub : Scheme of Automatic Advancement Spacial promotion post after 10 years 15 years of Service - Regarding.

Ref : From the Dist. Educational Officer, Ongo l Lr. RC. No. 333 A1/84, Dated : 19-11-85.

The Dist. Educational Officer, Ongole has reported in his letter read above that the Zilla Parishad and the Municpal Councils have granted Special Promotion post to the teachers covered in Category II of regrouped scales though they are not qualified to hold the next higher post of Head Master on plea that Government have not Specifically mentioned in their order No. 166 Edn., Dt : 1-5-85 regarding pay fixation of Category II and III.

It is also noticed from the reference read above, that the Dist. Educational Officer, Ongole, has also adopted the same policy Regarding fixation of pay of the teachers working in High School Section attached to Government Junior Colleges under his Jurisdicton.

Clear instructions were also issued in D.S.Procs. RC. No. 279 / SCC / 85, Dt : 30-10-85 stating that the G. O. Ms No. 166 Edn. dt : 1-5-85 is applicable only to he teachers under Category III and that they are not applicable to teachers under categories I and II for awarding Special promotion post.

Thus the appointing authorities i. e. Dist. Educational Officer, Zilla parishad and Municipal Councils have granted Special Promotion Posts in Prakasam District to Category II teachers of their own accord without seeking for any clarification from the Higher outhorities. The pay fixations done by them are not in order as per instructions contained in D. S. Procs. RC. No 279/SCC/85, dt. 30-10-85.

The Dist. Educational Officer, Ongola is therefore requested to effect recoveries, if he has granted special promotion post to teachers in Category II contrary to these instructions.

Similar instructions may also be issued to all the managements under his jurisdiction immediatelly.

Action taken in this regord may by intimated to this office immediately.

P. F. Nightingale
for Director of School Education

